శ్రీరస్తు

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

శ్రీ

# కవితానంద వాల్మీకి రామాయణము

## సారకాండము

---

ఇయ్యది

బాలకవిసింహ, అష్టావధానదక్ష, శతావధాని

విద్వాన్ సోంపల్లి కృష్ణమూర్తి

విరచితము.

---

లక్ష్మీ స్వదేశీ ప్రెస్సునందు ముద్రితము

అనంతపురము.

1940

---

 [ వెల రూ.

శ్రీ

# ఉపోద్ఘాతము.

క్షాంతి శ్చేద్వచనేన కిం కిమరిభిః క్రోధోఽస్తి చేద్దేహినాం
జ్ఞాతిశ్చేదనలేనకిం యదిసుహృద్దివ్యౌషధైః కింఫలం।
కింసర్పైర్యది దుర్జనాః కిముధనైర్విద్యాఽనవద్యాయది
వ్రీడాచేత్కిముభూషణైః స్సుకవితాయద్యస్తి రాజ్యేనకిమ్॥. భర్తృహరి.

ఆనందము లనేకవిధములు. ఆనందఫలము తృప్తియని యార్యులమతము. తృప్తియే ఆనందావధియని సారము. ధనరాజ్యాదులచేఁ గలుగుతృప్తి యల్పకాలిక మనియే పెద్దలయాశయము. సుకవిత్వసంప్రాప్తసంతృప్తి నడుమ నశించునది కాదని కవుల సిద్ధాంతము. ఈ సిద్ధాంతము యుక్తియుక్తమా యను ప్రశ్నము విచారింపఁ దగినది, యుత్తరమీయఁదగినదియుఁ గాదు. కవి భావప్రపంచమున విహరించును. మనోరాజ్యమనియే దానికి నామాంతరము. అందలి విహారమున కంతరాయసంతతి యొనఁగూడదు. దేశకాలములు ప్రతిఘటింపనేరవు. అవిచ్ఛిన్నగతి విహారమయ్యది సాగుచుండును. దానలాభమేమని ప్రశ్నించుట జ్ఞానహైన్యము ఫలము. ఇతర చింతలుమాని యానందమున నోలలాడుటకన్న వలయునదెద్ది? 'ఆనందో బ్రహ్మేతివ్యజానాత్' అనికదా యుపనిషద్వాక్యము వినఁబడియెడు. సుకవులు బ్రహ్మోపాసకులని దీనిసారము. నిరంతర మద్దానియందు బద్ధాదరులగుటకన్న మిన్నయని యెన్నదగినదెద్దియుండును? "యస్యబ్రహ్మణిరమతే చిత్తం నందతి నందతి నందత్యేవ" అన్న సూక్తి సుకవియందు సమన్వయమగును. సర్వకాల సర్వావస్థలయందును సుకవి యానందమనుభవించుచుండునే నద్దానికంటె వాంఛింపఁదగినదేది? అప్పని తప్పక యొనరించుచుండువాఁడే సుకవియని సారము. ఆధివ్యాధులాతనిమదికిఁ దోఁపకయుండును. యోగి సుకవి సమానులనుటయే దీనికి ఫలము.

మానుషానందములలో నెక్కుడు కాలమద్దానిఁ గొఱఁతపడకుండ ననుభవించువాఁడు సుకవికాక మఱెవ్వఁడుండును? అట్టి కవివరునకు నాధారము మహర్షి. త్రికాలవేత్తయగుట మహర్షి భావికాలగతుల నెఱింగి వానినుచితరీతిగ ననుసంధానునగు

పద్ధతులఁజూపును. అవియే కావ్యములు పురాణములు లోనగు పేరుల వ్యవహరింపఁబడును. కావ్యసృష్టి మొదటిదియా పురాణసృష్టి మొదటిదియా యనుప్రశ్నమునకు సముత్తరము వ్రాయుటకిది యదనుకాదు. మఱియుఁ గాకదంతపరీక్షవంటిదియునగు. కావ్యసృష్టియందాదిముఁడు మహర్షి వాల్మీకి. మహర్షి శబ్దమీ మహానుభావుని యందన్వర్థసంజ్ఞికము.

లౌకికానాంహి సాధూనామర్థం వాగనువర్తతే।
ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోఽనుధావతి॥

అని భవభూతిమహాకవి యనువదించిన భావమీవాల్మీకియందుఁ బ్రత్యక్షమగుచుండును. భూతభవిష్యద్వర్తమాన కాలవార్తలా మహాత్మునకుఁ గనఁబడుచుండుననుట దుర్విదగ్ధులకనుమానము గొలుపునేమో కాని విదగ్ధులనఁబడు సుమతుల కనుమానము గొలుపనేరదు. అట్టి వాల్మీకిమహాముని కవితాకన్యను సృజించెనందురు. ఆ సృష్టియే రామాయణమనఁ బ్రసిద్ధిఁగాంచెను.

వేదః ప్రాచేతసాదాసీత్సాక్షాద్రామాయణాత్మనా.

అని ప్రమాణము వినఁబడియెడు. ఆర్తత్రాణక్షమము వేదము. ఇదియునట్టిదే కనుక వేదతుల్యమనఁబడును. వేదత్రయసారమనఁబడు గాయత్రీమంత్రనిబద్ధముగుటనీ రామాయణము వేదమేయని విశ్వసింపఁదగునను ప్రాచీనుల యాశయమైయుండనోపు. కొందఱు మధ్యవైష్ణవులు రామాయణమునుండి వేదముల నాఱింటిని బయలుపఱుపవచ్చునందురు. అది పాటింపఁదగిన మాటయేగాదని నిరాఘాటముగాఁ జెప్పవచ్చును. అది పామరులకు భక్తిదృఢపఱుపఁబూని వచించినదేయగునేని శిరోధార్యమే. సభలో దృఢపఱుతుమను వారుందురేని పరిహాసపాత్రులుకాక మానరు. నియమము లేక యక్షరములు స్వీకరించుచు వేదమంత్రముల నుద్ధరించితిమనిన నప్పని నమరమునుండియుఁ గావచ్చును. "యద్యదుద్దేశేన ప్రవృత్తస్తత్తదంశేఏవ ప్రమాణమ్" అను న్యాయము ననుసరించి భగవచ్చరిత్రమును వేదతుల్యముగాఁ బరిగణింపఁదగునను భావమును ఖండింతురనువారుందురే నది యవశ్యమంగీకరింపఁదగు. వేదపారాయణానష్ఠులు నశక్తులునగువారలీ యుత్తమోత్తమ కావ్యమునుబఠించి తత్తుల్యఫలము నొందఁగలరని వచించువారల కనేక నమస్కారములు. వేదములు భగవదనురాగ బోధకములు. ఈ మహాకావ్యము నట్టిదియే. "కథాచ్ఛలేన బాలానాం నీతిస్తదిహ కథ్యతే" యన్నసూక్తి యీనాఁటిది కాదుకదా.

కావ్యమ్ రమణీయార్థ ప్రతిపాదకశ్శబ్దః-రసాత్మకవాక్యం వా-ఆనంద విశేషజనక వాక్యం।
అర్థదోష శూన్యత్వేసతి వ్యాకరణాది దోషరహితత్వమ్॥. అని సర్వలక్షణసంగ్రహము.
కావ్యమ్-కవేరిదంకర్మ భావో వా-రసయుక్త వాక్యమ్-యథా.

శ్లో॥ వాక్యం రసాత్మకం కావ్యం దోషాస్తస్యాపకర్షకాః।
ఉత్కర్షహేతవః ప్రోక్తా గుణాలంకార రీతయః. అని శబ్దకల్పద్రుమము.

శ్లో॥ చతుర్వర్గ ఫలప్రాప్తిస్సుఖాదల్పధియామపి।
కావ్యాదేవయతస్తేన తత్స్వరూపం నిరూప్యతే॥.

అని విశ్వనాథకవిరాజు సాహిత్యదర్పణమునందుఁ దేటపఱచెను. కనుకఁ గావ్యము ధర్మార్థకామమోక్షముల నొసఁగునది కావలయును. కావ్యాలాపాంశ్చ వర్జయేత్తను నిషేధవాక్యమసత్కావ్య విషయమున సమన్వయింపఁ దగునని పెద్దలు తీర్మానించిరి. ఇఁక రామాయణ కావ్యవర్యమునందు నెవ్వరికి నేశంకలుదయింప నవకాశములుండఁబోవని నా విశ్వాసము.

చరితం రఘునాథస్య శతకోటి ప్రవిస్తరం।
ఏకైకమక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్॥.

అను సూక్తికలవు. ఇందు శతకోటి ప్రవిస్తరమ్మనుచోట రామాయణమనేక శ్లోకములుకలదని, యాదిప్పుడు ప్రసిద్ధముగానుండునది లేశభాగమని కొందఱందురు.

అప్రాప్తయౌవనం బాలం పంచవర్ష సహస్రకమ్।
అకాలే కాలమాపన్నం మమదుఃఖాయ పుత్రకమ్॥. ౮ ఉత్తరకాండము ౭౩ సర్గము.

పంచవర్ష సమన్వితమ్ = అని నూతనపాఠము. హేపుత్రక! అప్రాప్తయౌవనం మమదుఃఖాయ అకాలే కాలమాపన్నం పశ్యేత్యనుషంగః. పంచవర్ష సహస్రకమ్-వర్షశబ్దోత్ర దినపరః సహస్రసంవత్సరం సత్రముపాసీత ఇతివత్ తేనషోడశవర్షమిత్యర్థ ఇత్యేకే తేన కించిదూనచతుర్దశవర్ష మిత్యర్థ ఇత్యన్యే. అని వ్యాఖ్య. అయిదువేల సంవత్సరములని సామాన్యుల కర్థమగుచుండఁగా నది పదారువర్షములకు సమీపముగానుండు ప్రాయమునకుదింపఁబడినది. శతమానంభవతి శతాయుఃపురుషః = అనుచోట శతశబ్ద మధికార్థపరము. కానిచో నూటయిరువది సంవత్సరములు అయిదుదినములు మానవుల కాయుర్దాయము శాస్త్రసిద్ధమగుచుండఁగా నిరువదివత్సరములు తగ్గించుట పరిహాసాస్పదము కాకపోదుగదా. అట్లే యీచోట నుండు శతకోటిశబ్దము విస్తారమను నర్థమును బోధించును. గాయత్రీ మంత్రాక్షరని బద్ధమీ రామాయణమగుట నిదియొక భాగమేయగున వలను పడదు. ఇందలి ప్రత్య

క్షురము పాపనికృంతన క్షమమగునని ఫలమును బోధించు శ్లోకమునకర్థము.

రామాయణము లెన్ని?

అందు వాల్మీకి యేదినిరచించెను?

ఏకకర్తృకములయందు విరుద్ధవార్తలుండఁ గతమేమి?

అను ప్రశ్నములకు నుత్తరము లీయవలయుచున్న నించుకశ్రమమే. కాని యేదో యొక మార్గము ననుసరింపవలయుఁగదా. వాల్మీకిమహర్షి తమసానదికరుగుచుండఁగాఁ గ్రౌంచమిథునమునఁ బురుషపక్షిని బోయవధింపఁ బరితపించుచు నేమో చెప్పఁబోవఁగా దైవవశమున నమ్మునివరు వక్త్రసరసిజమునుండి.

మానిషాద ప్రతిష్ఠాంత్వ మగమశ్శాశ్వతీస్సమాః

యత్క్రౌంచ మిథునాదేకమవధీః కామమోహితమ్.

అను శ్లోకమావిర్భవించెననియుఁ దదనంతరము బ్రహ్మ యనుమతినీయ రామాయణమును రచియించెననియు నదియే వేదమనియుఁ జెప్పుదురు. ఆకావ్యమే శ్రీమద్రామాయణమను పేరఁ బరఁగుచుఁ బఠనపాఠనములచే లోకప్రసిద్ధిఁ గాంచియున్నది. ప్రకృతవిషయమునఁ బేర్కొనఁబడనున్న దానందరామాయణము మఱది. ఇదియు వాల్మీకి ప్రోక్తమనియే యున్నది. "ఇతి శ్రీశతకోటి రామాయణాంతర్గతే శ్రీమదానంద రామాయణే వాల్మీకీయే సారకాండే" అని కలదు. ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే" అని కలదు. ఈ రెండింటిని విమర్శింపఁ బూనిన నేదో యొక విషయము దేలును. కాని యావిధము నాకిటననవసరము. కాన దానిమాని నూతన పథమున నడువఁబూనెదను. ఈ రెండు గ్రంథములు పెక్కుతావులఁ బోలికలే కానరావు. "అనుక్తమన్యతో గ్రాహ్యమ్" అను న్యాయము నవలంబించి సమాధానము వ్రాయుచున్నను విషయమొక్కఁడైనను విరుద్ధవార్తలు కనఁబడుచున్నవి. స్థాలీపులాకన్యాయము ననుసరించి పరిశీలించెదను.

సోఽన్తఃపురం ప్రవిశ్యైవ కౌసల్యామిదమబ్రవీత్।
పాయసం ప్రతిగృహ్ణీష్వ పుత్రీయం త్విదమాత్మనః. ౨౬
కౌసల్యాయై నరపతిః పాయసార్ధం దదౌతదా।
అర్ధాదర్ధం దదౌచాపి సుమిత్రాయై నరాధిపః॥ ౨౭
కైకేయ్యైచావశిష్టార్ధం దదౌ పుత్రార్థ కారణాత్।
ప్రదదౌచావశిష్టార్ధం పాయసస్యామృతోపమమ్॥ ౨౮
అనుచింత్య సుమిత్రాయై పునరేవమహీపతిః।

ఏవంతాసాం దదౌరాజా భార్యాణాం పాయసంపృథక్॥. ౨౯

శ్రీమద్రామాయణము బా॥కాం॥ ౧౬ సర్గము.

ఆవిర్భూత్వా స్వయం వహ్నిర్దదౌ రాజ్ఞే సుపాయసం।
రాజ్ఞాపిభక్తం తిస్రభ్యస్తాభ్యః కైకేయ్యా దుష్టభావతః॥. 3
అహరత్పాయసం హస్తాద్గృధ్రీ శాపవిమోచకం।
సువర్చలాప్సరోముఖ్యా నృత్యరంగాత్స్వయంభువః॥. ౪
శప్తాజాతాతు సాగృధ్రీ తయావేధాస్సుతోషితః।
తస్యైతుష్టోవిధిః ప్రాహకైకేయీ పాయసంయదా॥. ౫
ప్రాక్షేప్స్యస్యంజనగిరౌ తదాతే భవితాగతిః॥
అప్సరాస్త్వం పూర్వవచ్చ భవిష్యసినసంశయః॥. ౬
తస్మాత్సాపాయసం నీత్వాక్షిపదంజనపర్వతే।
నిజంస్వరూపం సాలబ్ధ్వా జగామ సురమందిరం॥. ౭
తతస్తాభ్యాంతు కైకేయ్యైదత్తం కించిత్తుపాయసం।
అథతాభరతోరామాసూ రంతర్గర్భాస్తదాభవన్.॥ ౮

ఆనంద॥ సారకాం॥ ౧ సర్గము.

పాయసవిభాగమునందీ రెండు గ్రంథములకుఁ బోలిక యేమాత్రము కానరాకుండుటయేగాక విభేదమే కానవచ్చుచున్నది. కవితను బరిశీలించినను రవంతయుఁ బోలిక కానరాదు.* నిజంస్వరూపం సాలబ్ధ్వా అను సారకాండ శ్లోకమునందలి వాక్యముంబరిశీలించితిమే నిట్లుకూడ వాల్మీకిమహాకవివచించునాయని తోఁపకమానదు.

కౌసల్యాజనయద్రామం సర్వలక్షణసంయుతం॥ ౧౦
విష్ణోరర్ధం మహాభాగం పుత్రమైక్ష్వాకవర్ధనం।
... ... ...
భరతోనామ కైకేయ్యాం జజ్ఞేసత్యపరాక్రమః॥ ౧౨
సాక్షాద్విష్ణోశ్చతుర్భాగస్సర్వైస్సముదితోగుణైః।
అథలక్ష్మణశత్రుఘ్నౌ సుమిత్రాజనయత్సుతౌ॥. ౧౩
వీరౌ సర్వాస్త్రకుశలౌ విష్ణోరర్ధసమన్వితౌ॥.

శ్రీమద్రా॥ బా॥ ౧౮ సర్గము.

అథవిష్ణుశ్చైత్రమాసి నవమ్యాం మధ్యగేరవౌ॥ 3
సూతికాగృహమధ్యేఽత్ర కౌసల్యాయాః పురోభవేత్।
చతుర్భుజః పీతావాసా మేఘశ్యామోమహాద్యుతిః॥ ౪

---

* నిజంసురూపమని యుండియుండనోపు.

సాపి దృష్ట్వా బాలభావం ప్రార్థయామాస తం హరిం।
తతో జాత స్తదా బాలః క్షణాద్రత్న విభూషితః॥ ౫
హేమవర్ణః కంజనేత్రశ్చంద్రాస్య స్తపన ప్రభః।
తతస్సుమిత్రా పురత శ్శేషోఽభూద్బాలరూపధృక్॥ ౬
ఆవిర్భూతౌ ద్వాయప శౌ కైకేయ్యాశ్చ ఖచక్రకే।
ఏవంతే జనితా బాలాశ్చత్వారస్సమయే శుభే॥ ౭

ఆనంద॥ సారకాం—౨ సర్గము.

కైకేకు భరతశత్రుఘ్నులు కొడుకులని ఆనందరామాయణము తెలుపుచున్నది. సుమిత్రకు లక్ష్మణుఁడు, కౌసల్యకు రాముఁడు తనయులని తేటపఱచుచున్నది. కౌసల్యా విషయమున నంతగా భేదము కానరాదు. అదియే మహాభాగ్యమనుకొనందగు. దీనిం బట్టి చూడఁగా నీరెంటికిని సంబంధము విశేషించి కానరాదు. భేదములుగల తావుల నెల్ల నెత్తిచూపుట నధిక ప్రసంగముగనుండునని భయపడి వదలెదను.

ఇట్టి భేదములుండఁ గారణమేమని ప్రశ్నించువారలకు నాయల్పమతికిందోఁచిన సమాధానము చెప్పెదను. శ్రోతృప్రీతిననుసరించి కథను మార్చి భగవన్మాహాత్మ్యమును దెలుపఁబూని గ్రంథాంతరములు రచింపఁబడుచుండుట మన మెఱుంగుదుము. ఏకరీతిగాఁ గథనునిచి గ్రంథాంతరము నీతిబోధకముగునట్లు వ్రాయుట పాఠకులకు సంతృప్తిని గొలుపఁజాలదు. వాల్మీకిమహర్షియే రచించెనని వచింపఁజాలనుగాని యితరులే రచించియుందురనియు నిర్ణయించు నుద్దేశముకలవాఁడనుగాను. ఏది యెట్లున్నను బరమపావనమగు శ్రీరామచంద్రగాథల నీగ్రంథము వెలిపుచ్చుటం జేసి పరమపావనమే యని నిర్ణయించుట సమంజసమని సంతోషించుచున్నాఁడను.

ఇఁక నీవిషయమునే పెంచివ్రాయక యీ యుపోద్ఘాతమునకు హేతుభూతులగు కవిపుంగవులఁగూర్చి నాలుగుమాటలు వ్రాసెదను. ఈ యానందరామాయణమునందలి తొలిదగు సారకాండమును దెనిఁగించినవారు కృష్ణమూర్తిగారు. వీరి యింటిపేరు సోంపల్లియని. వీరు శ్రీరామచంద్ర బాలాత్రిపురసుందరీ పాదసరోజ సేవాపరాయణులు. మంగాంబానంజపార్యతనూభవులు. రాయలసీమలోని యనంతపుర మండలాంతర్గత కదిరి నామకోపమండలమునఁగల కొక్కంటియను గ్రామమున నివసించువారు. ఉల్చుకమ్మ యను తెగకుఁజేరిన విప్రులు. వీరింతకుముందే భక్తరక్షామణి శతకము, ఆపదుద్ధారకస్తోత్రము, హాసవీవిలాసనాటకము లోనగు కృతులనచ్చొత్తిం

చిరి. మఱికొన్ని యముద్రితములు గ్రంథమునందైదవ పుటలో నీవిషయము తెలి
యఁగలదు. ఇప్పు డానందరామాయణమును దెనిఁగింపఁబూని మొదటిదగు సార
కాండము వ్రాసిరి ముద్రించిరి. ఈ యుత్తమకృతిని ముద్రింపఁ దోడ్పడిన వదాన్య
గ్రామణులు మ॥రా॥రా॥శ్రీ అనుపూరు సుబ్బరాయప్పగారు. కదిరి సమీపముననుండు
ముత్యాలచెఱువు అనుగ్రామము వారినివాసము. నందవరీకులను తెగకుఁ జేరినవారు. వీరే
గ్రంథముద్రణవ్యయము నొసంగి ప్రోత్సహించుటం జేసి యాత్రాకాండమును దెనిఁగించి
యున్నారు. ఇట్లే యాగకాండములోనగు నేడుకాండములనుఁ గూడఁ దెనిఁగించుచున్నవారు
విశ్వకళాశాలవారి విద్వత్పరీక్షయందాఱితేఱి సంస్కృతాంధ్రములయందుఁ బాండిత్య
మును సంపాదించి యా పాండితికి ఫలముగా నుత్తమోత్తమమగు నీ యానందరామా
యణమును దెనిఁగింపఁబూనిరి. వీరి కార్యమునకుఁ బై ధనవంతులు తోడుపడిరి.
ఈ గ్రంథము శ్రీరామచంద్రున కంకితము చేయఁబడినది. ఈ కాండమునందుఁ బది
నెనిమిదివందలు పదునైదు పద్యములుగలవు. మక్కికిమక్కి యన్నట్లుగాక తెనుఁగు
బాస యలవాటుల వదలక బిగిసడలనీయక భావమించుకయు వదలక మూలార్థమునకు
హానిరానీయక తెనిఁగించిరి. శైలిమనోజ్ఞతయును పాకము ద్రాక్షాపాకమే యన
వచ్చును అన్వయకాఠిన్యము కానరాదు. దూరాన్వయాది దోషము లిందు గగన
కుసుమాయమానములు. భాషాంతరీకరణపద్ధతిఁ దెలుపుటకై కొలఁది పద్యము
లుదహరించెదను. మూలము ముందే వ్రాసితిని.

క॥ ఆ యమృతోపమపాయస, మాయతకృప నిచ్చె దశర - థావనిపతికిన్
బాయని ప్రేమను సతులను, జాయలకా మువ్వురకును - సరిగా నొసఁగెన్.

క॥ కైకేయి దుష్టమతియై, సాకల్యముగాఁగఁ బాయ - సపుభాగంబున్
జేకొని గృధ్రీశాపవి, మోకంబుగ నంజనాగ - మునఁ బడ విసరెన్.

తే॥ అరయ మున్ను సువర్చల-యనెడునప్స, రోంగనామణి నృత్యంబు-నందుఁదప్పు
సేసి విధిశాపవశమునఁ-జేసి తాను, గృధ్రయై శాపమోక్షంబు-బ్రహ్మనడుగ.

తే॥ అతఁడు కరుణించి కైకేయి - యంజనగిరిఁ
బాయసవుఁ బాఱవైవన - ప్పాయసంబు
సోఁకి శాపంబు పాయునం - చును వచించి
యుండె నద్దాన గృధ్రయు - నువిదయగుచు.

మ॥ సురలోకంబున కేఁగె సంతసముతోఁ - జోద్యంబుగాఁ బిమ్మటన్
వర కౌసల్యయు నాసుమిత్రయును వి - శ్వాసంబుతో ధర్మమౌ
తెఱఁగుం గైకకుఁజెప్పి యిర్వురును దృ - ప్తిన్ రెండు భాగంబులం
దరయం గొంచెను పాయసంబునిడఁగా - నా కైకయుం జేకొనెన్.

శేషద్వయమైత్రి వీరికి సమ్మతమేయని యీ పద్యమే తెల్పుచున్నది.

శైలి తెలియఁజేయుటకై యొకటి రెండు పద్యములను వ్రాయుచున్నాఁడ.

సీ॥ చరణాబ్జములను నూ - పురములందెలు మ్రోయ
మొలనూలు నడుమున - మురుపు గొలుపఁ
గంకణరాజముల్ - కరముల వెలుఁగంగ
బాహులఁ గేయూర - వరము లలరఁ
గంఠానమణిరత్న - కనకహారము లొప్ప
శార్దూలనఖము లా - సరస మెఱయఁ
గర్ణద్వయిని మణి - స్వర్ణశలాటుకల్
దేదీప్యమానమై - తేజరిల్ల

తే॥ ముత్తియము లంచులందున-హత్తినట్టి, తళుకు బంగరురావియూ కులసరంబు
ఫాలమున ముద్దులొల్కంగ-వ్రేలుచుండ, ముంగిటను దోఁగిరారాజ-పుత్త్రవరులు.

మ॥ హనుమంతా! నిజముగ వచించితివి నే - నాత్రింబుతో నీవు రా
కను లెక్కింపక మంచి మూర్తమది యే - గన్ భంగపా యత్నమం
చును భీతిల్లి ప్రతిష్ఠసల్పితిని ని - చ్చోఁ గావునన్ సైకతం
బును మత్స్థాపితమైన లింగము నిదే - పోఁద్రోయుమా తీయుమా.

ఇట్లే గ్రంథమంతయు నడుపఁబడినది. కవివరులు కడుజాగరూకతఁ గలిగి పామరజన రంజనార్థమై మృదుపదములం జేర్చి పద్యముల నడక సాగించిరి. భాషాంతరీకరణముగాన నైజశక్తిని దెలుప వలనుపడమి లేనిపోని వర్ణనములఁ బాఠకుల విసిగింపక గ్రంథమును సాగించి "సమానానా ముత్తమశ్లోకో అస్తు" అన్న శ్రుతివాక్యమున కుదాహరణభూతులైరి. ఇట్లే తక్కిన కాండములఁ దెనిఁగించి త్రిలింగాంధ్రదేశముల నెల్ల యెడల నిర్మలయశశ్చంద్రజ్యోత్స్నల విలసిల్లఁజేయుదురుగాత యని యాశించుచున్నాఁడను. రాయలసీమ యిట్టి సత్పుత్త్రకులఁ బెల్లుగంబ్రసవించి తత్కీర్తి కుసుమ పరిమళముల దశదిశల వెదఁజల్లుఁగాక. భగవంతుఁడు కరుణావారధి దాశరథి యే తత్కృతికర్తలకుఁ గారయితలకు నాయురారోగ్య భాగ్యజ్ఞాన సంపదల నొసంగి రక్షించుఁగాక.

ఇట్లు విన్నపించు విద్వద్విధేయుఁడు,
జనమంచి శేషాద్రిశర్మ.
శ్రీశ్రీశ్రీ

# పండితాభిప్రాయములు.

బ్రహ్మశ్రీ కావ్యపురాణతీర్థ, విద్వాన్, జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మగారు. పండితుఁడు. కడప.

శ్రీ కవితానంద వాల్మీకిరామాయణము సారకాండమును స్థాలీపులాకన్యాయముగ నందందుఁ బఠించితిని. పద్యములు గడుంగడు హృద్యములు. భావములు, తగిన యిమిడికతోఁ బొంపొందుచుండుటయు, శైలి యత్యంతసరళమయి పామరులగు వారికిఁ గూడ విన్నంతమాత్రముననే సుబోధకమయి యలరారుచుండుటయు. నంతట నొకే విధమగు శక్తితోఁగూడి యుండుటయు, నామనంబున కత్యానందంబు గల్గించినయవి. గ్రంథనామధేయము గ్రంథకర్తకుఁగల సార్థకమయిన శక్తిని దెలుపుచున్నయది యని నావిశ్వాసము. ఇద్దాని మాతృక శ్రీవాల్మీకి మహర్షి కృతమగు నానందరామాయణం బయ్యును గవికిఁగల నిజమగు భావసూచక శబ్దపూర్వకంబయియుండుట యెంతయుఁ దగియున్నదనుట నిర్వివాదాంశము.

గ్రంథకర్త త్రిలింగదేశ వాస్తవ్యుఁడు. అందును నాంధ్రప్రపంచమున నప్పుడప్పుడు విద్యావిషయక ప్రసంగముల వెనుకఁబడియుండు మండలములుగాఁ దెలిసియేని తెలికయేని పేర్కొనఁబడుచుండు రాయలసీమనివాసి. ప్రతిక్షణము మార్పులు కుప్పలు కుప్పలుగా నుప్పతిల్లి భాషామర్యాదల నున్మూలనము చేయుచున్న యీకాలమునఁ బ్రాచీన సంప్రదాయముల వదలక తెలుఁగు భాషాయోషామణికిఁ గళంకమాపాదింపక చక్కని శైలిలో నిట్టి యుద్గ్రంథరచనకుఁ బూనుకొనుటకయి తెలుంగు దేశముననుండువారలెల్లరును గ్రంథకర్తకుఁ గృతజ్ఞులై ధన్యవాదము లర్పింపవలసి యున్నది.

గ్రంథకర్త గ్రంథరచనచేయఁ గడంగుటకిది ప్రథమప్రయత్నము కాదని యిందలి ముప్పదితొమ్మిదవ పద్యమే స్పష్టముచేయఁగలదు. ఈ మహాకవి నిజముగాఁ గవితానందుఁడే. సత్యముగా ధీరకవి. పండితకవి. పదునెనిమిదివందలకంటె మించిన పద్యములుగల యీ గ్రంథము నైదుమాసములలోఁ బరిపూర్తిగావించియుండుటఁ జూడఁగా వాణి స్వాధీనయైయున్నదని తప్పక చెప్పవలయు.

ఆనందరామాయణము సంస్కృతమున నందందొక పర్యాయము చూచి యుంటిని. తెలుఁగు భాసయందును వచనకావ్యముగానుండిన గ్రంథమునఁ గొంత భాగము నిరువదివత్సరములకుఁ బూర్వము చదివియుంటిని. పద్యకావ్యము నెన్నఁడుఁ జూచియుండలేదు. ఇన్ని దినంబులకు నీ మహాకవిరచితంబగు నీ గ్రంథమునుజూచు భాగ్యంబునాకుఁ గలుగుటకతన నెంతయు మనంబునకు సంతసంబుగలిగె. అవకాశమా కొంచెముగానుండుటచే నందందుఁజదివి యానందించుటయే సంభవించినయది. బమ్మెర పోతనామాత్యుఁడు పలికినట్టులుగానే గ్రంథకర్తయుఁ దనకుఁగల పరిజ్ఞానములఁ జెప్పక శ్రీరామమూర్తినే యన్నింటికిని నమ్మినయట్లు తెలుపుట యెంతయుఁ బ్రశంసనార్హమగు విషయము.

క॥ నుడువునది రామచరితము, నుడువఁగఁదగు మంచినుడులు-నూల్కొనుగతిఁ దా
నిడువాఁడు రామచంద్రుఁడు, నుడివినయెడ దానవవు ననూన శుభంబుల్.

ఈ పద్యమే కవికిఁగల శ్రీరామభక్తి నిరుపమానమని వాకొనుచున్నయది. గ్రంథకర్తకుఁగల యీభక్తిపరాకాష్ఠకు నిదర్శనముగా నిందలి యెనుబదియవ పద్యము మొదలు మూఁడుపద్యములఁ జదివినఁ దేటపడఁగలదు.

గ్రంథకర్త యింతకుముందు వ్రాసిన కృతులన్నింటికంటె నిది మిన్నయనియు, నిట్టిదియే శాశ్వతముగానుండఁదగినదనియు నా సంపూర్ణవిశ్వాసము. ఇట్టి గ్రంథమునకు సాయముగావించిన శ్రీ అనుపూరు సుబ్బరావుగారు స్తుత్యర్హులు. వారి ధనమునకుఁ గుటుంబమునకు స్థిరత్వము చేకూఱినదని యెల్లరు నేకవాక్యముగాఁ బలుకఁగలరు.

ఈ గ్రంథకర్తగారగు శ్రీ కవితానంద బిరుదవిభ్రాజితులగు శ్రీ సోంపల్లి కృష్ణమూర్తి గారు 'మా కొక్కల్లును విద్దెల నొరగల్లటంచు' అను వాక్యము సుస్థిరము గావించుటకై యీ గ్రంథమును బూర్ణముగాఁ దెనుంగుసేయుటయేగాక యిట్టి లోకోపకార కృతులఁ బెక్కింటిని రచించి తెలుఁగుమండలమున యశశ్చంద్రికల వ్యాపింపఁజేయుచుఁ జిరాయురారోగ్య భాగ్యోపేతులయి వెలయుదురుగాతమని శ్రీరామచంద్రుని పాదారవిందములఁ బ్రార్థించుచున్నవాఁడను.

సహృదయు లీగ్రంథమును బూర్ణముగఁ బఠించి యానందించి గ్రంథకర్తకుఁ జేయూఁత నొసంగుదురుగాక!

పండిత వశంవదుఁడు,
జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మ.
ప్రమాది మార్గశిర కృష్ణామావాస్య.

శ్రీ లలితావిలాసము,
కడప.

II

అభినవబాణకవి ఆశుకవిచక్రవర్తి కవిసార్వభౌమ విద్వాన్ గౌరావఝ్ఝల రామకృష్ణ సీతారామ సోదరకవులు శతావధానులు గజ్జలకొండ, కర్నూలు జిల్లా.

మిత్రమా! ఆశీర్వాదములు,

ఉ॥ మమ్ము బఠింపుమంచు నభిమానముతో నిటకంపినట్టి గ్రం
థమ్మును గొన్నిచోటుల యథావిధిగాంచితి నెంతయేని మో
దమ్మొనరించెఁ బంకజవితాన లసన్మకరంద బిందు పా
నమ్మొనరించి సొక్కు నళినాథుల పోలిక నో సుహృన్మణీ॥.

సీ॥ భాస్కరకవి వచఃప్రౌఢ దీర్ఘసమాస
పరిపాటి యొక్కొక్క పట్టునందు
రంగనాథుని మధురప్రయోగార్థగం
భీరభాషణ లోకవేళయందు
గోపినాథుని వారి గోస్తనీపాక వృ
త్త్యాద్యలంకృతు లొక్క యదనునందు
వా-సు-దాసుని భక్తి వైరాగ్యశృంగార
సరసభావములొక చరితమందు

గీ॥ శారదా పాదనూపుర ఝణఝణం ఝు, ణారవస్ఫూర్తి మించి ప్రచారు సేయు
నట్లు గనుపట్టె నీదు రామాయణమును, జదువ తరుణమునందుఁ గృష్ణకవిరాజ!.

శా॥ మున్దేదో పఠియించు కాలమున "నేమో పండితుండై మహా
సందంబీతఁ డొసంగునా?" యనుచు డెందంబందు మేమెంతు మి
ట్లుండంబై మధురార్థయుక్తమగు కావ్యంబల్లి యానాఁటి మా
సందేహంబును దీర్చితిప్పటికి వత్సా! శిష్యచూడామణీ!.

గీ॥ నీదు కవితాసుధారసాస్వాదనమునఁ, దనివిఁ జెందియుఁ గలయథార్థము వచింపఁ
జాలకుంటిమి స్తోత్రము సలుపఁదగదు, గురువులని నీవు మము వ్రాసికొనిన కతన॥.

---

## III

కింకవీంద్ర ఘటా పంచానన విద్వత్కవి బాలకళానిధి బాలసరస్వతి శతావధాని తిరుపతి వేంకటేశ్వర కవులుగారిలో నొకరగు

బ్రి॥ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు.

కడియము, తూర్పుగోదావరి జిల్లా.

అయ్యా,

మీ రామాయణము అంది చాలారోజులైనది. నేను వృద్ధుడను. పైగా అయిదారేండ్ల నాటినుండి అనారోగ్యంగా నున్నాను.

ఇట్టి నేను మీగ్రంథము సంపూర్ణముగాఁ జదివి అభిప్రాయమీఁగలనా? ఏ కొంచెమో చదువకపోలేను. తత్సమపద భూయిష్ఠముగాఁ జక్కఁగానున్నట్లు తోఁచినది. కథ భగవద్విషయము. మీ యుద్యమము కడుశ్లాఘ్యము. మీ కవిత్వము నిర్దుష్టము. భగవంతుఁడు మీకు సర్వవిధములఁ దోడ్పడుఁగాక యని యాశీర్వదించుచున్నాఁడను.

చిత్తగింపుఁడు,

వెం॥ శా॥ శతావధాని.

## IV

డాక్టరు. చిలుకూరి నారాయణరావుగారు, M. A., Ph. D., L. T., అనంతపురము.

శ్రీ కవిలానందవాల్మీకి రామాయణమనే ఈ గ్రంథమును కొంతభాగము చదివినాను. కవిత్వము ధారావాహిగా ఉన్నది. కవి యువకుడు. ఉత్సాహి. ఇంతకంటె ఎక్కువశ్రద్ధతో ఇకముందును మంచికావ్యములనువ్రాసి ప్రసిద్ధిపొందునుగాక అని ఆశీర్వదిస్తున్నాను.

చిలుకూరి నారాయణరావు వ్రాలు.



శ్రీ కరణం సుబ్బరాయప్పగారు,
ముత్యాలచెరువు
పోషకులు.



శ్రీ సోంపల్లె కృష్ణమూర్తిగారు,
కొక్కంటి,
గ్రంథకర్త.

# విజ్ఞాపనము.

రామాయణము ప్రథమకావ్యమనియు వాల్మీకి యాదికవియనియుఁ బండితులు మొదలు పామరులవఱకు నంగీకరింపఁబడియుండుట సత్యదూరముకాదు. రామాయణము లనేకములుగలవు. వానియందుఁ గొన్ని వాల్మీకీయములని యున్నవి. "చరితం రఘునాథస్య శతకోటి ప్రవిస్తర" మను ప్రసిద్ధి యీనాఁటిది కాదని యెల్లరెఱింగిన విషయము. శతకోటిప్రవిస్తరమనుదానికిఁ బలువురు పలురకముల యర్థములు సమర్థించి వ్రాసిరి. పాండితీబలముచే సాధించినయవి యిరువదినాల్గువేలు శ్లోకములుగల శ్రీమద్రామాయణమునకు మాత్రము సంబంధించినవై యున్నవి. ఐనను శతకోటిశబ్దమునకు నూఱుకోట్లని యర్థముచేయుటయే సమంజసమని విజ్ఞులకుఁ దోఁపక పోదు. శ్రీమదానందరామాయణమున నీ విషయమై విపులముగా వ్రాయఁబడినది చూడుఁడు.

"ఉదారవృత్తార్థపదైర్మనోరమైస్తదాస్య రామస్య చకార కీర్తిమాన్
సమాక్షరైః శ్లోకవరైర్యశస్వినో మునిస్స కావ్యం శతకోటిసమ్మితం" ౨౨

యాత్రాకాండము ౧ సర్గము.

వాల్మీకినాకృతం దేవి శతకోటి ప్రవిస్తరం
రామాయణం మహాకావ్యం జగృహుర్మునయశ్చ తే
అశ్రమేషు పఠంతిస్మ కథయంతిస్మ తేముదా
తచ్ఛ్రుతుమమరాస్సర్వే విమానైశ్చదిశిస్థితాః
శ్రుత్వాపూర్వం సవిస్తారం వాల్మీకిం పుష్పవృష్టిభిః
వవృషుస్తయశోభైస్తైః ప్రశశంసుర్మునీశ్వరం
తతో దేవాస్స గంధర్వా యక్షా నాగాస్సకిన్నరాః
మునీశ్వరా గుహ్యకాశ్చ పార్థివాః పద్మభూస్త్వహం
పరస్పరం తే కలహం చక్రుః కావ్యార్థమాదరాత్

× × × ×

విష్ణుస్తుత్వాతు వేదోక్తైర్మంత్రైర్నానావిధైరపి

× × × ×

వృత్తంసర్వం మయాదేవి కథితం తత్సవిస్తరం
కావ్యార్థం కలహం శ్రుత్వా ప్రహస్య జగదీశ్వరః

త్రిధా విభజ్య కావ్యం తత్ క్షణేన భక్తవత్సలః
త్రయస్త్రింశత్కోటిలక్ష సహస్రాణి పృథక్ పృథక్
శతాని త్రీణి శ్లోకాంశ్చ త్రయస్త్రింశచ్ఛుభావహాన్
దశాక్షర మితాన్మంత్రాన్ విభజ్యేతి రమాపతిః
ద్వ్యక్షరే యాచమానాయ మహ్యం శేషే దదౌ హరిః

... ... ... ...

రామేతి తారకం మంత్రం తమేవ విద్ధి పార్వతి

× × × ×

తతః పూర్వవిభాగాన్స దదౌ విష్ణుః పృథక్ పృథక్
ఏకం విభాగం దేవేభ్యో ద్వితీయం పరమేశ్వరః
మునీశ్వరేభ్యో నాగేభ్యస్తృతీయం భాగముత్తమం

... ... ... ...

... ... ... ...

అస్మిద్భాగో మునీనాం హి పృథివ్యాం గిరిజాత్మజే
తస్యాపి విస్తరం వక్ష్యే విభక్తో విష్ణునా యథా
సప్తద్వీపేషు సర్వత్ర విభక్తస్సప్తధా పునః
కోట్యశ్చత్వారి లక్షాణి షట్సప్తతి మితాని హి
సహస్రాణి తథైకోన వింశచ్చైవ తథా పునః
సప్తచత్వారింశదన్వితాః శ్లోకాశ్చేతి పృథక్ పృథక్

× × × ×

జంబూద్వీపాగతో భాగో నవవర్షేషు సాదరం
విభక్తో విష్ణునా దేవి యథా త్వాం చ బ్రవీమ్యహం
ద్విపంచాశత్తు లక్షాణి తథా గిరివరాత్మజే
సహస్రాణ్యేకనవతిః శ్లోకాః పంచ తథా పునః
సప్తాక్షరమితామంత్రాస్త్వేవం హి నవధా కృతాః
శేషమేకమక్షరం శ్రీరితి సర్వత్ర విష్ణునా
నవఖండేషు తత్త్యకం తత్సర్వత్ర నియోజయత్

× × × ×

శ్రీకృష్ణోపి పునర్దేవి వ్యాసరూపధరో భువి
మానవానాం హితార్థాయ కావ్యాద్రామాయణాత్పునః
భాగాద్భారతవర్షాంతర్గతాచ్చ వివిధాని హి
పృథక్ పృథక్ సప్తదశ పురాణాని కరిష్యతి
భారతం త్వితిహాసం చ మహచ్ఛ్రేష్ఠం కరిష్యతి

× × × ×

తేషామేవార్థమాదాయ పురాణం పరమోదయం
అష్టాదశసహస్రం హి శ్రీమద్భాగవతాభిధం

కరిష్యత్యష్టాదశేషం రమ్యం జనమనోహరం
భాగవతస్యాతఏవ వాణీ భిన్నా భవిష్యతి

× × × ×

తతో రామాయణం వ్యాసో విధ్వస్తం మునిభిః పునః
కృత్వైకత్ర శేషభూతం సప్తకాండ మితంశుభం
చతుర్వింశతిసాహస్రిం రక్షిష్యతి మునిస్తదా॥

… … … …
… … … …

రామాయణాన్యనేకాని పృథగగ్రే మునీశ్వరాః
భాగాద్భారత ఖండాంతర్గతాత్కుంభోద్భవాదయః
కరిష్యంత్యత్ర శతశస్తాని సర్వాణి పార్వతి
వాల్మీకీయాద్వినా దేవి నజ్ఞేయాని మనీషిభిః॥ ౨౦

యాత్రాకాండము ౨ సర్గము.

ఇద్దానింబట్టి విచారింప భారతవర్ష భాగమునకువచ్చిన ౯౨-౧౦౦౯ శ్లోకములలోఁ గ్రమముగాఁ గొన్ని ఖిలమైపోవఁ దక్కినవానిని సముద్ధరించి సవరించి వ్యాసుఁ డిర్వదినాల్గువేల శ్లోకములుగల రామాయణమును సమకూర్చెననియు రామాయణమందలి శ్లోకములనే కొన్నింటిని సంగ్రహించి మఱికొన్ని స్వీయములుచేర్చి పురాణములు భారతము రచియించెననియు స్పష్టమగుచున్నది. రామాయణ శ్లోకములు భారతమునందున్న వనుటకు శ్రీ గోపీనాథరామాయణమునకుఁ బీఠిక వ్రాసియుండిన విజయనగర మహారాజ సంస్థాపిత ఆంగ్లేయపాఠశాలా సంస్కృతభాషాధ్యాపకులు శ్రీ శ్రీ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు పెక్కు దృష్టాంతములు చూపియున్నారు. అదేరీతి నగస్త్యాదులును గొన్ని రామాయణములొనర్చిరనియుఁగలదు. కథాసరణి చెడనీక వాల్మీకిమహర్షి రచితశ్లోకములను జేర్చుచు సంవిధానమునకై యటనట స్వతంత్రశ్లోకములు కల్పించుచు గ్రంథము సమగ్రముకావించి గద్యము వాల్మీకీయమనియే పై మునీశ్వరులు కొందఱు వ్రాసియుందురని నా యాశయము. మఱికొందఱు తముచే సంగ్రథితమగుటంజేసి తమపేరనే గద్యమువ్రాసికొనియు నుండవచ్చు. ఒకరికిలభించిన కథాభాగమే మఱియొకరికి లభించుట పొసఁగదుగదా? కావున లబ్ధభాగమునకుఁ బూర్వాపరకథను సంక్షేపించివ్రాసి తర్వాత నద్దానిఁజేర్చుట జరిగియుండును. లేకుండిన శ్రీమద్రామాయణమున రాము నరణ్యవాస కష్టచరిత్రము పదునాల్గేండ్లదయ్యు విస్తారముగనుండుటయు వైభవానందయుక్తమగు పదునొకండువేలేండ్ల రాజ్యపాలనము నామమాత్రముననుండుటయు సంభవింపదు. సుప్రసిద్ధ రామేశ్వరక్షేత్ర ప్రస్తావన సైకతలింగప్రతిష్ఠాది విషయములు మృగ్యములై యుండెను ద్దానలేని పై రెండు విషయములును శ్రీమదానందరామా

యణమున వివరముగాఁగలవు. శ్రీమద్రామాయణమునందు విస్తారముగా నుండిన చరిత్రమీ యానందరామాయణమునందు సంక్షిప్తము. ఇట్లే తక్కిన రామాయణములకును విషయము ననుసరించి భేదము కాన్పింపవచ్చును. పాయసవిభాగమునను రామాదుల జననవిషయమునను నీరెంటికిని విశేషభేదము కాన్పించుచున్నది. వానియందేది వాల్మీకీయ శ్లోకభూయిష్ఠమో? యెయ్యది యన్యమహర్షీయమో? చదువరులూహింతురనికోరుచు నాయభిప్రాయమును దెల్పెద. సామాన్యముగా నిద్దఱు ముగ్గురు భార్యలుగల్గిన పురుషుఁడు మనస్సునందెట్లున్నను సమక్షమున వారియందు సమానాదరమును జూపింపకతీరదని సంసారులెఱుంగుట వింతకాదు. భేదభావముతో నుండుట యుత్తమపురుషుని లక్షణమునుగాదు. అట్టి యెడ మహారాజగు దశరథుఁడు దైవదత్తపాయసమును కౌసల్యా సుమిత్రా కైకేయులకు సమముగాఁ బంచిపెట్టక తారుమాఱుసేయఁ గారణముకానరాదు. పోనిండు కౌసల్యకు సగము పంచియిచ్చెనుగదా? తక్కినదియైనఁ జిన్నభార్యలకు రెండుభాగములు చేసి యొసఁగఁగూడదా? సుమిత్రకొకభాగమిచ్చి కైకేయికొసఁగు భాగమున మరల సర్ధము వెనుకకుందీసికొని సుమిత్రకే యిచ్చుబుద్ధి యతనికేలపుట్టెనో? కౌసల్యకొసఁగిన పాయసమామె యప్పుడ క్రోలుటయు సుమిత్రమాత్రము తనభాగమును దాఁపకె దశరథుఁ డేమిచేయునో? యని దిక్కులుచూచుచు నుండుటయుఁ గైకకిడుపాయసములోఁ గొంత మరల సుమిత్రకు దశరథుఁడిచ్చుటయుఁ దద్భేదకార్యమునకుఁ గైక మోర్వపట్టి గుక్కిళులతోపాటు పరమాన్నము మ్రింగుటయు నక్రమముగాక సక్రమమా? క్రమవిధిని రెండవదియగు కైక పాయసవిభాగసమయమున మాత్రము మూడవదియగుటయుఁ జింత్యము.

"అథలక్ష్మణశత్రుఘ్నౌ సుమిత్రా జనయత్సుతౌ
వీరౌసర్వాస్త్రకుశలౌ విష్ణోరర్ధ సమన్వితౌ" శ్రీమద్రా॥ బా॥ కాం॥

విష్ణోరర్ధమనుటంబట్టి లక్ష్మణ శత్రుఘ్నులకుఁ జతుర్థాంశభాక్త్వము స్ఫురించినను జతుర్థాంశముయొక్కయు నష్టమాంశముయొక్కయుఁ గలయిక తేటపడుట కవకాశము లేదు. భరతలక్ష్మణుల జ్యేష్ఠతాకనిష్ఠతలఁ గూర్చియు నిందు సందేహములు పెక్కు తావులనుండినను యుద్ధకాండములోని,

"హిమవాన్ మందరో మేరు స్త్రైలోక్యం వా సహామరైః
శక్యంభుజాభ్యా ముద్ధర్తుం న సంఖ్యే భరతానుజః"

అను నాధారముచే మాత్రము లక్ష్మణుని కనిష్ఠత్వము నిరూపించుట సాహసముకదా?

లక్ష్మణుఁడే జ్యేష్ఠుఁడని నిరూపించు నుదాహరణము లొండురెండు వీక్షింపుఁడు.

"తతో లక్ష్మణమాసాద్య వైదేహీంచ పరంతపః
అభివాద్య తతః ప్రీతో భరతో నామచాబ్రవీత్" యు॥ కాం॥
"సీతామాదాయ గచ్ఛత్వ మగ్రతో భరతాగ్రజ
పృష్ఠతో౽హం గమిష్యామి సాయుధో ద్విపదాంవర." అర॥ కాం॥

ఇద్దానికి భరతుఁడగ్రజుఁడుగాఁ గలవాఁడా! యనవచ్చునందు రేని పై శ్లోకమున ను భరతుఁ డనుజుఁడుగాఁ గలవాఁడని చెప్పుటతప్పుకాదు. లోకప్రతీతియు రామ లక్ష్మణ భరతశత్రుఘ్నులనియే కాని రామ భరతలక్ష్మణ శత్రుఘ్నులని లేదు. శ్రీమదానందరామాయణమునఁ గౌసల్యా సుమిత్రా కైకేయులకు ముగ్గుర కును దశరథుఁడు సమముగాఁ బాయసమును బంచియిచ్చినట్లు కలదు. కైకేయి మాత్రము తనభాగమును గృధ్రీశాపవిమోచనార్థము పాఱవైవఁ గౌసల్యాసుమిత్రలు తమ భాగములలోఁ గొంచెము కొంచెము పాయసము మరలఁ గైకకొసఁగినట్లును దత్కారణముచే నామెకు భరతశత్రుఘ్నులిద్దరు పుత్త్రులు జనించినట్లును గలదు. చిన్ననాఁటినుండియు నేకగర్భజనితులగు భరతశత్రుఘ్నులు లోకజతగానుండుటయుఁ గౌసల్యాకుమారుఁడగు రాముఁడును సుమిత్రాసుతుఁడగు లక్ష్మణుఁడును నొక్కజతగాఁ జేరుటయు స్వభావవిరుద్ధములుగావు. శ్రీమద్రామాయణము రీతిని సుమిత్రాపుత్త్రు లేకగర్భజనిత మర్యాదనువీడి యొకఁడు రామునిని మఱియొకఁడు భరతుని సేవించుచు విభేదముగుట మాత్రము స్వభావమునకు విరుద్ధమునక తప్పదు. సోదరుఁ డగ్రజునితోఁ గూడియుండక దాయతోఁ గూడి మెప్పుపొందినట్లే యగు. అధ్యాత్మరామాయణములోను పాయసవిభాగము వేఱొకగతి నున్నది పరికింపుఁడు.

"కౌసల్యాయై స కైకేయ్యై అర్ధమర్ధం ప్రయత్నతః
తతః సుమిత్రా సంప్రాప్తా జఘ్నతుః పౌత్రికం చరుం
కౌసల్యాతు స్వభాగార్ధం దదౌ తస్యై ముదాన్వితా
కైకేయీ చ స్వభాగార్ధం దదౌ ప్రీతిసమన్వితా
ఉపయుజ్య చరుం సర్వా స్త్రియో గర్భసమన్వితాః"

ఇది మఱియుఁ గను గను నన్యాయము ఈ రామాయణములోని దశరథు నకు సుమిత్ర కనఁబడలేదో? మూలమునకుఁ గుత్సితమో? క్షిప్తమో? తెలియదు. ఈ ప్రకారము నేరామాయణమున కారామాయణము సప్రమాణమగుచుండును గాని యొకదాని కింకొకటి యతిక్రమించి తేని భేదము సూచింపకపోదు. ఇట్లు కావుణంజేసి వాల్మీకిమహర్షిరచితశతకోటిరామాయణాంతర్గతములును స్వసంలబ్ధములునునగు శ్లోకము లాధారముచేసికొని మఱికొన్నింటిని గల్పించి శ్రీమద్రామాయణమును వ్యాసమహర్షి యొనగూర్చినట్లే తక్కుమహర్షులును రామాయణముల నొనగూర్చియుం

మారనియే నా దృఢవిశ్వాసము. ఏ త్రేతాయుగమునకో రచియింపఁబడిన వాల్మీకి రామాయణము ఖిలముగాక సమగ్రముగానున్నదనియు నయ్యది యిరువదినాలుగువేల శ్లోకములుగల శ్రీమద్రామాయణమేయనియు ముడిపెట్టి పిడివాదమున నుపక్రమించుట హాస్యాస్పదము గదా? నాయీయభిప్రాయమును భేదబుద్ధితోఁ బరిశీలింపక లోకప్రవర్తనము నూహించి యెల్లరామాయణములందును నేకముఖ గౌరవదృష్టినిడి సత్యాసత్యములు తెలిసి సంతోషింతురని సత్కవిపండితమణులకు విన్నవించుచు నమస్కరించుచున్నాఁడను.

మత్కృతమగు నేతత్కవితానంద వాల్మీకిరామాయణమునకు నుపోద్ఘాతముఁ గరుణతో వ్రాసి యొసఁగిన బ్రహ్మశ్రీ కళాప్రపూర్ణ, కావ్యస్మృతితీర్థ, అభినవాంధ్ర వాల్మీకి, ఆంధ్రవ్యాస జనమంచి శేషాద్రిశర్మగారికిని, గ్రంథమును జదివి తమ యభిప్రాయములను సాదరముతో నొసఁగిన, బ్ర॥ జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మగారికిని, మద్గురువర్యులగు బ్ర॥ గోరావజ్ఝల రామకృష్ణ సీతారామ సోదరకవులుగారికిని, బ్ర॥ శతావధాని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారికిని, మ॥ రా॥ శ్రీ చిలుకూరి నారాయణరావుగారికిని, గ్రంథసముదాయ విక్రయకార్యమునకుఁ గంకణముధరించి కష్టమునకోర్చి పెక్కుగ్రామములఁ బ్రచారముసాగించి ధనలాభమును నుల్లాసమును గలిగించిన మామేనత్త భర్తయగు బ్ర॥ శ్రీకాంతము నంజుండయ్యగారికిని, బ్ర॥ మాడుల నారాయణశాస్త్రిగారికిని, రాజశ్రీ వార్తకవి లక్ష్మీపతిరావుగారికినిఁ గృతజ్ఞతాపూర్వక వందనములర్పించుచుఁ గృతినిఁ బోషించిన మహారాజశ్రీ అనుప్రాయ సుబ్బరాయప్పగారికి శ్రీరామచంద్రమూర్తి పుత్త్రోత్సాహము నొసంగినందులకు సంతోషించుచు నిత్యోధిక పుత్త్రపౌత్త్రాభివృద్ధియు ధనధాన్యాయురారోగ్య భాగ్యములును నా రామచంద్రుఁడు సర్వదా యతనికిఁ బ్రసాదించుఁగాతమని యాశీర్వదించుచున్నాఁడను.

ఇట్లు,
సుకవిజన విధేయుఁడు,
సోంపల్లి కృష్ణమూర్తి.

## శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# శ్రీ కవితానంద వాల్మీకి రామాయణము.

### —• బాలకాండ విషయానుక్రమణిక •—

---

శ్రీరస్తు

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

శ్రీ

# కవితానంద వాల్మీకి రామాయణము

## సారకాండము.



—♦ ఇష్టదేవతా స్తుతి ♦—

మద్భూతనయా మనోజ్ఞ మధుపం, శృంగార భూషోజ్జ్వలం
భీమోత్సేధ దశానన ప్రముఖ దోర్వీర్యాంధ చంద్రోదయం
భూమానంద కథాసుధా మధురిమా పూర్ణాజజాండాదికం
రామబ్రహ్మ, మనంత సంసరణ పారావార పోతం, భజే. ౧

శా॥ శ్రీసీతాసతి వామభాగమున న - ర్థిన్ ముందు సామీరి య
న్గా సౌమిత్రియు వెన్కలన్ భరతుఁడున్ - శత్రుఘ్నుఁ డిర్వంకలం
దా సుగ్రీవ విభీషణాంగదులు వృ - ద్ధా జాంబవంతుండు చు
ట్టై సేవింప రహించు రాము ససీతా - బ్జాభున్ భజింతున్ మదిన్. ౨

మ॥ మొదటన్ రావణుఁజంపి సద్ద్విజ వచ - స్స్ఫూర్తిన్ ధరిత్రీజతో
నకులం గ్రుంకి దశాశ్వమేధముల నె - న్నంజల్పి జాయావిలా
సదపాకీర్తిఁ జరించి శ్రీసుతులఁ బ - జ్జంజేర్చి కోడండ్రఁ గూ
ర్చి ధరంబ్రోచి సమర్చ తెల్పి స్వపద - శ్రీరాముఁ డొందెన్ సతిన్. ౩

శా॥ శ్రీ క్ష్మా కాంతలు పార్శ్వభాగముల వా - సిం జెన్ను మీఱంగ స
ల్లక్ష్మాంబుల్ కరుణాంచితంబులు మహో - ల్లాసోత్కరంబుల్ చల
త్పక్ష్మాంతాబులునైన వీక్షలను నే - తల్లోక సంరక్షియౌ
లక్ష్మీనాథుఁ గళాసనాథుఁ గృతిలీ - లానాథు సేవించెదన్. ౪

శా॥ దుర్గా గంగలు దేహశీర్షముల నెం - తో ప్రీతిసంధిల్ల సం
సర్గౌన్నత్య సుఖానుభూతి వెలయన్ - సర్వామర స్తుత్యుఁడై
దుర్గర్వంబుహరించి లోకభరమున్ - దోశ్శక్తి మాయించు శ్రీ
భర్గున్ భంజితపాపవర్గు మదిలోఁ - బ్రార్థింతు నశ్రాంతమున్. ౫

మ॥ చతురత్వంబున వాణి వాఙ్నిలయయై - సంతోషమున్ నింప నా
తతమౌ రీతి సమస్త భూతచయ స - త్త్వంబుల్ తదాయుష్యముల్
నుతిపాత్రంబుగఁ గూర్చి జన్మఫల సం - దోహంబు సాధించు నా
చతురాస్యున్ సకృపాస్య మత్కృతి చిర - స్థంబానటుల్ కొల్చెదన్. ౬

చ॥ కలశపయోధిభాస వర - కంజనివాస సమస్తభూత సం
కుల నటనానుకూల దృగ - గోచర దివ్యవిలాస భవ్యవి
స్తుల ధనధాన్య సంపదభి - శోభిత పావనదాస మానసో
ద్విలసనమందహాస మద - భీష్టములిచ్చి శుభంబుఁ గూర్చుతన్. ౭

క॥ వర సస్యాభమిడి స, త్కరుణన్ లోకంబునెల్ల - తనుఁబ్రోచెడి యా
ధరణీదగు కరణిన్ సు, స్థిర సరణిన్ గొలుతుఁ బ్రీతి - చే ననుగావన్. ౮

ఉ॥ కర్ణములన్ సుఖంబెసఁగఁ - గాఁ గరి వక్త్రుఁడు ప్రక్కవీవఁగా
నిర్ణయ కార్యసిద్ధికయి - 'నే'నని ముందుఁ గుమారుఁడుండఁగా
స్వర్ణకళాతనూగరిమ - సామెయి సామినిగూడి మించు ప్రే
మార్ణవ సర్వమంగళ ద - యామతి మత్కృతికిచ్చు భద్రముల్. ౯

క॥ రంగుగ నం గావృత ను, త్తుంగ తరంగాంగ గంగ - తో యాంచ చ్ఛ్రీ
సంగత విహంగ నిస్వన, భృంగారవ సత్ప్రసంగ - ప్రియమెసఁగంగన్. ౧౦

శా॥ వాణిన్ పద్మజురాణి నిత్యనుత గీ - ర్వాణిన్ సమద్ధీజన
శ్రేణిన్ బుస్తక దివ్యహారమణియు - క్ఛ్రీ హైమవీణా చతు
ష్పాణిన్ నీలభుజంగవేణి శుభవీ - క్షాభాజితైణిన్ లస
ద్వాణిన్ రమ్యవచోవిలాస కవితా - ర్థంబై నుతింతున్ మతిన్. ౧౧

క॥ లక్ష్మీశ గణపతి కవితా, లక్ష్మము శుభమెసక మెసఁగ - లలితోక్తులతో
సూక్ష్మస్థితిఁ గృతిగన వా, ఙ్లక్ష్మి కరుణాకటాక్ష - గరిమము నిడుతన్. ౧౨

క॥ ప్రథమావతారగణ్యున్, బ్రథా జయ స్తవ్యమాన - భక్తశరణ్యున్
విధిముఖ సురకృత పుణ్యున్, సుధీవినోదమున కెంతు - సుబ్రహ్మణ్యున్. ౧౩

ఉ॥ వాణికి లక్ష్మికిన్ బ్రమద - వాంఛితముల్ పొనగూర్చు కైత వి
న్నాణము నాకుఁజేర్చి కరు - ణానిధియై వరదాభయాంక క
ల్యాణ గుణాత్త పుస్తక శు - భాక్ష సరంబులఁదాల్చి సైకత
శ్రోణులరాణియౌ త్రిపుర - సుందరి బాలఁ దలంతు భక్తితోన్. ౧౪

చ॥ మురళిని గేలుదోయినిఁ బ్రి - మోదముగా ధరియించి గానమా
ధురిఁ జవిచూపుచుం గడు గు - తూహలతన్ వ్రజభామినీతతుల్
బిరబిర నేగుదెంచి తను - వీక్ష యొనర్చి భజింప మందహా
సరుచిని మౌళిబర్హముఁ బ - సందుగ నూఁపెడు కృష్ణుఁ గొల్చెదన్. ౧౫

చ॥ ఖర నరసింహరూపమున - దైత్యకుమారుని వేఁగఁ బ్రోవ దు
ష్కర సమదారి నత్తఱి న - ఖండ బలోద్ధతిఁ గూల్చి లోక సం
భరణ మొనర్చినట్టి హరి - భక్తిఁ దలంచెద సూరిదత్తమా
వరకవిసింహనామము శు - భస్థితి నిల్పఁగ నన్ను గావఁగన్. ౧౬
క॥ శ్రీ వాంఛా పరిపూర్తిఁ "గ, లా వేంకటనాయక" యను - లాలితకీర్తిన్
భూవలయంబునఁ బడసిన, దేవున్ సద్భావుఁ గోర్కె - దీర్ప నుతింతున్. ౧౭

—♦ సంస్కృత కవిస్తుతి ♦—

శా॥ ఆమ్నాయంబులెగాని కావ్యమన మృ - గ్యంబైన కాలంబునన్
నిమ్నంబౌ తమసా నదీతటినిఁ బెం - టిం గూడి మోహించు క్రౌ
ఞ్చమ్మిం జంపిన బోయపైఁ గినియు చిం - తా వాక్యమే శ్లోకమై
స్వామ్నాయార్థదమైనఁ గావ్యుఁడగు న - వ్వాల్మీకిఁ బ్రార్థించెదన్. ౧౮
క॥ వేదవిభాగము లొనరిచి, యాదట నష్టాదశాంక - మాదిపురాణ
ప్రాదుర్భావముఁ జలిపిన, వేదవ్యాసులను గొల్తు - విధిహిత భక్తిన్. ౧౯
మ॥ స్థిర వాగ్బాణుని నా మయూరు భవభూ - తిన్ గాళిదాసున్ యశో
భరు నా భారవి మాఘు బిల్హణుని స - ద్భారున్ ఘనున్ భోజునిన్
వర సౌమిల్లిని రాజశేఖరునిఁ గా - వ్య శ్రీ మురారిన్ సుబం
ధురు దండిన్ జయదేవు భర్తృహరినిన్ - స్తోత్రం బొనర్తున్ మదిన్. ౨౦

—♦ సనాతనాధునాతనాంధ్ర కవిస్తుతి ♦—

క॥ నన్నయఁ దిక్కన్నను నె, ఱ్ఱన్నను సోమన్న ననఘు - నా పోతన్నన్
గ్రన్నన శ్రీనాథున్ మ, ల్లన్నను దిగ్దంతికవుల - నందఱఁ దలఁతున్. ౨౧
శా॥ మున్నే భూపలలాముఁ డుత్తమకళా - పూర్ణుండు దివ్యాంధ్రదే
శౌన్నత్యమ్మున కాంధ్రభాషకును తా - వై సత్కవిస్తోమ సం
పన్నత్వమ్మున కాదియై సుజయకా - వ్యశ్రీ యశశ్శ్రీల ధా
త్రిన్నిల్పెన్ మది నెంతు నట్టిసును నెం - తేఁ గృష్ణరాయాధిపున్. ౨౨
క॥ పద్దుగ మాకొక్కల్లును, విద్దెల యొరగల్లటంచు - వినుతింపఁగఁ దా
ముద్దు కవిత్వము చక్కెర, నద్దిన మీఁగడనువలెను - నల్లిన ధన్యున్. ౨౩
క॥ సంగత కీర్తి కలాపున్, రంగగు శ్రీకాంతవంశ్యు - రహిఁ గొక్కంటిన్
ముం గ్రాలిన మద్బంధున్, సంగీతము సుబ్బరాయు - సత్కవి నెంతున్. ౨౪
తే॥ మొదట రామాయణము నాంధ్ర - మున రచించి
నట్టి భాస్కర ముఖ్యుల - నలఘుమతుల
గోపినాథుని వేంకటా - ఖ్యునిని ఘనుని
నాంధ్రవాల్మీకి వాసుదా - యని స్మరింతు. ౨౫

క॥ జనమంచి వంశభవునిన్, ఘనునిన్ శేషాద్రిశర్మ - కవినిన్ గవితా
ధనునిన్ శ్రీపాదాన్వయు, ననఘున్ శ్రీకృష్ణమూర్తి - నాత్మనుదలంతున్. ౨౬

క॥ తిరుపతి వేంకటసత్కవి, వరులను నవధానకార్య - వరణీయుల గ్రం
థరచన దక్షుల మఱి ధీ, వరులా నాధునిక కవులఁ - బ్రార్థింతు మదిన్. ౨౭

—♦ గురుస్తుతి ♦—

శా॥ శ్రీరమ్యుల్ కవిసార్వభౌములు కృపా - సింధుల్ బహుగ్రంథ కీ
ర్త్యారంభుల్ సుశతావధానులు మహా - ఖ్యన్ నవ్యబాణుల్ లస
ద్గారావజ్ఝుల రామకృష్ణకవి సీ - తారామ శాస్త్రుల్ మహో
దారుల్ మద్గురువుల్ భజించెదను జి - త్తంబందు సద్భక్తితోన్. ౨౮

—♦ భావి కవిస్తుతి ♦—

క॥ పరకృత సత్కృతులను గని, పరమానందంబు నొందు - భావి కవులకున్
స్థిరమతిఁ గరములు మోగిచెద, వరకావ్య విలాస మహిత - వైభవ [illegible].

—♦ కృతికర్తృ వంశావళి ♦—

సీ॥ శ్రీమదగ్నిహోత్ర - నామ గోత్రోద్భవుం, డాశ్వలాయన సూత్రుఁ - డవని సురుఁడు
సోంపల్లె వంశాబ్ధి - సోముండు భవ్యుండు, నంజయార్యుండు సు - జ్ఞానఘనుఁడు
అతని యిల్లాలు గుం - డాంబ శీలకదంబ, వారి యాత్మజుఁడు వి - ద్యారతుండు
కృష్ణాహ్వయుండు స - త్కీర్తి విస్తారుండు, వెంకాంబ విభుఁడు వి - వేకనిభుఁడు
తే॥ ధన్యతములగు నాదివ్య - దంపతులకు
నాదిలక్ష్మమ్మయును నంజ - యాభిధుండు
కలశజలధి రమాశీత - కరులయట్లు
కలిగి సద్గుణఖనులన - వెలసి రిలను. 30

క॥ ఆనంజయార్యుఁ డభినవ, సూనాస్త్రుఁడనంగ విరాజి - సుందరతనుఁడై
జ్ఞానకళాకుశలతఁ జతు, రానను బరిణించెఁ బ్రాజ్ఞ - లౌనౌ ననఁగన్. 31

తే॥ పరమ సాధ్వీమతల్లి సౌ - భాగ్యవల్లి, సుగుణ కల్పవల్లి భా - సుర సుశీల
ధర్మగుణసత్య కరుణా వి - ధానమాన, హర్షనికురుంబ మంగాంబ - యతనిపత్ని.

తే॥ ఆగుణోత్తరతములు ప్రి - యత్వదైవ
తములు లక్ష్మీజగన్నాథ - సములు క్రమతఁ
దనయ నొక్కరుఁ బుత్త్రి కా - ద్వయిని మరల
ముగురు కొడుకులఁ గనిరి స - మ్మదము మీఱ. 33

క॥ అందగ్రజుఁ డనునయుర, త్తిం దనరిన కృష్ణమూర్తి - దివ్యాఖ్యుండన్
సుందరు సీతారాము న, మందానందంబు నొంది - మది భజియింతున్. 34

తే॥ సత్యపథనుత వెంకమ్మ - సాధుచరిత
సుబ్బలక్ష్మమ్మ సమ్మాన - సుగుణభరిత
యిద్దరును నాకు చెల్లెండ్రు - తద్దభక్తి
వినయ ధర్మానురక్తిఁ దా - ర్పెలయుచుండ్రు. ౩౫
క॥ శ్రీ సుబ్రహ్మణ్యుఁడు గుణ, భాసురుఁ డేక విశ్వనాథ - భవ్యాభిధుఁడున్
వాసిఁదగు రామమూర్తియు, నా సోదరు లస్మదాజ్ఞ - నయగతు లెపుడున్. ౩౬
క॥ మానిని మద్గృహిణీమణి, జ్ఞానాత్మిక లక్ష్మి నరస - నామక మాకున్
శ్రీనాథుని కృపఁ గలుగఁగ, నానందము కవికుమారి - యాత్మజకల్గెన్. ౩౭
క॥ మావంశక్రమమును గన, భావంబున భావిబుధులు - భ్రమపడకుండన్
నే వివరించితి సత్కృ, త్యావిర్భావమున వెలసె - నస్మత్కులమున్. ౩౮

—• కవికృత పూర్వగ్రంథ నిర్ణయము •—

సీ॥ [illegible] - పద్యశతం బాప, దుద్ధారక స్తోత్ర - మిద్ధకీర్తి
[illegible] విలా - సాభిరూపకమును, దన్మల్లికార్జున - దైవవినుతి
రామాస్త్ర మివ్వి ము - ద్రణములు నేఁటికి, శ్రీసతీతిలక సు - ప్రాత్తుకల్ప
వల్లియు నవధాన - భవ్యరత్నావళి, తెనుఁగు వ్యాకృతి వివ - రణము మఱియు
తే॥ వరుస శంకరవిజయ దై - వజ్ఞ భూష
ణాంధ్ర శ్రీసూర్యశతక టీ - కాద్వయములు
సత్యనారాయణాఖ్య వా - చకములై దు
మత్కృత గ్రంథములు దైవ - మాన్యకృతులు. ౩౯

—• ప్రస్తుత కావ్యనిర్మాణ కారణము •—

శా॥ శ్రీమిర్జన్ రఘురామచంద్ర కరుణా - తృప్తాత్ముఁడై నట్టి నే
నా మాన్యున్ ఘనకావ్యసంస్తుతిగా - నర్థింప యోజించి మ
ద్గ్రామంబున్ విడి బంధువీక్షకయి ము - త్యాల్ చెఱ్వనాఁబొల్చు త
ద్గ్రామంబుం గని యందుఁ బేర్గనిన సు - బ్రాయార్యు సద్గోష్ఠితోన్. ౪౦
క॥ ఒకనాఁడాతని యుపవన, మకలంకస్థితిని జొచ్చి - యాసీనులమై
సుకృతియగు గంధవాహుఁడు, సుకముగ వీవంగనుండఁ - జూచి యతఁడనెన్.
మ॥ కవిసింహుండని పేరుపొంది విపులం - గావ్యంబులన్ వ్రాసినాఁ
డవు మేలౌ నవధానదక్షుఁడవు రూ - ఢంబైన సద్భక్తిచే
నవనిన్ శ్రీజయమోక్షదాయియగు న - య్యానందరామాయణం
బవు నౌ నంచు బుధుల్ కవుల్ పొగడఁగా - నాంధ్రించు గావింపుమా! ౪౨
క॥ విద్వాంసులు నుతియింపఁగ, విద్వత్పట్టంబునంది - వేవిధముల నీ
విద్వత్కవితా చతురిను, సద్వినయము మొనయఁ దెలిపి - క్షమమనితి బుధా! ౪౩

క॥ చిల్లర పాత్రములెన్నియొ?, కల్లలో? నిజములో? రచించి - కాలక్షేపం
బెల్లలనో? కనమేలా?, సల్లలిత మహాకృతిన్ వి - చారింపు బుధా! ౪౪

ఆ॥ చిన్ననాఁటి నుండి - నిన్ను నేఁ బొడఁగని, యున్నవాఁడ నేస్త - మున్న దటులె
కవులు గలరు కాని, - తప్పునువు నీవె యీ, కృతి కటంచు నెంతు - హితవరేణ్యా!

క॥ శ్రీ కవితానందుఁడు వా, ల్మీకి తదానంద రామ - లీలా కృతినిన్
గైకొని తెల్గింపుఁడు మీ, కే కవితానంద వాల్మి - కి ప్రథ వెలయన్. ౪౬

క॥ అని నా కోర్కికిఁ దాను, ననునయముగఁ బల్కి నంత - హర్షించియు నా
జనకసుతాపతి సంఘట, నను నెమ్మది మెచ్చి గృహము - నకుఁ జనితిమటుల్.

మ॥ దినముల్ కొన్ని చనంగఁ దత్కృతిని న - ర్థిం జిత్తముం దెంచి య
య్యనఘత్వాంబును బొందనుండ బహుధా - న్యాఖ్యాంబు సద్వత్సరం
బును నేతెంచెను జైత్ర రామ నవమీ - పుణ్యోత్సవంబుల్ ధరం
దనరెన్ బాద్యమి మున్నుగాఁ గనుక నేఁ - దత్కార్య యత్నుండనై. ౪౮

తే॥ వాయుపథ షడ్డిగబ్జాంక - వత్సరమ్మ
లైన శ్రీశాలివాహ శ - కాన వెలయు
వత్సర శ్రేష్ఠ బహుధాన్య - వత్సరమునఁ
జైత్ర శుద్ధ ద్వితీయఁ గృ - తిత్రు నెంచి. ౪౯

క॥ మూల గ్రంథముఁ బడసెడు, నాలోచన సుబ్బరాణ్మ - హామహు నరయన్
జాలిన భక్తిని నాతఁడు మూల గ్రంథమ్మొసంగి - మోద మెలర్పన్. ౫౦

తే॥ క్రమత నానందరామాయ - ణమును మీరు
తెల్గుసేయఁగ ముద్రణ - స్థితికి నేను
శక్తి కొలఁదిని ధనమిచ్చి - సాయ పడెద
గ్రంథ పరిపూర్తి వఱకని - కరుణఁ బలికి. ౫౧

క॥ మునుకొని భక్తిని ఘన చం, దనమున్ గర్పూర కలిత - తాంబూలంబున్
గొనుమని యొసఁగి సగౌరవ, మున జాంబూనదము నిచ్చెఁ - బుణ్యోన్నతియై. ౫౨

చ॥ ప్రవిమలమైన నందవర - వంశమునందు వసిష్ఠ గోత్ర సం
భవుఁడయి యాశ్వలాయన స - మంచిత సూత్రకుఁడై గణింప మే
లవు ననుపూరు సంతతి య - శోన్వితుఁడై తగు నాగయార్యుఁ డి
బ్భువిఁ బొలుపొందె నాగపతి - పూన్కి నుతింపఁగ వేయి నోళ్లతోన్. ౫౩

సీ॥ ఆ నాగయార్యున - కనుకూల గృహలక్ష్మి, సాధ్వి యక్కాజమ్మ - సత్యశీల
వారల సుతుఁడు సు - బ్బారాయ ధీమణి, యాతని భార్య కో - నమ్మ యార్య
యాదంపతుల సూనుఁ - డాఢ్యుఁ డన్నాసామి, యాతని పత్ని ల - క్ష్మమ్మ మాన్య
తద్గర్భ శుక్తిము - క్తాఫలంబయి కీర్తి, రాణించె శ్రీసుబ్బ - రాయఘనుఁడు

తే॥ భక్తితో నా మునమ్మయుఁ - బార్వతమ్మ
తనకుఁ గూరిమి సతులగు - యను దినంబు
సేవలను జేసి సమ్మద - శ్రీని గూర్ప
వెలయు నీ సుబ్బరాయ ధీ - కలితుఁ డరయ. ౨౪
తే॥ శైవ వైష్ణవ కాపాల - శాక్త సౌర,
మతము లెన్న గాణాపత్య - మతము ననెడు
షణ్మతాంచిత భేద ప్ర - సంగి గాక
భక్తి నద్వైత సన్మత - ప్రాప్తుఁడయ్యె. ౨౫
తే॥ యజన యాజన పావనా - ధ్యయన భవ్య
బాధ్యతాధ్యాపనము లొక్క - పాటి వనుచుఁ
గ్రమతఁ బంచత నొందు దా - నమును బ్రోవ
నతని చెంతఁ బ్రతిగ్రహ - మల్పమయ్యె. ౨౬
క॥ కవి పడిత పౌరాణిక, ప్రవిమల గాథాను కథక - ప్రస్తోత్రిక హా
స్య విధాయక గాయకులం, గవి ముఖ్యుఁడటంచు మిగుల - గౌరవ మొసఁగున్.
క॥ అన్నము వస్త్రము గంధము, సన్నుత పుష్పములు మృదుల - శయ్యయుఁ దాంబూ
లోన్నతి రతిగానములని, యెన్నెడు భోగములు గల్గి - యెపుడతఁడు మనున్. ౨౮
క॥ కప్పురమును గస్తురియును, నప్పునుఁగు జవాది యగురు - నల పన్నీరున్
మెప్పగు సిరి గందమ్ముగ, కుప్పంక్తులఁ బరిమళించు - గుమి నతనింటన్. ౨౯
తే॥ శాలి గోధుమ తిల మాష - చణక ముద్గ, బర్బరాఢక సుకుళుత్థ - బహుళ ధాన్య
లాభ నానా పదార్థక - లాప మెపుడు, వఱలుఁ దనయింట నతనిదే - పాడిపంట.
క॥ అడిగిన వారికి లేదని, నుడువక తోఁచినది యొసఁగి - నూల్కొను ప్రీతిన్
గుడువం బెట్టుచు నతిథులఁ, గడు భక్తిని గొల్చు నతఁడు - ఘనత దలిర్పన్. ౩౧
తే॥ అన్నపూర్ణా మహాదేవి - నెన్ని యాల, నెన్నఁదగు నన్నదాన స - మున్నతులను
నర్ధరాత్రమునం దైన - నలఁతఁ గొనక, వండి వడ్డించుఁ దన పెద్ద - భార్య యార్య.
తే॥ అట్టి శ్రీ సుబ్బరాయార్యు - నాత్మ దెలిసి
కావ్యముల కెల్ల నాదియౌ - కావ్య మరసి
సరవి ననుబ్రోచు శ్రీరామ - చంద్రుఁ దలఁచి
భక్తి భయ సంభ్రమము లాత్మఁ - బ్రబల నిలిచి. ౩౩
క॥ నే నెట? శ్రీ వాల్మీకి ము, నీనం డెట? హస్తి మశక - మే యగుఁ గాదే?
యానందరామ చరితము, జ్ఞానంబుగఁ దెల్పసేయఁ - గా నగునొక్కొ? ౩౪
మ. ముదమేపారఁగ నెందఱో కవులు సొం - పుం బెంపు రూపింప ని
త్యదుఁడౌ శ్రీరఘురాముని దలఁచి త - ద్రామాయణ గ్రంథముల్

పదులున్ నూఱులు వేలు లక్షలు గణిం - పన్ గోటులుం గాఁగ న
భ్యుదయాంచత్పరివృద్ధి నల్పి యశమున్ - బుణ్యాబ్ధిఁ జేపట్టరే ? ౬౫
చ. అయినను నాదు పుణ్య వశ - మా ? మఱి భాగ్యవశంబ ? హర్ష దం
బయి చెలువొందు రామ చరి - తామృత మౌనియు మానకవ్విధిన్
నయవినయోల్లసత్కవిత - నందమునంద రచింప నయ్యె శ్రీ
జయ సుఖభోగ భాగ్య సుయ - శస్థితి గాంచఁగ నయ్యె నియ్యెడన్. ౬౬
క. ఆనందకరుఁడు రాముం, డానందము చరితమెల్ల - నానంద లస
ద్ధ్యానధనుం డాదిమ కవి, యానందమె నాకుఁగల్గు - నారాము కృపన్. ౬౭
శా. ఎట్టో మానవ జన్మమెత్తి ద్విజుఁడై - యిప్పట్టునన్ దిట్టమౌ
నట్టుల్ వాల్మికి మౌనివర్య కృతమౌ - నానంద రామాయణం
బుట్టన్ సద్భుచు లద్భుతంబని కవుల్ - యోజించి నిత్యంబుఁ జే
పట్టన్ దెల్గొనరించుచుంటిఁ గృతి సం - భావింపఁగా ధన్యుఁడన్. ౬౮
తే. పొగరుపడి సత్కవుల నెల్లఁ - దగరటంచుఁ
బగఱవలెఁ గాంచి తమకుఁ దా - మెగిరి పడుచుఁ
దగరు కొండకు డీకొను - పగిది తోఁప
దగని కైతల నొనగూర్ప - నగరె జనులు. ౬౯
క. నుడువునది రామ చరితము, నుడువఁగఁ దగు మంచినుడులు - నూల్కొను గతిఁదా
నిడువాఁడు రామచంద్రుఁడు, నుడివినయెడ దాన నవ్వ న - నూన శుభంబుల్. ౭౦
క॥ కావున భక్తిశ్రద్ధా, భావంబున నేను రామ - భద్రుని యానం
దావహ ఘన చారిత్రము, కావ్యముకై యతని మ్రొక్కి - కావింతుఁ గృతిన్. ౭౧
ఉ॥ శ్రీ రమణీయమూర్తిని న - శేష కృపాపరివర్తినిన్ గుణో
దార సమస్త భక్తజన - తా పరిపూర్ణ హితార్తినిన్ శర
త్సారసవైరిభాసమది - శాతతకీర్తిని దుష్టమార్గ సం
చారనివర్తినిన్ శుభ వి - చారణఁ గొల్చెద రామమూర్తినిన్. ౭౨
ఉ॥ నా తొలి పాములెల్లను వి - నాశమునందఁగఁ జేసి సత్కృపా
రీతినిఁ జేసి నాకుఁదగు - ప్రీతినిగూరిచి వ్రాసిఁ గావ్య కీ
ర్త్యాతత గౌరవంబది ని - రంతరమౌనని వ్రాసి మోమునన్
జేతము తృప్తిపొందునటు - చెల్వుగ నం గను రామునెంచెదన్. ౭౩
క॥ కలదా ? ఘనమెదియేనిఁ, గలదా ? యాశ్రితులకోరి - కల నిల రమఁ దేఁ
గలదా ? శుభములు వడినిడఁ, గలదా ? తారకముమించఁ - గలదా ? మదికిన్.
ఉ॥ శ్రీకవితాసుధాగస వి - శేషసుఖానుభవాది వైభవ
శ్రీకుఁడు వాల్మికాఖ్య ముని - శేఖరుఁ డాదికవీంద్రుఁ డెట్టి పు

ణ్యాకరమైన రామచరి - తామరభూజను ధాత్రి నిల్పె స
స్తోకఫలప్రదాయి యగు - చున్ ముదమిచ్చెడు దానిఁ గొల్చెదన్. ౨౫

మ॥ ఇతివృత్తంబు మహత్త్వయుక్తము, కడున్ - హృద్యంబు, శ్రీరామ భూ
పతియా? విష్ణ్వవతారమూర్తి; యనుజుల్ - భావింపఁగా భోగిసం
తతిరాడబ్జరథాంగమూర్తు లెలమిన్ - ధాత్రీజ మా దేవి చిం
తిత వాంఛాపరిపూర్తి, తత్కృతము కీ - ర్తిస్థాన మికావ్యమా. ౨౬

క॥ అని నిశ్చయించి మత్కృతి, కనఁగా నాచంద్రతార కముగా నిలఁగా
ఘనుఁడౌ రాముఁడె దిక్కని, మునుకొంటిని నతఁడె విఘ్న - ములఁ బోకార్పున్.

తే॥ మఱియు నుత్సాహకరుఁడైన - మాన్యచరితు
ననఘు సుబ్రాయుఁ బుత్రపౌ - త్రాభివృద్ధి
కరముగా నాయురారోగ్య - చిరసుఖంబు
లనవరత మిడి రాముఁడు - మనుచుఁగాత! ౨౮

క॥ నా గొప్పతనముఁ దెలిపెడు, బాగోగుల మాటకాదు - భక్తిజ్ఞానో
ద్వేగముగాఁ గరుణామతి, తో గోచరమయిన ఘనుల - తో మొఱనిడెదన్. ౨౯

శా॥ ఏ నీ రామచరిత్ర పీఠికను నేం - తే భక్తితో వ్రాయుచున్
సానందుండయి యుండ నొక్కరజనిన్ - స్వప్నంబునన్ ధ్యానయో
గానుష్ఠాన సునిశ్చలుండు మునిలో - కాగ్రేసరుండున్ మఱిన్
దీనిం బూర్తిగ వ్రాయ నీవును గృపా - ప్తిన్ రామ! కన్పింపరే? ౩౦

సీ॥ పద్మాసనస్థితి - భక్తితోఁ గూర్చుండి, జాను యుగ్మమున హ - స్తముల నునిచి
మోమున దేహాన - భూతిరేఖలు వెల్గఁ, గన్నులమూసి చ - క్కఁగను నిక్కి
తారకధ్యాన సం - ధాన చిత్తుండయి, యింతైనఁ దాఁ జలి - యింపకుండ
గడ్డము స్వచ్ఛమై - బొడ్డుదాఁకను వ్రేలఁ, దెల్లమీసలు పురి - దీరి యుండ
తే॥ వెలవత్సరములనుండి - వెలసియున్న, రీతిఁ గన్పడినట్టి వి - ఖ్యాతమూర్తి
యాదికవి వాల్మీకియె యంచు - నాత్మ నెంచి, సంతసించితి నమస్మాని - సన్స్మరింతు.

సీ॥ కడు నీలమునుగాక - కడు స్వచ్ఛమునుగాక, మేలికాంతినిమించు - మేనివానిఁ
గనక మణీగణా - క్రాంత కిరీటంబు, సరిమెఱుంగుల నీను శిరమువాని
బంగారు జలతారు - రంగారు పనులచేఁ, బొలుపొందు పచ్చని - వలువవాని
ధనువును డాకేల - ధరియించి వలకేల, నభయ మిచ్చుచు నన్ను - నరయువాని
తే॥ లీల దరహాసరుచి తొంగ - లించువాని
ధన్వి లక్ష్మణుఁడొక ప్రక్కఁ - దనరువాని
వెలఁది సీతమ్మ డగ్గఱ - వెలయువాని
నిన్నుఁగాంచితి రామ! ప్రసన్నమూర్తి! ౩౧

—◆ షష్ఠ్యంతములు ◆—

క॥ శ్రీరామమూర్తి సత్కరు, ణారామ వినోదవర్తి - యభినవ కవితా
ధారా మధుర సుధారస, పారంగత వినుతకీర్తి - ప్రహతార్తియగున్. ౧౩

క॥ రామున్ జితవైభవ సు, త్రామున్ బరిహసిత పరశు - రామున్ శత్రు
ద్దామ జయాద్యభిరామున్, మామక మతి నెంతు దురభి - మాన విరామున్. ౧౪

క॥ సార్థకముగఁ గృతి సురసం, ప్రార్థితుచే జానకీహృ - దబ్జస్థితుచే
వ్యర్థపదవాద హాతుచేఁ, బార్థివకులజనితుచే న - పార చరితుచేన్. ౧౫

క॥ నతి వర పుణ్యాకృతికై, సతత మునిప్రకరమాన - సస్థిరమతికై
హత భవబంధ సమితికై, యతినమస్కార శాత్రవ ప్ర - హార నియతికై. ౧౬

క॥ భాషాసౌష్ఠవ దివ్య మ, నీషా సువిశేషువలన - నిఖిలావన సం
తోషామల గుణగణమణి, భూషాన్విత వేషువలనఁ - బోషితుఁడౌ వరున్. ౧౭

క॥ మత్కృతికన్యా పరిణయ, సత్కృతి రఘువంశవార్ధి - చంద్రునకు శుభాం
చత్కృత గుణసాంద్రునకు ల, సత్కృతి రుంద్రునకు రామ - జగతీంద్రునకున్. ౧౮

—◆ కథా ప్రారంభము ◆—

వ॥ శ్రీకర శుభోదయ పరంపరాభివృద్ధిగా వాల్మీకిమహర్షికృతానందరామాయణమున కాంధ్రీకరణముగా శ్రీరామచంద్రపరబ్రహ్మసమర్పణంబుగా నా యొనర్పం బూనిన శ్రీకవితానంద వాల్మీకి రామాయణ మహాకావ్యంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన. ౧౯

—◆ (శ్రీ) పార్వతీ పరమేశ్వర సంవాదము ◆—

క॥ శ్రీనగజాత యొకప్పుడు, జానకి వల్లభుని మీఁది - సద్భక్తి మెయిన్
దాను ముదమంది శంకరు, మానుగ నతిజేసి పల్కె - మంజుల ఫణితిన్. ౨౦

తే॥ రమణ! మీచేత నెల్ల పు - రాణములును
ముందు నే వింటి నానంద - మును నొసంగు
రామజననాదిచర్యా వి - రాజమాన
దివ్యచరితమ్ముఁ దెల్పుము - దేవ! యిపుడు. ౨౧

—◆ సూర్యవంశ రాజానుక్రమము ◆—

వ॥ అని ప్రార్థించిన నప్పరమేశ్వరుండు పార్వతితోఁ గాంతా! చక్కఁగాఁ బ్రశ్నించితివి. మహామంగళ కారకంబైన శ్రీరామచంద్రమూర్తి కథానకంబు నాద్యంతంబు వివరించెదవినుము. తొల్లి శ్రీమదాదినారాయణమూర్తికి బ్రహ్మదేవుఁ డుద్భవించె; నతనికి మరీచికలిగె; నమ్మరీచికిఁ గశ్యపుఁడు జనించె; నాతనికి సూర్యుండు పొడమె; సూర్యునకు యముండు సుతుండయ్యె; యముఁడే వైవస్వతమనువనాఁ బరఁగు;

నామనువున నిక్ష్వాకుండుపుట్టె; నిక్ష్వాకునకు శశాదుఁడను వికుక్షియు నతనికిఁ
బురంజయుండును నింద్రవాహుండను ననఁబడు కకుత్థ్సుండును, నవ్వానికి ననేనుఁ
డను విశ్వరాధియు, నాయనకుఁ జంద్రుఁడును, జంద్రునకుఁ బ్రతాపవంతుఁడగు
యువనాశ్వుఁడును, వానికి శాబస్తుఁడును, నతనికి బృహదశ్వుఁడును, నాతనికి నృపో
త్తముఁడగు కువలయాశ్వుఁడును, గువలయాశ్వునకు దృఢాశ్వుఁడును, దృఢాశ్వు
నకు హర్యశ్వుఁడును, వానికి నికుంభుఁడును, నతనికి బర్హణాశ్వుఁడును, నావానికిఁ
గృతాశ్వుఁడును, గృతాశ్వునకు శ్యేనజిత్తనువాఁడును, శ్యేనజిత్తునకు యువనా
శ్వుఁడును, నా రాజునకుఁ దసద్దస్యుఁడను మాంధాతృమహీపాలుఁడును, మాం
ధాతకుఁ బురుకుత్సుఁడును, నాతనికి మరలఁ ద్రసద్దస్యుఁడును, వాని కనరణ్యుఁ
డును, ననరణ్యునకు హర్యశ్వుఁడును, హర్యశ్వునకు నరుణుఁడును, నరుణునకుఁ
ద్రిబంధనుఁడును, ద్రిబంధనునకు సత్యవ్రతుఁడను ద్రిశంకుఁడును, నాతనికి హరిశ్చం
ద్రుఁడును, వానికి రోహితుఁడును, రోహితునకు హరితుఁడును, హరితునకుఁ జం
పుఁడను సుతుండును. జంపునకు సుదేవుఁడును, సుదేవునకు విజయుఁడును, విజయు
నకు భరుకుఁడును, భరుకునకు వృకుఁడును, వృకునకు బాహుకుఁడును, బాహు
కునకు సగరుఁడును, సగరునకు నసమంజసుఁడును, నసమంజసునకు నంశుమంతుఁ
డును, వానికి దిలీపభూపతియు, దిలీపునకు భగీరథుఁడును, నాతనికి శ్రుతుఁడును,
శ్రుతునకు నాభుఁడును, నాభునకు సింధుద్వీపుఁడును, నతనికి నయుతాయువును,
వానికి ఋతుపర్ణుఁడును, ఋతుపర్ణునకుఁ గల్మాషపాదుఁడనియు మిత్త్రసహుఁ
డనియు నామాంతరములుగల సుదాసుఁడును, సుదాసునకు నశ్మకుఁడును, వానికి
నారీకవచుఁడనంబడు మూలకుఁడును, మూలకునకు దశరథుఁడును, నతనికిఁ బ్రసి
ద్ధుఁడగు నైడవిడుఁడును, వానికి విశ్వసహుఁడును, విశ్వసహునకు ఖట్వాంగుఁ
డును, నాతనికి దీర్ఘబాహుకుఁడును, దీర్ఘబాహుకునకు దిలీపుఁడును, దిలీపునకు
రఘుమహారాజును, నారఘుమహారాజునకు నజమహారాజును, నజమహారాజు
నకు దశరథమహారాజును, దశరథమహారాజునకుఁ బరమేశ్వరుఁడగు శ్రీరామ
చంద్రుఁడును గ్రమముగా జన్మించిరి. ౧౨

తే॥ సర్వదా మును లెవ్వాని - సారనామ
ములను గడలేనియట్టి రీ - తుల గ్రహింత్రో?
యరువదియు నొక్కరైన భూ - వరుల వెనుక
నెవ్వఁడలరెనో? యారాముఁ - డితఁడె సుమ్ము. ౧౩

తే॥ మఱియు నీతనిపిమ్మట - నరువదొక్క, రైనరాజులు కలరు వి - ష్ణ్వాది మధ్య
గణ్యుఁడైనట్టి శ్రీరామ - పుణ్యమూర్తి, చరిత సంక్షిప్తముగఁ దేట - పఱుతు నెల్ల.

—♦ కౌసల్యా వివాహ ప్రయత్నము ♦—

శా॥ శ్రీమంతుండును నాజి సత్త్వయుతుఁడున్ - సేనాగణో పేతుఁడున్
భూమీపాధ్యుఁడు లోకవిశ్రుతుఁడు జం - బూద్వీపుఁ డిక్ష్వాకు వం
శామర్త్యాగమునైన రాజు సరయూ - ప్రాంతస్థితాయోధ్యఁ దాఁ
బ్రేమన్ బంక్తిరథుండు రాజ్యము యశ - శ్శ్రీ నేలుచుండెన్ రహిన్. ౯౫

తే॥ ఆ యయోధ్య సమీపము - నందు వెలయు
నలఘు కోసలదేశ కో - సలపురమునఁ
బుణ్యుఁడౌ కోసలాహ్వయ - భూమిధవుఁడు
ఘనుఁడు సంతోషచిత్తుఁడై - మనుచునుండె. ౯౬

క॥ కోసలపతి పుత్త్రీమణి, భాసుర రమ్యాంగ పెండ్లి - పడుచు తలంపన్
గౌసల్య యనెడు పేరున, వాసినిగను సుగుణశీల - వర్ధిలుచుండెన్. ౯౭

క॥ ఆమెను దశరథనామక, భూమీశున కొసఁగునట్టి - పూనికగని తా
నామెయి శుభగతిఁ గోసల, భూమీశుఁడు సఖుల నతని - పురమున కనిపెన్. ౯౮

క॥ వారా దశరథరాజును, నారసి శుభలగ్నమునకు - నందఱితో మా
కోరికఁ దీర్పఁగ రమ్మని, కోరిన నాతఁడును బంధు - గులతోఁ బ్రజతోన్. ౯౯

తే॥ అమిత వైభవమొసఁగ ల - గ్నావసరము
నాత్మ గమనించి శుభచిహ్న - మలర నపుడు
బయలుదేరెను మంత్రిలు - ప్రమదమిడఁగ
నావపై నెక్కి సరయువు - నదిని దాట. ౧౦౦

క॥ రాతిరి పరిజనములతో, క్ష్మాతలపతి దశరథుండు - మనఁగా నట వే
శ్యాతతి నటియించెను ర, త్నాతత రుచు లెసఁగె మాగ-ధాదులు పొగడన్. ౧౦౧

—♦ రావణుఁడు బ్రహ్మవలన స్వమరణము తెలియుంగుట ♦—

క॥ ఆ సమయంబున లంకను, నాసురపతియైన రావ - ణాసురుఁడు ధృతిం
జేసి విధాతను గని బ్ర, హ్మా! చెప్పుమునాకు మరణ - మది యెట్లొదవున్ ?

క॥ నీవే యర్హుఁడ వనవుడు, నా విధి రావణున కనియె - నయ్యా! విను నీ
న్నావిష్ణుఁడె దశరథుఁడను, భూవిభునకుఁ బొడమి రూప - మును మాయించున్.

క॥ చతురంశాగ్రభవుండై, క్షితిఁ గౌసల్యకు జనించి - శ్రీరాముఁడనన్
మతిగాంచు నా రమేశుఁడు, మతినమ్ముము డగ్గఱించె - మద్వాక్స్థితియున్. ౧౦౪

తే॥ నేఁటి కైదవనాఁడు పం - క్తిరథు పెండ్లి,
కోసలాహ్వయుఁ డాతని - కూఁతు నొసఁగ
నిశ్చయించెను విప్రోక్తి - నిక్కమిద్ది
యనిన రావణుఁ డప్పుడె - యదరి లేచి. ౧౦౫

—♦ రావణుఁడు కౌసల్యా వివాహమునకు విఘ్నము సేయుట ♦—

తే॥ ఆయుధోపేతులైన ని - శాటవరుల
వెంట రాఁ బిల్చి తా ముని - వంటఁ గ్రింది
పెదవి నొక్కుచు దిక్కులు - ప్రిదిలపడఁగఁ
బుష్పకము నెక్కి సాకేత - పురముఁ జేరి. ౧౦౬

క॥ సరయూ నౌకాస్థితుఁడౌ, ధరణీపతిఁ గాంచి మించి - తత్పరిజనులన్
బోరిఁగొని నొంచి క్షణంబున, విఱుగఁగ నావను బగిల్చి - విక్రమలీలన్. ౧౦౭

తే॥ దశరథ సుమంత్రు లిర్వురు - దైవవశత
నావ శకలంబె ఘన సాధ - నంబుగాఁగ
నరిగి భాగీరథినిఁ జేరి - యాలసంద్రి
మంచు విశ్రాంతినొంది సౌ - ఖ్యముగ నుండ. ౧౦౮

క॥ ఆ రావణుఁడును గోసలఁ, జేరఁగఁ జని యెల్లవారిఁ - జీకాకు పడం
గ్రూరత మోదుచుఁ గోసల, భూరమణుని గెల్చి యతని-పుత్త్రిని గొనియెన్. ౧౦౯

ఉ॥ ఆమెను బుష్పకాన నిడి - యంబరవీథిని లంక కేగుచున్
దా మదిఁ జింతనొంది దితి - నందనవంద్యుఁడు రావణుండు నే
నీమెను లంకలో విడువ - నెట్టులొ మోసమొనర్చి దేవతల్
తాము హరింతు రంచు వసు - ధన్ లవణార్ణవ మీక్ష సేయుచున్. ౧౧౦

తే॥ అందొక తిమింగిలముఁ గాంచి - యచటి కరిగి
యొక్క పెట్టియఁ గౌసల్య - నొనరఁ బెట్టి
గట్టిగా మూఁతవైచి యా - పెట్టెదాని
కొసఁగి రక్షింపఁగా నాజ్ఞ - నొసఁగి చనియె. ౧౧౧

క॥ రావణుఁడు లంక కేఁగుట, భావించి తిమింగిలంబు - వాగ్వివరంబున్
దావల మొనరిచి పేటిక, కా వననిధి సౌఖ్యరీతి - నలరుచు నుండెన్. ౧౧౨

తే॥ ఆ తిమింగిల మొక్కచో - నరిని గాంచి
పేటికను బ్రిక్క దీవిపైఁ - బెట్టి తాను
గ్రోధమునఁ బోరఁ దొడఁగె నా - లోనఁ బంక్తి
రథ సుమంత్రులు దీవిఁ జే - రంగవచ్చి. ౧౧౩

తే॥ పెట్టియ సమీపమున కేఁగి - గట్టిమూఁత
నూడఁగాఁ దీసి యందున - వోఢఁ గాంచి
సరవి నన్యోన్య విషయ వి - చారణలను
జలిపి వృత్తాంతమెఱిఁగిరి - సంభ్రమమున. ౧౧౪

—♦ కౌసల్యా దశరథుల గాంధర్వ వివాహము ♦—

క॥ దశరథుఁ దెలిసిన పిమ్మట, శశిముఖి కౌసల్య సిగ్గు - చాటున నిలిచెన్
శశధరు నల్లుఁడు తన స, ద్యశమలర నిరీక్షణంబు - ననువుగఁ గూర్చెన్. ౧౧౫
తే॥ అట్టి సుముహూర్త సమయమ్ము - నందు నచట
దశరథావనినాథుఁ డ - త్తన్విఁ జేరి
నగుమొగంబున గాంధర్వ - మగు వివాహ
విధినిఁ బెండ్లాడె నామెను - వేడ్క మీఱ. ౧౧౬
క॥ మఱియుచుఁ గౌసల్యా దం, శరథులును సుమంత్రుఁ డపుడు - దేవుని చిత్రం
బరయఁగఁ బేటికయందున, నిరవుగఁ గూర్చుండి మూఁత - నిడికొనిరంతన్. ౧౧౭
తే॥ తత్తిమింగిల మఱిఁ గల్చి - తత్తరమున, వచ్చి యాపేటికను దన - వాతఁ దాల్చె
నత్తఱిన లంకలో రావ - ణాసురుండు, మరల బ్రహ్మను బిలిపించి - పరిహసించి.

—♦ రావణుఁడు బ్రహ్మను బరిహసించుట ♦—

మ॥ విధి! నీ వాక్యము కల్లచేసితిని ను - ర్వీనాథుఁ డయ్యాజియున్
వధియింపంబడెఁ దోయమందు బలవం - తంబొప్పఁ గౌసల్యనున్
బ్రిథచేఁ దెచ్చితి దాచితిన్ వనధి; శ్రీ - రాముండు జన్మించునా?
వధియింపం గలఁడా ననున్? బలికితో - వార్ధక్య వాక్యంబులన్. ౧౧౯
క॥ అని చెప్పుటయును నవ్విధి, యును 'నోం పుణ్యాహ' మంచు - నుచ్చైస్స్వనుఁడై
మునుకొని సభలోఁ బల్కిన, మనమున భ్రమమొంది దైత్య - ముండనుఁ డంతన్.
ఉ॥ కారణమేమి తెల్పుమని - కంజజుఁ బల్కెయుఁ గోసలాత్మజన్
భూరి ముదానఁ బంక్తిరథ - భూపతి పెండ్లి యొనర్చుకొన్న మా
టారసి దూతలం బనిచి - యప్పుడె పేటికఁ దేనొనర్చి యా
భారతినాథు ముందటనె - బ్రద్దలుచేసెను దాని మూఁత తాన్. ౧౨౧
క॥ ఆ పెట్టియలో దశరథ, భూపుఁడు మొదలైన మువురు - పొడసూపినఁ దాఁ
గోపించి ఖడ్గధరుఁడై, యా పంక్తి గ్రీవుఁ డొంచె - హాతమొనరింపన్. ౧౨౨

—♦ విధి తప్పదని బ్రహ్మ రావణున కుపదేశించుట. ♦—

క॥ కమలాసనుఁ డప్పుడు సం, భ్రముఁడై రావణునిఁ జూచి - వలదయ్యా! య
క్రమ మీ సాహసకార్యము, రమణిని నొకరితనె ముందు - రహముగ నిడవే?
తే॥ అట్టి యీ పెట్టెలో ముగ్గు - రైరి చూడ, నింకఁ గోట్లకుఁ గల్గును - రీవు వీరిఁ
జంపనెంచిన శ్రీరామ-చంద్రుఁడిపుడె, యుద్భవించును వీరి యా-యువును దొఱఁగె?
తే॥ యద్భవిష్యమొ? తద్భవ - తసురచంద్ర! వలదు నీపూన్కి-సాకేత - నిలయమునకు
వీరిఁ జేర్పుము నామాట వినుము నిజము, నీవు సుఖవంతుఁ డగుము సం-దేహ మేల?

క॥ కాఁగల కార్యము తప్పదు, కాఁగల దెట్టులైన దురవ - గాహము కర్మం
బీగతి వినుమన నిజమని, తాగర్వము విడిచి భీతి - దశకంఠుండున్. ౧౨౬

క॥ దూతలచే వారల సా, కేతముఁ జేర్పఁగ నొనర్చి - కీర్తించెను వా
ర్జాతభవున్ వేవిధముల, నాతండును సత్యలోక - మప్పుడ సేరెన్. ౧౨౭

సీ॥ తమ రాజు మంత్రియు - తంబుగాఁ గౌసల్య, కాంతతో వచ్చెడు - వింతఁ జూచి
యా యయోధ్యను గల్గి - నట్టి జనంబెల్ల, సంతోషమగ్నులై - చెంతఁ జేరి
పలుమాఱు దశరథ - పార్థివేంద్రుల, కవనతులై మ్రొక్కి - యభ్రమంది
శుభవాద్యములు ధరా-నభములు నిండంగ, మ్రోయించి జయపెట్టి-మురువు నడచి

తే॥ రాజ భవనంబునకు వారి - నోజఁజేర్చి, యలరి యావార్త నా కోస - లావనీశు
నకును దెల్పఁగ నాతఁ డా-నంద మొంది, పుత్త్రికను నల్లునినిఁగాంచి-ముదము నించి.

— ♦ దశరథుఁడు కౌసల్యాది కాంతలను వివాహమగుట ♦ —

క॥ మరలన్ గడు వైభవమునఁ, బురి బంధు హితాళి గూడి - భూపతియగు పం
క్తిరథునకా కౌసల్యను, వరరాజ్యముతోడ నిడి వి - వాహ మొనర్చెన్. ౧౨౯

క॥ అది మొదలు సూర్యవంశ్యులు, పదపడి యాకోసలాధి - పతులయిరి భువిన్
ముదమున నాదశరథుఁడును, ముదితను గౌసల్యఁ గూడి - మురియుచుఁ బినపన్.

మ॥ మగధేంద్రాత్మజయౌ సుమిత్రయను రా - మన్ బెండ్లియై కేకయుం
డగు భూపాలుని ముద్దుకూఁతురగు న - య్యబ్జాక్షిఁ గైకేయి నిం
పుగ వైవాహికముం బొనర్చికొని సొం - పుం బెంపు మీఱంగ ని
జ్జగతిన్ సప్తశతాంగనామణుల ని - చ్చం బొందె నిల్లాండ్రఁగాన్. ౧౩౧

తే॥ సకల దానంబులను భోగ-సౌఖ్యములను, క్షమను బాలించె ధర్మ వి-చారుఁడగుచు
నాదశస్యందనుఁడు భూప-యౌవనాంగు, లయిన యయ్యాదిపత్నిత్రి-యంబుఁగూడి.

క॥ కులశీలంబులు గలిగిన, యలముగ్గురు సతులయందు - నా దశరథ రా
ట్తిలకునకున్ సంతానము, కలుగుట లేదయ్యె ముదిమి - కడు దాపయ్యెన్. ౧౩౩

— ♦ దశరథుఁడు దేవదానవ యుద్ధమున దేవతలకుఁ దోడ్పడుట ♦ —

క॥ అప్పుడు సురలును నసురులు, గొప్పఁగఁ బోరాడ సురల - కోరికఁ బవనుం
డొప్పఁగ దశరథు సాహ్యము, నప్పాటను వేఁడె దాని - కయి యా ఘనుఁడున్.

చ॥ పయనముగాఁగఁ గైక తన - భర్తయొనర్చెడు యుద్ధమారయన్
రయమున వెన్కనేఁగె సుర - రాట్ప్రముఖుల్ మదిమెచ్చునట్లుగా
జయముగ నాజి నాజి కడు - సంభ్రమ మొప్పఁగఁ బోరుచుండఁ గై
కయుఁ గనుచుండెఁ దేరునకుఁ - గల్గిన యక్షము విర్గె నత్తఱిన్. ౧౩౫

—♦ కైకేయి దశరథుని రథమున సాహసమొనర్చి వరములు వడయుట ♦—

వ॥ కైకేయి యదిగాంచి ధైర్యకంచుకితయై తన చిన్ననాఁడొక మునిమూతిని నల్లఁ గాఁజేసి యాతని నెవ్వరును వీక్షింపకుండినఁ దాను భక్తితోఁ బార్శ్వగతయై యెడమచేతితో దండాదికము నందియిచ్చిన నా ముని సంతసించి యామెకరంబు వజ్రసమానంబగునని యిచ్చియున్న వరంబు జ్ఞప్తిదెచ్చికొని భిన్నాక్షమునకు మాఱుగా దన హస్తంబునిడి పతికి సాహాయ్యమొనర్చిన నాదశరథుండు దైత్యులను జయించి తనసతి యొనర్చిన సాహసమున కచ్చెరువంది యామెకు రెండువరంబులిచ్చిన నామెయు సమ్మతించి వలసిన యప్పుడావరములఁ గోరెదనని భర్తకు వచించిన నాతఁడు నట్లకాకని దేవేంద్రాదులచే గౌరవములంది కేకయాత్మజా యుతంబుగా నయోధ్య కరుగుదెంచి సుఖించుచు. ౧౩౬

—♦ దశరథునకు శ్రవణవధచే శాపమువచ్చుట ♦—

తే॥ వేటకై యొక్కరాతిరి - విపినమునకుఁ
జేరి తా వారిబంధంబుఁ - జేసి యచటి
వనచరంబుల వధియించు-చును జరింప
వైశ్యవర్యుఁడు శ్రవణుఁడన్ - పౌంథు డపుడు. ౧౩౭

ఉ॥ అంధులఁ దల్లిదండ్రులను - నంసమునందున మోసి కాశికా
పంథను బోవుచున్ నడచు - బాధను జెమ్మట పొంగ డప్పిచే
నంధులు నీరు నీరనుచు - నాత్రముతో బతిమాలుచుండ ని
ర్బంధముతోడ వారి నొక - పక్కను డించి జలాశయంబు తాన్. ౧౩౮

క॥ వెదకి జలంబును గని స, మ్ముదమున జలపాత్రమందు - ముంచుచు నుండన్
విదితముగాఁ గరిణీధ్వని, యదియనఁ బాత్రంబు మునిఁగె - నదివిని నృపుఁడున్.

తే॥ అడవి యేన్గులఁ జంపరా - దనెడు నీతి, నెఱిఁగి యుండియు మార్గస్థు - నేన్గటంచు
నెంచి బాణంబువిడువ హా!-యెవఁడుచంపె, నన్నటంచును శ్రవణుండు-సలఁగిపడియె

శా॥ ఆ యార్తారవ మాలకించి భయస - మ్యగ్ర స్తుఁడై పర్వుతో
నాయూహాద్భవవైశ్యుఁ జేరి కృప చె - న్నారంగఁ దద్బాణమున్
వేయూడంగ నొనర్చి యాతనిని నెం - తే లేవఁగాఁ దీసి య
న్నా! యన్యాయము చేసినాఁడ నని చిం - తన్ రాజుశోకించుచున్. ౧౪౧

తే॥ వాని వృత్తాంతమంతయు - వానివలనఁ, దెలిసి పిమ్మట శ్రవణుండు - తీఱిపోవ
దశరథుం డంధులను జేరి-తత్కుమారు, మృతినిఁ దెల్పిన వారు దు-ర్గతిఁ దలంచి.

తే॥ ఆత్మ భవుశోకమున జీవి-తాశవదలి, యాత్మభవునిఁ గాంచి సుతునితో-మాకుఁగూడఁ
జితినిఁ బేర్చుమటంచును-జెప్పి దుఃఖ, పడుచుఁ గొడుకును దలఁచుచుఁ-బనవి పనవి.

క॥ రాజా! మే మిర్వుర మే, యోజన్ సుతదుఃఖహతుల - మో? యటు నీవున్
యోజింపఁగ సుతదుఃఖము, తోఁ జావుమటంచు నృపుని - తోఁ బల్కుటయున్.

తే॥ వారి ముప్వురఁ జితఁబెట్టి - పంక్తిరథుఁడు, దీనవదనముతో రాజ - ధానిఁ జేరి
సద్గురుని నవ్వసిష్ఠుని - సమ్ముఖమునఁ, దెలిపె వనిలోని కతనెల్లఁ - దొలుతనుండి.

తే॥ అంతలకు నావసిష్ఠము - నీంద్రుఁ డరసి, యశ్వమేధంబు సలిపిన - ననఘమంచుఁ
దెలిపి శ్రీసరయూనదీ - తీరమందు, నతనితోఁ దాను జేయించె - యాగమపుడు.

—◆ దశరథుఁడు రోమపాదునకుఁ దనకూఁతురగు శాంతనొసంగుట ◆—

తే॥ ఆ మహీపతి, హితుఁడైన-రోమపాదు, నకు నొసంగెను దనదు శాం-తాసుమూర్తిఁ
దనయఁగా, రోమపాదుండుఁ దత్కృతమున, కాత్మ సంతసమందుచు-నరిగెఁ బురికి.

మ॥ ప్రవినీతుఁడగు రోమపాదు నిజ రా - ష్ట్రంబం దనావృష్టి సం
భవమయ్యెన్ ముని ఋష్యశృంగుఁ బిలిపిం - పం బూని యాతండు మేల్
జవరాండ్రన్ వెలయాండ్రనాశ్రమము ప - జ్జం జేరఁగాఁ బంపె వా
రవు నౌనంచు నుతింపఁగాఁ దగిన నొ - య్యారంబు దీపింపఁగన్. ౧౮౮

క॥ అమల విభాండక మున్యా, శ్రమమును జేరంగ నరిగి - చయ్యన వేశ్యా
రమణులు సంగీత విలా, సములును మఱి నృత్య వాద్య - సంగతులలరన్. ౧౮౯

తే॥ (శ్రీ) విభాండక సుతు ఋష్య-శృంగుఁ జూచి, కౌఁగిలించుచు నగవుల-గమ్రవాక్య
ములను సత్కారములఁ గడు మోహవశునిఁ, జేసి యాతనిఁ దమవెంటఁ-జేరఁ బిలిచి

తే॥ రోమపాదున కర్పింప - నామునీంద్రుఁ, డడుగు పెట్టిన మాత్రనా - పుడమియందు
మంచివానలు కురిసె స-మంచితముగఁ, బాడిపంటలు పొలుపొందె-భవ్యమహిమ.

క॥ ఆ రోమపాదునకును గు, మారుం డుదయించె నపుడు - మానికిఁ బ్రియ మిం
పారగఁ శాంత నొసంగి స, గౌరవముగఁ బెండ్లి చేసెఁ - గాశ్యపిపతియున్. ౧౯౨

—* ఋష్యశృంగానుగ్రహముచే దశరథునకు యజ్ఞపురుషుఁడు పాయస మిచ్చుట *—

శా॥ ఆ వృత్తాంత మెఱింగి పంక్తిరథుఁడున్ - హర్షించి పుత్రాప్తికై
వేవేగన్ ఘను ఋష్యశృంగమునినిన్ - బిల్పింప నమ్మౌనియున్
దేవ ప్రీతిగఁ బుత్త్రకామ ఫలమౌ - దివ్యేష్టి సేయించె స
ద్భావుండై యనలుండు పాయసపు పా - త్రం బూని ప్రత్యక్షమై. ౧౯౩

క॥ ఆ యమృతోపమ పాయస, మాయత కృపనిచ్చె దశర - థావని పతికిన్
బాయని ప్రేమను నతఁడును, జాయల కా ముప్వురకును - సరిగా నొసఁగెన్.

—◆ సువర్చలా శాపవిమోచనము ◆—

క॥ కైకేయి దుష్టమతియై, సాకల్యముగాఁగఁ బాయ - సపు భాగంబున్
జేకొని గృధ్రశాప వి, మోకంబుగ నంజనాగ - మునఁ బడ విసరెన్. ౧౯౫

తే॥ అరయ మున్ను సువర్చల-యనెడు నప్స, రోంగనామణి నృత్యంబు-నంపుఁ దప్పు
సేసి విధి శాపవశమునఁ-జేసి తాను, గ్రద్దయై శాపమోక్షంబు-బ్రహ్మనడుగ.
తే॥ అతఁడు కరుణించి కైకేయి-యంజనగిరిఁ, బాయసముఁ బాఱవైవ న-ప్పాయసంబు
సోఁకి శాపంబు పాయు నం-చును వచించి, యుండె నద్దాన గ్రద్దయు-నువిదయగుచు
మ॥ సురలోకంబున కేఁగె సంతసముతోఁ - జోద్యంబుగాఁ బిమ్మటన్
వర కౌసల్యయు నా సుమిత్రియును వి - శ్వాసంబుతో ధర్మమా
తెఱఁగుం గైకకుఁ జెప్పి యిర్వురును దృ - ప్తిన్ రెండు భాగంబులం
దరయం గొంచెము పాయసంబు నిడఁగా - నా కైకయుం జేకొనెన్. ౧౫౮

—♦ కౌసల్యా సుమిత్రా కైకేయీ గర్భధారణము ♦—

తే॥ వెంటనే ముప్వురును దైవ-విధిని లభ్య, మయిన పాయసమును గ్రోలి-హర్ష మొంది
క్రమముగా గర్భవతులైరి-రమణులకును, గర్భచిహ్నము లెంతయుఁ-గానుపించె.
క॥ వేవిళులు కలిగి వారికి, భావి కుమారాభ్యుదయము - భావింపనయోన్
గేవలమగు తచ్చిహ్నము, లావిధములె యంచు లోకు - లరయుదురు కదా?

—♦ విష్ణ్వాజ్ఞచే సురలు భూమి నవతరించుట ♦—

ఉ॥ ఇంతటిలోనె రావణుఁడ - హీన పరాక్రమ ముప్పతిల్ల దే
వాంతకులైన రాక్షసుల - నందఱఁ గూడియు లోకమెల్ల దు
శ్చింతను బొంది బాధపడఁ - జేసిన ధారిణి బ్రహ్మదేవు న
త్యంతము వేఁడె నాతఁడును - న త్తతి శ్రీహరి కెల్లఁ దెల్పినన్. ౧౬౧
తే॥ అభయమిడి శ్రీమదాది నా-రాయణుండు, కపులగా నిర్జరులకు నా-జ్ఞను నొసంగి
దుందుభి సమాఖ్య గాంధర్వి-నిం దలంచి, మంథరగ జన్మ మొందించి-మహిమ వెలయ
క॥ వారలఁ దన కనువగు మే, ధారతులుగఁ జేసి దైత్య - దర్ప మడంపన్
గోరిక మీఱఁగ దశరథ, భూరమణున కాత్మజుఁడుగఁ - బొడమెదు మతితోన్.
మ॥ మహినా శ్రీహరి చైత్రశుద్ధ నవమీ - మధ్యాహ్నకాలంబునన్
దుహినారాతి వెలుంగఁ గోసలజ ముం - దున్ సూతికాగేహమం
దహహా! యంచును నామె యబ్రపడఁగా - నావిర్భవంబందె దై
త్యహరుండౌ నితఁడంచు బ్రహ్మ మొదలౌ - నాదిత్యు లుప్పొంగఁగన్. ౧౬౪
క॥ అభ్రశ్యాముఁ జతుర్భుజు, విభ్రమ దివ్యాయుధున్ సు - పీతాంబరునిన్
సుభ్రూ కోసలపుత్త్రి య, దభ్రస్థితి మ్రొక్కి తనకుఁ - దనయుఁగఁ గోరెన్. ౧౬౫

—♦ శ్రీరామాదుల జననము ♦—

చ॥ సలలిత రత్నభూషణుఁడు - స్వర్ణ కళాయుతుఁ డబ్జనేత్రుఁ డిం
పలరెడు సూర్యతేజుఁడు సు - ధాంశు మనోజ్ఞముఖుండు బాలుఁ డ

చ్చెలువకుఁ దక్షిణంబునన - చెల్వుగఁ గల్గెను బ్రీతిమీఱఁ గో
సలపతి పుత్త్రికామణియు - సంతతి నొందితి నంచు నుబ్బఁగన్. ౧౬౬
తే॥ శ్రీసుమిత్రకు నయ్యాది-శేషమూర్తి, యుత్సుకముతోడ బాలుఁడై-యుద్భవించెఁ
గైకకును శంఖచక్రియు-గమ్మ దివ్య, బాలక ద్వయిగా నప్డై-ప్రభవమొందె.
చ॥ నలుగురు పుత్త్రులా వసువు - నన్ జనియించిన మంచివేళ యం
దలరుల వాన దేవతలు - హర్షముగాఁ గురిపించి దుందుభుల్
చెలువలరంగ మ్రోయునటు - చేసిరి పంక్తిరథుండు మోదసం
కలితమనంబునన్ గురు ము - ఖంబుగ బిడ్డలఁ గాంచి మించుచున్. ౧౬౮
తే॥ జాత కర్మాది విధులను-జలిపె మరల, నా వసిష్ఠుఁడు కౌసల్య-యాత్మజునకు
రాముఁడనియు సుమిత్రి పు-త్త్రకున కరయ, లక్ష్మణుండని నామంబు-లను విధించి
క॥ కైకేయీ సుతులకు ని, చ్చాకుశలత మీఱ భరత - శత్రుఘ్ను లటం
చాకరణిఁ బేరులిడి శో, భాకరముగ నల్వురకును - నాశీస్సు లిడెన్. ౧౭౦
తే॥ ప్రేమ రమియించు వాఁడు శ్రీ - రాముఁ డనుచు
సర్వలక్షణ యుతుఁడు ల - క్ష్మణుఁ డటంచు
ధరణి భరియింపఁ గలవాఁడు - భరతుఁ డనుచు
ననియె నరిహంత శత్రుఘ్నుఁ - డనుచు గురుఁడు. ౧౭౧
క॥ అనుదిన మాబాలురు వృ, ద్ధినిఁ బొందుచునుండ మిగులఁ - దృప్తిని గనుచున్
జనపతియు సతులు వెలసిరి, పినపాపల బులుపుఁ బొలుపుఁ - బిరిగొను నటులన్.

—♦ శ్రీరామాదుల బాల్యక్రీడా వర్ణనము ♦—

తే॥ తల్లితోఁ బాలుత్రావెడు-తఱినినైన, లక్ష్మణుఁడు రామునిని వీడి-రాడు కనఁగ
భరతునిని వీడి శత్రుఘ్నుఁ-డరుగఁ డటులె, వారి సౌభ్రాత్రి మదిగణ్య-మై రహించె
తే॥ భర్మ నవరత్నజాల వి - నిర్మితంబు, లయిన డోలికలందు శ - య్యలను బఱచి
కొడుకులను బండు కొనఁజేసి-పడఁతి మిన్న, లూఁచి జోలలు పాడుచు-రుత్సుకమున
సీ॥ చరణాబ్జములను నూ - పురము లందెలు మ్రోయ,
మొలనూలు నడుమున మురువుగొలుపఁ
గంకణ రాజముల్ - కరముల వెలుఁగంగ, బాహులఁ గేయూర - వరములలరఁ
గంఠాన మణిరత్న-కనకహారము లొప్ప, శార్దూల నఖము లా-సరస మెఱయఁ
గర్ణద్వయిని మణి - స్వర్ణశలాటుకల్, దేదీప్యమానమై - తేజరిల్ల
తే॥ ముత్తియము లంచులందున - హత్తినట్టి, తళుకు బంగరు రావియా - కులసరంబు
ఫాలమున ముద్దులొల్కంగ-వ్రేలుచుండ, ముంగిటను దోఁగి రారాజ-పుత్త్రవరులు
తే॥ చిన్నచిన్నఁగ నడచుచు - మన్నుగాంచి, కిమ్మనక తీసి పెల్లలు - గిల్లి తినుచుఁ
దల్లిదండ్రులు బెదరింపఁ - దత్తఱిల్లి, మూతిఁ దుడువఁగ నేర్చిరా -ముద్దుసుతులు.

ఉ॥ పాపడువేళఁ గోసలజ - సంబర మొప్పఁగ రామచంద్రునిం
బ్రాపుగ నాథునొద్ద నిడ - రాముఁడునుం గబళంబుఁ గొంచుఁ దా
వే పరువెత్త నామెయును - వెంబడి పట్టినఁ బట్టితేఁగ నా
పాపఁడు బువ్వనిందమని - వారల నోళ్లను బెట్టె నవ్వుచున్. ౧౭౭

క॥ నగవులఁ జిటితగవుల ము, ద్దగు నుడువుల నడల వాహ - నారోహములన్
దగు వసనధారణములను, జగతీపతి సుతులు నెగడఁ - జర్యలఁ గనుచున్. ౧౭౮

ఉ॥ రాఘవవర్యుఁ డాజి విప్రు - లాపతి దేశికు నవ్వసిష్ఠు వి
ద్యాఘను మ్రొక్కి పంచసమ - లయ్యెఁ గుమారులకంచుదెల్పి వి
ప్రౌఘముఁ జేర్చి పుత్త్రకుల - నొయ్యనఁ దా నుపనీతులౌనటుల్
శ్లాఘు చెలంగఁ జేసి గురు - సమ్మతిఁ బుత్త్రుల నిల్పె విద్యకున్. ౧౭౯

తే॥ వారలును బ్రహ్మచర్య స-ద్వ్రతముఁ బూని, వేదశాస్త్రాదులును శార్ఙ్గ విద్యనేర్చి
గురుని మంత్రుల సేనలఁ-గూడి భక్తి, తీర్థయాత్ర నొనర్చి తా-మర్థి మరలి. ౧౮౦

క॥ షణ్మాసములకు జగతీ, రాణ్మోదకరంబుగాఁ బు - రంబును విలస
త్త్రివణ్ముఖులై చేరిరి దు, ర్ద్విణ్మర్దను లర్థి లోక - శ్రీకరులనఁగన్. ౧౮౧

క॥ వచ్చిన తన పుత్త్రకులను, మచ్చికఁ గనెఁ బంక్తిరథుఁడు - మాతలు ముగురున్
జెచ్చెర సంతసమందిరి, మెచ్చిరి పురజనములెల్ల - మేకొని వారిన్. ౧౮౨

—• విశ్వామిత్రుఁడు యజ్ఞరక్షకై రామలక్ష్మణులను బిలిచికొని పోవుట •—

ఉ॥ అంతట నా యయోధ్యకు మ- హాముని గాధిసుతుండు వచ్చి సా
ధ్వాంతరమొందఁ బంక్తిరథు - నారసి దివ్యముఖంబుఁ బ్రోవ ని
శ్చింతగ రామలక్ష్మణుల - శీఘ్రమ నా వెనువెంటఁ బంపుమం
చెంతయుఁ గోర నాతఁడు ము - నీంద్రు వసిష్ఠుని యాజ్ఞ నొందుచున్. ౧౮౩

క॥ విశ్వామిత్రుని యజ్ఞము, శశ్వద్యశమలర రామ - సౌమిత్రులఁ దా
విశ్వాసస్థితిఁ బంపెను, విశ్వామిత్త్రులను జంప - వేగమ మునితోన్. ౧౮౪

ఉ॥ వారును గాధిసూనుని కృ - పాపరతన్ రథమెక్కి భక్తిమైఁ
గోరిక మీఱఁ గౌశికుని - కోమల వాఙ్మధురామృతంబు నిం
పారఁగఁ గ్రోలుచున్ బయన - మై చనిరా మునిలోకచంద్రుఁ డా
దారిని ముచ్చటల్ దెలుపఁ - దన్మహిమంబులు చింతసేయుచున్. ౧౮౫

క॥ ఆ మార్గంబున వెలసిన, కామాశ్రమమందు శ్రాంతిఁ - గనఁగా వారల్
సామోదంబుగ నిలిచియుఁ, దామా వేగుననె లేచి - తానం బాడన్. ౧౮౬

క॥ మునిపతి విశ్వామిత్త్రుఁడు, జనపతి పుత్త్రులను రామ - సౌమిత్రుల నె
మ్మనమున సన్నిధిఁ జేరిచి, కనుగొనలఁ గృపారసంబు - కడలు కొనంగన్. ౧౮౭

—♦ రామలక్ష్మణులకు విశ్వామిత్రుఁడు శస్త్రాస్త్ర విద్యల నిచ్చుట ♦—

సీ॥ మాహేశ్వరీ నామ - మహితమౌ విద్యయు, శస్త్రాస్త్ర విద్యలు శార్ఙ్గవిద్య
రథ గజాశ్వగదాభి - రంజక విద్యలు, మంత్రయోగోపసం - హారవిద్య
యాకలిదప్పుల - నణఁచి సౌఖ్యమొసంగు, నాబలాతిబల వి - ద్యాఖ్యములును
సలలిత సత్కళా - తులిత మోదాత్మ్యంబు, లై పరంగెడు నట్టి - యఖిలవిద్య
తే॥ లప్పు డుపదేశ మొనరించె - హర్షమాణుఁ, డగుచు నద్దాన వారును - మిగుల నలరి
వననివాసుల బాధించు-దనుజవరులఁ, గూల్చి యమ్మౌని వెంట నేఁ-గుచును నుండ.

—♦ తాటకా వృత్తాంతము ♦—

క॥ పాంథజన ధ్వంసిని దు, ష్పంథా విహారిణిని మాని - వర భక్షిణినిన్
మంథనగాంగినిఁ దాటక, మంథించెను రాముఁడొక్క - మహితాస్త్రముచేన్.
శా॥ మున్నా తాటక యొక్క యచ్చర కరం - బున్ మోహతాపంబుచే
తన్నైర్మల్య హృదంతరాళు నటపీ - ధామున్ ముని గోరి యే
మన్నన్ వీడక బాధపెట్టిన నతం - డాక్రోశుఁడై దైత్యగాఁ
గ్రిన్నం బుట్టు మటంచుఁ దిట్టె నదియున్ - రక్షః కులాభీలయై. ౧౯౦
తే॥ రామ బాణాహతిని మోక్ష-మామతిల్లు
ననుచు ముని తెల్ప సుందుఁడన్ - దనుజపతినిఁ
బతిగఁ జేకొని మారీచు - సుతుని గాంచి
మోహమున వానివెన్క సు -బాహుఁ గనియె. ౧౯౧
క॥ ఆ కారణమున నా దై, త్యాకారయు రామచంద్రు - నస్త్రము తాఁకన్
క్ష్మాకొరగి శాపమోక్షము, గైకొని యచ్చరగ నరిగెఁ - గౌతుక మొప్పన్. ౧౯౨

—♦ శ్రీరాము రణయజ్ఞారంభము ♦—

తే॥ రామలక్ష్మణు లాపైని - బ్రేమమీఱ
గాధిసుతు నాశ్రమము సేరి - కౌశికుండు
మొదలుగా మౌను లాయజ్ఞ - మును నొనర్పఁ
గావమునుకొని యమ్మఖ - ఘాతుకులను. ౧౯౩
క॥ రాక్షసులను సజ్జనగణ, శిక్షాచణులైన దనుజ - శేఖరులను దా
మాక్షణమ వేనవేలుగ, శిక్షించిరి విండ్లఁబూని - శితశరములచేన్. ౧౯౪
మ॥ మరలన్ రాముఁడు కీర్తిధాముఁడు వెసన్ - మారీచుని దీక్షణమా
శరఘాతంబున నూఱు యోజనములన్ - జానొందు సంద్రంబునన్
బొరలాడంగను నేసి యాపయిని దు - ర్బుద్ధిన్ సుబాహున్ బొరిం
బొరి ధాత్రింబడఁ జంపి వైచె నొకటా - ముల్కిన్ జగం బల్కఁగన్. ౧౯౫

శా॥ విశ్వామిత్రుఁడు సత్క్రతాధ్వరుఁడునై - వీక్షించె రాట్పుత్రులన్
విశ్వాసంబున మానులెల్లరుఁ గడున్ - దీవించి రాధీరులన్
విశ్వస్తుత్యులటంచుఁ బిమ్మటను నా - విజ్ఞాన సంశోభితుల్
శశ్వత్కీర్తులు రామలక్ష్మణులు ని - చ్చన్ మ్రొక్కి రవ్వారికిన్. ౧౯౬

—♦ అహల్యా శాపవిమోచనము ♦—

వ॥ తదనంతరంబునఁ గరుణాంతరంగుండగు విశ్వామిత్రి మునివతంసుండు మిథిలాపత్తనమున జనకరాజోత్తముని మందిరమున నమందానంద కరంబుగా జరగఁబోవు సీతాస్వయంవర వృత్తాంతంబు నాకర్ణించి సుగుణార్ణవులగు శ్రీరామ లక్ష్మణుల నచ్చోటికిం బిలిచికొని పోవ నిర్ణయించి పయనంబై తన వెంటవచ్చుచున్న రాకొమారులకుఁ దోవలో గౌతమపత్నియగు నహల్య భర్తృరూపధారియగు దేవేంద్రునిచే రతిసౌఖ్య మనుభవించి పతివలన శాపంబునొంది యుపలమై పడియున్న చరిత్రంబుదెల్పె మున్ను చతుశ్శిరునిచే సృష్టింపఁ బడిన యహల్యాసుందరి దేవేంద్రాది బృందారకుల కొసఁగఁబడక ద్విముఖీగోప్రదక్షిణ పుణ్యాతముఁడగు గౌతమునకు సతిగా నీఁబడె నందువలనఁ బురందరుండు వంచించి యించు విలుకాని సంచున నచ్చంచలాక్షితోరమించి గౌతమ శాపగ్రస్తుండై సహస్రభగుఁడుగా నేర్పడి పిమ్మట సహస్రాక్షుండునాఁ బరంగె నేతద్వృత్తాంత మంతయును ముని సత్తమునిచే నెఱింగిన శ్రీరాముండు దయార్ద్రహృదయుండై స్వపాద స్పర్శనమున నామె పాపమాహరించి చూపఱ కాశ్చర్యంబు కలుగఁజేయు ముందటి రూపరేఖావిలాసంబులెసంగ నయ్యుపలంబును జపలాక్షింగావించె మఱికొందఱు మహాసాధ్వీ యహల్య పతిశాపవశత నదియైయుండ మార్గగుండగు రామచంద్రుండు పదస్పర్శచే నుద్ధరించెనందు రయ్యది కల్పభేదంబు సమస్త కల్పంబులందును రామచరిత్రంబు నానావిధంబులుగా విరాజిల్లుచుండు; నహల్యాశాపమోక్షణ కరుండైన రామునిపై సురలు విరులవాన గురియించిరి; మునియుతులై రామలక్ష్మణు లాయహల్యను గౌతమున కప్పగించి యతనిచే మెప్పొంది గంగాతీరమును జేరి నద్యవతరణార్థమై నౌక నధిరోహింపఁబూనిన శ్రీరామచంద్రమూర్తినిం గని నౌకాధిపతి వినయవినమితశిరస్కుండై యిట్లనియె. ౧౯౭

—: శ్రీరాములు గంగను దాటుట:—

మ॥ ప్రభువా! ముందుగ నీదు పాదరజమున్ - బ్రక్షాళితంబౌ నటుల్
శుభచిహ్నంబుగ నేనసల్పి పిదపన్ - సోఁకింతు నా నౌకలో
నభయంబొప్ప భవత్పదంబులను దే - వా! లేనిచో నీపద
ప్రభవంబౌ రజమింతసోఁక వనితా - రత్నంబవున్ నావయున్. ౧౯౮

తే॥ రాతినాతిఁగఁ జేసితి-రామ నీవు, నాకుఁ గల దొక్క యిల్లాలు-నావకూడఁ
గాంతయైనంత నాదగు-గతిమతేమి? యొక్క పెండ్లమె చాలు నిం-కొక్క తేల?
క॥ అనినన్ రాముఁడు చిఱునగ, వునఁ బదములఁ గడుగుమంచుఁ బూర్ణానందా
ననుఁడై మునుకుఁ జాఁపిన, వనయానుఁడు నీటఁగడిగె - భగవత్పదముల్. ౨౦౦
ఉ॥ పిమ్మట నౌకనెక్కి రఘు - వీరులు మౌనియు జాహ్నవీనదిన్
సమ్ముదమొప్ప దాటి ముని - నాథులఁ గొందఱఁ గూడి పట్టణా
ధ్యమ్మగునట్టి శ్రీమిథిల - నల్లనఁ గాంచి పురోపసీమ వ
ర్ణ్యమ్మయి మించు నాయుపవ - నమ్మునుజేరి సుఖించి రొక్కెడన్. ౨౦౧
సీ॥ జనక భూమీశుచేఁ - దనయా వివాహ స, మాహూతులైనట్టి - యవని పతులు
పూర్ణ మోదంబున - భూషణోపేతులై, వాహనారూఢులై-వచ్చిచేరఁ
బిలువని పేరంట - ముల కేఁగు చందాన, సారణుచే వార్త - సరిగఁ దెలిసి
రావణాసురుఁడు వి - రాజిత తేజుఁడై, పుష్పకం బెక్కి యా - పురముఁ జేరె
తే॥ దశరథుఁడు మాత్రి మొక్కండు - తనయు లెపుడు
వత్తురో? యను బెంగచేఁ - బడిణాయమున
కరుగఁ డయ్యెను దక్కిన - ధరణి వరులు
భూసురులు నెల్ల రచటికిఁ - బోయిరపుడు. ౨౦౨
క॥ జనకుఁడు విశ్వామిత్రుఁడు, చనుదెంచిన వార్త నెఱిఁగి - చయ్యన వారిన్
దన నిలయమునకుఁ దోతే, రను మంత్రులతోడ వెడలి - రా నెంచునెడన్. ౨౦౩
తే॥ గాధిసూనుని శిష్యుఁ డొ - క్కరుఁడు వచ్చి
యా విదేహావనీశు ర - హస్యముగను
బిల్చి గురువాక్యములు గాఁగఁ - బ్రీతి నిట్లు
పలికె మృదు మధుసార వా - క్కులు చెలంగ. ౨౦౪
శా॥ రాజా! పంక్తిరథాత్మ జన్ములు కళా - ప్రిస్తవ్యు లుత్ఫుల్ల నీ
రేజాతాక్షులు రామలక్ష్మణులు వా - ర్ధి శ్రేష్ఠ గంభీరులా
రాజన్యుల్ సువయస్కు లిష్టు మఖమున్ - రక్షించి నా వెంటఁ దా
మోజన్ వచ్చిరి సీతనూర్మిళను గే - లొందంగ నర్హుల్ కవల్. ౨౦౫
తే॥ త్వత్పణీకృత శివచాప-భంగకార్య, మొక్క త్రుటిలోనఁ జల్పెడు-హొంతకాఁడు
హాసుకాఁ డందగాఁడు శ్రీ-కౌసలేయుఁ, డైన రాముఁడు కావున-నాత్మ నెంచి.
తే॥ వరవిధానముతో యోగ్య-వరుల నీరి, నీవు సౌభంబుఁ జేర్పుము-నేర్పు మీఱ
హరధనుర్భంగ కార్యంబు జరుగు దనుక, వెల్లడింపకు వృత్తాంత-మెల్ల నీవు. ౨౦౬
క॥ అను మాటల రాజనపతి, ఘన మోదమునొంది పురము - కళకళ లాడన్
గనులకుఁ బండువు గొలిపెడు, ననువొప్ప నలంకరించు - నటు లానరించెన్. ౨౦౭

వ॥ విశ్వామిత్రుని శిష్యుండును జనకునివలన నామంత్రిణంబు వడసి దేశికవరు సన్ను
ఖంబునకు నరిగినం దద్వృత్తాంతంబు గుప్తపఱచి యా ధరణీరమణుండును. ౨౦౯

—♦ జనకుఁడు రామలక్ష్మణులకు స్వాగత మొసఁగుట ♦—

ఉ॥ ఆవల మంత్రి బంధుయుతుఁ - డై తన సేననుగూడి వేడుకన్
శ్రీవెలయన్ సుమేధయను - చెల్వమొదల్ సతులెల్ల రాఁగ మే
లౌ వసనాది భూషణము - లంది కరీంద్ర పురస్కారంబుగా
నావనిఁ జేరె రోవెలఁదు - లాడ మనోహర వాద్యముల్ తగన్. ౨౧౦

క॥ అటుచని మునిపుంగవు ను, త్కట భక్తినిఁ గొల్చి దశర - థ ప్రభుసుతులన్
దటుకున నలంకరించియుఁ, బటువుగఁ గూర్చుండఁ జేసి - వారణములపై. ౨౧౧

తే॥ చామరాద్యుపచారముల్ - సలుపఁ జేసి
యాటవెలఁదులు మున్నాడి - పాటపాడ
వంది మాగధు లొక వంకఁ - బ్రస్తుతింప
వాద్యములు మ్రోయఁ బురివీధి - వచ్చుచుండ. ౨౧౨

సీ॥ వారి రాకనెఱింగి పత్తనోత్తములెల్ల, లీలతో గోపురాట్టాలకముల
నిలిచి పుష్పాల వాన-లలరిచి వారిపై, సీతకుఁ దగు నాథుఁ-డీతఁడనుచు
రాముని జూపుచు - లక్ష్మణుఁ బొడగని, యూర్మిళాంగన కితం-డొప్పు ననుచు
మన పుణ్యవశమున-జనకు పుత్త్రికలకు, మంచి మగండ్రు ల-భించి రనుచు

తే॥ నెంత సుందరులమ్మ! నేఁ-డిటకు వీరు, వచ్చుటయె సంతసము మది-హెచ్చెననుచు
నుత్తమోత్తములనుచుఁ దా-మొఱఁ బలుక, వినిరి శ్రీరామలక్ష్మణుల్-వినయనీతి

మ॥ మఱియా యుత్సవమెల్లఁ గాంచి నృపతుల్ - మార్గమ్ములన్ జింతతో
నఱగొడ్డంబును జేసె నీజనకుఁ డా - హా! మానభంగంబె మ
మ్మెఱు క్రమ్మన్ బొనరించి రామునకె యీ - యం బూనెనా? సీత నం
చుఱవాడన్ జనకాదులున్ వినిరి ధా ర్ష్ట్యోక్తుల్ తగన్ దప్పునన్. ౨౧౪

వ॥ ఇవ్విధంబుగా ననేకులనేక విధంబుల నాడికొనుచుండఁ గడుఁగడు వైభవంబు చెన్ను
డర జడదారితో నాపుడమి యేలిక కొడుకు లిరువురును గరులడిగ్గి స్వయంవర
మందిరంబుఁ బ్రవేశించి యక్కుశికనందను ముందటఁ గూర్చుండిన జనకుండును
నిండుసభలోనికిఁ గన్యా ప్రతిగ్రహార్థంబు పణంబుగా నిర్ణయించి యుండిన నాథ
నువును దెప్పించె. మున్నాత్రిపురదాహకంబైన శార్ఙ్గంబు నాయొద్ద ధనుర్విద్య
నభ్యసించిన పరశురామునకు నేనొసంగ నాతండా ధనుస్సును ధరించి కార్త వీ
ర్యార్జునిని నిర్జించి యిరువదొక్కమాఱుగా భూమిని నిఃక్షత్త్రంబుగావించి మిథి
లాంగణమునఁ బెట్టియుండిన, సీతయుఁ దోడిబాలికలతోఁ గూడి యాధనువును

గట్టిమువలె నొనర్చుకొని యాటలాడుచుండె నందువలనఁ బరశురాముఁ డయ్యది యెఱింగి యామె సాక్షాల్లక్ష్మియని తెలిసికొని దురాసదమయిన యాధనువునే యామె వివాహమునకుఁ బణముగా నిచ్చి చనియెఁ గావున నట్లు తెప్పించిన నా యను త్తమమగు చాపంబును రాజులముందఱ నునిచి జనకమహీపాలుండు ధరా రమణులను గాంచి శంకించి యెట్టకేలకు నుంకించి యిట్లనియె. ౨౧౫

## —◆ సీతా స్వయంవర శపథము ◆—

క॥ పంచశతర్షభములచే, నంచితముగ శస్త్ర గృహము - నం నుండియుఁ దె
ప్పించినదీ శివశార్ఙ్గము కాంచుఁడు భార్గవుఁడు సీత - కై పణమిడియెన్. ౨౧౬

క॥ భూరమణులార ! యెవరేన్, వీరాగ్రణులున్న లేచి - విల్లెక్కిడి మీ
ధీరతఁ జూపుఁడు సభ నా, వీరుని వరియించు సీత - విఖ్యాతి తగన్. ౨౧౭

మ॥ అనినన్ దిగ్గున బెగ్గడిల్లి నగసా - మ్యంబైన యా వింటినిం
గని శీర్షంబులు వంచి మంచిపని యీ - కాంతాసుఖంబెంత? మే
దిని జీవించినఁ జాలుఁ గాంతలిఁక నెం - దే లేరో? పెండ్లాడరో ?
మనకేలా? యిది సాధ్యమా? యనుచు సం - భావించి రాభూపతుల్. ౨౧౮

సీ॥ యత్నించి కొందఱు - రత్నగర్భాధిపుల్, ధనువుఁ గదల్పకే - వెనుక కేఁగ
నిఁకఁ గొంద ఱొక్కింత - యిటునటు కదలించి, యెత్తఁగాలేక నొ- క్కెడను నేఁగఁ
బై కెత్తినిల్పిన - పార్థివుల్ మఱికొంద, ఱెక్కిడఁగా లేక - పక్క కేఁగ
నెక్కువెట్టఁగఁ బూని - యెట్టకేలకు డస్సి, యుస్సురంచును గొంద-ఱొదిగి యేఁగ
తే॥ ధనురధిజ్యం బొనర్చెడి-ఘనుఁడొకండు, లేఁడె? యని రావణుఁడు నవ్వి-లేచి వచ్చి
ధనువు డగ్గఱి గర్జించి-జనకుఁ గాంచి, మించి దర్పంబెలర్ప ని-ట్లంచుఁ బలికె ౨౧౯

ఉ॥ ఎవ్వఁ డమర్త్యులం గెలిచె - నెవ్వఁడు ముజ్జగముల్ వశంబుగా
నివ్వటిలెన్ సురారులు గ - ణింపఁగ శ్రీరజతాద్రి నెవ్వఁ డా
పువ్వులబంతి చందమున - ముందుకు వెన్కకు నూఁచివైచె రా
జెవ్వఁడు మీకు నట్టి ఘను - నీదశకంఠు విదేహ! చూడవా? ౨౨౦

ఆ॥ గడ్డిపోఁచవోలెఁ - గడు నల్పమైనట్టి, వింటి నెత్తు టెట్టి - బంటుతనమొ ?
చాలుఁజాలు నాదు - సత్త్వంబు తెలియంగ, నెంచినాఁడవేమొ? కాంచుమింక.

## —◆ రావణుఁడు హరధనుస్సుచే భంగపడుట ◆—

వ॥ అని మునుకొని తన వామహస్తంబుచే ధనువును బైకెత్తఁ బూనిన నయ్యది రవంతయైనఁ గదలకుండిన రోషతామ్రాక్షుండై కుడిచేతినిసైత మాచేతికి జతచేసి యెత్తఁ జూచిన నదియు రిత్తయైన నుత్తలపడి భుజబలంబు మెఱయఁ జాపమును దొప్పిల్ల నూఁపి యేపాటును దోఁపక యిరువదికరంబులచే గట్టిగాఁ బట్టికొని యెట్టకేలకు ది

ట్టతనంబుసూపి కొట్టుకొన పట్టుదొరకిన ధట్టించి నెట్టనఁ బై భాగంబువఱకు నట్టెట్టి యెత్తి యొక్క చేయివదలి క్రిందనుండిన యల్లెత్రాటిని గైకొన సంకించు నంత నా శివునివిల్లు దబాలున నాతని యెదపైఁబడినఁ బుడమికిని వింటికిని నడుమఁ జిక్కికొని దిక్కుతెలియకసుక్కుచు నక్కిరీటంబులంత్రొలంగఁ గచ్ఛపీడ బలంబు సడల విడు దలగతి గానక కిచకిచలాడుచు సభలోని వారెల్లరును బకపక నగుచుండ గిరగిర మని కండ్లుత్రిప్పుచు నోటఁగాఱు చొంగలను జప్పరించుచుఁ దన ముప్పునకుఁ దాన వగచుచుఁ జొప్పెఱుంగక తప్పుసేసితి ననుకొనుచుఁ దుదకు నసువులపై నాసవిస ర్జించిన నూర్జితయశుఁడగు జనక మహీశుఁడు మరల సభాదులఁ బరికించి మెడ నిక్కించి చేయెత్తి యిట్లనియె. ౨౨౨

క॥ లేరా వీరులు భూస్థలి?, నారయ నిర్వీర్యమయ్యె - నా? యుర్వరయున్
భీరుని నీ దశకంధరు, వారక రక్షించుటొప్పు - బలయుతుఁడున్నన్. ౨౨౩

వ॥ అని పలికిన. ౨౨౪

క॥ ఆ మాటలె శరములౌగా, రాముఁడు లక్ష్మణుఁడుఁ గనలి - ప్రణతులగుచుఁ దా
మామెయి విశ్వామిత్రుని, మోముం గన నతఁడు రామ - మూర్తిం బలికెన్.

శా॥ లెమ్మా! రాఘవ! రావణాంత మిప్పుడే - ప్రేక్షింతువా? యీసభన్,
బొమ్మా! వేగమ రాక్షసుం దరియ, నూ - ర్పుల్ నిల్వఁగాఁ జేయుమా!
కొమ్మా! శ్రీ శివశార్ఙ్గమున్ సులువుగాఁ - గొన్నంత జ్యావల్లినిన్
నెమ్మిన్ వింటికిఁ గూర్చి టం కృతిని నెం - తేఁ జల్పుమా! మేలుగాన్. ౨౨౫

మ॥ అనినన్ రాముఁడు లేచి మ్రొక్కి మునికిన్ - హర్షించి హారంబులన్
గొనగొల్లన్ సవరించి నిశ్చలగతిన్ - గోటీరమున్ నిల్పి చ
య్యన వస్త్రంబు బిగించి నెన్నడుమునన్ - హంవీరు లీక్షింప మొ
ల్లన నాశార్ఙ్గము డగ్గఱించె జయలీ - లాలోల చేతస్కుఁడై. ౨౨౬

క॥ ఆ రామునిఁ గని విస్మయ, పూరంబగు మదులజనులు - పొడగనుచుండన్
ధారుణి రమణులు లోచన, నీరేజాతముల భీతి - నెక్కొనఁ గనుచున్. ౨౨౭

సీ॥ మనకె దుస్సాధమౌ - పనికి యత్నించె రా, కొమరుండు జడుఁడని - కొందఱనఁగఁ
గాదు కాదా పంక్తి - కంఠు నాలోకింప, ముందుకేఁగె నటంచుఁ - గొందఱనఁగఁ
బిన్నాటలింతియే - బిరుదైనమగలెల్లఁ, బందలై రా? యని - కొందఱనఁగ
గాధిసూనుండింత- కార్పణ్య మొనరించెఁ, గోదండమేట? నని - కొందఱనఁగ
తే॥ జనకుఁడా పల్కులాలించి- సంభ్రమించి, కౌశికునిగాంచి నృపులచేఁ - గానిపనికిఁ
గోమలాంగుఁడు బాలుండు-రాముఁడగునే? జలధిజాతకమేటు పీల్చుఁ-జాలునదియె.

శా॥ ప్రాసాదస్థిత కాంతలత్తత్తని దృ - క్ప్రావిణ్య మేపారఁగా
నా సర్వావయవప్రభా మహితు డి - వ్యాకారు సల్లక్షణో
ల్లాసుఁ జాపసమీపవాసుఁ బరి పు - ల్లన్నేత్రి నీరేరుహుల్
వాసిన్ రాముని గాంచి యూర్ధ్వముఖులై - భక్తిన్ నతుల్ సేయుచున్. ౨౩౦
తే॥ హరిహర బ్రహ్మలను మమ్ము - నంబరమున, సంబరంబునఁ గన్గొని - సర్వదేవు
లార! మద్వ్రత దాన పు-ణ్యముల చేతఁ, జాప మీ రామునకుఁ బుష్ప-సామ్యమగుత.
క॥ రాముని శుభకంధరమున, భూమిజయున్ బుష్పహార - మును వెస నిడుతన్!
మేమా రామావనిజా, శ్రీమహామును గనెడి రీతిఁ - జేయుఁడు మీరల్. ౨౩౨

—♦ సీత రామునే పతిగాఁ గోరుట ♦—

వ॥ అని ప్రార్థించుచున్న సమయంబున సఖీజనులచేఁ బరివేష్టింపఁబడి సౌధాగ్రమున నుండిన సీతయు నమందానందకందళిత హృదయారవిందయై తులసియను చెలి కత్తియ మెడపైఁ దనచేయి వైచికొని సాదరమతియై. ౨౩౩
సీ॥ సుకుమారు నబ్జాక్షు - సుందరుఁ జంద్రాస్యుఁ, జారు దోర్దండు స్వ - ర్ణోరు తేజు
శృంఖలా నూపురాం - చిత దివ్యపదయుగ్ముఁ, గంకణాశృంఖలా - క్రాంతహస్తు
నవరత్నమకుట కుం - డలకాంతిశోభితు, శూరవర్యు సుజంఘు - సుపదు సుగుణు
వరజాను సుందరో - దరు హనుసుస్కంధుఁ, గంబుకంఠు వళిత్రి - యుం బ్రకాశు
తే॥ సస్మితానను బింబోష్ఠు - స్వచ్ఛదంతు, సత్కపోలు లసన్నాసు - సంస్థ సుభ్రుఁ
గుంచితాలక సత్ఫాలుఁ-గుసుమహారు, భూషణోపేతు శ్రీరాముఁ-బూజ్యుఁగాంచి.
క॥ అకటా ! యచలోపమమా, నికటస్థిత చాప మెచట ? - నెక్కను బలిమిన్
సుకుమారుఁడు శ్రీరాముఁడు, ప్రకటంబుగ వంచి నన్నుఁ- బరిణయమగునా? ౨౩౪
తే॥ దైవమా! రామచంద్రుండె - ధవుఁడు నాకు నీమనంబెటులున్నదో? - నేనెఱుంగ
నితరుఁ డెవఁడేని వరియింప-నీక్షణంబె మేడపైనుండి ధరఁబడి- మేనువిడుతు. ౨౩౫
సీ॥ శంకరా! లోకేశ! - శర్వాణి! శ్రీవాణి!, సావిత్రి! గాయత్రి! - జలజమిత్ర!
స్వర్లోకనాయకా! - సమవర్తి! జలనాథ!, ధనపతి! యనల! ప - ద్మా! రమేశ!
పక్షీంద్ర! ఫణిలోక - భర్తా! సుధాధామ!, సర్వదేవతలార! - సంస్మరింతు
మీరందఱును దయా - మేదురబుద్ధి నీ, శార్ఙ్గంబు సుమమట్లు - సలుపుఁడింక
తే॥ రామ భుజదండముల మీ బ - లంబుఁ జొన్పి
జయముఁ గూర్పుఁడు పదునాల్గు - సమలు నేను
వనమునందున మునివృత్తి - గనిచరింతు
ననుచు సంతసపడఁజేసె - నమరవరుల. ౨౩౬

—◆ హరధనుర్భంగము ◆—

క॥ ఆ పిమ్మట శ్రీరాముఁడు, చాపంబుఁ బ్రదక్షిణించి - సద్గురునిన్ న
న్మాపితరుల స్మరియించుచుఁ, జాపము డాకేలఁ బట్టి - చయ్యన నెత్తెన్. ౨౩౮

క॥ ఎత్తినవింటికి నారిని, హత్తించి గుణారవంబు - నతఁ డొనరించెన్
ముత్తునియలగుచు శార్ఙ్గం, బత్తఱి ఫెళ్లనుచు విఱిగె - నందఱు బెదరన్. ౨౩౯

చ॥ అవని చలించె దిక్కులు న - భోంతరముల్ కడుదద్దరిల్లె న
ర్ణవములు మేరమీఱుచుఁ గ - లంగె ఫణీంద్రుఁడు స్రుగ్గెఁ దారలున్
భువిపయి రాలె భీతిగని - బోరన నీవును నన్నుఁ జేరి నా
కవుఁగిట డాగి యుంటివి జ - గద్ధితుఁడా విలుత్రుంచు వేళలోన్. ౨౪౦

క॥ మొరయించిరి దుందుభులను, గురియించిరి పూలవానఁ - గుతుకమెలర్పన్
బెరయించిరి నృత్యంబులు, స్మరియించిరి రాము నెల్ల - స్వర్గౌకసులున్. ౨౪౧

చ॥ మఱియు సభాంగణంబున న - మానుష తేజుని రాముఁ జూచి వే
నెఱికొని వందిమాగధు ల - నేకముగా నుతియింప వేశ్యలున్
మెఱయుచు నృత్యముల్ సలుప - మేకొని వాద్యములెల్ల మ్రోయ మే
ల్తెఱఁగున స్త్రీలు పూల్గురియఁ - దిన్నఁగ వీఁచెను గంధవాహుఁడున్. ౨౪౨

తే॥ రావణాసురుఁ డప్పుడు - లజ్జచేత, నిమిషమైనను సభలోన - నిల్వకుండఁ
బడిన బొమిడికములనైనఁ - బడయకుండ, విహ్వలుండయి లంకకు - వేగఁ జనియె.

ఉ॥ రామలు కీర్తిసోముఁడగు - రాముఁ డొనర్చిన చాపభంగమున్
దాము సమీక్షసేసి కర - తాళములన్ జయశబ్దముల్ ముదం
బామతిలంగఁ జల్పిరి ధ - రాత్మజయున్ బులకాంకితాంగియై
రాముని దైత్యదర్పద వి - రాముని గాంచెను బ్రేమమీఱఁగన్. ౨౪౪

వ॥ అంత నా జనక మహీకాంతుండు మంత్రి వరులం గని మాతంగముపై సీత నెక్కించు కొని సేనా సురక్షితముగా మహోత్సవంబున నిచ్చటికిఁ బిలుచుకొని రండనిన వారును త్వరితగమనులై వెడలి సీతను సమీపించి నిటలతట ఘటిత కరపుటులై మధురాలాపముల నిట్లనిరి. ౨౪౫

శా॥ అమ్మా! జానకి! ధన్యవైతివి కదమ్మా! సూర్యవంశ్యుండునున్
నెమ్మిన్ బంక్తిరథాగ్రపుత్త్రకుఁడునున్ - నిష్ణాతుఁడౌ రాముఁ డా
పెమ్మెల్ గల్గిన వారలబ్రపడ ని - ర్భీతిన్ ధనుర్భంగమున్
సమ్మానంబుగఁ జల్పె లెమ్మువరు ప - జ్జం జేర నేనెక్కఁగన్. ౨౪౬

—◆ సవిభవముగా సీత రాముని కంఠమునకుఁ బువ్వుహార మలంకరించుట ◆—

క॥ అనినన్ సీతాకాంతయు, జననిన్ నతిసేసి సఖులు - సరస నడువఁగాన్
ఘనగజ మారోహించెను, మునుమంగళ వాద్యముల్ ప్ర - మోదంబిడఁగన్.

శా॥ చిత్రోత్క్షిప్తులు కందుకముల్ శతముగా - సీతా కరిణ్యగ్రము
దాత్రింబొప్పఁ జరింపఁగా జన సమూ - హంబున్ నివారించుచున్
వేత్రంబుల్ ధరియించినట్టి భటులు - ద్వేలంబుగా ముందరన్
బాత్రింబానటు వేశ్యలాడిరి నుతిం - పన్ మాగధాదుల్ కడున్. ౨౪౮

సీ॥ వారువంబుల నెక్కి - పరిచారికా తతుల్, చామరాదులు పూని - సరసరాఁగ
స్వర్ణ దండంబులు - శస్త్రముల్ ధరియించి, ముసలుల్ హయు లెక్కి - ముందరాఁగఁ
బురుష వేషము లూని - తరుణీశిరోమణుల్, బంటు తనంబున - వెంటరాఁగ
సచివవర్యులు చమూనిచయరక్షణ మెంచి, వాహనారూఢులై - వరుసరాఁగఁ

తే॥ బ్రిమద లానందముగఁ జామ - రములు వీవ
స్త్రీలు సౌధాగ్రములనుండి - పూలు గురియ
మెఱుఁగు తీవను బురిణించు - మెలఁత మిన్న
సీత యరుదెంచె వైభవో - పేతయగుచు. ౨౪౯

తే॥ వచ్చి కరిడిగ్గి నవరత్న - భర్మ విహిత, దివ్యహారంబుఁ గొనుచు వి - దేహునాజ్ఞ
రామచంద్రుని గన్గొని - ప్రేమమీఱ లలిత లజ్జావిలోకనో - ల్లాసయగుచు.

తే॥ మృదుపదంబులఁ దామెల - మెల్ల నిడుచు జానకీదేవి శ్రీరామ - చంద్రుఁజేరి
నమ్రయై హారమతని కం - ఠమునవైచి, పదములకు మ్రొక్కి లజ్జచేఁ - బజ్జనిలిచె.

క॥ రాముఁడు సద్గుణగణ సం, ధాముఁడు ధృతదివ్య రత్న - దాముఁడు విజయో
ద్దాముఁడు సీతారాముఁడు, సామోదుండగుచు నెగడె - సభలో మిగులన్. ౨౫౧

క॥ శాశ్వత యశుఁడా రాముఁడు, విశ్వామిత్రునకు మ్రొక్కె - వేగమ మునియున్
సుశ్రేయసుఁడగుమని, విశ్వాసాశ్లేష మొసర - విలసనమతియై. ౨౫౩

తే॥ దక్షిణాంక స్థితునిఁ జేసి - దాశరథిని, శిరము మూర్కొని చాల సం - బరమునొంద
జానకినిఁగూడ వామాంక - సంస్థఁజేసె, జనకుఁ డద్దాన శోభిల్లి - మునివరుండు. ౨౫౪

క॥ జననము సాఫల్యంబై, మనెనని నెమ్మనమునందు - మానుగఁదలఁచెన్.
జనపతియగు జనకుండును, మునిసత్తముఁ గాంచి కేలు - మోడ్చుచుఁ బలికెన్. ౨౫౫

తే॥ త్వత్ప్రసాద ఫలంబుచే - దాశరథిని, నల్లునిగఁ జేసికొంటి ధ - న్యమ్మకులము
ధన్యుఁడను నేను బితరులు - ధన్యులరయ, రామునకు, మామ నైనాఁడఁ - బ్రజలువొగడ.

వ॥ అనుచున్న సమయంబునఁ బార్థివులెల్లరును నిరర్థాలోచనల మునింగి తటిత్ప్రభాభా సమానయు బింబోష్ఠియుఁ జంద్రవదనయు దివ్యసుందరాంగియు నగు జగతీసుతం గని తత్కటాక్ష వీక్షణశరాఘాతములకు వాదురుచుఁ బరాభవంబు నొందితి మని దురదృష్టంబును నిందించుకొనుచు విషణ్ణులై యథశ్శీర్షులైన వారిం గనుంగొని విదేహమహీపతి నతియొనర్చి మదీయ సుతావివాహ మహోత్సవము నుత్సు కంబున నెఱవేర్చి నాయొనర్చు సత్కారముల నందువఱకును బురంబులకు వెడలవ

లదని ప్రార్థించిన వారును నిట్టూర్పులనుబుచ్చి తుట్టతుదకు సమ్మతించిరి తదనంత
రంబ. ౨౪౭

—♦ జనకుఁడు సీతావివాహమునకు దశరథాదులను రావించుట ♦—

తే॥ పుడమిఱేఁడుల విడుదల-విడియఁ జేసి, సముచితస్థానముల మౌని-సమితిఁ జేర్చి
గాధిజప్రేరితుండయి - గౌరవముగఁ, బంక్తిరథుఁ బిల్వ మంత్రులఁ-బంపె నృపుఁడు.

చ॥ సచివు లయోధ్యఁజేరి నృప - సత్తముఁ బంక్తిరథుఁ నమస్కరిం
చుచు శివచాపభంగమును - సూదికి దారముగూర్చినట్లు మేల్
వచనములన్ సమగ్రముగ - వాకొన నాతఁడు సంతసించి యా
సచివుల గౌరవించి తన - సంఘముఁ గాంతలునుం బదంపడన్. ౨౪౯

చ॥ మిథిలకు రా విదేహుఁడు స - మీహిత చిత్తముతోడ వారికిన్
బ్రిథ నెదురేఁగి వైభవ శు - భస్థితులన్ బురిఁజేర్పరాఁగ నా
పథమునఁ గైకపుత్రులను - బట్టణవాసులు గాంచి భ్రాంతిచేఁ
గథనమొనర్చి రా సుతయు - గంబును రాముఁడు లక్ష్మణుండుగాన్. ౨౫౦

తే॥ మైథిలుండౌల రామల - క్ష్మణులఁ గూడి, వెలయు గాధిజుఁ గన్గొని - యలవసిష్ఠ
మునికి నంజలి ఘటియించి-ముందునుండు కైకజుల రామరూపులఁ-గాంచిమురిసి.

క॥ వీ రెవ్వరనుచు నడిగిన సారమతుల్ వారు భరత - శత్రుఘ్నులు ధా
త్రీరమణా! రామానుజు, లారయుమని గాధిసూనుఁ - డప్పుడు పల్కెన్. ౨౫౨

ఉ॥ రాముఁడు లక్ష్మణుండు ముని - రాజగు గాధిసుతుండు మువ్వురున్
ధీమహితాత్ముఁ బంక్తిరథు - నిన్ మఱి కోసలజాది రాణులన్
బ్రేమ వసిష్ఠుఁ గాంచి నిబి - రీసముదంబును గూర్చివారికిన్
దాముసు హర్ష మాణులయి - తత్పరిసంగతులైరి పొంగుచున్. ౨౫౩

తే॥ గీ॥ భరతశత్రుఘ్నులును రామ-భద్రునకును, లక్ష్మణునకునుబ్రణమిల్ల-లలితఫణితి
వారుఁ దమ్ములఁ గౌఁగిటఁ-జేరఁదీసి, ముచ్చటించుచు వరుసగా-ముందునడువ. ౨౫౪

క॥ జనకుఁడు వారలఁ గనుగొని, మనమున సంతోషపడుచు - మంజులమధుర
ప్రణయోక్తులతో దశరథ, జననాథునిఁ గాంచి పలికె - జనమధ్యమునన్. ౨౫౫

తే॥ రామున కయోనిజనుసీతఁ బ్రేమనిచ్చి, మత్తనయ నూర్మిళాఖ్య ల-క్ష్మణునకొసగి
భరతశత్రుఘ్నులకుఁ గుశ-ధ్వజునిసుతల, మాండవీశ్రుతకీర్తుల-మఱియునిత్తు. ౨౫౬

వ॥ అనిన దశరథుఁడును నందుల కంగీకరించి జనకుని పురోహితుఁడును నహల్యానంద
నుండును నగు శతానందముని కెరఁగి సీతయయోనిజ యెట్లయ్యె నది సవిస్తరంబుగా
నానతీయుఁడని వేఁడిన నతండు వినుమని యిట్లనియె. ౨౫౭

—♦ దశరథునకు శతానందుఁడు సీతాపూర్వవృత్తాంతమును జెప్పుట ♦—

శా॥ పద్మాక్షుండను రాజు పూర్వము జగ - త్ప్రఖ్యాతినిం బొంది తా
సద్మాంబంమున నొక్కనాఁడు సుఖియై - శిక్షుల్ ధనోల్లాసముల్
బద్మావాస యొనర్పమిం బొగులఁగాఁ - బాటించి మత్పుత్త్రిగాఁ
బద్మం గాంచెద నంకసీమ నెపుడున్ - వర్తింప నంచెంచుచున్. ౧౧౮

క॥ తపముం బొనరిచి లక్ష్మియుఁ, గృపచేఁ బ్రత్యక్షమైనఁ - గీర్తించుచు నా
నృపుఁ డాదేవిని సుతగా, నపేక్షచే నడుగ నామె - హరిఁ గొల్వుమనెన్. ౧౧౯

క॥ అతఁడారీతిగ నిశ్చల, మతియై హరిఁగూర్చి తపము - మరల నొనర్పన్
గుతుకముతో విష్ణువు భూ, పతిఁ గాంచియు మాతులుంగ-ఫలమిచ్చి చనెన్. ౧౨౦

—♦ లక్ష్మి మాతులుంగోద్భవయై పద్మయను పేరొందుట ♦—

తే॥ ఆఫలాంతరమందు స్వ-ర్ణాంగియైన, కన్యకామణి ప్రభవింప - ధన్యుఁడైతి
ననుచుఁ బద్మాక్షుఁ డామెను-బెనుచుచుండె, నామె నెల్లరుఁ బద్మాస-మాఖ్యయనిరి

తే॥ ఫలము శకలంబు నందొక్క - ఫలము మరల నుద్భవించినఁ బద్మయు - నొందిదాని
లలితసుకళావినోద సో-ల్లాసయగుచుఁ, జాద్రికళవోలి తండ్రి యు-త్సాగమెక్క.

వ॥ అట్లు క్రమక్రమంబుగా వృద్ధిపొందుచున్న పద్మ నవలోకించి యామె వివాహవయ
స్కయగుట గమనించి తగిన వరుం డెచ్చటనుండెనని వితర్కించి స్వయంవరంబు జ
రగింపనెంచి యజ్ఞంబొనర్పనూహించి యాహ్వానపత్రికలను లిఖింపించి నృపతు
లకును మునులకును బత్రికలఁబంపించి పురంబు నయనానందకరంబుగా నలంక
రించునట్లొనరించి పద్మాక్షుండు యజ్ఞమునకుఁ బ్రారంభించిన నా సమయంబున.

మ॥ సురగంధర్వులు దైత్యదానవులు య - క్షుల్ పక్షులున్ గిన్నరుల్
నరులున్ భూవరులున్ మునీశ్వరులునున్ - నాగుల్ దశగ్రీవుఁడున్
సరిదంభోధి మహీధ్ర భూరుహ వరాం - చత్కామరూపౌఘ మ
బ్బుర మేపారఁగ వచ్చి రాపరిణయం - బున్ యజ్ఞమున్ గాంచఁగన్. ౧౨౪

ఉ॥ వచ్చినవారినెల్లర న - పారముదంబునఁ గాంచి నెమ్మదిన్
మెచ్చుచు సత్కృతుల్ సలిపి - మేకొని రాజు సభాస్థలంబునం
దచ్చుపడంగఁ బల్కె ఘను - లార! నభోసితవర్ణ లేపుఁడై
పొచ్చెములేని కీర్తిగను - పోటరి నా సుత కర్హుఁడంచుఁ దాన్. ౧౨౫

క॥ ఆపల్కుల కుల్కుచు నా, చూపఱు లాశ్చర్యమంది - క్షోణీశునిపై
గోపించి యసాధ్యంబగు, నీపనినెటు తెల్పితనుచు - నీర్ష్యాళువులై ౧౨౬

తే॥ మోహనాకార పద్మను-మోదమరయ, దూరమయ్యెడు ననియెద్ది-త్రోవయనుచు
నందఱామెను హరియింప-సందడింపఁ, గనలి పద్మాక్షుఁడును సంయు-గంబు సలిపె.

తే॥ రోమహర్షణుఁడగుచు స - క్రోధుఁడగుచు
వింటశరములు సంధించి - వేనవేలు
గాఁగఁ బద్మాక్షుఁజేసిన - గరువముడిగి
నృపులు సురలును వెనుకకు - నేఁగిరంత. ౨౭౮

శా॥ దైత్యుల్ భీకరశస్త్రసంహతులచే - దర్పం బెలర్పాగ సు
శ్రీతాత్యౌత్కంఠ్యముతో నెదుర్కొనుచు ధా - త్రీనాథుఁ బద్మాక్షు నా
మృత్యుప్రీతియొనర్చి పద్మనుగొనన్ - హేలాగతిన్ వెన్కనన్
భీత్యుద్వేష్టితయౌచు నామెయును వే - వేయగ్నిలోనం బడెన్. ౨౭౯

ఉ॥ ఆమె యదృశ్యమైన నమ - రారులు పద్మని పట్టణంబుఁ దా
మామెయిఁ జేరి నేలసమ - మౌనటు సౌధములెల్లఁ ద్రోసి య
చ్చో మననం బొనర్చిరిఁక - క్షోణిపపత్నులు నంతమంది రా
శామతి లక్ష్మిఁ గోరిన భృ - శంబగు కష్టమె వచ్చి సేరికిన్. ౨౮౦

వ॥ పిమ్మట దైత్యులాదిగా నెల్లరును దమతమ నెలవుల కరిగిన నొక్కతఱిఁ బద్మయు నగ్నికుండంబునుండి వెలువడి తత్సమీప ప్రదేశంబున సంచరించుచున్నంత. ౨౮౧

—♦ పద్మ దివ్యపంచరత్నాకృతి నందుట ♦—

తే॥ విజయ యాత్రను వర్తియై - వెడలి గగన
వర్త్మమునఁ బుష్పకము నెక్కి - వచ్చుచున్న
రావణునిఁ గూడియున్న సా - రణుఁడు వేగఁ
బద్మఁ గని పంక్తిముఖున కా - పడఁతిఁ జూపె. ౨౮౨

ఉ॥ ఆ దశకంధరుండును బ్రి - హర్షము నొందుచు వ్యోమయాన మ
ప్డాదెస నిల్పి డిగ్గి గజ - యాన మనోజ్ఞ విలాసఁ గాంత న
త్యాదర మొప్పఁజేరి కర - మల్లనఁ జాఁచి గ్రహింపఁ బోవఁ దా
నాదహనాంతరంబున ర - యంబున డాగెను బద్మభీతయై. ౨౮౩

వ॥ అందులకు రావణుండు చింతించుచు నాకాంత నుద్దేశించి. ౨౮౪

శా॥ కాంతా! యెంతటి వెఱ్ఱిదానవు ధరా - కాంతుల్ సుధాంధోగ్రణుల్
మంతుల్ గల్గిన వారలెల్లరు నినుం - బ్రేల్మాలి మున్వేడినా
రంతే తావక ధామముం గనిన నా - కా? మాయఁ జూపింతు విం
కెంతైనన్ గ్రహియింతు నిన్ను ననలుం - డేమౌనో? వీక్షింపుమా! ౨౮౫

తే॥ అని జలంబును గొనితెచ్చి - యనల మార్చి
పేర్చి పరిశీలనము సేయఁ - బింజరాభ
మించు రత్నము లైదు ల - భించెనందు
వాని నొక్క కరండికఁ - బదిల పఱిచి. ౨౮౬

—♦ రావణుఁడు పంచరత్నములను లంకకుఁ గొనిచనుట ♦—

చ॥ త్వరగ విమానమెక్కి చని - తద్దశకంఠుఁడు లంకఁ జేరి దే
వరగుడిలోఁ గరండికను - బట్టుగఁ బెట్టి నిశీథినిం గడున్
సరసత భార్యఁ గూడి లల - నామణి! దివ్యములైన రత్నముల్
బరువడిఁ దెచ్చినాఁడ నని - పల్కి కరండికఁ దేరఁ బాచినన్. ౨౮౭

శా॥ ఆ మండోదరి దేవతాగృహము డా - యం బోయి యా తల్పులన్
సామోదంబుగఁ దీసి లోనఁగల భ - ద్రాసీత సద్రత్నముల్
దేమున్కాంచుఁ గరండికం గదలుపన్ - లేశంబునున్ లేవ కెం
తే మొల్లంబుగఁ దోఁపఁ దద్విషయముం - దెల్పన్ వెసన్ భర్తకున్. ౨౮౮

క॥ ఆ మాటలకుం బ్రహసనుఁ, డై మానవభోజి దేవ - తాలయమునకున్
భామన్ వెనుకొని చని తా, నామున్ గని యా కరండ - మటు కదలించెన్.

—♦ రత్నములు కన్యారూపము నందుట ♦—

చ॥ అది యచలంబుపోలె రవ - యైనఁ జలింపమి నబ్రమొంది దు
ర్మదరుమఁ బూని వింశతి క - రంబుల నెత్తిన లేవదయ్యె నా
పిదప దశాస్యుఁ డచ్చటనె - ప్రేలుచు మూఁతను దీయ దానిలోన్
ముదిత యొకర్తె కన్పడె స - ముజ్జ్వల సూర్యవిభాప్రభావయై. ౨౯౦

చ॥ అనుపమమైన తద్ద్యుతికి - నాశర తేజములేది వారి లో
చనములు మీలితంబులయె - సౌధనివాసజనంబులెల్ల నా
మెను గన వచ్చిరప్పుడు భ్రి - మించి దశాస్యుఁడు నానుపూర్విగా
వనితకథన్ వచించెఁ దన - పత్నినిఁ గాంచి ససాధ్వసాత్ముఁడై. ౨౯౧

క॥ మండోదరి యా నుడులకుఁ, జండతరాగ్రహముఁ బూని - చయ్యనఁ బతినిన్
దండించుచుఁ గులనాశం, బొడఁగ నీయమను దెచ్చి - తహహా! యనుచున్

తే॥ చెలువ సేసిన మూర్ఖ వి-చేష్టితముల, నెఱిఁగియుండియు లంకకు-నీమె నిట్లు
తీసికొని రాఁగఁ బాడియే? - దేవవిమత, నాథ! యిది విపరీతపంబ - నంగవలదె?

క॥ సంకోచ మేల? యీయమ, లంకను నుండంగ రాదు - రయమున బలుతా
లెంకలఁ బిల్పింపుము మన, కంకిలి లేకుండఁ జేర్పు - మా! యొక వనికిన్. ౨౯౨

—♦ మండోదరీ వాక్యములవలన రావణుఁ డాకన్యకను వనమున వదలుటకు భటుల నాజ్ఞాపించుట ♦—

వ॥ అని పలికిన రావణుండును నగేస్థితులగు నమాత్యుల నవలోకించి మంత్రింబునలిపి
యడివిపాటున నడియరులఁ బిలిపించి యా దివ్యాపఘున నొక్కఘనగహనము
న డించిరా నియోగించిన భయంకరులగు నాకింకరులును బంకజాక్షిగల కరండికను
విమానంబున నిడి యడవికి వెడలఁ బ్రియత్నించిన మండోదరి మరల వారలం గని

యిర్వ్యంగనం గడు దవ్వునం గల పొలమునకుం గొనిపోయి పొడవడకుండఁ గరండి కనట్లు భూమిలోఁ బాఁతిపెట్టి పెడమఱిరండు కనలుపడినంత నీను నెత్తఱి నేరిన్నైన మిత్తి కెరసేయఁగలను గృహస్థుండయ్యు జితేంద్రియుండై చరాచరంబులను నేకంబగు నాత్మరూపంబుగా నెఱింగి మను ఘనునింటనుంట కీవాల్గంటి యొంతయుం దగు నని వచియింపఁ గరండికాస్థయగు పుండరీకాస్యయు దశకంఠుండు మొదలగు పౌలసు దిండులు వినుచుండ నుద్దండముగా నిట్లనియె. ౨౯౬

మ॥ మరలన్ లంకకు నేనువచ్చెద న్భృశం - సశ్రోణియూ మిమ్ము నె
ల్లరనున్ రావణపుత్త్రబంధుసచి వ - పౌరాఢ్యా ప్తయుక్తంబుగాఁ
బరలోకంబున కేగఁ జెయఁబిదపన్ - బొండున్ శతగ్రీవు ను
ద్ధరతం జంపెద మూలకాసురునిఁ దుర్మ - తున్ వానిపై నొంతయున్. ౨౯౭

క॥ అనవుడు దనుజులు భయకం, పనులై శవములను బోలి - మ్లానాస్యులుకాన్
ఘనుఁడా రావణుఁడును గే, లను ఖడ్గముఁ బూని యెత్తె - లలనం జావన్. 

వ॥ ఆ సమయంబున. ౨౯౮

—♦ రావణుఁడు పేటికాస్థిత కన్యకను జంపఁబోవ మండోదరి వారించుట ♦—

శా॥ ఏమిరా? సాహస మాయువుం దొలఁచి యి - య్యింతిన్ వధింతే? యటం
చామండోదరి భర్త కడ్డుపడి యా - ర్యా! ముందు రాఁబోవు కీ
డో? మేలో? యెటు నిశ్చయింపఁ దరమా - యోషన్ విసర్జింపుమా!
నామాటన్ వినుమా! యటన్న నతఁడుం - దత్పూర్తిచే నూఱడెన్. ౨౯౯

—* భటులా పేటికను మిథిలచెంత భూమియందుఁబాఁతి వచ్చుట *—

క॥ దూతలు నాపేటికఁ గొని, యాతురముగ మిథిలచెంత - కరిగియు దానిం
బాఁతి ధరయందు జవమున, నేతెంచిరి లంకకంత - నేలిక పొగడన్. ౩౦౦

క॥ ఆ ధరణీ భాగమ్మును, భూధవుఁ డీజనకుఁ డొక్క - భూసురునకు జీ
వాధారంబుగ రాహుని, వేధము రవి గనిననాఁడు - ప్రీతిగ నొసఁగెన్. ౩౦౧

చ॥ అతఁడును దత్కృషిం జలుప - నారసి మంచిముహూర్తమందు మే
ల్జతయగు కోడెలం గొని ప - సందగు నాఁగలి పొంది కర్షకుం
డితవుగ రాఁగ భూమికడ - కేగియు రైతది దున్నుచుండఁ దా
మతి నదుసంబు నొంద నొక - మాఱున నాఁగేటి చాలునందునన్. ౩౦౨

—♦ బ్రాహ్మణుఁడు నాఁగటిచాలున దొరకిన పెట్టెను జనకున కిచ్చుట ♦—

క॥ సీతాగ్రము తాఁకున నిం, పారంగఁ గరండికయు బ - యల్పడె నపుడ
వ్వారలు నబ్బురపడి యీ, భూరమణుని యొడకుఁ దెచ్చి - పొందుగ నిడినన్.

క॥ విప్రుని సొమ్మది చేకొన, నప్రతిభ ఘటిల్లునంచు - నవనిపుఁ డనియెన్
విప్రుఁడును జనకభూప! న, హిప్రతి యర్థులరు మీర - యిదొయని యొసఁగెన్.

శా॥ అందేమున్నదో? యంచు మూఁతనటు తీ - యన్ బాలికారత్న మిం
పొందం గన్పడె భూమిదేవుఁ డపుడో - హా! రాజ! యీ యందక
త్తెం దామే గ్రహియింపుఁడీ! యని చనన్ - దేవాదులాదుందుభుల్
మ్రోయించి దివ్యానము సేయఁ బుష్పములు సం - వర్షించి రుత్కర్షులై. ౩౦౫

—♦ పెట్టెలోనుండిన కన్యకకు సీతానామమిడి జనకుఁడు పెనుచుట ♦—

క॥ సీతను దొరకిన దాటన్, సీతయె యని పేరుపెట్టి - స్ఫీతముదమునన్
ఖ్యాతిలపతియుం బెంచెను, సీతా వృత్తాంతమిద్ది - శివకర మరయన్. ౩౦౬
వ॥ మఱియు నా సీతాదేవికింగల యభిఖ్య లెవ్వియనిన. ౩౦౭
తే॥ మాతులుంగోద్భవయు నౌట - మాతులుంగి
భవ్య పద్మాక్ష సుతయౌట - వలసఁ బద్మ
యగ్ని సంవాసినియు నౌట - నగ్నిగర్భ
నవ్య రత్నములౌట ర - త్నావతియును. ౩౦౮
తే॥ ధరణి వెల్వడుటనుఁ జేసి ధరణిజాత, జనక సంరక్షితయు నౌట-జానకియును
ననెడు దివ్యాహ్వయంబుల-నలరుచుండు, సీత నుతియింపఁ దరమె? వి-ఖ్యాతజాత.
వ॥ కావున. ౩౧౦
తే॥ గగననీలాభతనుఁడైన-ఘనయశుండు
రామచంద్రున కాసీత - రమణి యయ్యె
నవనిఁ బద్మాక్షుఁ డొనరించి - నట్టి ప్రీతిన
సఫలతను బొందెఁ గనుము స్న - పాసుఖంబు. ౩౧౧

—* దశరథాదులు మిథిలం బ్రవేశించుట *—

వ॥ అని శతానందుండు దశరథునకుం దెల్పిన యా సమయంబునందె మున్ను దశరథునిచే నాహూతులై యుండిన కోసలాధిపతియు మగధేంద్రుండును గేకయాధిపుఁడును బుత్త్రమిత్రకళత్ర బాంధవాది మంత్రి సైన్యసమేతంబుగా నరుదెంచిన వారల కెల్లరకు స్వాగతం బొసంగి జనకమహీశుండు తగు సత్కారముల నొనరించె దశరథుఁడును సముచిత సల్లాపంబులచే గౌరవించె నదనంతరంబున జనకుండు దశరథునిఁ బూజించి రామలక్ష్మణ భరతశత్రుఘ్నుల నాభరణాదులచే నలంకరించి భద్రగజములపై నధిరోహింపఁజేసి మంగళవాద్య ఘోషంబులు మిన్నుముట్ట వందిమాగధస్తుతులు సెలంగ వారకాంతా నృత్యగీత వినోదంబులు డంబుమీఱ నందఱం బురవీధిం బ్రవేశింపఁజేసి సంబరంబున వచ్చుచున్నంత. ౩౧౨
క॥ పురకాంతలు సంభ్రమమున, వరులగు రామాదులపుడు - వచ్చుట చూడన్
బిరబిర బిడ్డలఁగొని గో, పురములపై కెక్కి రిండ్లఁ - బోవిడి పనులన్. ౩౧౩

క॥ ఆ నారీమణు లెల్లరు, సూనాస్త్రునిఁ బోని రాజ - సుతుల నలుగురన్
సానందముగాఁ బొడగని, సూనంబులు చల్లి రంతఁ - జోద్య మెలర్పన్. ౩౧౮
క॥ పిమ్మటఁ బంక్తిరథాదుల, రమ్మని జనకుండు ప్రీతి - రమ్య ప్రాసా
దమ్ముల విడియఁగఁ జేసె శు, భమ్ముగ సర్వానుకూల - వసతి యొసఁగఁగన్.
క॥ మంత్రులు భూరమణునితో, మంత్రంబు నొనర్చి జరగు - మహామునకగు నా
తంత్రము నెఱిఁగి కడంగి స్వ, తంత్రముగాఁ బనులు జరపఁ-దత్సమయమునన్.
తే॥ జనకుఁడు పురోహితులఁ బిల్చి - సన్ముహూర్త
నిర్ణయంబును బొనరించి - నిఖిల విధులు
సరిగ నెఱవేఱుచుండంగ - స్వాంత మందుఁ
బొంగి తల్లగ్న సమయంబుఁ - బొరయు చుండె. ౩౧౯
వ॥ మఱియు జనక సుతావివాహార్థంబు సచివు లలంకరింపఁ జేసిన యా పట్టణరాజంబు.
సీ॥ జాత రూపపరిచ్ఛ - దాతి వేలోత్తాల, కూబర శ్రీమంత - గోపురంబు
భర్మరత్నాకీర్ణ - భాసుర ద్వారకు, డ్యస్ఫుటాభ్రంకషా - ట్టాలకంబు
కమనీయ మండపా - గార తోరణ సత్ప, తాకా సమూహా వే - ద్యధ్వజంబు
పరిమళాంభస్సిక్త - పరిణాహ వివిధ సూ, న ప్రచయాత్త ఘం - టా పథంబు
తే॥ స్వచ్ఛమౌక్తిక మణిగణ - శ్లాఘ్యమాన, రంగవల్లీ విరాజిత - ప్రాంగణంబు
సతత సర్వతోలంకార - సంయుతంబు, లలిత భరితంబు శ్రీమిథి - లా పురంబు.

—♦ శ్రీ సీతారామాదుల వివాహమహోత్సవాభి వర్ణనము ♦—

ఉ॥ అంతట నా ముహూర్త సమ - యంబును వచ్చిన రాత్రిలో విధుం
డొంతయు మున్గినట్టి యెడ - నింతులు కోసల పుత్రి మున్నుగా
సంతస మొప్ప రామునిని - సానుజుగా శుభపీఠి నిల్పియున్
బంతుగ హారతిం జలిపి - పాడిరి సంపఁగి నూనె యంటుచున్. ౩౨౦
క॥ శుభ వాద్యంబులు మ్రోయఁగ, నిభయానలు నాల్గు దెసలు - నిడి దీపికలన్
రభసముగా జల కుంభము, లభిగమములు సేసి జలక - మార్చిరి వారిన్. ౩౨౧
క॥ కొడుకులకున్ దడి తుడిచియు, వడిగా మేల్వలువ లొసఁగి - వలఁతులు నిగులం
దొడవుల నిడి మఱి పంక్తిర, థుఁడు మొదలుగ జలకమాడి - తోరపుఁ బ్రీతిన్.
తే॥ కనకచేలంబులను గట్టి - కనకనమను, భూషణంబులు ధరియించి - పుత్త్రవరులుది
గురువరుండు వసిష్ఠుండుఁ-గూడిరాఁగ, వాద్యములు మ్రోయ శుభవస్తు-పాళినొం.
తే॥ మౌక్తిక వినిర్మితంబైన - మండపమును, జేరఁగా నవ్వసిష్ఠుండు - ధారుణీపతి
వామపార్శ్వాన సతులను-వారి ముందు, సుతులఁ బీఠస్థులను జేసి-కుతుక మలర
క॥ గణపతి పూజను బ్రాహ్మణా, గణయుక్తముగా నొనర్చి - కడు వడిగా నై
పుణముగఁ బుణ్యాహత్రియ, మణిమముగాఁ జల్పి దేవ - తాభ్యర్చితుఁడై. ౩౨౫

తే॥ గ్రామ కుల వృద్ధ దేశ వి - ఖ్యాత మాన్య, నీ సదాచారముల రీతి - నిఖిల దేవ
పూజనము మండపము పూజ - పూర్ణకలశ, పూజమున్నుగ జరిగించె - రాజుచేత.

క॥ (శ్రీ) కౌసల్యాది హరి, ద్రా కుంకుమ శోభితలు య - థావిధి నుండన్
జోకన్ జనకుం డచటికి, సాకల్యంబైన విభవ - సంగతి వచ్చెన్. ౩౨౮

వ॥ అట్లులరుదెంచిన జనక ధరణీరమణుండు రామలక్ష్మణ భరతశత్రుఘ్నులను గనకాంబర దివ్య భూషణములచే నలంకరించి కౌసల్యాది సతీజన సహితంబుగా దశరథుని రామాది కుమారులను గజారూఢులం జేసి వారలకుఁ జామరాద్యుపచారములు సలుపఁ గొందఱ నియమించి మంగళవాద్యనినాదంబులు సెలంగ మిటారులగు నటీమణులు ముందట నటింప నానావిధ సూన లతావృక్షతతుల నతులితంబుగా శ్రేష్ఠంబులగు పాత్రముల నిడికొని కొందఱు భటులా తౌర్య త్రికంబుల వెంబడి నడువఁ జిత్ర విచిత్రంబులగు కృత్రిమ వృక్షధ్వజ పతాకాంకులు శోభిల్ల నోషధీ విశేష ప్రశస్తవస్తులోహ వినిర్మిత వినోద సాధనము లగ్నిసంబంధముచేఁ దటిల్లతాప్రసవవల్లీ ఫలవృక్ష దీపికాజాల జైవాతృక జ్యోత్స్నా పుండరీక కోకనద మాంజిష్ఠ కంజాత వివిధ కృత్రిమ శకుంతసంతాన మృగకుల రథ రథాంగోపమంబుగా వెలుంగుచుండ నిజమందిరమునకుం బిలిచికొని వచ్చినప్పుడు వియచ్చరులచ్చెరువంది హెచ్చిన మచ్చిక నుత్సవంబునకు మెచ్చుచు నెచ్చటి విమానముల నచ్చట నిలిపికొని కనుగొనుచుండిరి. కౌసల్యాదిసతులు సమ్మదితాంత రంగలై సుతులమీఁద ముక్తావిరాజమాన లాజాక్షతలఁ జల్లుచు దీవించిరి. శ్రీరామలక్ష్మణ భరతశత్రుఘ్నులును దశరథాది భూపతులును వసిష్ఠాది మునినాథులును నమందానందమును బొందిరి. తదనంతరంబ గజావరోహులయిన రాకొమరులు మొదలుగాఁగల యెల్ల వారలను జనక మహీశుండు వివాహమండపమునఁ బ్రవేశపెట్టి వేదికాంతరములయందుఁ గ్రమంబుగా రామాదివరులను సముచిత పీఠంబుల నధిష్ఠింపించి వసిష్ఠశతానందుల యనుమతినిబొంది వారలకు మధుపర్కంబులిచ్చి సుమేధాది సువాసినీయుతంబుగా సర్వాలంకార భూషితలగు జానకిని నూర్మిళా మాండవీ శ్రుతకీర్తులను శుభవాద్యధ్వనులు దనర వరుల కభిముఖముగా నిల్పిన

తే॥ (శ్రీ) వసిష్ఠ శతానంద-ఋషులు కరము, భక్తి వాల్మీకి ముఖమౌని-వర్యసూక్తి
గాధిజుఁడు తోడుగా వేది-కలను నిల్చి, సరవి వైవాహికములను-జరపఁ బూని.

తే॥ ఆ వధూవరులకు మధ్య-మందు దివ్య, మగు తిరస్కరిణిని బట్టి-యారజముగ
మంగళశ్లోక సంకల్ప-మంత్రలగ్న, పద్ధతులు సల్పి యంతర-పటముఁ దీసి. ౩౩౦

వ॥ కన్యాదానముల నొనరింప జనక కుశధ్వజులకుఁ దెల్పిన. ౩౩౧

తే॥ జాయలనుగూడి జనకకు-శధ్వజాఖ్యు, లలరి రామాదులకుఁ బుత్రి-కలను దాము
ధారవోసిరి కన్యా ప్ర-దాన విధిగఁ, జెలఁగి గురువులు మంత్రముల్-చెప్పుచుండ.

కం॥ కంకణ మాంగల్యంబులు, పొంకంబుగఁ దాల్చిరపుడు - ముదమున వధువుల్
పంకేజాక్షులు వరులును, బ్రాంకితముగ మనులు మునులు - పఠియింపంగన్.
ఆ॥ ఆణి ముత్తియములు - నక్షతలును బూని, యావధూవరులు ప్రి - హర్ష మెసఁగ
నపుడు సల్పిరంత - నక్షతారోపంబు, శాస్త్రవిధిని గురుల - సమ్మతిగని. ౩౩౪
కం॥ పాణిగ్రహణ విధానము, శోణిమిగాఁ జలుపఁ జేసి - ముని పుంగవులున్
రాణను హోమాదికము న, రీణ ముదంబొనర జరపి - కృతకృత్యులు గాన్.
కం॥ మొరసెన్ ఘన వాద్యంబులు, కురిసెన్ మేల్విరుల వాన - కుతుకము మనలన్
నెరసెన్ జనులకు నుతులును, బెరసెన్ వెలయాండ్రి యాట-ప్రియముగ వెలసెన్.
కం॥ సూనుల స్నుషలం గనుఁగొని, మానుగ దశరథుఁడు జనక - మహిపతి తోడం
బూనిక దానంబులను న, నూనంబుగ నిచ్చె బ్రాహ్మ - ణులకుం జాలన్. ౩౩౭
చం॥ దశరథ పుత్త్రులప్డు తలి - దండ్రులకున్ ముని కోటికిన్ లస
ద్యశులగు గొప్పవారలకు - నత్తల మామలకున్ సభక్తిగా
శశిముఖులైన పత్నులును - సన్నిధిరాఁ జని మ్రొక్కి దీవనల్
భృశముగ నొంది సంతసము - నెంతయుఁ గాంచిరి ప్రేమ మించఁగాన్. ౩౩౮
కం॥ నలువురు వరులును బిమ్మట, నలువుగ భార్యలను గటుల - నందితు లౌచున్
నిలుపుకొని గృహములోనికి, వెలలిరి నృపవరులు మునులు - వెలఁగులు రాఁగన్.
కం॥ పౌరులు జానపదులు ధర, ణీ రమణులు మునులు మాని - నీమణులు గుణో
దారులు పరివార జనుల్, సారాన్నాదుల భుజించి - జా నొంది రటన్. ౩౪౦
శా॥ శ్రీరాముండు కృపా కటాక్ష విలస - ద్దృగ్భాసి సర్వాత్మకుం
డారాధ్యుండు త్రిలోక వాసులకు ది - వ్యాకారుఁ డాబద్ధశం
పారమ్యాభ శుభాంబరుండు తరళ - ప్రాలంబ కంఠుండు సీ
తా రామన్ జగదాది దేవతను నొం - దన్ మిక్కిలిన్ శోభిలెన్. ౩౪౧
ఉ॥ లక్ష మదేభముల్ మఱియు - లక్ష రథంబులు లక్ష పల్లకీ
ల్లక్ష తవాజు లొక్క పది - లక్షలు గోపరిచార కాళులున్
లక్షణమైన వస్త్రతతి - లక్ష్మములౌ బహు భూషణంబు లా
దక్షుఁడు మైథిలుం డొసఁగె - దాశరథుల్ గొన సత్క్రియార్థమై. ౩౪౨
వ॥ ఆవల నావిదేహమహీపతి సుతావివాహ సమాలోకన కుతూహలులై వచ్చియుండిన
వారల కెల్ల రకుఁ దగిన సత్కారములొనర్ప వారును వారివారి నెలవులం జేరిరి.
దశరథుఁడు మాత్రము జనకుని ప్రార్థనావశంబునఁ గుటుంబ సమేతుండై నెలదినం
బు లామిథిలయందయుండి యొక్క శుభదినంబున సపరివారంబుగా నయోధ్యకుం
బోవఁ బయనంబై నంత. ౩౪౩

● జనకుఁడు సీతను నూర్మిళా మాండవీ శ్రుతకీర్తులను నత్తగారింటికిఁ బంపుట ●

చ॥ కనుఁగొనలందు బాష్పములు - గ్రమ్మఁగ సీతయు నూర్మిళాహ్వయున్
జనవున మాండవీసతియు - సచ్ఛ్రిత కీర్తియుఁ దల్లిదండ్రులం
గనుచును వారి కౌఁగిళుల - గారవ మొప్పఁగ నిల్చి వ్రీడయున్
మునుకొన ముద్దరాండ్రగుచు - మ్రోముల మోములు సేర్చి డీల్పడన్. ౩౮౪

ఉ॥ వారును వారి నూఱడిలు - వాక్కుల నాడుచు నాదరంబు చె
న్నారఁగ నొదలల్ నిమురు - చల్లన నా చిబుకంబు లంటుచున్
గూరిమి బిడ్డలార! మముఁ - గూడి సుఖంపను రీతి భర్తలన్
జేరి సుఖాన మీ శ్వశుర - సేవలొనర్పుఁ డటంచు దీనతన్. ౩౮౫

క॥ దశరథరాజును గని మా, వశగతలగు సుతల నిదె భ - వత్సుతులకు మేల్
వశలగ నిడి నారము నీ, వశమికఁ గృపఁ గనుట యనుచుఁ - బ్రార్థించి తగన్.

క॥ మర్యాద పురస్కారముగ, నార్యుండగు నతని వెంట - నాహూతుఁడై
ధైర్యము దెల్పుచుఁ బంపిరి, తౌర్య త్రికమలరఁ గొంత - దవ్వు వెనుకొనుచున్.

క॥ జనకునిచే నామంత్రణ, మును బడసిన దశరథుండు - మూఁడామడ త్రో
వను గడచె వసిష్ఠుండును, వనితలుఁ బరిజనులు సుతులు - వలగొని రాఁగన్.

తే॥ నిర్నిమిత్తముగాఁ గొన్ని - దుర్నిమిత్త
ములు కనంబడ నప్పుడు - భూమిధవుఁడు
గురునిఁ గని మ్రొక్కి యిదియేమి - ఘోరమనిన
నతఁడు భయపడవలదని - యనియె నిట్లు. ౩౮౯

క॥ జగతీ రమణా! కనుమిదె, మృగములు శుభసూచకముగ - మేకొని మనలన్
దగుగతిఁ బ్రదక్షిణించెను, మిగులన్ లగ్గౌను జమ్ము - మిడుకఁగ నేలా?. ౩౯౦

వ॥ అను నా సమయంబున. ౩౯౧

క॥ తటుకున విటపుల తుటుములు, పెటపెట మనఁ బ్రాణికోటి-విటతటము పడన్
బుటపుటనై చటుల రజః, పటలము వర్షింప గాలి-భస్సని వీచెన్. ౩౯౨

● పరశురాముఁడు శ్రీరాము నెదుర్కొన వచ్చుట ●

ఉ॥ అంతటఁ గార్తవీర్య మహీ - పాంతకుఁ డద్భుతకాంతిశాలి కా
లాంతకమూర్తి సంయుగహ - తాఖిల రాజచమూసమూహుఁ డ
త్యంత జటాభిమండితుఁడు - సారుణనేత్ర ముఖుండు ధన్వి దు
ర్దాంత పరశ్వధుండు భృగు - రాముఁడు వచ్చె భయంకరంబుగాన్. ౩౯౩

ఉ॥ ఆతనిఁ గాంచి పంక్తిరథుఁ - డర్ఘ్యము పాద్యము నిచ్చుటేనియున్
జేతము విస్మరింపఁగ వి - శేష భయంబునఁ గంపమంది వి

ఖ్యాత చరిత్రి! మమ్ములను - గావుము కావుము పుత్త్రజీవ దా
నాతి పథంబునన్ గనుమ - టంచుఁ బదద్వయి వ్రాలె మ్రొక్కినన్. ౩౫౪
తే॥ పరశురాముఁడు దశరథు - పల్కులెల్లఁ
బెడచెవినిఁ బెట్టి యాతనిఁ - గడకుఁ ద్రోచి
రామచంద్రుని నెదిరించి - ప్రచలితోద్రి
యుండగుచు నుగ్రుఁడయి నిష్ఠు - రోక్తిఁ బలికె. ౩౫౫
తే॥ క్షత్త్రియాధమ! మదభిఖ్య - గని చరింతె?
ప్రాఁతవింటిని విఱచుట - బంటుతనమె?
కనుము మామక వైష్ణవ - ధనువు దీని
గుణ మొనర్పుము నే నాల - రణ మొనర్తు. ౩౫౬
క॥ లేదా? క్షత్త్రియకుల నగ, భేదామరధవుఁడ నేను - భీమ బలమునన్
నీను సమూహము నంతము, నాదండధరాంతికమున - కనిపెదఁ ద్వరతోన్.
మ॥ అనినన్ శ్రీరఘురామచంద్రుఁడు స్మితా - స్యం బెంతయున్ రంజిలన్
మునినాథున్ భృగురాముఁ బల్కె ద్విజుఁడా! - మో పెట్టఁగా నౌనె? మీ
ధనువున్, మీరు గుణాధికుల్ గుణముఁ ద - త్సంధాన మొక్కండె మా
కనువౌ గో సుర విప్ర భామినులపై - నస్త్రచ్యుతుల్ రాఘవుల్. ౩౫౮
క॥ వలసిన మాయసువుల నీ, బలములరఁగఁ గొనుము విప్ర - వర్యుల తోడం
జలమున నేఁ బోరాడను, పలుకులు వేయేల? కృపను - బాటింపు మిఁకన్. ౩౫౯
ఉ॥ నావుడుఁ గ్రోధఘూర్ణిత మ - నంబున భార్గవ రాముఁడు ద్ధృతుం
డై వడిఁగొన్నఁ జీఁకటులు - నంబరమెల్లను గప్పె వారిధుల్
భూవలయంబు దిక్కులు న - భూత విధానముతోఁ గలంగె నా
భావిత దుర్దశం దలఁచి - భావమునన్ రుషపూని రాముఁడున్. ౩౬౦

—♦ శ్రీరాముఁడు పరశురాముని జయించుట ♦—

క॥ భార్గవు శార్ఙ్గముఁ దిగిచి య, నర్గళముగ నెక్కువెట్టి - నారియు మ్రోయన్
భార్గవ రామునిఁ గనుఁగొని, దుర్గర్వము నణఁప వింటఁ - దొడిగి శరంబున్.
క॥ ఇది రామాస్త్రము వదలను, నదముల మఁగ్గినను వనుల - నగముల మనినన్
త్రిదివము సేరిన భార్గవ!, యెది దీనికి నెరయొనర్తొ? - యెఱుఁగు మటన్నన్.
వ॥ పరశురాముఁడును. ౩౬౩
క॥ గడగడ వడఁకుచు రామా!, విడువకు నాపైని శరము - వికృతిం గనితిన్
వడి మత్పుణ్యంబులపై, విడువుము త్వద్బాణ మనుచు - విజ్ఞత మెఱయన్.
క॥ పూర్వస్మృతిగని వృత్తము, సర్వంబును నెఱిఁగి రామ - సాన్నిధ్యంబున్
సర్వోత్తమముగఁ దలఁచుచు, నిర్వక్రంబైన భక్తి - నింగర పుటుఁడై. ౩౬౫

సీ॥ శ్రీరామ! రఘురామ! సీతా హృదభిరామ!, కరుణాలలామ! సం-గ్రామ భీమ!
సర్వాంతర చరిష్ణు!-సద్యశోరోచిష్ణు!, విష్ణు! దివ్యాలంక-రిష్ణు! జిష్ణు!
అభయ ప్రదాన! సృ-ష్ట్యాదికార్య నిదాన!, ధర్మనిధాన! త-త్త్వ ప్రధాన!
మౌని మానసవాస!-మంజులోక్తి విలాస!, సంతత సోల్లాస!-సత్యభాస!
తే। భూభరాహరణార్థమై-భూరికరుణఁ, జేసి భవదంశ మొసఁగి నా-చేత నవని
గర్వితక్షత్త్రకులమును-గార్త వీర్యుఁ, జంపఁగాఁ జేసి నేఁడు ద-ర్శనము నిడితె?
క। మాన్యచరిత్రా! మన్మద, శూన్యంబుగ నంశమదియు - జొచ్చెలె నీలోన్
ధన్యోస్మి యనుచు మ్రొక్కన, నన్యంబగు రీతి దశర - థాగ్రసుతుండున్.
క॥ ఉత్కటమగు తత్పుణ్యా స, ముత్కరమును శరము విడిచి - బూది యొనర్చెన్
సత్కృతుఁడై భార్గవుఁడును, ముత్కర సుమహేంద్ర భూధ్ర-మును జేరఁజనెన్.
క॥ తొలఁగెం దమమును నిర్జర, కులముం గనె ముదము జనము-కుతుకమున మనెన్
దలిదండ్రులు గురుఁడును భ్రా, తలు రాముని బొగడి రవని-తలము సుఖించెన్.
చ॥ సురలనుగెల్చి దర్పపరి - శోభితుఁడౌ దశకంఠు వేయిమా
కరములఁ గార్తవీర్యుఁ డతి - గాఢముగా బిగియించె నట్టి యు
ద్ధురబలుఁ జంపె భార్గవుఁడు - దూపిల నాతని నిట్లు కొంతలో
గరువముడించి గెల్చె మొర - గాఁడు కదా? రఘురాముఁ డెంతయున్. ౩౨౦
వ॥ అట్టి శ్రీరామచంద్రమూర్తిని దశరథుండు కౌఁగిటం బొదివి శిరము మూర్కొని సంతోషభరితాంతఃకరణుండై యెల్లరతోఁగూడి పయనించి యయోధ్యం దరిసిన

—♦ శ్రీరాముడు అయోధ్యకు వచ్చుట ♦—

క॥ దశరథ దాశరథులు నిజ, వశలను గురువరుని గూడి-పరితతితోఁ దా
దృశముగ వచ్చుట విని యస, దృశమగు విభవముగఁ దత్పు-రీ జనులంతన్.
సీ। సలలితంబులు గాఁగఁ - గలువడంబు లమర్చి, కస్తూరికా గోము-ఖము లొనర్చి
రమ్య ముక్తాజాల - రంగవల్లులు దీర్చి, నవ హరిద్రుచిత్తోర - ణములుగూర్చి
ఘంటాపథంబులఁ - గమ్రవారి విచిర్చి, ప్రసవసమూహ మా - పైఁదనర్చి
వివిధ వాద్యంబులు - వేవేగ నొనగూర్చి, వారణ రాజముల్ - వరుసఁ జేర్చి
తే॥ యయ్యమాత్య పురస్సరు-లగుచువచ్చి, తోరపుం బ్రీతి వారినె-దుర్కొనంగ
మంగళాచారములు మీఱ-మహీధవుండు, సుతల స్నుషలఁగరంద్రి సం-స్థితులఁజేసి
తే। వందిమాగధ సంస్తుతుల్ - వఱలుచుండ
సరవి వేశ్యలు నృత్యముల్ - సలుపుచుండ
మొనసి మంగళవాద్యముల్ - మ్రోయుచుండ
వెడలి నిజసౌధమును జేరెఁ - బ్రియులఁగూడి. ౩౨౪

క॥ అహమహమికగా జనములు, మహమును గని యుప్పొంగుచు-మహీపతిసుతులున్
గృహమున లక్ష్మిని మోదా, వహముగఁ బూజించి రపుడు-భార్యలతోడన్. ౩౨౫
క॥ పిమ్మట శ్రీరామాదులు, సమ్మోదమున జనకునకును-జననులకున్ న
మ్రమ్ముగ నతులనొనర్చి శు, భమ్ముగ నాశీస్సులొంది-వఱలిరి సుఖులై. ౩౨౬
క॥ హితభూపతులు సదంబర, తతులున్ భూషలును దెచ్చి-దాశరథులకున్
నుతియుతముగ నిడిన యుధా, జితుఁ జెంతనె నిల్పికొనియె-శ్రీదశరథుఁడున్. ౩౨౭

—♦ శ్రీరామావతార శ్రేష్ఠత్వము ♦—

శా॥ దారాసంయుతులౌచు దాశరథులున్ - దత్తద్గృహాళిన్ సుఖ
శ్రీ రంజిల్లి ప్రహర్ష మొందిరి మదిం - జింతింప రామావతా
రారూఢత్వము విష్ణుదేవు నవతా - రాలందు నెద్దానికే
నీ రేడైన జగంబులం గలుగునే? - కృష్ణుండు తత్తుల్యుఁడౌ. ౩౨౮
క॥ సాకేతస్థితుఁడై సీ, తాకాంతను గూడి సంప-దలు చెన్నారన్
నైకంబులు భోగంబులు, జోకన్ శ్రీరాముఁడొందె - క్షోణిపుఁ గొలిచెన్. ౩౨౯
తరలము॥ తరళమౌ శశిదాగమంబది - తారొకానెన్ దివి నర్కుఁడున్
దరలనావల నబ్జజాండము - దండియౌ కలశంబుగాన్
సురుచిరంబగు వెన్నెలల్ కడు - సొంపునింపఁ బయస్థితిన్
వర సుధాకిరణుండు భాసిలెఁ - బైనిమిరఁగడ చందమై. ౩౩౦

—♦ జనకుఁడు దీపావళ్యుత్సవమునకు రామాదులను బిలువ మంత్రులను బనుచుట ♦—

క॥ అత్తఱి నాశ్వయుజంబునఁ, జిత్తంబునఁ గోర్కులంతఁ - జిగురెత్తఁగ భూ
భృత్తుం దశరథుఁ జేర న్నృ, పోత్తముఁ డాజనకుఁ డంపె -నొనర సచివులన్.
క॥ వారలఁ గని దశరథుఁడును, గారవమొసరించి మించి కారణ మడుగన్
వారా భూరమణునితో, సారాముల మృదుల వాక్య - సంగతి వెలయన్. ౩౩౧
క॥ దీపావళ్యుత్సవమున, కై పంపెను మిమ్ముఁ బిల్వఁ - గా జనక వర
క్ష్మాపాలుఁడు మముఁ గావున, నోపిక నెల్లరును మిథిల - కొగి రావలయున్.
క॥ మీరు కుటుంబ యుతంబుగఁ, బౌరుల స్నేహితుల జాన - పదుల సచివులన్
వారక తోకొనిరావలెఁ, గోరిక దయివాఱ రాజ - కౌతుకము దీరన్. ౩౩౪

వ॥ అని విన్నవించిన నతండును సమ్మతించి యొక్క సుముహూర్తమున దివ్యాంబరాభరణ భూషితులై కౌసల్యాది సతులును రామాదికుమారులును సీతాదిస్నుషలును దానును గజారూఢులై చతురంగ బలంబుతో మహావైభవంబున మంత్రి పౌరజానపదాదులును దాసదాసీ జనంబులును బరివేష్టింప బయలుదేరి మిథిలకు నరిగిన జనకుండును వారిని సగౌరవంబుగా విభవోపేతంబుగా నెదుర్కొని తన నగరు

నకుం బిలిచికొని వెడలి వారలంగూడి యమందానందంబునంది సుఖించుచుండనంత
దీపావళ్యుత్సవదినంబు వచ్చిన. ౩౮౫

—◆ దీపావళీ మహోత్సవాభి వర్ణనము ◆—

సీ॥ వేగువేగు నటంచు - వేగ నిద్దుర లేచి, యాబాల గోపాల - మవనిపులును
గమగమ లాడెడి - సుమతైలము లలంది, యభ్యంజన స్నాన - మాచరించి
కమనీయ చేలముల్ - కడుభూషలును దాల్చి, కలపముల్ పూసి వి - కాసమంది
చిత్ర విచిత్రమై - చెల్వొందు దీపికా, జాల నీరాజన - లీల నలరి
తే॥ పగటి పూటను దేవతా - బలు లొనర్చి, సత్పదార్థాప్తి మృష్టాన్న - సంగతముగ
నిష్టులగు వారితో భుజి-యించి మించి, నృత్యసంగీతవాద్య సం-ప్రీతి మనిరి. ౩౮౬
క॥ జనకుండుఁ గూతుల నల్లుం, డ్రను నుత్సవమొప్ప నుత్క-టంబగు లిప్సన్
గనకపుఁజేలల భూషల, ఘనమణి రత్నముల నొసఁగి - గరుసెనఁగంగన్. ౩౮౭
క॥ రథగజ తురగ భటాదులఁ, బృథువుగనిడి సత్కరించి - హిత బంధులనున్
బ్రిథగల వారలనున్ దశ, రథ ముఖ్యుల గౌరవించెఁ - బ్రస్తుతి ఫణితిన్. ౩౮౮
క॥ తదనంతరమున దశరథుఁ, డుదియన్ స్వజనంబుతో న - యోధ్యకుఁ బోవన్
ముదముగఁ బయనంబయ్యె సు, హృదమాత్యభటాదులెల్లఁ - గ్రోవలఁ దనరన్.

—◆ అయోధ్యకుఁబోవు దశరథాదులను భార్గవు లెదిరించుట ◆—

చ॥ అటు పయనించి వారు చన - నా పథమధ్యమునందు రాజులు
త్కటమగు వైరబుద్ధిగని - తజ్జన కాత్మజకై పరిభవం
బటమును దాము పొందుట ర - యంబున నేఁపఁగ గుంపుగూడి యు
ద్భట రథ వాజి వారణ యు - తంబుగ నడ్డమువచ్చి తాఁకినన్. ౩౯౦
వ॥ దశరథ మహీపాలుండును, ౩౯౧
క॥ చింతామగ్నుండై మతి, మంతుల మంత్రులను బిల్చి - మంత్ర మొనర్పన్
జింతిల్లెడు తండ్రిని గని, గ్రంతున రాముఁడు సుమిత్ర - గాదిలి సుతుఁడున్. ౩౯౨
తే॥ దశరథునిఁ జేరి మ్రొక్కుచుఁ - దండ్రి! మాకు
నాజ్ఞ యొసఁగుము సమర వి - హార పటిమ
విమత నాశన మొనరించి - వేగవత్తు
మనుచుఁ బల్కిన నతఁడు నె - మ్మనము తోడ. ౩౯౩
మ॥ సుతులం గౌఁగిటఁజేర్చి రాముఁగని చుం-చున్ దువ్వి శ్రీరామ! నీ
చతముల్ రాజులు నీవుబాలుకుఁడ వీ - సౌమిత్రితో సంగర
క్షితి వర్తింతే? పదాఱు వత్సరములన్ - జెల్వొంద మీరేమి? సం
భృతశస్త్రాస్త్రఘనుప్క రాగ్రులయి నె - మ్మింబోరుటేమి? యనన్. ౩౯౪

ఉ॥ రాముఁడు సద్గుణాంచదభి - రాముఁడు తండ్రినిఁగాంచి నాయనా!
ప్రేముడి మీరు పల్కితిరి - భీతి యొకింతయు లేదు మేమె సం
గ్రామ మొనర్తు మంతకును - గానియెడం దమరున్ సహాయులై
భూమిధవాధమాళి మద - మున్ డిగఁ జెండఁగ వచ్చుఁ గావునన్. ౩౯౮
క॥ సమరము తుదదాఁకను గుశ, లముగా మనవారినెల్ల - రక్షింపుఁ డటం
చమరఁగ మ్రొక్కిన భరతుఁడు, నమరిక శత్రుఘ్నుఁడును ర-యంబగు గతితోన్.
తే॥ రామలక్ష్మణులను జేర-రామచంద్రుఁ, డాదిగా నల్వురును ఘన-స్యందనముల
నప్పు డధిరోహణముసేసి-జ్యానినాద, ముల నొనర్చిరి సేనలు-ముందు నడువ.

—♦ శ్రీరాముఁడు రాజులతో యుద్ధ మొనర్చుట ♦—

వ॥ ఆ సమయంబునఁ బార్థివులు శ్రీరామచంద్రునిం గని తమలోఁ దామిట్లని వితర్కించిరి.
ఉ॥ వచ్చెడి వాఁడు రాముఁడదె - పంక్తిరథాఢ్య రథస్థుఁడై ధృతిన్
హెచ్చెడి శ్రీమహాగవిధి - యేపగు టెక్కెము కోవిదారమా
మ్రచ్చగు తండ్రిమాట శర - ముల్ రథమందున నిండియుండఁగా
నుచ్చయమొప్ప మున్నోనియె - నూఁకునఁ బైకొన నేమిసేయునో?. ౩౯౯
మ॥ అని వారా రఘురామ సైన్యమును ధై - ర్యస్ఫూర్తితోఁ దాకిఁ వెం
టనె శస్త్రాస్త్రములున్ శతఘ్నులును ఖ - డ్గాల్ భిందిపాలాదులుం
గొని వే సూతులు రథ్యముల్ నడపఁగా - గ్రోధోన్మదో ద్రేకులై
ధనువుల్ టంకృతి సేయుచున్ శరములం - తన్ సేనపై వేయఁగన్. ౪౦౦
ఉ॥ రాముని సైనికుల్ గడు ప - రామరికన్ దగు నాయుధంబులన్
దాము ధరించి శత్రుల య - థాయథలానటు గొట్టుచుండ నా
భూమిపులుం గడంగి రఘు - పుంగవు సేనను బాణకోటిచే
నామికచాఁగఱుం గనెడు - నట్లొనరించియు నార్చి పేర్చినన్. ౪౦౧
మ॥ త్వరగా లక్ష్మణుఁ డేపునన్ భరత శ - త్రుఘ్నుల్ సహాయుల్గ ను
ద్ధురుఁడై తీక్ష్ణశరంబులం గురిసి శ - త్రుల్ డీల్పడం గొట్టి భీ
కరుఁడై తోఁచినఁ గైకయాత్మజులపై - క్ష్మానాథు లొక్కుమ్మడిన్
ఖరనారాచము లేయఁగా భరతుఁ డ - న్నా! యంచు మూర్ఛిల్లినన్. ౪౦౨
ఉ॥ శోకము రోషమున్ మనముఁ - జొప్పడు వెట్టఁగ లక్ష్మణుండు నా
కాకసులెల్ల మెచ్చునటు - లాక్షణమంద యనేక బాణముల్
గైకొని వైచి రాజులను - గంపిలఁ జేసిన వార లాతనిం
బైకొని రొక్కపెట్ట యది - వారక వీక్షయొనర్చి రాముఁడున్. ౪౦౩

ఉ॥ వీకున శస్త్రవర్షమును - వే కురియించుచు రాజతండమున్
దాఁకి మదాంధులార! గగ - నంబున నెండిన యాకులట్టులన్
మూఁకగ గిర్రిరం దిరిగి - మూల్గుచుఁ గ్రిందికిఁ గూలుఁ డింక నం
చూఁకున మారుతాస్త్రము మ - హోగ్రత నేసె నజాండ మల్కఁగన్. ౪౦౪

క॥ వారా వాయవ్యాస్త్రము, పారముగా నెత్తికొట్టఁ - బై కెగిరి యసూ
పారతటంబునఁ గూలిరి, శ్రీరాముఁడు మిగిలియున్న - సేనం గనుచున్. ౪౦౫

తే॥ మోహనాస్త్రంబు నరివోసి - సాహసంబు
మెఱయ సేనకు గుఱివెట్టి - మిడుమిడు కన
వడిగ విడిచిన నద్దాన - బహుల సైన్య
రథగజాశ్వము లవనిపై - వ్రాలి పడియె. ౪౦౬

—• శ్రీరాముఁడు మూర్ఛనందిన భరతుని సంజీవనిచే బ్రతికించుట •—

క॥ ఈవిధి శ్రీరాముఁడు దు, ర్భావుల నిర్జించి మించి - రథముపయిం దాఁ
జేవఱి యొఱఁగిన భరతుని, నావేగముతోడఁ జేరి - యకటా! యనుచున్.

తే॥ కైక మొదలగువారు దుః - ఖమును జెంద
వలదు వలదని యూఱడఁ - బలికి వేగ
లక్ష్మణుని వీక్షణము సేసి - లక్ష్మణా! స
మీపమున ముద్గలాశ్రమ - మేపు మీఱు.

తే॥ ముని మహత్త్వముచేత న - ష్పాడమి యందు
నలరు సంజీవనీలతా - దులు కరంబు
వాని జవమునఁ గొని తెమ్ము - భరతునకుఁ ద
లంప భయమేమియును లేదు - లగ్గు కల్గు. ౪౦౯

మ॥ అన సౌమిత్రి రథస్థుఁడై త్వరితమా - యానంబునం బోయి య
మ్మునిని దివ్యాశ్రమమందు నున్నవటులన్ - ముమ్మాఱుగా మ్రొక్కి యా
చన సేయంగ సమాధినుండె గురుఁ డెం - చన్ బిమ్మటన్ రండు తీ
వను గోయం జనదంచు వారనినఁ ద - ద్వార్తన్ సమగ్రంబుగాన్. ౪౧౦

తే॥ రామునకుఁ దెల్ప వటుల ని - రాకరించి
యోషధులఁ దెమ్ము మునివరుఁ - డుగ్రుఁడైన
నేను శాంతింపఁ జేసెద - నీవు వెడలు
మనుచు రాముఁడు వచియించె - ననుజునకును. ౪౧౧

ఉ॥ వల్లెయటంచు లక్ష్మణుఁ డ - వారిత రీతిని నాశ్రమంబునన్
వల్లులఁ జేరి యావటుల - పల్కులు లెక్కయొనర్ప కచ్చటన్

బెల్లుగనుండు తీవలను - వేగమ త్రుంచి ముదంబు కొంత సం
ధిల్లఁగఁ దెచ్చియిచ్చె నగ - ధీరున కారఘురామమూర్తికిన్. ౪౧౨
క॥ ఆ మూలికలం గొని శ్రీ, రాముఁడు సారమును దీసి - త్రావించెఁ గడున్
బ్రేమన్ భరతున కప్పుడె, యా మాన్యుఁడు మూర్ఛఁదేఱె - నబ్బుర మొదవన్.
క॥ భరతునిఁ గని యెల్లరు ము, ద్భరితాత్మకులైరి గురుఁడు - తద్దయు నెమ్మిన్
వర రక్షాచారంబులఁ, బరువడి యొనరించె మిగుల - భరతుఁడు నలరెన్. ౪౧౪
క॥ ముద్గల మునివరుఁ డావల, గద్గదులయి వటులు పల్కఁ - గా లక్ష్మణుఁ డీ
యుద్గాఢధార్ష్ట్య మొనరిచె, నుద్గ్రీవుండగుచు నంచు - నొయ్యన విని తాన్.
క॥ చిత్రంబీ వృత్తంబని, ఛాత్రులఁ బంపించె వేగఁ - జని లక్ష్మణుఁడే
క్షత్రియుఁడో? లతలేలొకొ?, యాత్రంబద్దియేమొ? తెలియుఁ-డని యచ్చటికిన్.
తే॥ వార లాబంతి తేరుల-వలఁతిఁ గాంచి, గురుని మాటలు వినుపింపఁ-గువలయపతి
నేను దశరథుఁడను నాదు-సూనుఁడైన, భరతు బ్రదికింప రామాజ్ఞ-వచ్చియిటుల.
తే॥ లక్ష్మణుఁడు తెచ్చె మీ తీవ - లను గడంగి
మమ్ము మన్నింపవలె నని - మాని వర్యుఁ
డైన మీగురునకుఁ దెల్పుఁ - డయ్య! మఱియు
నేను వచ్చెద విజ్ఞప్తి - నిని వచింప. ౪౧౭

—♦ ముద్గలముని రామాదులను గాంచవచ్చుట ♦—

క॥ అనినన్ ముద్గల శిష్యులు, చనుదెంచియు గురునకెల్లఁ - జక్కం దెలుపన్
మునివరుఁడు రామదర్శన, మునకై నిజపత్నిఁ గూడి - మునుకొని వచ్చెన్.
క॥ వచ్చెడి మునిఁగని దశరథుఁ, డచ్చపుమతి స్వాగతంబు - నమరిచి నతుఁడై
హెచ్చుగ వేడఁగ రామా, ద్యచ్చయమును మునికి నెరఁగి యుత్సుక మొందెన్.
చ॥ ఘనుఁడగు ముద్గలుండును వి - కాసముఖుండయి సత్కరించి రా
జును స్వకుటుంబ యుక్తముగ - సూరివరేణ్యు వసిష్ఠు మ్రొక్కినన్
మునిసతియైన శ్రీసుమతి - మోదముతోడుతఁ గోసలాత్మజా
వనితను దొట్టి భామినుల - భవ్య బహూకృతి గారవించెఁ దాన్. ౪౨౧
తే। దశశతాంగుఁడు మరల ము - ద్గలునిఁ గాంచి
దేవ! మీ యాశ్రమమునుండి - తీగములు
తెచ్చి యపకార మొనరించి - తిమి క్షమింప
వలయునని మ్రొక్కఁగా ముని - తిలకుఁ డపుడు. ౪౨౨
తే॥ రాజ! యపకారమద్దియే - యోజలేదు
గొప్ప యుపకారముననె యొడఁ - గూర్చి తీవ

మానుషాకారముల జగ - న్మాయఁ దాల్చి
నట్టి రాముని సీతను - నరయఁ గలిగె. ౪౨౩

క॥ అని దశరథు నెదఁగల కో, ర్కిని దెలిసియు నతనిఁ బిల్చి-క్రేవం దులసీ
వనమున నేకాంతంబుగ, జనపతి! నీకేమి వలయు?-నసిఁ దెలుపుమనన్. ౪౨౪

తే॥ అతఁడు మౌనికిఁ గేల్మోడ్చి - యార్యవర్య!
రాము భావిచరిత్రంబు - ప్రేమతోడ
హితమునహితము సహితము - నేర్పరించి
కాంక్షఁ దీర్పుడటన్న ము - ద్గలుఁడు పలికె. ౪౨౫

—♦ ముద్గలుఁడు దశరథునకు శ్రీరామ వృత్తాంతము సెప్పుట ♦—

చ॥ దశరథ! నీకు పుణ్యము ప - దంపడి తా ఫలియించె నాదిశే
షశయుఁడు శ్రీజనార్దనుఁడు-సర్వ జగత్పరిపూర్ణుఁడిందిరా
వశుఁడు మహానుభావుఁడు కృ - పాపరుఁ డాఢ్యుఁడు విష్ణుఁడే భవ
ద్వశమున రామనామమున - వర్తిలెఁ బుత్త్రకుఁడౌచు నెంచఁగన్. ౪౨౬

తే॥ ధర్మ పరిపాలనమును న - ధర్మ హతియు
దుష్టజన సంఘశిక్షయు - శిష్టరక్ష
సలిపి పదునొక్క వేలేండ్లు - జగతి నేలు
నీవు కడచిన పిమ్మట - నీదు సుతుఁడు. ౪౨౭

శా॥ సప్త ద్వీపసమాధ పత్యమున ని - క్ష్వాకన్వయ శ్రేష్ఠుఁడై
వ్యాప్తింజెందును జక్రవర్తియయి దీ - వ్యత్కీర్తి చెన్నార సం
ప్రాప్తింతురవ్వర పుత్త్రులిర్వురును ద - త్పత్నుల్ స్నుషల్ నల్వురున్
దృప్తిన్ రెండుపదుల్ మఱిన్ నలువుర - ద్ధిన్ బౌత్రులున్ గణ్యులై. ౪౨౮

తే॥ పౌత్రికలును బన్నిద్దఱు - ప్రభవ మౌను
రీకఁ బ్రపౌత్రుల గణియింప - నేరి తరము?
త్వరగ వృందాభి శాపాను - భవము కొఱకు
దండకాటవిఁ జేరు రా - ముండు నిజము. ౪౨౯

వ॥ మఱియు నరణ్యంబునుండి పిడమఱి వచ్చిన యనంతరంబు శ్రీరాముఁడు మహారా
జ్యంబు సేయంగలండనినఁ బంక్తిరథుండు మునివర్యునిం గని. ౪౩౦

ఉ॥ ఎవ్వతె వృంద? యామెపతి - యెవ్వఁడు? విష్ణునకేల శాప మా
జవ్వనియిచ్చె? సర్వముఁ బ్ర - శస్తముగా వినఁజేయుఁడయ్య! యే
దెవ్విధిఁ బూర్ణతం గనునొ? - యేమగునో? యన ముద్గలుండు వా
క్రువ్వఁగసాగెఁ దత్కథ న - కుంఠిత వాక్యవిలాస మేర్పడన్. ౪౩౧

—♦ వృందాశాపముచే శ్రీహరికి రామావతారము కల్గుట ♦—

చ॥ మునుపు జలంధరాహ్వయుఁడు - భూరిబలుం డసురాన్వయుండు భ
ర్గుని నెదిరించి యుద్ధమును - రూఢముగా నొనరించుచుండఁగా
ననుపమ భర్తృసద్వ్రత ని - శాటుని భార్య సుశీల వృందయన్
వనిత పతివ్రతామహిమ - భర్తను జేద్పడకుండఁ బ్రోచినన్. ౪౩౨

క॥ శ్రీమన్నారాయణుఁడున్, హైమవతీ వాక్యసరణి - నా వృందా కాం
తామణి పతివ్రతాత్వము, బూమెను జెఱుపన్ సురారి - పురముం జేరెన్. ౪౩౩

ఉ॥ అప్పుడు వృంద స్వప్నమున - నాయమ భర్త లులాయవాహుఁడై
దెప్పరమంది నగ్నుఁడయి - దీమసమేదగముండుఁడై కనుల్
గప్పఁ దమంబు దక్షిణపు - గాష్ఠకుఁ దైలయుతాంగుఁడై వెసన్
దుప్పలు దూలు చేగినటు - తోఁపఁగ నిద్దుర లేచి దిగ్గునన్. ౪౩౪

మ॥ కలఁ జింతించుచు దివ్య సౌధముల సౌ - ఖ్యాబింతయున్ లేక యు
త్తలపాటొంది సఖీయుతంబుగఁ దను - ద్యానాబులం జేరి యా
దలి మోదంబును వీడి వేఱొక వనిం - దాఁ జేరుచున్ గాంచె దం
ష్ట్రిలు నేత్రంబులు భీషణంబులయి గ - ర్జల్ సేయు రక్షోద్వయిన్. ౪౩౫

క॥ ఆ ధ్వనికిన్ భీషణమున, కధ్వము విడి చెలులు పఱవ - నా వృందయు భీ
తిధ్వస్తయగుచు మఱియొక, యధ్వంబునఁ బర్వువాఱి - యటనొక మౌనిన్.

క॥ కని యా శాంతధనున్ జ, య్యనఁ గంఠముఁ గౌఁగిలించి - యార్తన్ నన్నున్
మునివర! రక్షింపు మటం, చని వేఁడఁగ నతఁడు వృంద - నపుడీక్షించెన్. ౪౩౬

క॥ ఈక్షించి భయము వలదని, యాక్షణమున వృందకొఱకు నటవచ్చెడి యా
రాక్షసులను హుంకృతిచే, విక్షేప మొనర్ప వారు - వెసఁజని రంతన్. ౪౩౭

ఉ॥ వృందయు దండవన్నతి ము - నీంద్రునకుం బొనరించి దేవ! నా
తొందర వాపి ప్రోచితిరి - తోయధిసామ్య దయాస్వరూపు లిం
పొందఁగ నొండు ప్రార్థనము - నొయ్యనఁ దీర్పుఁడు నాదు భర్త పో
ల్పంది జలంధరుండు సమ - రావని రుద్రు నెదిర్చి పోరెడిన్. ౪౩౯

క॥ ఆతఁడు సుఖియే? యుద్ధం, బీతఱి నటు సేయుచుండె - నే? రుద్రునకున్
గాతరపడి చెడఁడు కదా?. నాతండ్రీ! తెలియఁజేసి - ననుఁ దేర్పు మనన్. ౪౪౦

మ॥ ముని దృష్టుల్ గగనంబుపైఁ బఱపుచున్ - భ్రూసంజ్ఞ సేయంగ వెం
టనె కోతుల్ కనిపించి మ్రొక్కి ముని కం - తంబోయి జాలంధరం
బును శీర్షంబును మొండెమున్ గరములున్ - బోలన్ వెసం దెచ్చి చూ
పిన వృందాసతి మూర్ఛనొంది పడియెన్ - బృథ్వీస్థలం బందునన్. ౪౪౧

క॥ మునియును గమండలువుజల, మును బ్రోక్షణమును నొనర్చి - ముదితను దేర్చెన్
వనితామణి పతిదుఃఖం, బున నేడ్చుచు మానికెరఁగి - మునుకుచుఁ బలికెన్. ౭౭౨
శా॥ మౌనీంద్రా! యిఁక నామనాథు బ్రతికిం - పన్ మీరె శక్తుల్ లస
ద్జ్ఞానుల్ ధర్మపరుల్ కృపానిధులు మ - ద్భర్తాసువుల్ గూర్చి వే
వే నాజన్మము సార్థకం బొనరుపుఁ డీ - వేళన్ మహాపుణ్యసం
ధాన్యుల్ మీకిది లెక్కయే తలఁప? నం - తన్ బాపుఁడీ! ప్రోవుఁడీ!. ౭౭3
మ॥ అని వేఁడన్ మునినాథుఁ డోవనిత! సా - ధ్యంబౌనె? భూతేశ్వరుం
డనిలోఁ జంపిన నీపతిన్ మరలఁ బ్రా - ణాప్తిన్ స్థిరుం జేయ నై
నను నీయందలి సత్కృపాగరిమఁ ద్వ - న్నాథుండు జీవించు నం
చని యాతండు నదృశ్యుఁడయ్యె వెస వృం - దాత్మేశుఁ డాసన్నుఁడై. ౭౭౪
శా॥ వృందం గౌఁగిటఁ జేర్చి ముద్దుగొని నా - రీరత్నమా! దైవముం
బొందం జేసెనటన్న వృందయును భ - వ్యోత్సాహయై నాథ! మీ
పొందుం జేరితి నం తెచాలునని యా - పూవిల్తు నుత్ప్రేరణన్
సౌందర్యంబు రహింపఁ గొన్నిదినముల్ - సౌఖ్యంబుగా నచ్చటన్. ౭౭౫
క॥ ఆతనితోఁ గ్రీడించుచుఁ, బ్రీతిగ నొకనాఁటి సురత - వేళన్ మాయా
రీతిని వంచించిన హరి, యాతండని తెలిసి క్రోధ - మేపారంగన్. ౭౭౬
ఉ॥ విష్ణునిఁ గాంచి వృంద యను - వెంగలివిత్తయి నీవె శౌరి! వ
ర్తిష్ణుఁడవై తె? యన్యుని స - తిన్ రతిసౌఖ్యమెసంగఁ బొందఁగా
జిష్ణుఁడనంచు గర్వమును - జెందకు మింక మదీయశాప వా
క్యోష్ణత నందికందుమిదె - యోటమిపాటిలు బూటకంబునన్. ౭౭౭
చ॥ జయవిజయాఖ్యు లెవ్వరు ని - శాచరులై భవదీయమాయ దు
ర్నయమునన్ హరింపఁ గని - నారలొ? వారలె నీకు భార్యనున్
రయమున దొంగిలింతు రి నిఖి - లంబున కీశుఁడవయ్యుఁ గీశులన్
జయమతి దండకాటవిని - సౌహృద మొప్పఁగఁ గోరెదెంతయున్. ౭౭౮
తే॥ పుణ్యశీల సుశీలురు - మునునిచట, నాకసంబునఁ గన్పడి - నట్టికపులు
కనుకఁ గపిసేనఁగూడి నీ - కార్యమెల్లఁ, దీర్చికొననగుఁ బత్నికై - దేవురించి. ౭౭౯
క॥ అనిహరికి శాపమును నిడి, యనలంబునఁ దూఁకె వృంద - యాక్షణమున గె
ల్పునుబొంది శివుఁడు దైత్యుని, ఘనుని జలంధరునిఁ జంపెఁ - గడుసులభముగాన్
చ॥ హరియుఁ బతివ్రతామణిమ - హామహిమంబున కబ్బిమంది సా
దరమున వృంద కెప్పుడును - ధారిణిఁ బూజన మొప్పునట్లు స
ద్వరము నొసంగె నామె చిత - భస్మముగాఁ దులసీవనంబటన్
వ్వరగ జనించె నత్తరులె - భాసిలెఁ బూజ్యము లౌచు నెచ్చటన్. ౭౮౦

క॥ ఆకారణమున నృపతీ!, నాకాధిపవైరికులము - నకు దశకంఠుం
డా కుంభకర్ణుఁడనఁగా, వైకుంఠుని భటులుపుట్టి - వర్తిలిరి ధరన్. ౨౯౨

క॥ వారిపురము లంకలోన, న్నారలు పంచవటియందు - నను రాముని జా
యారత్నము దొంగిలికొని, సారమతిన్ లంకఁ జేర్చి - సన్మానంబుల్. ౨౯౩

ఆ॥ సీత నచటఁ బ్రియము - చెన్నారఁ గాతురు
మరల రాముచేత - దశముఁనందు
మరణమందుదురు పరి - మాణ మిా వాక్యాంబు
రాముఁడందు లకైయు - రణ్యమునకు.

మ॥ అల సుగ్రీవుని స్నేహితంబుఁ గొనుఁ దా - నావాలినిం ద్రుంచు గో్రఁ
తుల గుంపెల్ల సహాయతన్ మనఁగఁ బా - థోరాశికిన్ సేతువున్
లలి నిర్మించును రావణాదులగు త - ల్లంకాపురీకష్టులన్
బొలివుచ్చున్ జనకాత్మజం గొనును స - మ్మోదంబుతో నావలన్. ౨౯౪

తే॥ రామచంద్రుఁడు జానకీ - రమణిఁగూడి
బాంధవులతోడ సాఖ్యాను - బంధుఁడగుచు
యాత్రలును యజ్ఞములు విలా - సాదికములు
సలుపుచును నేఁడుదీవుల - నిలను నేలు. ౨౯౫

క॥ ఇది కడుగోప్యము రాజా!, కదలికయా మతినిఁ జెప్పఁ-గాఁ దగదుచుమిా!
యెదియెటులైనను నెంతటే, యడనున్నైనను మతేరి-కైనను నెటనేన్. ౨౯౬

చ॥ అనవిని యాజి ముద్గలుని - నారసి యోమహాసీయ! రామచం
ద్రుని చరితంబు వింటిని గు - తూహలతన్ వచియింపుఁడింక నే
నును దొలిజన్మమం దెవఁడ - నో? మఱి యే సుకృతంబుఁ జేసినాఁ
డనో? హరిఁ బుత్రుగాఁ బడయు - టన్ రమఁ గోడలుగాఁగ నోంచుటన్. ౨౯౭

వ॥ అని యడిగిన నాజడదారియుఁ గడుంగడు ముదంబడరఁ బుడమితేనితో నిట్లనియె.

—◆ కైకేయీ దశరథుల పూర్వ జన్మవృత్తాంతము ◆—

చ॥ వినుము నృపేంద్ర! ముంద్దుఁగర - వీరపురంబు కరంబు సహ్యమున్
ఘననగసీమయందరయ - ఖ్యాతివహించెఁ దదీయపత్తనం
బున మనె ధర్మవేత్తయగు - భూసురవర్యుఁడు ధర్మదత్తుఁడన్
వినుతయశుండు సద్వ్రతుఁడు - విష్ణుపదార్చకుఁ డద్వితీయుఁడై. ౨౯౮

తే॥ ద్వాదశాక్షర జపనిష్ఠుఁ-డాదరమున, నతిథులను బ్రోచువాఁడు వి-ద్యానిధానుఁ
డైన యాధర్మదత్తుండు-హరివ్రతంబు, సలిపి కార్తికమునఁ దమి-స్రను సభక్తి.

ఉ॥ జాగరణంబొనర్చి తుది - జామునఁ బూజకుఁ దగ్గవస్తువుల్
దాఁగొని విష్ణుమందిరము - దారిఁ బోవుచుఁ గాంచె రాక్షసిన్

బూగవికీర్ణ కేశను న - భూతభయంకర ఘుర్ఘురస్వనన్
వ్యాగత వక్రదంష్ట్రిఁ గను - బాబర సారుణ నేత్ర జిహ్వికన్. ౪౬౨
క॥ కాంచి భయభ్రాంతుండై, సంచిత పూజోపకరణ - జాలము జలమున్
బ్రాంచత్తులసీదళములు, నంచల జాఱంగ విడిచె - హరినిఁ దలఁచుచున్. ౪౬౩
క॥ తులసీ సలిలస్పర్శన, బలమున నంహస్సు తొలఁగి - బలురక్కసియున్
సలలిత వాక్యంబులతో, నిలసురునకు మ్రొక్కి నిలిచి - యిట్లని పలికెన్. ౪౬౪
క॥ బ్రాహ్మణవర! తొలిపుట్టున, బ్రాహ్మచరణంబు వలనఁ - జెట్టంగని స
ద్బ్రాహ్మణ్యము దిగనాడితి, బ్రాహ్మగముం బోలెఁ గ్రూర - శీలత మనితిన్.
క॥ ఈ కాయాపమునందితి, నాకిఁక సద్గతి లభించు - నా? యెవ్విధినేన్
సాకల్యముగాఁ దెల్పి శు, భాకరమగు పథముఁ జూపుఁ - డయ్యా! యనినన్.
తే॥ విప్రుఁడయ్యార్తవసుకిని - వీక్షసేసి, నీయొనర్చిన దుష్కృత - నికర మిపుడు
చెప్పుమా: భావిఫలమది - చెప్పవచ్చు, నని యె నంఘలకాయము - యనియె నిట్లు.
క॥ ఓ క్షితిదేవా! మిగులన్, దక్షుఁడు సౌరాష్ట్రనగర - ధాముఁడు ద్విజుఁడౌ
భిక్షు సమాహ్వయుఁ డాతని, కీక్షింపఁగఁ బత్నినైతి - నేఁగలహాఖ్యన్.
సీ॥ ఒక్కనాఁడైనను-నుత్సుకంబున నాథు, మంచిమాటలఁ బల్క-రించ లేదు
ఒకపూఁటనేని భ-ర్తకుఁ గుక్షినిండఁగా, నిష్టమృష్టాన్నంబు-నిడఁగలేదు
ఒక్క కార్యంబైన-నొగి మగండు వచింప, శిరసావహించి నేఁ-జేయలేదు
ఒక రుచ్యవస్తువే-నకలంక మతి ముందుఁ, దినకయె పతికీయఁ-గనఁగలేదు
ఆ॥ ఇంతయేల? ధవున-కెది యిష్టమో? దాని, నెపుడుగాని జరప-నెంచలేదు
నాదు వృత్తమెల్ల-నగు బాటుగానుండ, రమణుఁడంత హితుని-నమలుఁ గాంచి.
ఉ॥ మిత్రమ! నాదు పత్ని చెలి - మిన్ ననుగాంచను మాటలాడఁగా
నాత్రపుబుద్ధితోఁ గలహ - మాడు మతేపని చేయుమన్నను
బాత్రముగా నొనర్ప దవ - మానముగా ననుదిట్టు దుష్టచా
రిత్ర యదెట్టు నాకుఁ దగు - రీతిగఁ గాపురమేర్పుఁ జెప్పుమా! ౪౭౦
క॥ అని యడిగిన నాతఁడు నె, మ్మనమునఁ జింతించి పలికె - మాన్యచరిత్రా!
వినుమా! యొకయుక్తి తటా, లునఁ దోఁచెను జెప్పెదను న - లూన విధంబున్.
ఆ॥ ఇష్టమైన యది య - నిష్టమంచు వచించి
వలయుపనినిఁ జేయ - వలవదనుచుఁ
బనికిమాలినవియె - పనిబూని కోరుచు
మనుము పెడగుణంబె - మంచిదగును. ౪౭౨
వ॥ అని బోధించిన సుహృద్వరు వచనంబులను మన్మనోరమణుండువిని గృహంబునకే
తెంచి నాఁటినుండి తనకు వలసిన పనిని వలదనుచుండ నేనాపనినిఁ జేసితీరుటయు

నక్కఱలేనివాని నక్కఱగా నతఁడు వచింప నాపనులఁ జేయకయుండుటయుఁ దట
స్థించె నిట్లుండ మా మామగారి శ్రాద్ధదినంబు వచ్చిన నాపతి నన్నుం గని. ౪౭౩

మ॥ రమణీ! తండ్రిది నేఁడు శ్రాద్ధము ద్విజుల్ - రాఁగూడ దన్నాదులున్
గ్రిమరీతిం జలుపంగఁ గూడను గుహూ - క్రాబైన మాత్రంబులన్
దమితోడన్ వచియింపఁ గూడదు పదా - ర్థంబుల్ మహాభక్ష్యముల్
తములంబుల్ మఱి దక్షిణల్ మహిసురా - ర్థం బీయవల్దంచునన్. ౪౭౪

చ॥ అదివిని నేను నాపతిని - నఘుఁడవంచని తిట్టి వెంటనే
పదునెనమండ్రు బ్రాహ్మణుల - భక్తిగఁ బిల్చి పదార్థ భక్ష్యముల్
ముదమునఁ జేసి శుభ్రముగ - భోనముపండియు శ్రాద్ధ కర్మమున్
గాదకొని సల్పుమంచుఁ బతిఁ - గోరికతో బతిమాలినంతటన్. ౪౭౫

ఉ॥ ఆతఁడు సక్రమంబుగనె - యా పితృయజ్ఞము సేసి భోజనం
బీతతి సేయనంచనిన - నేను బలాత్కర మొప్ప నన్నియుం
బ్రీతిగఁ గుక్షినిండునటు - పెట్టిన నాపతి తృప్తిపొంది తాఁ
జేతమునందు విస్మృతినిఁ - జెంది ననుం గని హర్షమాణుఁడై. ౪౭౬

క॥ నాతీ! యీ పిండములు ప్ర, నీతంబగు జలమునందు - నీవు విడువు మం
చాతఁడెఁ బలికిన మలమూ, త్రితగర్తమున వాని - నప్పుడ యిడితిన్. ౪౭౭

మ॥ కడుదుఃఖంబును బొంది భర్తయు ననుం - గన్గొంచుఁ దత్పిండముల్
వడిగా బైటికిఁ దీయఁబోకుమిఁక భ - వ్యంబౌ జలంబందునన్
విడఁగా నెంచకుమన్న వానినటు వే - వే బైటికిం దీసి పొం
దడరన్ మంచి జలానవైచితిని నా - యాత్మేశుఁడా పిమ్మటన్. ౪౭౮

ఆ॥ దినదినంబు నింట - ఘనమైన కలహంబు, ననుభవింప లేక - యడలు నొంది
నన్ను విడిచిపెట్టి - నాతి నింకొకతిఁ, బెండ్లియాడె నేను - విసుగుఁ జెంది.

క॥ కరమున్ దుఃఖమనంబున, గరమున్ గొని తెచ్చి మ్రింగి - కడువడిగా ని
ద్ధరణిన్ బొర్లుచు నఱచుచు, మరణించితి యముని భటులు - మసలక నన్నున్.

క॥ కొనిచని శమనుని సమ్ముఖ, మున నిల్పిన నతఁడు తనకు - ముఖ్యుండగు నా
ఘనుఁ జిత్రగుప్తుఁ గనుఁగొని, యనఘా! యీ వనితకృతము - లన్ని వినుచుమా!

వ॥ అని యాజ్ఞాపించినఁ జిత్రగుప్తుండు నన్నుం గని యమునితో నిట్లనియె. ౪౮౧

సీ॥ దేవ! యీ వనిత సం-భావింప సుకృతంబు, నొండేని యొనరించి-యుండ లేదు
పతి భుజింపకయె యీ-పాపాత్మురాలు తా, మృష్టాన్నమును బ్రీతి-మెక్కుచుండె
నావల్ల నీయోని-యందు స్వీయములంబు, భక్షింపవలయుఁ ద-ద్భవము వలన
నిత్యంబు భర్తను-నిష్ఠురోక్తులఁ బోరెఁ, గనుక భూదారమై-మనఁగ వలయుఁ

ఆ॥ శాకభాండమందె-పరు లెఱుంగని రీతి, దొంగతిండి తినియె-దుష్టురాలు
కనఁగఁ బిల్లియగుచుఁ-దన పిల్లలను దానె, తినఁగవలయు నీమె-జననమంది. ౪౮౩

ఆ॥ మఱియు నాత్మహత్య-మరణించె గరముతోఁ, గానఁ బ్రేతదేహ-యై నలంగి
మరు ధరాతలమునఁ-దిరుగుచుఁ బలునాళ్లు, తొలఁబైని పుట్టు-లందవలయు. ౪౮౪

క॥ అని విన్నవింపఁ గాలుం, డును భటులకు నన్నుఁజూపె - నూకుచు వారల్
నను మరు భూమిని విడిచిరి, కనుకనె క్షుత్తృషల నిట్లు - కార్శ్యము గనితిన్.

క॥ తృష్ణన్ వి త్తనుయుతనై, కృష్ణావేణీ సుసంగ - పృథివిన్ మనఁగా
విష్ణూగ్రిగణము సక్రో, ధోష్ణత ననుఁ దరిమె నిచటి - కొగివచ్చి యిటన్. ౪౮౫

క॥ త్వత్కరపాత జలాప్తిని, ముత్కరముగఁ బాపమేది - మునుకొని నీతో
సత్కరుణముగా నొడివితి, మత్కథ భూసురవరేణ్య! - మన్నింపు మనన్. ౪౮౬

తే॥ బ్రాహ్మణుఁడు రాక్షసీ చరి - త్రము నెఱింగి
యద్భుతాశ్చర్య భయసంభ్ర - మాత్ముఁడగుచుఁ
గొంతవడి స్థాణువును బోలి - చెంతనిల్చి
తుదకు దయఁబూని రక్కసి - తోడఁ బలికె. ౪౮౭

ఉ॥ ప్రేతశరీరిణీ! వినుము - వేగమె పాపతతుల్ నశింపఁగా
నాతత తీర్థయాత్రలు మ - హావ్రతముల్ ఘనదానధర్మముల్
ప్రీతినొనర్పఁ గావలయుఁ - బ్రేతకు నీకవి సాధ్య దూరముల్
నాతి! త్వదీయ దుర్దశకు - నాకును జాలిజనించెఁ గావునన్. ౪౮౮

—♦ కార్తికమాస విష్ణు వ్రతమహిమ ♦—

తే॥ నీకు ప్రేతత్వమది బహు - నీచ మరయఁ
బొందవలసిన జన్మముల్ - మూఁడు కలవు
నీకు వీని నివారింప - నిశ్చయముగ
స్వల్ప పుణ్యము చాలదీ - జగతియందు. ౪౯౦

క॥ నా చిన్ననాఁటి నుండియుఁ, బ్రాచీన వ్రతవిధాన - పటిమ మెఱయ శ్ర
ద్ధాచార భక్తిమెయి నే, నై చలిపిన కార్తిక వ్ర - తార్థ ఫలంబున్. ౪౯౧

తే॥ ధారవోసెద నీకు న - ద్దాన నఖిల
పాపసంబంధమది పటా - పంచలగును
గార్తిక వ్రతసామ్యముల్ - గావు ధరణి
నితర వ్రతదాన యజ్ఞంబు - లెంచిచూడ.

క॥ అని యా విప్రుఁడు తులసిం, గొని జలమును ధారగాఁగఁ - గురియుచు నాడా
ఘనకార్తిక వ్రతాప్తం, బనుపమ పుణ్యంబు నీకు - నర్థం బిడితిన్. ౪౯౩

వ॥ అనుచు నామె హస్తంబున ధారవోసిన దత్పుణ్య సంప్రాప్తిచే నాయమ వికార రూపంబుఁబాసి యూర్వశింబురిణించు దివ్యాంగసుందరియై స్వర్ణ ప్రభా భాసమాన యగుచు ధర్మదత్తుని పదములపై వ్రాలి మహానుభావా! మహానరక వారాశి ము నింగి దరిగానక పరితపించుచున్న నన్నుమీరు నౌకవలె నుద్ధరించితిరి నా పాప శేషమంతరించె నిఁక ధన్యురాలనయితినని యనేకవిధంబుల స్తుతించుచుండ విష్ణు దూతలటకు విమానారూఢులై యప్సరోంగనలతోఁ జనుదెంచి కలహ నా విమా నమునం దధిష్ఠింపఁ జేసిరి యచ్చర మచ్చెకంటులామెకు హెచ్చిన మచ్చికతో నుప చారంబులొనర్పఁ బ్రారంభించిరంత నావిప్రుండు విస్మయంబంది విష్ణుదూతులకు నమస్కరించిన వారును ధర్మదత్తునిం గని. ౪౯-౪

మ॥ ద్విజవర్యాగ్రణి! మేలుమేలు సతముల్ - విష్ణ్వర్చనామానసాం
బుజుఁడై తద్వ్రతుఁడై సుధర్మవిదుఁడై - పూర్ణానుకంపావనా
ర్థిజనుండైతివి కార్తిక వ్రతఫల శ్రీ నర్ధమీ కాంతకున్
నిజపాపోత్కర నాశకారణముగా - నీవిచ్చితౌ త్యాగివై. ౪౯-౫

సీ॥ హరి జాగరణ పుణ్య-మతివకుఁ బ్రాప్తింప, నీ వ్యోమయాన మీ-యెడకువచ్చె
దీపదానంబునఁ-బ్రాపించు ఫలమున, శ్యామ సురూప తే-జముల నొందెఁ
దులసీసమర్చనా-ద్భుత పుణ్యగరిమచే, విష్ణుసాన్నిధ్యమీ-వెలఁది కొదవె
వ్రతఫలంబున నీమె-వైకుంఠమునఁ జేరి, వివిధభోగంబుల - వెలయఁ గలిగ

తే॥ విభుకృపయె యుద్ధరించె నీ - మెలఁత నిపుడు,
మీరలును మేను వీడిన - మీఁద సహిత
పత్నులై విష్ణుసాన్నిధ్య - పదవినంది
యాల సారూప్యమును గాంచ - నౌను విప్ర! ౪౯-౬

ఉ॥ నీవలెఁ గార్తికవ్రతము - నెమ్మి నొనర్చినవారె ధన్యులీ
భూవలయంబునన్ ఫలము - పొందఁగ రానిదిలేదు వారికిన్
శ్రీవిభునామసంస్మరణ - సిద్ధి ధ్రువుండు స్థిరుండు కాడె? దం
తావళ నక్రరాజములు - ధ్యానవిధిన్ హరిరక్ష పొందవే? ౪౯-౭

ఆ॥ భూసురాఢ్య! నీకు-పుణ్యానుభవమది, కడచువఱకు విష్ణు-కరుణఁ జేసి
యతని లోకమందె-యతిప్రీతి వసియించి, మరలఁ బుట్టఁగలవు-ధరణియందు.

క॥ భార్యాద్వయుఁడై దశరథ, వర్యాహ్వయ ధరణిపతిగఁ - బ్రభవిల్లెదవో
యార్యా! యీ కలహయునీ, భార్యయగున్ గైకయనఁగ - బడి మూఁడవదై.

చ॥ అనవరతంబు మాధవ ప - దార్చనను బొనరించుచుండి యా
ఘనుని నిజాత్మజన్ముఁడుగఁ - గాంచెదు రామసమాహ్వయుండుగా

ననువుగ లక్ష్మి నీవు స్నుష - యౌ నవనీతనయాఖ్యమీఱఁగా
వినుతయశుండు రాముఁడు న - భీష్టధరాపరిపాలకుండగున్. ౧౦౦

వ॥ అని వచించి తామును విమానారూఢులై కలహను వైకుంఠమునకుం గొని వెడలిన ధర్మదత్తుండును యథావిధిగా విష్ణుపూజనము లొనరించుచు ధర్మనిష్ఠుఁడై యుండి యవసానసమయంబున జాయాయుతుఁడై విష్ణుసాన్నిధ్యంబున కరిగె. ౧౦౧

క॥ ఆ ధర్మదత్తుఁడవు నీ, వే ధరణీరమణ! కలహా - యే కైకసుమీ!
మాధవుఁడే రాముఁడు నీ, తాధాత్రీభవయె లక్ష్మి - తర్కించి కనన్. ౧౦౨

తే॥ లక్ష్మణుం డాదిశేషుఁడు - లలిత గుణులు
భరత శత్రుఘ్ను లరయఁగా - దర రథాంగ
యుగము కావున నీవె పు - ణ్యుఁడవు రాజ!
యనుచు సర్వంబు ముద్గల - ముని వచించె. ౧౦౩

— శ్రీరాముఁ డయోధ్యం జేరుట —

వ॥ పిమ్మట దశరథుండును ముద్గలమునివలన సెలవుకొని యామంత్రితుండై సతీసుతస్నుషాగురుమంత్రిపరివార యుతంబుగా బయలుదేరి యయోధ్యానగరంబుం బ్రవేశించిన. ౧౦౪

సీ॥ సౌధోపరిస్థిత-సౌందర్యకాంతా స, మూహంబు సుమజాల-ములను గురియఁ
బ్రాంగణస్థ వినోద - భామినీసంతతి, నవదీపనీరాజ-నముల నిడఁగ
సత్పురోభాగ సం-చార నర్తన వాద్య, కారులు తౌర్యత్రి-కములఁ జలుపఁ
బార్శ్వానుగత రమ్య-పరిచారికాపాళి, చామరాద్యుపచార-సౌఖ్యమొసఁగ
తే॥ నపరిమిత మోదమందు రా - మాది సుతుల
ముచ్చటల కిచ్చమెచ్చుచు - భూమిధవుఁడు
స్వీయజనవార పరివృతుం - డై యమేయ
భవ్య నిజమందిరముఁ జేరి - పరిఢవిల్లె. ౧౦౫

తే॥ మరలఁ దమ వెంటనరుదెంచి - వఱలియున్న
జనకరాజేంద్ర మంత్రుల - కనుపమాన
సత్కృతులఁ జల్పి మిథిల కా - సచివవరులఁ
బంపెఁ బంక్తిరథాఖ్యుండు - పెంపుమీఱ. ౧౦౬

క॥ జనకుఁడుఁ బ్రీతిమాసంబును, దన కూఁతుల నల్లురన్ ము - దంబున నేఁడై
ననుఁ బండుగవచ్చిన మిథి, లను జేర్చుచు సత్కరించి - లలిగనుచుండెన్. ౧౦౭

— శ్రీ సీతారాముల గర్భాధాన మహోత్సవవర్ణనము —

చ॥ జనకుని ముద్దుకూఁతురు వి - శాలసరోరుహ పత్రనేత్ర రా
ముని ప్రియపత్ని సీత పరి - మోదవిలాససమేత సద్గుణా

ద్యనుపమపూత యార్స్నెలల - కౌల రజస్వలయయ్యెఁ బ్రియము
మునఁ బదునొక్కవర్షములు - నూల్కొనఁగా, శుభలగ్నమందునన్. ౧౦౮

తే॥ జనకుఁడావార్త తెలిసి యు - త్సాహమలరఁ
బత్నితోఁగూడి సచివులు - పజ్జరాఁగ
(శ్రీ) యయోధ్యకు నరుదెంచి - (శ్రీ)కరముగ
దశరథస్వాగతము నొంది - తనివిసెందె. ౧౦౯

సీ॥ రంగారు బంగారు - పొంగారు సింగార, మూగైన లాలితా - భ్యంతరంబు
వివిధ యత్నోద్ఘూర్ణ - నవరత్నకరనూత్న, సారముత్కారణ - తోరణంబు
సురసాల దళగుచ్ఛ - సురసాల కదళికా, సాలరాజత్ప్రంభ - జాలకంబు
కలరవ కింకిణీ - ఘంటా లసద్దివ్య, దర్శనాసాదనా - దర్శనంబు

తే॥ నైన మందిర రాజంబు - నందు భవ్యఁ
డౌవసిష్ఠుఁడు మణిమయ - మైన దీప
రాజివెలుగొంద (శ్రీ)రఘు - రాముచేత
సీతకపుడు గర్భాధాన - రీతి జరపె. ౧౧౦

చ॥ జనకమహీశుఁడత్తఱిని - జాఁయనుగూడి ప్రసూనహార చం
దన ఘనచేల భూషలను - నందమునందముగా నొసంగె రా
మునకును సీతకున్‌గడు, నమోఘవిలాస సమీక్షణోల్లస
ద్వనిధిఁ దేలియాడి సుఖ - పద్ధతిగాంచిరి వారలెంతయున్. ౧౧౧

క॥ కనకమణిసుందరములౌ, ఘనభవనంబులను బుష్ప - కాంతునిసఖ్యం
బునఁ దగు సురతసుఖంబుల, ననుపమ భోగముల రాముఁ - డుండెను సతితోన్.

తే॥ జనకుఁ డొక నెల సాకేత - మున వసించి
మరల మిథిలకు నరిగె స - మ్మాన మొప్పఁ
దొడరి లక్ష్మణ భరత శ - త్రుఘ్న పత్ను
లును రజోవతులైరి మే - లనెడు తఱిని. ౧౧౩

తే॥ మఱి యథావిధి నరుదెంచి - మైథిలుండు
వారలకును గర్భాధాన - భవ్యమహము
లొనర జరగించి సంతస - మున నొసంగె
నల్లురకును బహూకృతు - లెల్లఁ దమిని. ౧౧౪

ఉ॥ నాణెమెసంగ మేలి వస - నంబులఁ దాల్చి సుచందనాదులన్
రాణనలంది భూషణము - లన్ దమిమీఱ నలంకరించియున్
బోణిమి నెల్లరున్ మనఁగఁ - బొల్పుగఁ దూర్యములొప్ప నిత్యక
ల్యాణము పచ్చతోరణము - నై రహిమించె నయోధ్య యొంచఁగన్. ౧౧౫

ఉ॥ లేఁడు దరిద్రుఁ డొక్కఁడును - లేఁడు ఋణస్థుఁడు లేఁడు రోగియున్
లేఁడు పరాంగనాసుఖ వి - లీన మనస్కుఁడు లేఁడు దుష్టుఁడున్
లేఁడు వివేకశూన్యుఁడును - లేఁడు మలిమ్లుచుఁ డయ్యయోధ్యయన్
ఏఁడునఁడాఁడు నాఁడు రఘు - వీరుల సేవ యొనర్తు రెల్లరున్. ౧౧౬
తే॥ లలిత గార్హస్థ్యమున రామ - లక్ష్మణులును
భరత శత్రుఘ్నులును దివ్య - భవన వాసు
లగుచు భార్యలఁ గూడి సౌ - ఖ్యముల నెల్ల
ననుభవించుచు మనుచుండి - రనుపమముగ. ౧౧౭

—• శ్రీరామచంద్ర దినచర్యావర్ణనము •—

శా॥ ప్రాతఃకాల సముత్థితుండగుచు శ్రీ - రాముండు శౌచాదులన్
జేతః ప్రీతిగఁ జల్పి దివ్యశిబికన్ - జెల్వొప్ప నారూఢుఁడై
స్నాతుండౌటకు నేవివిధాలి సరయూ - సత్కూలముం జేరి మే
లౌ తద్వాజి రథాదులన్ నిలిపి వా - జార్థంబు సామాత్యుఁడై. ౧౧౮
తే॥ పులినతలమున వరపదాం-భోజములను, నవ్య చిహ్నితములుసేసి నదిని దరిసి
వందనముసల్పి జ్యాదేవ-వారయుతుఁడు, నౌచు నాప్లావ మొనరించి-హర్ష మెసఁగ
తే॥ నిత్యకృత్యంబు నెఱవేర్చి-నిఖిల విప్ర, పాళికిని గో మహీధాన్య-భవ్యదాన
ములనునిడి సరయూనదీ-భూసురులకుఁ, బూజలొనరించి తటమును-బొంది యచట.
క॥ బంగరు గొలుసులు మెఱయఁగ, రంగైన దుకూలపాళి - రంజిల్లంగన్
సింగారించిన మేలిమి, బంగరుతేరెక్కె రామ - భద్రుఁడు సక్కన్. ౧౨౧
తే॥ తానమాడించి హరులకుఁ-దానుగూడ, స్నాతుఁడై సిద్ధముగ నున్న-సారథియు బి
ఱాన నరదంబు గడపఁ జ-రాచితులును, స్వర్ణదండధరుల్ ముందుఁ-జాగి నడవ.
క॥ సచివులు నచలామరులును, నుచితస్థితి వెంటరాఁగ - నొగి వెడలి రవ
ప్రచురము ఘంటాకింకిణి, నిచయము లొనరుపఁ బురంబు - నెఱిఁ జేరు తఱిన్.
క॥ తెఱవలు విరులనుఁగొని మే, డ్తెఱఁగున వర్షింపఁ దరణి - దీధితికెనయై
వఱలు తనుద్యుతి రాముం, డుఱవుగ నిజగృహము దరిసి - యొనర రథంబున్.
క॥ డిగి పాదుకలను దాలిచి, తగు పాద్యార్ఘ్యముల నపుడు - ధరణీసుత పొం
దుగ నిడ ముదమును గని హర్, మ్యగృహము నాసీతతోడ - మఱి సేరి తమిన్.
తే॥ అగ్నిహోత్రాది విధులను-నాచరించి, స్ఫటిక లింగంబునకుఁ బూజ-సల్పి సీత
భక్తి నొసఁగిన నైవేద్య భుక్తి దేవు-నకు సమర్పించి మంచి దా-నము లొనర్చి.
తే॥ బ్రాహ్మణాశీస్సులనుబొంది - శ్రద్ధతోడ
ధేను తులసీద్రుమాశ్వత్థ - భాను పూజ

నముల నొనరించి బ్రాహ్మ య - జ్ఞంబు సలిపి
బంధు పరివేష్టితుండయి - భార్యఁ గూడి. గి౨౭
తే॥ గురుని వలనఁ బురాణ స - ద్గోష్ఠి జరపి
యతనిఁ బూజించి భూమిసు - రాప్త బంధు
యుతముగా రమ్యవహా శాల - కొనర నరిగి
మించు ప్రేమను సీత య - ర్పించుచుండ. గి౨౮
తే॥ నారికేళ కపిత్థ జం - బూ రసాల, సార కదళీ సుపనస ఖ - ర్జూర దాడి
మీ ఫలాది ఫలంబులు-మెచ్చుగను ర. హించు ఘృతపాచితములు-భక్షించి మించి.
చ॥ తములము స్వీకరించి పరి - ధానములన్ ధరియించి దర్పణం
బమరఁగఁ గాంచి జానకి క - టాక్ష విలాస సమీక్షణంబు లం
దముగ గ్రహించి స్యాదనము - నన్ బరిరోహ మొనర్చి నిండు మో
దము విభవంబుఁ జెన్నడరఁ - దల్లుల యిండ్లకు నేగి భక్తిమై. గి౩౦
తే॥ మాతలఁ బ్రదక్షిణించి న-మస్కరించి, తండ్రిభవనంబు సేరి యు-త్తమ మృగాధి
పాసనంబున వెలసిన-పఙ్క్తిరథున, కవనతుండయి మ్రొక్కి త-దాజ్ఞ వడసి.
క॥ పౌరసుఖంబును గార్యము, లారసి యొక కొంతసేపు - నచ్చట మని యా
త్మారమణుని యనుమతిఁ గని, సారమతిన్ రథమునెక్కి - స్వగృహంబునకున్.
తే॥ వారనారుల నృత్తముల్-మీఱఁ దూర్య నిస్వనంబులు సెలఁగ వం-దిజన సంస్తు
తులను గొనుచు వినోదరీ-తులు తలిర్ప, నరిగి పాద్యార్ఘ్యములు సీత-త్వరగ నిడఁగ.
క॥ భవనాంతరమును జేరియు, నవిరళమగు లోకవృత్త - మా జానకికిన్
దవురీతి సరసహాస్యం, బవరతిగాఁ దెలిపి ముచ్చ - టందుచు లీలన్. గి౩౪
క॥ మధ్యాహ్నస్నానంబును, విధ్యుక్తముగా నొనర్చి - విహితాచారం
బధ్యాత్మంబుగఁ జలిపి స, దధ్యాపక విప్రబంధు - సామాత్యుండై. గి౩౫
ఉ॥ పొంకముగా మహారజత - భోజన పాత్రములందునన్ గ్వణ
త్కంకణ నూపురాది లలి - త ప్రతిపాదక భూషణ ప్రమో
దాంకిత సీత భోజన ప - దార్థములెల్లను బెట్టుచుండఁ బ్రే
మాంకురితాత్ముఁ డారఘుకు - లాధ్యుఁడు తా భుజియించి పిమ్మటన్. గి౩౬
క॥ కరపాదప్రక్షాళన, కరుఁడై సీతాసుసాధ్వి - కడువడిగ మనో
హరమై స్ఫారాద్భుత రుచి, కరమా తాంబూలమిడఁగఁ - గై కొని తమిమై. గి౩౭
తే॥ శతపదంబులు నడచి యా-సమయమునకు, సీత భుజియించి వచ్చి శ-య్యాతలంబు
సిద్ధపఱుపఁగఁ దచ్ఛయ్యఁ - జేరి ప్రీతి, భార్యతోడుత నిద్రించి - భావుకముగ.
తే॥ కొంత వడికిని శ్రీరఘు - కుంజరుండు
నిద్రనుండియు లేచి ప - త్ని ప్రదత్త

హృద్య నూత్నాంబరములు ధ - రించి మంచి
బాణములు శార్ఙ్గమునుబూని - రాణ మీఱ. ౫౩౯

క॥ తమ్ములు మొదలుగ బాంధవు, లిమ్ముగఁ దనుఁ గూడ రథము-నెక్కి పురోభా
గమ్మున నర్తనములు తూ, ర్యమ్ములు సెలగంగ నుపవ-నాదులు కనఁగన్.

క॥ వెడలి వినోద విహారం, బడరఁగ నందంద సుఖము-నందుచుఁ బవనుం
డొడికముగా వీచుచుఁ బు, ష్పౌఘలను జల్లంగ ముదము - పొందుచు మరలన్.

క॥ వెనుదిరిగి గృహముఁ జేరి వ, డిని సంధ్యావందనము క - డిమిఁ జల్పియు నా
యనలమున వేల్చి మఱి హరి, ఘనభక్తినిఁ బూజసేసి - కమాన్నములన్ ౫౪౧

తే॥ ఇష్టజనములతో భుజి - యించి యాల
రత్న కాంచన మాణిక్య - రాజితాఢ్య
మంచకంబును మృదుశయ్య - మించ దివ్య
మైన ప్రాసాదమధ్యంబు - నందుఁ జేరి.

క॥ మార్దవ శయనోపరి సౌ, హార్దము మీఱన్ వినోద - హాస్యోల్లాస
స్వర్ధనలన్ మధురవచో, నిర్దేశములన్ స్వపత్ని - నిం గూడి తగన్. ౫౪౪

క॥ తాంబూల చర్వితుండయి, యింబలరఁగ నలరు విల్తు - నేసకం బెసఁగన్
సంబరమున నమ్మైథి, ల్యంబుజనేత్రారతిన్ ము - దాత్ముండగుచున్. ౫౪౫

తే॥ కామకేళివిలాస సౌ - ఖ్యమ్మునంది
చల్లఁగాఁ బిల్లగాలి య - ల్లల్ల వీవఁ
బ్రియసతీపార్శ్వసీమ ని - ద్రించుఁ గీర్తి
ధాముఁడౌ రాముఁడిటులె ని - త్యంబు నెగడ. ౫౪౬

క॥ పండ్రెండేఁడులు కడచినఁ, బుండరీకాక్షుండైన రామ - మూర్తిని నొకటన్
దండ్రియగు దశరథుఁడు గని, మండ్రాటము లేనిరీతి - మహిఁ గను మతితోన్.

క॥ కౌసల్య షజ్జనుండఁగఁ, జేసాఁచుచు రామచంద్ర! - శ్రీహరి వీవై
భాసిల్లెదవని తెలిసితి, భాసుర విజ్ఞాన భక్తి - భ్రమము దొలఁచుమా! ౫౪౮

—♦ కౌసల్యా దశరథులకు శ్రీరాముఁడు తత్త్వోపదేశము సేయుట ♦—

వ॥ అనిన సత్కృపాసాంద్రుండగు శ్రీరామచంద్రుండును బితలంగని సంసృత్యుత్తరణ మార్గంబు నెఱుంగు నుపాయంబు వారలకుం గరతలామలకంబుగా నొనర్ప నిచ్ఛగించి యిట్లనియె.

క॥ విశ్వము మాయోద్భవమై, నశ్వరమై శుక్తిరజత - నైజ భ్రాంతిన్
నిశ్వసితోచ్ఛ్వసితంబుల, సుశ్వశ్రేయసముఁ గీడు - జొబ్బిలఁ దోఁచున్. ౫౫౦

తే॥ కాచభూమిని గని జల - కం బటంచు
రజ్జువును గని ఘోర స - ర్పం బటంచు

సరవి మృగతృష్ణఁ గని జలా - శయమటంచు
భ్రమగనెడు రీతి మాయను - బ్రహ్మమందు. ౫౫౧
తే॥ పండితులు మాత్ర మాబ్రహ్మ - మందు రీతి
నిశ్చయంబుగ నెఱిఁగి య - నిత్యమైన
మాయ కెప్పుడు నవశులై - మనుచు రరయ
నజ్ఞులయ్యది తెలియ న - సమర్థులిలను. ౫౫౨
తే॥ ఆత్మశుద్ధంబు నిర్వ్యళీ - కాంచితంబు
సచ్చిదానంద దివ్య ల - క్షణయుతంబు
నప్రతిహతంబు కావున - నాత్మవిదులు
శాశ్వతస్థితి మగ్నులై - శాంతిఁ గంద్రు. ౫౫౩
తే॥ అట్టి యాత్మాంశమునను ద - దంశములను
శ్రీశివబ్రహ్మలును నేను - స్థితియు సృష్టి
విలయములు సల్పఁ బొందెను - వివిధరూప
ములను బొందుదు మమ్మాయ - వలనఁ దెలియ. ౫౫౪
చ॥ అనఘ! నటుండు వేషధరుఁ - డై నటు లన్నివిధంబులన్ జగం
బున నటియించు నాత్మ జల - ముల్ కమలంబు స్పృశింపనట్లు మా
యను లవమైన నంటక ని - రామయ నిర్మల నిర్వికల్ప భా
తినిఁ దనయంతఁ దా వెలిఁగి - తేజరిలున్ బరిపూర్ణ మోదియై. ౫౫౫
తే॥ దేహగేహ సతీసుత-మోహవశత, నొదవు మమకారమును వీడి-ముదము గాంచి
యా పరబ్రహ్మమును సర్వ-మందుఁ దెలియు, మంతఁ దత్సంస్మృతి క్లేశ-మంతరించు.
తే॥ సత్య శౌచ దయా క్షమా - శమదమములు
దైవభక్తియు వేదప - థప్రవర్త
నము నహింసయు మున్నగు - నమలగుణగ
ణంబు నిరతంబు ముఖ్య శ్రే - యంబు జగతి. ౫౫౬
క॥ చౌర్య ద్యూత కలహ మా, త్సర్యంబులు దంభమున్ మృ - షావచనంబుల్
క్రౌర్య భయ లోభ క్రోధము, లార్యా! దుష్కర్మ వృత్తి-యవి త్యాజ్యంబుల్.
తే॥ వేద విప్ర యతీశ్వర-సాధు నింద, వారలకు మానభంగంబు గూర్చుటయును
మఱియుఁ బైశున్య మియ్యవి-మానవులకు, ననిశము విసర్జనీయంబు లవనియందు.
తే॥ పూర్వమున నీయొనర్చిన - పుణ్యమునను
దపమువలనను నేను నీ - తనయుఁడైతి
లోకవర్తన మెఱిఁగి మీ - లోన నీ యార
హాస్యమును డాపవలయు మీ - రని వచింప. ౫౬౦

క॥ దశరథుండును గౌసల్యయు, శశధర సుమనోజ్ఞు రాము - సద్గుణధాముఁ
భృశముగ నాశ్లేషించియుఁ, గుశలంబును గంటిమనుచుఁ - గొండొక వడికిఁ.
వ॥ ప్రపంచ ప్రవర్తనంబు ననుసరించి నిజావాసంబులకుం జనిరి తదనంతరంబ.

—• శ్రీరాముఁడు లోకులతో నానందించుట •—

క॥ తలిదండ్రులకును దమ్ముల, కల బంధుల కాప్తజనుల - కా పౌరులకుఁ
లలనలకును సచివులకును, బలుప్రియముల నిడుచు రామ - భద్రుఁడు వెలసెఁ.
ఉ॥ ప్రాణిక మానివర్యులు ప్ర - మోద హృదంతరులౌచు రామునిం
గానగఁ వచ్చి ద్వారమునఁ - గావలివారు నిరోధపెట్టినఁ
మానక లోనికేగి యభి - మాన మెలర్పఁగ రాముఁ గాంచి సు
జ్ఞాన కథాప్రసంగములు - నాఁడును నాఁడు నొనర్తు రెంతయుఁ. గీ=౮
చ॥ హితమతి రాముఁడిట్లు చరి - యింపఁగఁ గొండొకనాఁడు నయ్యుధా
జితుఁడును గైకఁ బంక్తిరథుఁ - జేరి ప్రియంబునఁ గేకయాత్మజా
సుతులను మేనయల్లురను - జుట్టటికంబుగఁ బంపఁగోరి స
మ్మతిఁ గొని వారిఁ బిల్చుకొని - మంజుగతిఁ దనయూరికిం జనెఁ. గీ=౯

—• శ్రీరామునకు నారదుఁడు దేవప్రార్థనను విన్నవించుట •—

ఉ॥ అంతట నారదుండు గగ - నాంతరమందుననుండి వచ్చి సౌ
ధాంతర వాసు రాము నర - యంగ నతండును జానకిఁ సుధీ
మంతుని లక్ష్మణుం గలిసి - మౌనికిఁ బూజలొనర్ప నారదుం
డంతికమందుఁ గూర్చొని సు - రార్థము రామునితోడ నిట్లనెఁ. గీ=౬
క॥ రామా! మౌని హృదంతర, ధామా! కరుణాలలామ! - తారకనామా!
క్షేమముల రావణముఖ్యుల, నీమెయిఁ వధియించి రాజ్య - మేలుము మరలఁ.
క॥ దేవతలుఁ మౌనులు సం, భావించి వచించినట్టి - ప్రార్థనయిది నేఁ
బోవలయు ననుచు నారదుఁ, డావర్తితుఁడౌచు నరిగె - హర్షయుతుండై. గీ=౮
ఉ॥ రాముఁడు జానకిం గని మ - రాళమనోజ్ఞ విలాసయాన! కాం
తామణి! విన్ము లక్ష్మణ యు - తంబుగ నేనిఁక దండకాటవిఁ
శ్రోమను జేరి రావణుని - భీకర దుర్మద దైత్యపాళి సం
గ్రామమునఁ వధించి త్వర - గాఁ జనుదెంతు నయోధ్య సేరఁగఁ. గీ=౯
తే॥ నాకు రాజ్యాభిషేకం బా - నర్ప నెంచి, తండ్రి యుత్సింపనున్నాఁడు-దానికిపుడు
విఘ్న ముత్పాదనము సేసి-విపినయాత్ర, నేను జరగింతు నిచటనె-నీవు మనుము.
క॥ అని పలికిన జానకి మె, ల్లన నవ్వుచు సత్కృపాల - లామా! రామా!
మనసెఱుఁగ నిటులు పల్కెదొ?, నిను వీడి సుఖంపఁ గలనె? నే నెచ్చటనేఁ.

చ॥ అదియునుగాక కారణము - లారయ నేర్పడి యుండె ముందె నే
నది వచియింతు బాల్యమున - యందొక విప్రుఁడు నాకు హస్తముల్
ముదమునఁ గాంచి రేఖలను - మూఁదలగాఁ గని యీమె భర్తతో
గూడకొని తా నరణ్యమున - కుం జనునంచు వచించె నేనునుల్. ౧౭౨
తే॥ హరధనుర్భంగవేళ మీ-మ్మరసి మీరె, ధనువు నెక్కిడి నన్ను గై-కొనఁగఁ గోరి మ్రొక్కితిని దేవతలకు న-మ్మునులరీతి, వనిఁ జతుర్దశ సమలుండు-మనుచు నాథ!
తే॥ మఱియు భావి చరిత్రంబు - మహిమయుతులు
చెప్పఁగా వింటి నంచును - సీతఁగూడి
రాముఁ డడవికిఁ జనునన్న - ప్రావయుండెఁ
గనుక నను వెంటఁ గొనిపొండు - వనమునకును. ౧౭౪
వ॥ అని ప్రార్థించిన సీతావాక్యంబులకు సమ్మతించి రామచంద్రుండు పత్నినిఁ గాఁగిటం బొదివి ముద్దుగొని నిన్ను నరణ్యంబునకు వత్తువుగాకని పలికె నంత నొక్క దినంబున. ౧౭౫

—♦ శ్రీరామ పట్టాభిషేక ప్రయత్నము ♦—

తే॥ దశరథుండును మౌని స - త్తము వసిష్ఠుఁ
గాంచి సత్కారమును నమ - స్కారములను
జలిపి శ్రీరాము యౌవరా - జ్యంబునకుఁ ద
లంప నభిషిక్తుఁ జేయంగ - లగ్నమడుగ. ౧౭౬
చ॥ దశరథు నావసిష్ఠుఁడు సు - ధాకర కాంతశిలా గృహంబునన్
భృశము రహస్యముం దెలుపఁ - బిల్చియుఁ గోసలజాసుమిత్రల
న్వశలును రాజుచెంగటనె - వర్తిల వారల ముప్పురం గృపా
వశుఁడయి చూచి పల్కెనిటు - భావికథా కథనానుసూక్తులన్. ౧౭౭
తే॥ ఓయి దశరథ! కౌసల్య! - యోసుమిత్ర!, వినుఁడు రాజ్యాభిషేకంబు-విభవములర రామునకుఁ జల్పఁగనుట గా-రామెకాని, కార్యమయ్యది వ్యతిరేక-గతిని జరగు.
క॥ సీతాలక్ష్మణ యుతుఁడై, యాతండును దండకావ - నాటనమునకై
భీతి దదైత్యాహతికై, స్ఫీతానందమున తేపు - చెచ్చెర నరుగున్. ౧౭౯
క॥ ఎఱిఁగియు నెఱుఁగని విధమున, నెఱె సంభారములఁ గూర్చి - నిఖిల జనములన్
బఱపుగఁ బిల్పింపుఁడు క్రి, చ్చఱ శ్రీరాజ్యాభిషేక - మని రామునకున్. ౧౮౦
ఉ॥ ఇప్పుడు రామరాజ్యము స - మీక్ష యొనర్ప నసాధ్యమొంచఁగన్
మున్పున శాపకారణము - మున్నొనెఁ బంక్తిరథా! నినుం గడున్
గొప్ప వియోగమింక నొన - గూడును బుత్త్రులచేత నీకు నీ
వప్పుడె పాకశాసన గృ - హాతిథి వయ్యెదవయ్య యొయ్యనన్. ౧౮౧

క॥ కౌసల్యాదులు శ్రీసిం, హాసన సమధిష్ఠితుఁ సు - తాగ్రణి రాముఁ
భాసుర రాజ్యోద్ధాము సు, రాసుర మునిదత్త దాము - సరయుసు రవలఁ.
॥ గగన యానంబునందుండి కనెద వీవు, రామ పట్టాభిషేకంబు రాజచంద్ర!
భావిరేఖానుభవమది బ్రహ్మకైనఁ, దప్పునే? చూడుఁడింక నే-తత్క్రమంబు.
క॥ అని వచియించిన దశరథుఁ, డును దేవుని చిత్రమెంచి - డోలన మతియై
జనపతులను మునిపతులను, ఘనులను రావించెఁ బురియుఁ - గడు రాణించెఁ
క॥ రాజానుమతి వసిష్ఠుఁ, డోర్జఁ సంబారములను - యోగ్య సుమంత్రుఁ
యోజించియు నొడ. గూర్పఁగఁ, దాఁ జయ్యనఁ జెప్పెనిటు య-థావిధి తోడఁ.
ఉ॥ రేపు ప్రభాతమందు నమ - రీసమభూషిత కన్యకల్ కరుల్
ప్రాపుగ మధ్యకక్ష్యకల - రఁ జవ్వదంతుల నాల్గునిల్పి తీ
ర్థాపిత హేమకుంభములు - నా పులితోళ్లును రత్నదండము
న్తా పరమోష్ణవారణ సు - దామ సదంబరభూషలుంచుఁడీ. గీ౮౬
తే॥ అచటఁ గుశపాణులైన మా - న్యాగ్రణులును
సిద్ధముగ నుండవలయుఁ బ్ర - సిద్ధవైది
కులును గాయకులును నర్త - కులును వాద్య
కుశలులును గూడవలయు నా - కూతి మీఱ. గీ౮౭
క॥ చతులంగ బలములవ్వల, వితతంబుగ వెలయవలయు - విపులాపతులుఁ
గుతుకము తోడ నుపాయన, తతిఁగూర్పఁగ వలయు మఱియుఁ-దత్తద్విధిగాఁ.
క॥ పుటభేదనమునఁ గన నె, చ్చట వెలసిన దేవళములఁ - జలుపఁగవలె ను
త్కట భక్తినిఁ బూజనములు, దిటముగ బలులును నటంచుఁ-దెలిపి గురుండుఁ.
చ॥ రథమును నెక్కి వేగ రఘు - రామునిఁ జేరి బహూకృతుండునై
ప్రథగను యౌవరాజ్యమున - రాముని నిల్పఁ దలంచి యోజి యొ
వ్విధిఁదగు యత్నముల్ సలిపె - విస్తృత మొప్పఁగ నన్నియుఁ యశో
నిధియగు రామమూర్తి గమ - నింప వచించియు నాల నిట్లనుఁ. గీ౯౦
ఉ॥ రామ! నిమిత్త మాత్రిన య - రణ్యముఁ జేరెద వీవు రేపు సీ
తామహిళాయుతుండవయి - తమ్ముని లక్ష్మణుఁ గూడి పిమ్మటఁ
భీమనరాదులందునిమి - షేర్మిఁ జతుర్దశ వత్సరంబుల
చ్ఛేమని రావణాసురుని - సూదునఁ జంపి ప్రహర్ష మొప్పఁగఁ. గీ౯౧
తే॥ భాత్రృజాయా యుతంబుగా - స్వపురమునకు
వచ్చి వైభవముగ రాజ్య - పాలనంబు
సల్పెదవు కాని తండ్రి యా - జ్ఞను జరింపు
మయ్య! యిప్పుడు లౌక్య వృత్త్యను గతముగ. గీ౯౨

క॥ ఈనాఁడు నీవు రాత్రికి జానకితో నుపవసించి - బ్రహ్మాశయనుండవై
పూని జితేంద్రియ వృత్తిని, మానుగ వర్తింపుమనుచు - మౌనియు నరిగెన్.
తే॥ కోసలజయు సుమిత్రయుఁ - గొడుకు లిట్లు
దండకారణ్యమునకు సీ - తాయుతముగ
నరుగఁ గలరని తెలిసిన - యంతనుండి
విఘ్నశాంత్యర్థ కర్మముల్ - వేయొనర్ప ౯౫

—♦ మంథర కైకకు దుర్బోధనము సేయుట ♦—

మ॥ అపరాహ్ణంబునఁ గైకదాసి సుతయా - నమ్మంథరాభిఖ్య మే
డపయిం దాఁ బచరించుచుండి కనె నం - టన్ రామపట్టాభిషే
కపు యత్నంబులు వృద్ధ యొక్కరిత సా - కల్యంబుగాఁ జెప్పఁగా
నపుడే కైకను జేరి తద్విషయ మా - ద్యంతంబునున్ వాకొనెన్. . . . ౯౬
క॥ ఆ కార్యంబును సరిగా, నాకర్ణించియును గైక - యాభరణంబుం
గైకొని చెలికత్తియకిడి, పాకట హర్షంబు నొందె - రాముఁ బొగడుచున్.
క॥ దైవప్రేరితమతి దు, ర్భావంబున మంథరయు న - భాగ్యపు రాణీ!
యేవిధి హర్షించెదవని, కావరముగఁ బలుకఁదొడఁగఁ - గైకం గనుచున్. ౯౭
ఉ॥ రాముఁడు రాజుకాఁగ నభి - రామము కోసలపుత్రికౌను సీ
వో? మఱి యామె దాసివయి-యుద్దవడిన్ మరియాద నేది కీ
డామతిలంగ హీనముగ-నందఱ ముందఱఁ జేతులొగ్గి పో
రాముల నొంద నౌను గన-రా? సవతాలి కుచేష్ట లెవ్వరున్. ౯౮
చ॥ వరములు రెండు నీకు మును - పంక్తిరథుండిడెనంటికాదె? యా
వరమున నొక్కటిన్ భరతుఁ - బట్టము గట్టఁగఁ గోరి యన్యమా
వరమున దండకావన ని - వాసిగఁ దాఁ బదునాలుగేండ్లు కా
వర ముడివోవ రాముఁడు జ - వంబున నేగఁగఁ గోరు మిమ్మెయిన్. ౯౯
తే॥ వినుము నామాట లగ్గాను - వేగఁ జనుము
క్రోధ గృహమును జేరుము - క్షోణినాథుఁ
డెంత సెప్పిన వినకుము - హేతువిద్ది
మంచి దంచును నెంచుము - టంచుఁ బలుక. ౧౦౦
క॥ (శ్రీ)రామేచ్ఛాకలనన్, సార వివేకంబు మాని - చయ్యన నా ధా
త్రీరమ్యోక్తుల నెదనిం, డారంగను నమ్మి కైక - యారీతి మనెన్. ౧౦౧
ఉ॥ రాతిరి క్రోధగేహమున - గట్టడిగాఁ బడియున్న దాని కను
ర్నితిఁ దలంచి పొక్కుచును - రీథ చెలంగెడి దానిఁ గీర్ణమా

నాతత కేశజాలయయి - యట్టిటు పొర్లెడిదాని భూషణ
వ్రాత విముక్తయై యడిచి - పాటుననుండెడిదానిఁ గైకయిన్. ౬౦౩
ఉ॥ పంక్తిరథుండు గాంచి సతి! - పల్కవిదేటి కటంచు సద్వచః
పంక్తుల నూఱడం బలికి - బాగుగఁ గౌఁగిటఁ జేర్చి కాంత! యీ
పంక్తిరథుండు నీతలఁపు - పాయక తీర్పఁగలండు త్వత్తృషా
పంక్తులఁ దెల్పుమా! యనినఁ - బల్కెను గైకయు ధార్ష్ట్యచిత్తయై. ౬౦౩

—♦కైకేయి దశరథునితో శ్రీరాము నరణ్యమునకుఁ బంపఁ గోరుట♦—

తే॥ రమణ! తావకదత్త వ-రంబులందు, భరత రాజ్యాభిషేక సం-ప్రాప్తి కొకటి
పదియునాల్గేండ్లు శ్రీరామ-భద్రుఁ డడవి, వడిగఁ జేరి చరింప నొ-క్కఁడును వలయు.
క॥ అనినన్ దిగ్గున దశరథ, జనపతి యుల్కిపడి హృదయ - శల్యంబగు కై
క నుడిన్ హరి! హరి! యని వెం, టనె మూర్ఛనుబొంది యిలఁ ద-టాలునఁ బడియెన్.
క॥ వేగిన యంత సుమంత్రుఁడు, వేగముగా వచ్చి రాజు - విధిఁ గని తల్లీ!
యీగతి యేమని కైకను, బాగుగ నడుగంగ నామె - వాక్చతురిమతోన్.
తే॥ మంత్రివర! రామచంద్రుని - మ్మందిరమున
కిపుడు వడిఁ దోడి తెమ్ము రా - జేచ్ఛ యిద్ది
యన సుమంత్రుఁడు రాజాజ్ఞ - యైన నటులె
క్రిన్న నేగెదనని పల్కి - మిన్నకుండె. ౬౦౭
ఉ॥ అంతట రామచంద్రుఁడన - నల్లన మూర్ఛనుదేరి రాజు ధీ
మంతు సుమంత్రునిం గని మ - మత్వముఁ జింతయు నంతరంగ మ
త్యంతమునుం గలంచిన ర -యంబున రామునిఁ దోడి తెమ్ము నా
చెంతకటన్న మంత్రియును - జెచ్చెర రామునిఁ దోడితెచ్చినన్. ౬౦౮
ఉ॥ రాముఁడు లోకమోహన వి -రాజిత దివ్యశరీర సత్కళా
రాముఁడు సస్మితానన ప - రార్థ్య గుణాఢ్యభిరాముఁ డంచితో
ద్దాముఁడు హేమరమ్యమణి - దాముఁడు లాలసమానసాబ్జ సం
ధాముఁడు తల్లిదండ్రుల య - థావిధి మ్రొక్కి యనుజ్ఞ వేఁడినన్. ౬౦౯
తే॥ కైక రామునిఁ గని దండ - కావనంబుఁ, జేరి పదునాలుగేండ్లు వ-సింపుమయ్య!
యిది భవత్పితృదత్త వ-రేహితంబు, మన్మన స్తృప్తిదంబు రా-మా! యటన్న.
క॥ బొటబొటఁ గన్నీరురలఁగ, నటమటపడి దశరథుండు - హా! తనయా! ని
న్నటవులకుఁ బంపవలసె నే?, కుటిలాత్మిక కైకయనుచుఁ - గుతిలం పడఁగన్.
ఉ॥ తండ్రినిఁగాంచి రాముఁడు సు - ధామయ సూక్తులతోడ నాయనా!
తీండ్రపు దుఃఖవేదనను - దేజు తొలంగఁగఁ ద్రొక్క నేల? యే

మందుఁ జనంబు లిట్లయిన - నద్దియుఁ గాకయుఁ గైక తల్లికిన్
వేండ్రము గూర్పఁగాఁ దగునె? - వేగ నొసంగుఁ డనుజ్ఞ నాకిఁకన్. ౬౧౨

తే॥ తల్లి వాంఛితమున మేలు-తారసిల్లుఁ, బ్రతిన నెఱవేర్చి త్వరలోనె - వత్తునేను
బదియు నాల్గేండ్లు లెక్కయే?-పరమహర్ష, చిత్తమున నేఁడె వెడలెద-సీతఁ గూడి.

—♦ శ్రీరాముఁ డరణ్యమునకుఁ బోవ యత్నించుట ♦—

క॥ అని సాంత్వనముగఁ బలికియు, జనసుల కడకేగి వత్తుఁ - జయ్యననని తం
డ్రిని సమ్మతింపఁ జేసి వ, డిని రాముఁడు కోసలజను - దేవం గాంచెన్. ౬౧౩

ఉ॥ కాంచి నమస్కరించి తన - కాననవాస విధానమెల్ల వి
న్పించి కరంబు దుఃఖమును - భీతియుఁ బొందిన తపించు మాతకున్
మంచిగ ధైర్యముం దెలిపి - మానన మొంది స్వగేహముం బ్రవే
శించియు సీతకున్ గహన - సీమకు నేగుట చెప్పి తమ్మునిన్. ౬౧౪

తే॥ లక్ష్మణునిఁ గని విపినయా-త్రను వచింప, నాతఁడును జానకియు దండ-కాటవీ ని
వాసమున కేము నిప్పుడ-పయనమనిన, రామచంద్రుఁడు కరుణాభి-రాముఁడగుచు.

ఉ॥ వేగ ననూనదానముల - విప్రులఁ దన్పి ధనంజయుకన్ మహా
యోగము మీఱ జానకియు - నొయ్యన వెన్కని భక్తియుక్తయై
రాఁగఁ బ్రదక్షిణించి తన - రంగ సుమిత్ర యనుజ్ఞఁబొంది హ
ర్షాగతు లక్ష్మణుంగలిసి - యల్లనఁ దండ్రినిఁ జేరఁ బోవఁగాన్. ౬౧౫

—♦ రామాదుల యరణ్యగమనమునకుఁ బౌరులు దుఃఖించుట ♦—

వ॥ పురీజనంబులును రామాదుల యరణ్యగమనవిషయంబు నాకర్ణించి శోకసంఘూర్ణిత మనస్కులై శ్రేయస్కరులగు సీతారామలక్ష్మణులకు దుర్మనస్కయై కైకేయి యెంతటి చెట్ట నడిగట్టెరా యని కట్టిడితనంబున నాయమ తలఁ దెగఁగొట్టెనను బాపమెట్టిదేని మనలను ముట్టదురా యని నట్టింటికష్టానకు నిష్టాంటించి గొప్పసుఖంబుఁ బడయనెంచిన మెప్పులాడి కైక తప్పుదారి నిప్పుడు తొలంగించు సంగడీఁడు లేఁడని లేరా యని యనేకవిధంబుల ననుకొనుచుఁ బితృగేహోన్ముఖులై చనుచున్న రామాదిత్రయంబుం గని యుల్లలితంబులగు నుల్లంబులతోఁ గొల్లఁగా వెల్లివిరియు కన్నీళ్లులతో నెల్లరును మొల్లంబుగా నిట్లనిరి. ౬౧౬

సీ॥ వాల్లభ్య మొనరింప-వావృత్తుఁడగు రాము, చంద్రుఁడు గహన ని-స్తంద్రుఁ జోట
కీవిధి సీతాస - మేతుఁడై లక్ష్మణుఁ, డనుగతుఁడై రాఁగ - నరుగుచుండె
నకట! రాజు వివేక-మది యేటఁ గలిసెనే?, కైకమాటయె నిరా-ఘాటమాయనె?
ప్రాణతుల్యుని రామ-భద్రుని విడనాడి, కౌసల్య ఘోరమౌ-గ్లానిఁ బడదె?

తే॥ పోదముపదండు మనము స-మూలముగను, సౌధమును ద్రొబ్బి వేగమ-చట్టుబండ.
మొండి కైకేయిపై వైచి-పిండిగాఁగ, మంథరను ఱోటనిడి దంచి-మలయుదమన.
ఉ॥ వెంటనె వామదేవముని - విస్తరమొప్పఁగ రామచంద్రుఁ డా
కంటక కాననంబుఁ గను - కారణముల్ పురివారికెల్ల ని
ష్కంటక రీతిఁ దెల్పి రుష - శాంతిలఁ జేసి దశాననాది దు
ష్కంటకులన్ వధించి వడి - గా రఘురాముఁడు వచ్చునంచనెన్. ఉ.౨౦
ఉ॥ రాముఁడు సీత లక్ష్మణుఁడు - రంజిలు మోముల రాజుఁ గాంచియుం
దాము నమస్కరింప జన - నాథున కూఱటగాఁగఁ బల్కె శ్రీ
రాముఁడు కైకనుం గని క - రంబులు మోడ్చుచుఁ దల్లి! దండకా
నామక కాననంబునకు - నర్మిలినేఁగ ననుజ్ఞ యిమ్మనన్. ఉ.౨౧
ఉ॥ కైకయు వల్కలంబులు త - గం గొని రామునకున్ ధరాజకున్
జోక సుమిత్రి పుత్త్రునకు - జూఁక యొసంగఁగ నిచ్చె నిచ్చినన్
గైకొని రాముఁ డావలువ - గారవమొప్ప ధరించి జానకిన్
బ్రాకట వీక్షణంబులఁ గృ - పారస ముప్పతిలంగఁ గాంచెఁ దాన్. ఉ.౨౨
ఉ॥ అంత వసిష్ఠమౌనివరుఁ - డక్కస మక్కసునొంది రక్కసీ!
యొంతటి కక్కసంపుఁదన - మిక్కడఁ జూపెను కైక! నిన్ను నే
నింతటి దానవంచు మును - నెంచఁగ నైతిని సీతయేమి నీ
గొంతుకకోసెనే? వల్కలము - కొమ్మని కట్టఁగ నిత్తువే? యిసీ! ఉ.౨౩
ఉ॥ రాము నరణ్యవాసమె క - రంబు కృపారహితాత్మవౌచు నీ
వీమెయిఁ గోరి చాలక దు - రిచ్ఛను సీత కసహ్యవేషమున్
బూనెను గూర్తె? పాపిని! మ - ముం గనమేని కుచేష్ట మానవా?
హానిక వల్దటంచు వెస - నాడి సుచేలములిచ్చె సీతకున్. ఉ.౨౪
చ॥ దశరథుఁడున్ సుమంత్రుఁ గని - దైవవిధానము దుస్తరంబు దు
ర్దశగనినాఁడ నిష్ఠు వని - తాసహజన్మయుతుండు రాముఁ డా
భృశగహనంబు సేరుటకుఁ - బేర్మిగ నొక్కరథంబుఁ దార్చుమా!
విశయము వీడఁగా వలసె - వీరలటంచు వచించి ఖిన్నుఁడై. ఉ.౨౫
తే॥ లక్ష్మణుని జానకినిఁ గాంచి-లాలనమున, మేను నిమురుచు దుఃఖించి-మీఁదుకూడ
రాము వెన్కొని చనుమనెన్-రామచంద్రి, సేవ ముఖ్యంబు నీకని-చెప్పెఁ గరుణ.
ఉ॥ సారథి మేటిరథ్యముల - జానగు స్యందనమున్ రయంబుగా
నా రఘువంశ శేఖరుల - యంచల నిల్పిన రామలక్ష్మణుల్
కూరిమి సీతయున్ గురుల - కున్ ధరణీపతికిన్ దదాత్మప
త్నీ రమణీత్రయంబునకు - నెక్కొనుభక్తిని మ్రొక్కి పిమ్మటన్. ఉ.౨౬

క॥ పౌరులకును దదితరులకు, గౌరాబము మీఱ మరచి - గొం బల్కుచు వే
సారక కడునోదార్చుచుఁ, దారు రథారూఢులై ము - దంబున వెలయన్. ౬-౨౯
వ॥ సుమంత్రుండును దశరథునానతి రామాదుల చెంతఁ దానును నుపస్థితుండయ్యె నంత

—♦ శ్రీసీతారామలక్ష్మణు లరణ్యమునకుఁ జనుట ♦—

చ॥ తవ తవ లేక వాజులు హు - టాహుటి టక్కుఁ బర్వునాఱఁ ద
త్కువలయ భాగసోత్థిత వి - ధూమల ధూసర ధూళి యాంబరం
బవఘుళమెప్ప ఘుప్పుమని - యప్పుడు గప్పఁగఁ జక్రివేగ సం
రవమది భోరుకొల్ప రథ - రాజము వేనడపించె సూతుఁడున్. ౬-౩౦
క॥ పిమ్మట రామత్రియము సు, ఖమ్ముగ నమ్మంత్రియుతము - గొఁ దమసాతీ
రమ్మున స్యందన మవరో, హమ్మొనరించిరి సుపద్వ - లభ్యర్చింపన్. ౬-౩౧
చ॥ సరవిని రామమూర్తి తమ - సానదితీరము మాఘమాసమం
దరయఁగ శుక్లపక్షమున - నైదవనాఁటి పగటి వేళలో
నిరవుగఁ జేరె దాఁ బదియు - నెన్మిది వర్షములైన ప్రాయమున్
గిరికొన భద్రచిహ్నములు - కేవలమై కనుపింప నెమ్మదిన్. ౬-౩౨

—♦ శ్రీరాముగులు గుహుని వలన సత్కారములొంది గంగను దాటుట ♦—

చ॥ అట నొకరేయి వారలు ప్రి - యంబుగ నుండి ప్రయాణమై రథ
స్ఫుటగతి శృంగిబేరపుర - ముం గని యందు గుహుండు భక్తి ను
త్కటముగ నిచ్చు సత్క్రియలఁ - గాంచి. వటాగపయఃప్రలిప్తులై
జటలు ధరించి రాముఁడును - సన్మతి లక్ష్మణుఁడొప్పఁ బ్రీతిమై. ౬-౩౩
తే॥ నాఁటిరేయచ్చట వసించి-ననుపు మీఱ, వేగునని యా సుమంత్రుని-వీక్షనేసి
రామచంద్రుఁడయోధ్యాపు-రంబు నీవు, సారథియుఁ జేరుఁడని పంపె-వారి నపుడు.
శా॥ సీతారాములు లక్ష్మణుండు నటవీ - సీమా గనంగా గుహున్
జేతః ప్రీతిగఁబిల్చి నొకను నథ - ప్తింపన్ గుహుం డత్తఱిన్
జ్ఞాతివ్రాతముఁ గూడి నౌక నడుపన్ - గంగానదిన్ దాటుచో
సీతాదేవి సభక్తి మానసమునన్ - జేదోయి సంధించి తాన్. ౬-౩౪
శా॥ రంగత్తుంగ తరంగ గంగఁ గని స - ర్వాంగీణపూతా! స్వన
ద్భృంగవ్రాతయుతా! సమస్తసుర మృ - ద్వీసారవాక్యస్తుతా!
యంగీకార మొనర్చి మన్నతులు సౌ - ఖ్యంబిచ్చి రక్షింపుమా!
గంగాదేవి! యరణ్యవాసము సమ - గ్రంబై జయంబొప్పఁగాన్. ౬-౩౫
తే॥ రామ సౌమిత్రులును నేను - రక్షితముగ
మరలి వచ్చిన యప్పుడు - సురయు వివిధ

బలులు నుపహారములు మాంస – ములు నొసంగి
నిన్ను సేవింతుమమ్మ! మ – న్నింపుమమ్మ! ౬౩౮
మ॥ అని ప్రార్థింప గుహుండు వారితటమం – దా మున్ను వారిం జేర్చి భ
క్తిని మ్రొక్కన్ రఘువీరులా గుహునిఁ బ్రీ – తిన్ వెన్కకుం బంపి తా
రును నా రాత్రి యటన్ వసించి మునివ – ర్యున్ శ్రీభరద్వాజునిన్
గనఁగా నేఁగ కడన్ బ్రయాణమయి త – ద్గణ్యాశ్రమంబున్ గనన్. ౬౩౯
తే॥ అల భరద్వాజ మౌని చే-తులను మోడ్చి, రామునకు సీతకును మఱి-లక్ష్మణునకు
మ్రొక్కి సత్కారములు సల్ప-ముదము నొంది, తత్ప్రయాగను యమునను-దాఁటి వారు.

—♦ సీతారామలక్ష్మణులు చిత్రకూటమునఁ బర్ణశాలయందు వసించుట ♦—

క॥ వాల్మీక్యాశ్రమముం గని, వాల్మీకి యొనర్చినట్టి - భవ్య కృతములన్
మేల్మినిఁ బొంది మహీరుహ, గుల్మవ్యపగూఢ చిత్ర-కూటము నందున్. ౬౪౦
తే॥ సన్మనోరమమౌ పర్ణ-శాల నపుడు, లక్ష్మణుఁడు వేగ నిర్మింప-లలిని నచట
రామచంద్రుండు బలుల న-ర్పణము సేసి, యనుజుతో దారతో నందు-నధివసించి.
తే॥ శయనశాలయు నాసన-శాల పాక, శాలయును హోమశాల ప్ర-శస్త దైవ
శాల వేర్వేఱు వెలయ వి-శాలలీల, సౌధరాజంబునను బోలె-సంతసించె. ౬౪౧
మ॥ గహనోద్భూత ఫలావళుల్ రుచి లస - త్కందంబులున్ మూలముల్
రహిమీఱన్ మృగమాంసముల్ దమి మునీం - ద్ర శ్రేణికిం బారఁగా
సహజాయానుజుఁ డారఘూత్తముఁడు ని - చ్చల్ పెట్టుఁ బూజించు వా
రహాహా! రాముఁ డనన్యసామ్యుఁడన గే - హస్థున్ విడంబించుచున్. ౬౪౩

—♦ శ్రీరాముఁ డైంద్రికాకాక్షిని భేదించుట ♦—

మ॥ ఒకనాఁడా ధరణీసుతాంకమున భ - వ్యోత్సాహుఁడై రాముఁ డిం
చుక నిద్రింగన నైంద్రికాకము నఖ - స్ఫూర్తిన్ గనత్తుండ ఘూ
తుకరీతిన్ జనకాత్మజా మృదులవి - ద్యోతాంగుళం బామిషం
బకదా యంచును జీల్చె రక్తము స్రవిం - పన్ సీతకున్ బాధగన్. ౬౪౪
తే॥ భర్తృ నిద్రా సుఖస్థితి భంగమనుచు, నామె కదలక మెదలక-యట్టెయుండ
రామచంద్రుఁడు మేల్కాంచి-రమణి వ్రేలు, రక్తసిక్తంబగుటఁ జూచి-క్రౌర్య మొప్ప.
తే॥ కాకమును గాంచి యిషిక నొ - క్కటి గ్రహించి
యదియె యస్త్రముగా వైవ - నైంద్రికాక
మబ్జజాండము దిర్మరి - యాశ్రయంబు
లేక శ్రీరాము చరణము - ల్సేరె భీతి. ౬౪౫

తే॥ కావు కావుమటంచు న్వే-గతులఁ బలుక, రామమూర్తియుఁ గరుణించి-ప్రాణరక్ష
సేసి తనయస్త్రమున కెర-సేసె దాని, యక్షి కావునఁ గాక మే కాక్షమయ్యె. ౬౪౭
క॥ ఈరీతి ననేక వినో, దారబ్ధుండగుచు రాముఁ - డనుజన్మునితో
దారామణితో నుల్లస, మారంగా నుబుసుపోక - నట సుఖముండెన్. ౬౪౮
మ॥ అల సూతుండు సుమంత్రుఁడున్ వెస నయో - ధ్యం జేరి రామానులిం
పలరన్ దండ్రి యనుజ్ఞ ముఖ్యమునికై - కాకాంక్ష తీర్పంగ వృ.
క్షలతాకంటక ఘోరవన్య మృగపా - షాణాంచితంబౌ వన
స్థలముం జేరిరటంచు రాజునకు వి - జ్ఞాపించి రాక్రిందుటై. ౬౪౯
క॥ ఆ మాటలు విని దశరథ, భూమీశుఁడు రామచంద్ర - మూర్తీ! యని దుః
ఖామయ పీడితుఁడై సక, లామర నిలయంబుఁ జేర - నసువులు విడిచెన్. ౬౫౦
తే॥ దశరథుండటు మరణింపఁ-దగినరీతి, నావసిష్ఠుఁడు తైలమ్ము-నందు శవము
నునిచి మాతుల నగరికిఁ-జనినయట్టి, భరత శత్రుఘ్నులకు వార్తఁ-బంపెఁ ద్వరగ.
క॥ వారును వెస సాకేతముఁ, జేరఁగ నేతెంచి తండ్రి - చేటును గైకే
యీ రాక్షసి కృత్యమ్ములు, నారసి దుఃఖంబునొంది - యతిరోషముతోన్.
తే॥ మాత నప్పుడు దూషించి మానినిఁ గని, యా వసిష్ఠుఁడు వచియించి-నట్లు భవ్య
మైన సరయూతటంబున-నగ్నివిధులు, తండ్రి కొనరించి సలిపిరి-తత్క్రియలను.
క॥ మంథరమరోప్ఛేదన ని, ర్బంధము రామప్రవాస - పథమని విని గ
ర్వాంధను మంథరఁ గనుఁగొని, ధం ధమ్మని, గుద్దిరపుడు - ధరణీశ సుతుల్

—• భరతుఁడు పరివారయుతముగా రామునిసన్నిధి కరుగుట •—

చ॥ భరతుఁడు సర్వమర్త్యులును - భక్తినిఁ దెల్పినఁగాని రాజ్య సం
భరితుఁడుగాక రామునినె - పట్టము నొందఁగఁ గోరనెంచి త
త్పురజన మంత్రి యుక్తుఁడయి - మున్కొని తల్లులు నా వసిష్ఠ స
ద్గురుఁడును వెంటరాఁగఁ జని - త్రోవ గుహుంగని మానితాత్ముఁడై. ౬౫౧
తే॥ శ్రీ భరద్వాజు నాశ్రమ సీమఁ జేరి, యతనిచే సత్కృతుండయి-యమిత సుఖము
లంది తన్మౌని దర్శిత-మైన పథము, నెఱిఁగి పరివారయుతముగా-నేగి యచల.
తే॥ చిత్రకూటంబునను రమ్య-సీమ సాంద్ర, పర్ణశాలా నివాసులై-వఱలియున్న
జానకీ రామచంద్ర ల-క్ష్మణులఁ గాంచి, రామునకు మ్రొక్కి-నశ్రుధా-రలుస్రవింప
క॥ శత్రుఘ్నుఁడు శ్రీరామున, కాత్రముగా మ్రొక్కి-పలికె - నన్నా! దుశ్చా
రిత్రముతోఁ గైక నినున్, భ్రాతృ సతీయుతముగ - వని పాలఁ జేసెన్. ౬౫౨
తే॥ అన్న భరతునకును నాకు-నన్నఁడైన, నిట్టి చెట్టలు మాతల్లి-యెఱుక పఱుప
దిప్పుడీగతి వంచన-నెంతసేసె, మాకు మీకును నెడఁ బాటు-మారి యగుచు.

క॥ అని దుఃఖింపఁగ రాముం, డనుజుల నోదార్చి తల్లి - ననవలదు చుమీ!
మనకిది దైవవిధానం, బని తెల్పఁగ భరతుఁ డిట్టు - లనె రామునితోన్. ౬౬౦
తే॥ పెంచి పెద్దలఁజేసి ప్రే-మించి మనకుఁ, బరిణయంబులొనర్చి సం-బరము గూర్చి
యెంచుచుండిన మనతండ్రి-మేరమీఱు, నీ వియోగంబుననె మర-ణించె నన్న!
క॥ ఖిన్నత మన తల్లులు నీ, సన్నిధి కేతెంచిరిపుడు - చయ్యన నదిగో!
మున్నొనరించిన నేరము, లెన్నక పురమునకు వచ్చి - యేలుము పుడమిన్.
మ॥ అనినం దండ్రి మృతుండటన్న నుడిచే - నారామ సౌమిత్రులం
తనె గంగానదికేగి స్నాతులయి పి - తృప్రీంబా నివాపంబులన్
మనసారంగ నొనర్చి వచ్చి మరలన్ - మాతాదులం గాంచి వం
దనముల్ సల్పిరి సీతతోడఁ గడు శ్ర - ద్ధాభక్తి యుక్తాత్ములై. ౬౬౩
క॥ పుర జనులును దల్లులు సు, స్థిర మతులౌ మంత్రులును వ-సిష్ఠుఁడు రామున్
బరిపరి విధములఁ గోరఁగ, భరతుం డిటుపలికె సపుడు-పావన మతియై. ౬౬౪

—♦ భరతుఁడు రాజ్యాభిషిక్తుఁడవు గమ్మని రాముని బ్రార్థించుట ♦—

శా॥ అన్నా! రామ! మదీయ వాంఛ విని మా - కాడంగ నిచ్చింపవా?
నిన్నే రాజుగఁ జేసి సర్వజనులున్ - నేనున్ దలల్ వంచి నీ
సాన్నిధ్యంబున నుండి యెల్ల పనులున్ - సాంగంబుగాఁ జల్పి హ
ర్షోన్నత్యంబును బొందు వారమిఁక ర - మ్మా! నీ పురమ్మున్ గనన్. ౬౬౫
ఉ॥ రానని నీవు పల్కుకుము - రాజ్య మదెవ్వరి యబ్బసొమ్ము? మే
మా? నినుగొల్వ నర్హులము - హాయిగ సౌధమునందు నుండకే
కాననమందుఁ ద్రిమ్మరుట - కైకకు నీవు భయంబు పొందియా?
జ్ఞానములేని వారలను - గాల్పినఁ జీల్చిన మంచి పొల్పునే? ౬౬౬
తే॥ ప్రాణమైనను విడుతు శ్రీ-రామచంద్ర!, నిన్ను విడి రాజ్యమునుగొను-నీచబుద్ధి
నాకుఁ గల్గదు జన్మ జ-న్మములకైన, నీకు సేవకుఁడను రాజు-నీవె చుమ్మ.
వ॥ అని ప్రార్థించిన భరతుని దీనాలాపంబులకును భక్తి విశేషంబునకును శ్రీరాముఁ డంతరంగంబున ననంత సంతోషంబునొంది గురువరునిం గని మాన్యుడైన మా భరతునకు భవిష్యత్కార్యావసరముల వివరించి నన్నుఁ బురమునకు రమ్మను పట్టుదల మాన్పుఁడని పలికిన నవ్వసిష్ఠుండును భరతునితో నిట్లనియె. ౬౬౭
మ॥ భరతా! రాముఁడు విష్ణుమూర్తి గమనిం - పన్ బంక్తికంఠాది దు
ష్కరులం జంపఁగ దేవతాతతికి సౌ - ఖ్యం బీయఁగా నిట్టులీ
ధర జన్మించెను దత్క్రియార్థముగ య - త్నం బొప్ప దుష్టాటవీ
చరుఁడయ్యెన్ వెనుదిర్గి రాఁగలఁడె? యి - చ్ఛల్ తీరు పర్యంతమున్. ౬౬౮

క॥ అని బోధించిన భరతుఁ, డనుమానము వీడి రాము - నారసి యన్నా!
ఘన రాజ్యార్థము పాదుక, లను నాకు నొసంగు మవె యి-లారక్షకగున్. ౬౭౦
తే॥ మిమును బోలె జటావల్క - లములు దాల్చి
యా యయోధ్యను వీడి వే - ఱైన చోట
నీదు పాదుకలను గొల్చి - నేను మనుచుఁ
బదియు నాల్గేండ్లు మీరాల - వత్తు రనుచు. ౬౭౧
తే॥ తచ్చతుర్దశ వత్సరాం-తము దినమున, భానున స్తమయము వేళ-వఱకుఁ జూచి
మీరు రాకున్న నగ్నిలో-మేను విడుతు, సనఘ! మమ్మాటికిది సత్య-మనియె నంత.

—• శ్రీరాముఁడు భరతునకు నిజపాదుకలనిచ్చి యనుగ్రహించుట •—

తే॥ రాముఁడు తథా స్తటంచు భ-ద్రముగఁ బలికి, రత్నరాజిత పాదుకా-రాజములను
స్వీయ పదభూషితములను-బ్రేమమీఱ, భరతునకు నిచ్చె నెల్లరుఁ-బ్రమదపడఁగ.
తే॥ వాని శిరసావహించి మ - ద్భాగ్య మనుచు
నలరి యహమేవ ధన్యోస్మి - యనుచు భక్తి
భరతుఁ డారామునకుఁ జల్పె - వందనములు
కైక శ్రీరాముఁగని యప్డు - గద్గదికను. ౬౭౪
ఉ॥ నేర మొనర్చి మిమ్మిటు వ - నిన్ దిరుగాడఁగఁ జేసి శోకచిం
తారతిఁ బ్రాణనాథు మర - ణంబునకున్ దొలి కారణంబులా
కోరిక లేను గోరితిని - గూళను మూర్ఖను దుష్టురాల నా
నేరములెల్ల సైచి కరు - ణింపుము రామ! యటన్న నాతఁడున్. ౬౭౫
శా॥ అమ్మా! కైక! భవత్కృతాజ్ఞ యిది నిం - ద్యం బౌనె? దోషంబు లే
శమ్మైనన్ గనరాదు నీయెడ మది - చ్ఛారీతి యమ్మంథరన్
నెమ్మిం బ్రేరణ సేసె నీహృదయమున్ - నేర్పొప్పఁగాఁ ద్రిప్పి ని
క్కమ్ముల్ నా నుడులింక మీరు పురముం - గానంగ వేంచేయుఁడీ! ౬౭౬
మ॥ అని కౌసల్యను నా సుమిత్రను ముదం - బారంగ నీక్షించి మ
జ్జననుల్ మీరు కృపామతిం గనుఁడు ర - క్షశ్శ్రేణిఁ దున్మాడి వే
గనె వత్తున్ భయమందఁగా వలదు కాం - క్షల్ తీర్చి కైకాత్మజుల్
జనులన్ మిమ్ము నమాత్య దేశికుల ని - చ్చల్ ప్రోతు రచ్ఛాత్ములై. ౬౭౭
క॥ అని యామంత్రణ మమరఁగ, జననుల భ్రాతల వసిష్ఠ - సద్గురువుల నా
జనముల సచివుల సాకే, తనగరమును జేరఁ బంపె - దాశరథి తగన్. ౬౭౮
తే॥ పూర్వమార్గాను సారియై-పోల్పెసంగ, భరతుఁ డెల్లర సాకేత-పురముఁ జేర్చి
నందిగ్రామంబు నిర్మించి-యుండుఁ దాను, వాస మొనరింప నెంచి యు-ల్లాసియగుచు.

—◆ శ్రీరామ పాదుకా పట్టాభిషేకము ◆—

క॥ సింహాసనమున మణిగణ, సంహితలై పట్టి రాము - సత్పాదుకల
త్యాగాహః పరిహారకలుస, రంహస్థితి నిలిపి భక్తి - రంజిలు సేవన్. ౬౮౦

తే॥ వాని నర్చించుచును జటా - వల్కలములఁ
దాల్చి ఫల కందమూల స - ద్భక్షకుఁడయి
రామపాదుకలకె యెల్ల - రాజ్యతంత్ర
ములను దెల్పుచు బ్రహ్మర్షి - వలెఁ జరించి. ౬౮౧

మ॥ అల రామాదుల రాకఁ గోరి మనమం - దానాఁటి కానాఁటికిం
బలరంగా గణియించుచుండి దినముల్ - హా రామ! హా లక్ష్మణా!
కలనైనం గనుపింపరేమి? భువిజా - కాంతాశిరోరత్న మెం
తలు కష్టంబులు పొందుచున్నదొకో? కా - నంగానరం చార్తుఁడౌ. ౬౮౨

—◆ శ్రీరామాదులత్రిమున్యాశ్రమమున సత్కారము లందుట ◆—

వ॥ ఇవ్విధంబున భరతుండు నందిగ్రామంబునఁ గాలంబుఁ బుచ్చుచుండఁ జిత్రకూటంబున శ్రీరామచంద్రుండు సీతాసతీయుతుండై లక్ష్మణునివలన సేవలం గొనుచు మునిగణంబువలన సమాదృతుండై రమ్యమగు నప్పర్వతప్రదేశంబునఁ గ్రీడించుచు మనశ్శిలాతిలకంబు డంబుమీఱఁ బత్నీలలాటంబున నిడుచు గండభాగంబుల నిండారు ప్రేమ నొండుకొన నిజహస్తంబుచేఁ జిత్రవల్లుల నమర్చుచుఁ గోమలమ్ములై నానావర్ణవిరాజమానంబులై చిత్రవిచిత్రంబులగు ప్రసవంబులచేతను నవారుణదళంబులచేతను సీత నలంకరించుచు నచ్చోటన వర్తించుచుండినఁ దద్దర్శన లాలసమానసులగు నయోధ్యాపురివాసుల రాకపోకలెక్కుడై రామునకాతంకంబు చేతంబున స్ఫురింపఁజేసిన నతండా చిత్రకూటంబును వదలి భార్యాభ్రాతృయుతుండై యనుత్తమమగు నత్రిమహర్షి యాశ్రమంబుం బ్రవేశించి యమ్మునీంద్రునకు నమస్కరించి యతనిచే సత్కృతుండై దినత్రయంబచ్చట వసింప నతివ్రతస్థితి గుహాస్థయగు ననసూయాదేవిని భయవినయసంభ్రమంబులు ముప్పిరిగొనుచిత్తంబున సీతోత్తమ కనుంగొని మ్రొక్కి యామెచే సమాలింగతయై తదంక పీఠోపవిష్టురాలైన నామెను ననసూయయు మహాదరంబునఁ బూజించి విశ్వకర్మ నిర్మితములయిన దివ్యకుండలద్వయంబును దుకూలయుగంబును నంగరాగంబును నొసంగి యిట్లనియె.

శా॥ తల్లీ! జానకి! త్వత్పతివ్రతమహా - త్త్వంబింపుగాఁ బ్రేమరం
జిల్లన్ రామసుఖానుసారిణివిపై - శ్రేయంబు పాటింపుమా!

మెల్లీలన్ మఱి యెప్పుడైన నిసుమం - తేనిన్ భవత్కాంతి శో
షిల్లం బోవను గేహముం గుశలులై - చేరంగ నో మీకొగిన్. ౬౮౪

క॥ అని మేటి ధర్మములు మె, ల్లన దెల్పిన విశ్వసించి - లక్షణవతియా
జనకజ పతినిం జేరఁగ, ననువుగ మఱి సత్కృతముల - నత్రి యొనర్చెన్. ౬౮౫

క॥ పిమ్మట రాముఁడు భార్యయుఁ, దమ్ముఁడు వెనుకొనుచురాఁగఁ - దన్మునివరుచే
సమ్మతిఁ గొని వెడలి యర, ణ్యమ్మును ఘనమైనదాని - నప్పుడ సేరెన్. ౬౮౬

తే॥ దండకావని నరిగెడు - తరుణమందు
రామచంద్రుఁడు ధృతధను - ర్బాణుఁ డగుచు
ముందునడువఁగ జానకీ - ముదిత యతని
వెన్కనఁగ లక్ష్మణుండామె - వెనుకఁ జనుచు. ౬౮౭

క॥ డాకేలన్ ధనువును దా, ల్చోకఁగ ధరియించి దెసలు - సూచుచు శరముల్
ప్రాకటముగ వలకేలం, గైకొని సీతానుసాధ్విఁ - గనె మెలఁకువతోన్. ౬౮౮

క॥ వారా ఘోరాటవిఁ గా, సారంబును నొందుగాంచి - స్నాతులగుచు నా
వారిం గ్రోలియు సుఫలా, హారంబులొనర్చి క్షణము - హాయిగ నుండన్. ౬౮౯

—• విరాధ వధ •—

మ॥ అతి సత్త్వుండు భయానకుండు శితదం - ష్ట్రాభీలవక్త్రుండు గ
ర్జిత సంభ్రాంత దిశాముఖుండు గహనో - ర్వీసంచరద్వ్యాఘ్రబృం
హిత మాతంగలులాయభక్షకుఁడు హిం - సీభూతవన్యుండు గ్రం
థిత శూలాగ్రనరుండు దైత్యవరుఁ డే - తెంచెన్ విరాధుం డటన్. ౬౯౦

క॥ వానినిఁ గని లక్ష్మణుతో, జానకి నాథుండు పలికె - సౌమిత్రీ! యీ
మానవభోజిం జంపెద, మానక సంరక్ష సేయు - మా! ధాత్రిసుతన్. ౬౯౧

క॥ అని తన ధనువున గుణమును, ననుసంధానం బొనర్ప - నారాక్షసుఁడున్
జనపతి సుతులను సీతను, గని మీరెవరంచు నడిగె - గంభీరోక్తిన్. ౬౯౨

ఉ॥ వాని నెఱింగి రాముఁడును - బంక్తిరథాత్మజులయ్య! మేము నా
మానిని యీమె కైకేయను - మాతయుఁ దండ్రియు నాజ్ఞ సేయఁగాఁ
గాననమందుఁ ద్రిమ్మరుచుఁ - గాలముఁ బుచ్చుచునుంటి మిట్టులన్
దానవ! నీవు ప్రాణుల వృ - థా వధియింపఁగ రాదటంచనన్. ౬౯౩

క॥ పకపక నగి యారాక్షసుఁ, డిఁకఁ జాలును నోరుమూయు - మీ ధర్మములం
గకవికలగుదునె? మునివర, నికరమె భయమంది పఱచె - నేనన వినవా?

క॥ నాపేరు విరాధుఁడు నేఁ, గోపించిన సకలజగము - గూలును ద్రుటిలో
నీ పెండ్లాము నొసంగియు, నేపొండిట నాయుధముల - వీడి యెచటికేన్. ౬౯౫

మ॥ అని సీతం గొనఁబోవ రాముఁ డతిరో - షా క్రాంతుఁడై యేమిరా?
కనులింపైన నను గానరావ? తులువా! - కార్యాంతరేలా? మదం
బున దుష్కార్యము సేయవచ్చెదవె? ని - ర్మూలింతు నీరూపమం
చును దద్దైత్యుని హస్తముల్ దునిమె వా - క్యమ్ము పొసక్తిక్ వెసన్. ౯౬

వ॥ హస్తహీనుండై రక్తధారాసిక్తదేహుండైన విరాధుండు నిరస్త్రపాసన్నుండై వక్త్రంబుం దెఱచి రామానుజులను మ్రింగఁబూని తఱిమిన. ౯౭

తే॥ వాని గర్వంబునకుఁ గ్రోధ - మూని వాని
పదయుగంబును శ్రీరామ - భద్రుఁ డపుడు
ఖండనముసేసె రక్షోన్వ - యుండు మరల
సర్పమునుబోలె రోఁజుచు - దర్పమంద. ౯౮

తే॥ అర్ధచంద్రశరంబు ర-యంబు మీఱ, రాఘవుఁడు వైచి చంపె వి-రాధు నుష్టుఁ
దత్కృతంబున కాభూమి-తనయ మిగుల, గారవముఁ జూపి భర్తను-కౌఁగిలించె.

క॥ దివి దేవగణపేరిత, మవు దుందుభు లపుడు మ్రోసె - నలరుల వానల్
సవసవ సురలుం గురిసిరి, భువిఁ గూలిన యసుర దేహ - మున నొకఁ డొదవెన్.

శా॥ ఆ తేజస్కుఁడు రామచంద్రుఁ గని దే - వా! నేను విద్యాధరుం
డై తార్మ్యజునఁ దప్పుసేసి మునిలో - కారాధ్య దుర్వాసు శా
పాతంకంబున రాక్షసుండయితి నై - చ్యం బాదింటిక్ నేఁడు మీ
చేతన్ ముక్తినిఁ గాంచితిన్ నతులివే - శ్రీరామ! యంచున్ దమిన్. ౨౦౦

తే॥ గగనయానంబు నెక్కి స్వ-ర్గంబుఁ జేరె, హర్ష మేపార నాల విద్యాధరుండు
లలిని శ్రీజానకీ రామ-లక్ష్మణులును, వెడలి శరభంగముని తపో-విపిన మరసి.

— శరభంగమునికి ముక్తి గలుగుట —

క॥ మునిఁగని మ్రొక్కిన నతఁడును, ఘన సత్కారము లొనర్చి - కరుణా భరణా!
యినకుల భూమీరమణా!, దనుజోత్కరహరణ! పాప - తరణా! యనుచున్.

తే॥ రామునిస్తుతింప వారొక్క - రాత్రి యచట
నుండి రంతట శరభంగుఁ - డుత్సుకమునఁ
జితను గల్పించుకొని పుణ్య - తతిని రాము
భద్రునకు నిచ్చి తా విష్ణు - పదము నొందె. ౨౦౪

వ॥ సహజాయా సహజన్ముఁడగు దశరథమహీధవాగ్రసుతుండు నిండు వేడుకతో నటనుండి బయలుదేరి సుతీక్ష్ణు నాశ్రమంబుం బ్రవేశించి యతనివలన నామంత్రితుండై సుఖంబుండు సమయంబున. ౨౦౫

క॥ నానాశ్రమసంవాసము, నీనుల్ గుమిగూడి రాము - నీక్షింపగఁగన్
వేనకు వేలరుదెంచిరి, నానా శ్రమ వారణము గ - నంగ మనంగన్. ౨౦౬

—♦ శ్రీరామాదులకు సర్వమునులు సత్కారము లొనర్చుట ♦—

క॥ వచ్చినవారలు రాముని నుచ్చైస్స్వనులగుచుఁ బొగడి - యొకరొకరుగ నా
సచ్చరితునిఁ దమ నెలవుల, కచ్చపుమతిఁ దోడితెచ్చి - యర్చింపంగన్. ౨౦౭

వ॥ భార్యాభ్రాతృయుతుండైన శ్రీరామచంద్రుండును మునివరుల భక్తివిశేషంబునకు వశుండై వారలప్రార్థనము ననుసరించి యొక్కయెడ నేక రాత్రంబును మఱొక్కచోఁ ద్విరాత్రంబును వేఱొక్కయాశ్రమంబున నైదుదినంబులును మఱొండుచోట సప్తదివసంబులును నింకొక్క నెలవునఁ బక్షమాత్రంబును నన్య మున్యాశ్రమంబున మాసంబును నితరర్షిపర్ణకుటీరమున నొకటిన్నర నెలయును నింకొక్కముని నివాసమ్మునఁ ద్రిమాసమ్ములును మఱియొక తపస్విచెంగటఁ బంచమాసంబులును వేఱొండు ఋష్యాశ్రమంబున షణ్మాసంబులును మఱొండుతావున నెనిమిదినెలలును నిఁగ నొక్కయెడ నేకాదశమాసంబులును మఱికొన్ని మునిధామంబుల సంవత్సరంబుంగా మెలంగుచుఁ దత్తన్మునీంద్ర దత్తసత్కారప్రీత మానసుండై యా దండకారణ్యంబుననుండ నుల్లాసంబుగా నవవర్షంబులు నిండినంత. ౨౦౮

క॥ ఆలోపల సానుజుఁడై, వాలాయముతోడ రామ - భద్రుఁడు రక్షో
భీలావళి నటనటఁ గని, కాలావసథమున కనిపెఁ - గడువడి వారిన్. ౨౦౯

తే॥ సకల దివ్యాశ్రమమ్ముల-స్వచ్ఛనదుల, జలతటాకాద్రి శిఖరాది-తలములందు
నామ్రమృద్వీక జంబూద్రుమాది వివిధ, తరు మనోజ్ఞలతాకాంత-పరిసరముల.

క॥ సీతారమణీయుతుఁడై, స్ఫీతానందంబు నొంది - శ్రీరాముఁడు వి
ద్యోతితవికసితముఖవా, ర్జాతుండయి మించెఁ గేళి - సరస మెలర్పన్. ౨౧౧

వ॥ తదనంతరంబున రామలక్ష్మణులును సీతాసతిని రక్షించుకొనుచు నరిగి యగస్త్యభ్రాతాశ్రమంబుం బ్రవేశించి యాసుమతివలనఁ బూజితులై పదంపడి నానావృక్షవిరాజితంబగు నగస్త్యనాశ్రమంబునకుం జనిన నమ్మునిశార్దూలుండును బహుముని పరివృతుండై జానకీయుతులగు నారాజసింహుల నెదుర్కొని రామచంద్రు నాలింగనంబొనర్చికొని వారినిఁ దనయాశ్రమంబునఁ బ్రవేశింపఁజేసి తగురీతుల సత్కరించినఁ బ్రీతమానసుండై రామచంద్రుండటఁ గొన్నదినంబులుండె నంత. ౨౧౨

—♦ శ్రీరాముని కగస్త్యముని ధనుర్బాణముల నొసంగుట ♦—

చ॥ కడుకొని కుంభసంభవుఁడు - కమ్రనమోక్తుల రామచంద్రునిం
బడరఁగ సంస్తుతించి పర - మాత్మ! రమారమణా! కృపాప్తిని

య్యెడ కరుణించి నాజనన - మొంతయు సార్థకమొనర్చి నా
యెడఁదకు దృప్తి నిచ్చితివి - హృద్యము నీచరితంబటంచుఁ దాన్. ౨౦౬
తే॥ అలమహేంద్రు పురాదత్త-మైన ధనువు, నక్షయములైన బాణంబు-లంబుపొదులు
రత్నభూషిత కరవాల-రాజమొసఁగి, పూజసల్పెను శ్రీరామ-మూర్తి కలరి.
తే॥ కుంభసంభవు ననుమతిఁ-గొంచు వెడలి, తమ్ముతో దారతో వని స్థలిని నడచి
గౌతమీనద్యుదక్తటిం-గాంచి రమ్య, పంచవటిఁ జేరఁబోవు చా-పథము నందు.

—♦ రామాదులు పంచవటిం జేరుట ♦—

మ॥ అచలాకారు ననూరుపుత్త్రు గుణాఢ్యు - ర్యక్షేష్ముఁ బక్షీంద్రు భ
క్తిచరిష్ణున్ బితృమిత్రునిన్ స్తుతమతిన్ - ధీరున్ జటాయ్వాహ్వయున్
వచనానందము మీఱఁగాంచియుఁ బిఱుం - దన్ రాఁగ నాతండు మె
చ్చుచు నాపంచవటి స్థలంబరసి య - చ్చోనుండఁ గాంక్షించినన్. ౨౦౭
క॥ పక్షీంద్రుఁడు లక్ష్మణుఁడును, లక్షణముగఁ బర్ణశాల-లను నిర్మింపన్
జక్షుః ప్రియముగ రాఘవుఁ, డాక్షణమున బలులొసర్చి-హర్షహృదయుఁడై. ౨౦౮
ఉ॥ అందునివాసముం జలిపె - నయ్యనుజుండు జటాయువున్ బ్రియం
బందుచుఁ దన్ను గొల్వఁగ ధ - రాత్మజ సౌఖ్యముఁ గూర్చుచుండ నా
చందమునన్ ద్రివర్షములు - సార్థముగాఁ గడచెన్ జటాయువా
ర్యందరశాక్షి జానకిని - నచ్చట రక్ష యొనర్చుచుండఁగన్. ౨౦౯

—: లక్ష్మణుండు సాంబుని సంహరించుట :—

క॥ ఆసమయంబున వని ఘో, రాసురుఁడున్ శూర్పణఖకు-నాత్మజుఁడును నా
నా సాంబుఁడు భక్తి శ్ర, ద్ధా సహితుండగుచుఁ దపముఁ-దానొనరించెన్. ౨౧౦
చ॥ అతని తపోవిశేషమున - కంబుజసంభవుఁ డాత్మమెచ్చి వే
శితకరవాల మొండతని - చెంగటనుంచిన దాని నప్పుడా
దితిజుఁడు గాంచడఁయ్యె రఘు - ధీరుఁడు లక్ష్మణుఁ డాకృపాణ మం
చితమతిఁ బొంది తీవలును - జెట్లును గొట్టుచునుండు నంతటన్. ౨౧౧
క॥ గుల్మాంతరుఁడై తపమును, మేల్మిగనొనరించు సాంబు-మేనుం దెగియెన్
గల్మషమందితి నంచును, జాల్మెడనని లక్ష్మణుండు - సరగునఁ జనితాన్. ౨౧౨
తే॥ అన్నకు నమస్కరించి రా-మన్న! నేఁడు, నేను బొరవడి బ్రహ్మర్షి-నిని వధించి
తప్పొనర్చితిఁ దత్పాప-తతిహతంబుఁ, బుణ్యదంబుఁ బ్రాయశ్చిత్త-మున్ వచింపు.
వ॥ అని ప్రార్థించిన. ౨౧౩
ఉ॥ రాముఁడు లక్ష్మణుంగని క - రంబు కరంబలరంగఁ గాంచి నీ
కేమియు భీతివల్వదు ల - యింపఁగఁ బడ్డజనుండు రాక్షసుం

జ్ఞా మునిగాని బ్రహ్మఋషి - యాతఁడు కాఁడని యూఱడించెఁ బ్రి
జ్ఞామహితుండు లక్ష్మణుఁడు - స్వాంతమునన్ భయమేదెఁ దృప్తిమై ౨౨౮

—♦ శూర్పణఖాఘ్రాణ కర్ణ చ్ఛేదనము ♦—

తే॥ పుత్త్రమరణ మెఱింగి యా-పాలసుదిండి, యైన శూర్పణఖా కాంత-యమితశోక
ఖిన్నయై క్రోధచిత్తయై-కేళ్లుఱుకుచు, నొక్కతఱిఁ బంచవటి రాము-నొయ్యఁగాంచి

క॥ కాపట్యంబగు బుద్ధిని, భూపాలకసుతుల మోస - పుచ్చఁగ దైత్యా
కోపన రమ్యాకృతియై, యా పొంతకు నరిగి మధుర - సాలాపములన్. ౨౨౯

ఉ॥ ఎవ్వరు మీరలిద్దఱు? శు - భేక్షణ యీమెయెవర్తు? కానలో
ముప్పురునిట్లు తిమ్మరఁగ - మూలపుఁ గారణమేమి? యింక మీ
రెవ్విధి నెందుఁ జేరెదరు? హృద్యముగా వచియింపుఁడన్న నా
జవ్వనికెల్ల వృత్తము ప - సంగుగ రాముఁడు తెల్పెఁ దెల్పినన్. ౨౩౦

వ॥ శూర్పణఖయు శ్రీరామునిభర్తఁగా గోరిన నాతండు చెంగటన నాభార్యగలదు లక్ష్మణు నభిలషింపుమని వచించె నంత నాదైత్యకాంత సౌమిత్రి నివరింప గోరిననతండును నేనురామునకు దాసుఁడనై చరించుచుంటి నీకనీవును దాసురాలవు కావలసి వచ్చునని చెప్పి తప్పించుకొన్న నాటక్కులాడి సీతను గుటుక్కుమని మ్రింగ నెంచి తటాలున నటకేగి యామెను గ్రహింపఁజూచిన రాఘవుండు యోజించి యొక్కతు రోపముశరంబు శూర్పణఖకొసంగి యియ్యది లక్ష్మణునకుఁజూపింప నతండు నీ కార్యంబు సిద్ధింపఁజేయునని వెడలంజేసిన నాశరభామినియుఁ జిహ్నంబుగా రాముఁడొసంగినబాణంబు లక్ష్మణునకొసంగి యంగీకారంబువేఁడిన సుమిత్రాసుతుండు రామాశయంబెఱింగి తత్క్షణంబ శ్రీరాముబాణంబు ధనుస్సున ననుసంధించి విడిచిన నాయమ నాసికయుఁ గర్ణంబులును నోష్ఠంబును బయోధరాగ్రంబులును డుల్లఁజేసి యయ్యది పెడమఱి రామతూణీరమ్ముఁ జేరెనంత ఖండితఘ్రాణ కర్ణోష్ఠపయోధరాగ్రయై శూర్పణఖ బొబ్బరిల్లుచుఁ బెల్లేడ్చుచుఁ దల్లడపాటునఁ దనబాంధులగు ఖరదూషణాదులం జేరం జని వారలకుం దన పరిభవంబు నెఱింగించి దుఃఖించిన.

—♦ ఖరదూషణ త్రిశిరాదుల సంహారము ♦—

క॥ ఖరదూషణులును ద్రిశిరుఁడు, గరువంబు రహింప భూమి - కాంతునిసుతు లి
ప్పురుసున శూర్పణఖను న్, ధ్ధరముగ దండించుటరసి - దోర్బల మొప్పన్.

క॥ పదునలువుర ఘనదైత్యులఁ, గదనకళానిపుణమతులఁ - గడువడిఁ బనుపన్
గొదకొని వారలు రాముని, నెదరించిరి దార్ష్ట్యమొనర - నిలయును నదరన్.

క॥ శ్రీరాముండు చతుర్దశ, ఘోరాసుర వరులఁ గాంచి - కోపోద్రేకుం
డై రయమొప్పఁ జతుర్దశ, నారాచములేసి వారి - నాశమొనర్చెన్. ౨౩౧

క॥ పనిచిన దనుజులు మరణము, గనిరని ఖరదూషణులును - గనఁ ద్రిశిరుండున్
గానకొని పదియలువేవుర, ఘనబలులనుగూడి రాముఁ - గని పోరాడన్. ౨౩౧

వ॥ రామచంద్రుండును సీతాలక్ష్మణుల నొక్క గుహాయందునుండ నియమించి. ౨౩౩

తే॥ ధైర్య శౌర్యస్థితినిఁ జతుర్దశ సహస్ర, రూపుఁడై వారి నెదిరించి-రూపుమాపె
గణమొఱప్పున నొక ముహూర్తమున నిశిత, శరపరంపరలను వేగఁ-గురియఁజేసి

వ॥ ఖరదూషణ త్రిశిరనినాశంబయియుండు నాగాత్రమితటంబె త్రికంటక త్ర్యంబక నామంబులం బరంగె ననంతరంబ శ్రీరామచంద్రుండు భూసురులకు జనస్థానంబొసంగ జానకియు సంతసించి 'రాముసాశేషించి యతనిం బ్రశంసించిన నాతండును సతీమణిం గని రహస్యంబుగ సాదరంబున నిటనియె. ౨౩౪

—♦ శ్రీసీతారాముల రహస్య సల్లాపము ♦—

శా॥ సీతా! నీవుత్రియోగతిన్ ద్రిగుణ సం - సిద్ధిన్ రయంబారఁగా
నేతత్కాలకృతానుసారముగ వ - హ్నిన్ నాయెడన్ డాపలన్
దైతేయుండగు పంక్తికంఠుని క్రియా - ర్థంబై వనిశాలలోన్
జేతఃప్రీతిగ వర్తిలన్ వలయు నీ చేజన్గు చారిత్రమున్. ౨౩౫

వ॥ అనిన నవ్వరారోహాయు భర్త్రనుజ్ఞామోదహృదయయై యట్లవర్తించె నా శూర్పణఖయు లంకకుం జని రావణాసురుని వీక్షించి శోకసంఘూర్ణితమనస్కయై యిట్లని విన్నవించె. ౨౩౬

—♦ రావణునితో శూర్పణఖ మొఱపెట్టుట ♦—

శా॥ ఛీ! పో! రావణ! రాక్షసాధిపతివై - చేడ్పాటు వాటిల్ల నీ
వ్యాపారంబునుమాని మూలనొదుగన్ - భావ్యంబె? వీక్షింపు నా
రూపం బెట్టి వికారమందెనొ? మహా - క్రోధంబుతో రాముఁడా
చాపాస్త్రంబుల నా ఖరాది ఘనర - క్షశ్శ్రేణిఁ దున్మెన్ వడిన్ ౨౩౭

తే॥ సీతయును లక్ష్మణుండు వి-ఖ్యాతకీర్తి, నతనిఁ గొల్తురు మానవుఁ-డైన రాముఁ
డీవిధంబున వనిలోని-యెల్లయసుర, రాజిఁ గూల్పఁగ నీకేల?-రాచఱికము? ౨౩౮

క॥ అనినన్ సింహాసనమం, దుననుండియు లేచి యేమి - దుర్మార్గము? నా
దనుజ సమూహముఁ గూల్చె నె?, మనుజుఁడు నిను వికృతఁజేసె మహిఁనని యతఁడున్

కః శూర్పణఖా! వచియింపుము, దర్పంబున రణమొనర్చి - దైత్యుల నేలా?
నేర్పరి మనుజుఁడు రాముఁడు, కార్పణ్యముతోడఁ జంపెఁ - గాననసీమన్. ౨౪౦

వ॥ అనియడిగిన నాతనితో శూర్పణఖ మరల నిట్లనియె. ౨౪౧

తే॥ రామపత్నిని జానకీ-రమణిఁ గాంచి, నీకుఁదగు కాంత యని యెంచి-నేను వెడలి
యామెను గ్రహింపఁబూన రా-మానుజుండు, నన్ను వికృతనొనర్చెను-ఖిన్నతఁగన

క॥ తత్తారణమున దైత్యస, ముత్కరమును నేను జేరి - మొఱలిడ వారుం
నత్తువల సమసత్పుత్రుల స, సత్కృతులను జేరిపోరి - చచ్చిరి మఱియున్. ౨౮౪
తే॥ ఏమి హేతువో? నాసుతుఁ - డిన్ని హెచ్చు, సాంబుఁ డవ్వానిఁ దపమును - జల్పుచుండి
ఖడ్గఘాతంబుచే నన్ను - గాంచినాఁడు, రావణా! యీ యనర్థముల్ - ప్రబలెనన్న!
ఉ॥ పౌరుషముండెనే నని? రఘు - వర్యుని భార్యను సీతఁ దెమ్ము, లే
దా? రమణుం గను చచ్చిన వ్య - థాభరయౌ వనితోపమంబుగా
ధారుణి నీవధోముఖు వి - ధానముతోఁ గృశియింపుమంచు రో
షారుణ నేత్రుఁడై పలుక - నాతఁడు సూఱట గూర్చి యూర్చుచున్. ౨౮౬
తే॥ రావణుఁడు దివ్యహాస్వయు - రథము నెక్కి
మాతులుని విష్టు మారీచు - మానివృత్తుఁ
జేరి వందన మొనరించి - చెప్పినపుడు
రాఘవులు సల్పినట్టి కా - ర్యముల నెల్ల. ౨౮౭

— ♦ రావణ మారీచ మంత్రాలోచన ♦ —

శా॥ ఆ మారీచుఁడు రావణాసురుని వా - క్యశ్రేణి నాలించి శ్రీ
రామాఖ్యన్ వినినంత నుల్కిపడి పో - రాముల్ ఘటించెన్ దశా
స్యా! మర్త్యుండని రాముని దలఁప కెం - చన్ సర్వలోకాత్మ సం
ధాముంగా గమనింపుమా! మును పెత - త్సామర్థ్యముం గాంచితిన్. ౨౮౮
తే॥ కౌశికుని జన్నమున రామ కాండశక్తి, నలఁగిపడినాఁడ రాముఁడ-నంగ రథము
నంగ రజతమ్మనంగ ర-త్నంబనంగ, రాయనంగను భీతిసంభ్రాంతుఁడగుదు. ౨౮౯
క॥ దైతేయాధిప! పగగొని, యాతనిపైఁ జనెదుబుద్ధి - యుది సరికాదీ
నీతులు విశ్వాస ద్రోహాతతుఁడగు నెవనివలన - నాలించితివో? ౨౯౦
క॥ లంకానాశన హేతువు, బింకంబులు పనికిరావు - వేయేలా? కో? రా
మాంకితశరమున నెవఁడే, నంకిలిగొని చావకున్నె? యాగ్రహమగునే? ౨౯౧
మ॥ అని బోధించిన రావణుండు కడురో - షాక్రాంతుఁడై యిట్లనున్
మన బంధుండు సహాయుఁడయ్యెదుఁ గదా? - మా మామ యంచెంచి నిన్
గని ప్రార్థించినఁ బైకనిక్కెదవె? మ - త్కార్యంబు సేయంగఁ గా
దనినన్ నిన్నువధింతుఁ బొమ్మ వెస మా - యాస్ఫూర్తి నేణంబవై. ౨౯౨
క॥ నినుఁగని రాముఁడు వెనుకొన, వనమున దవ్వేగి రామ - వాక్యోపమని
స్వనమున లక్ష్మణ! చచ్చితి, నని యఱచుము లక్ష్మణుండు - నచటికిఁ బఱచున్.
క॥ ఆ సమయంబున నేఁ జని, యా సీతాకాంతఁ గాంచి - యామెనుగొని యు
ల్లాసముతోఁ బురిఁ జేరెద, నాసురరాజ్యమున నీకు - నర్ధము నిడెదన్. ౨౯౪

మ॥ అన నా రావణురోషము౯ దెలిసి దు - ష్టాగ్రేసరుండైన యా
తనిచేఁ జచ్చుటకంటె రామకర సం - ధానాస్త్రఘాతంబుచే
వనిలోఁ జచ్చుటె మేలటంచు మది సం - భావించి మారీచుఁ డం
తనె మాయామృగరీతిఁ బంచవటి చెం - తం జేరెఁ దళ్కొప్పఁగ౯. ౨౫౫
శా॥ ఆ సారంగ విలాసమానమున కా - యాలోకనశ్రీలకు౯
శ్రీసీతాసతి మోహమొంది రమణు౯ - శ్రీరాము నీక్షించి నా
థా! సారంగము చిత్రశోభితమదే! - దాని౯ వెసం దెచ్చి యు
ల్లాసంబేర్పడ నాకునిమ్ము శుభలీ - లాక్రీడకై పోడిమి౯. ౨౫౬

—♦ శ్రీరాముఁడు మాయామృగము వెంటనంటుట ♦—

క॥ అని వేఁడిన శ్రీరాముఁడు, ననుజునిఁగని సీతఁ బ్రోవు- మా! యిదె యిఁక నేఁ
జని యా మృగమును దెచ్చెద, నని దానిని వెనుకొనంగ - నది పరువెత్తె౯.
ఆ॥ జింక పరుగువాఱ శ్రీరామచంద్రుండు, తానుఁ బఱచి పఱచి-దవ్వుదలఁచి
నిలిచి బాణమొండు-నేటుగా వైచిన వంచనామృగంబు-వసుధఁ గూలి. ౨౫౭
క॥ హా! హా! లక్ష్మణ! రమ్మా!, సాహాయ్యమొసర్ప వేగఁ - జచ్చితి నిచట౯
బాహుళ్యము వ్యథయని తా, హాహాకారమునఁ గ్రిక్కి-యఱ్రిము చచ్చె౯.
ఉ॥ ఆరవ మాలకించి జన - కాత్మజ సాధ్వసచిత్తయై రయం
బారఁగ లక్ష్మణా! చనుము - హా! యని నీదు ప్రియాగ్రజుండు దు
ష్కారణ బాధితుండగుచుఁ - జచ్చితినంచు నెలుంగు నెత్తిని౯
సారెకుఁ బిల్చె దైవము వి - శాల కృపాహృదయుఁడౌచుఁ బ్రోవుత౯. ౨౬౦
క॥ అని దీనంబుగ నేడ్వఁగ, ననఘుఁడు లక్ష్మణుఁడు సీత - నారసి తల్లీ!
మన శ్రీరాముని కంఠ, ధ్వని కాదది యసురమాయ - భయమేల? యనె౯.
ఉ॥ సీతయు లక్ష్మణుంగని యి - సీ! కడువంచకుఁడయ్య నీవు చే
డా తరుణంబెఱింగి భర - తాదుల నేర్పున రామచంద్రు వి
ఖ్యాతచరిత్రుఁ జంపుటకుఁ - గాఁ దలపోసితె? లేక నన్ను మో
హాతిశయంబునం గొనఁగ - నాసఁ జెలంగితె? యంచుదూరుచు౯. ౨౬౧
క॥ క్షోణీతలమ్మున నాదగు, ప్రాణంబులనైన విడుతు - రాముని విడి నీ
రాణింపుల మాటలను న, రీణంబుగ నమ్ముదునె? వ-రింతునె నిన్ను౯. ౨౬౩
వ॥ అనుచు నిందావచనంబుల నతనిమనంబు నొప్పించిన సౌమిత్రియు సీతకు నమస్కరించి తల్లీ! రామాజ్ఞ నుల్లంఘించి నిన్ను నొంటరిగా విడిచిపోవ శంకించితిం గాని నాయందు లవమైన దురభిప్రాయంబు కలిగియుండిన భగవంతుండె సాక్షియౌనని నిష్కారణముగ నీవ నన్ను నిందించినఁ దత్ఫలంబుఁ దప్పక యనుభవవేద్యంబు కాఁ

గలదని వచించి పర్ణశాలాంగణమున ధనురగ్రంబుచే నొక్కగీటుగీచి మరల సీతతో మాతా! నీవీ గీతదాటి చనవలదుసుమా! దైతేయుల మాయామార్గంబులకుఁ బాలుపడకుండ నియ్యది నిన్ను రక్షింపఁ గలదని ముమ్మాఱు వాక్రుచ్చి త్వరితగమనంబున నన్నుం జేరంజనియె నంత. ౨౬౪

—♦ రావణుఁడు సీత నపహరించి జటాయువును జయించి వెడలుట ♦—

తే॥ దేహమున భూతిరేఖలఁ-దీర్చి యక్ష, సరము కరకయుఁ గావివ-స్త్రముధరించి
సోఁది రావణుఁడపుడు భి-క్షుకునిరీతి, వంచనా వేషుఁడై పంచ-వటికి వచ్చి. ౨౬౫

తే॥ పర్ణశాలను దరిసి త-ద్ద్వార పూర్వ, భాగతలమున నిల్చి భూ-భవనుగాంచి
దేవ దేవ! మహాదేవ! దీనపోష!, యనుచు భిక్షాం దదాతు కాం-తా! యటన్న.

క॥ ఛాయామయియగు సీతయు, మాయామునిఁ గాంచి భిక్షమానుగఁ గొని క్రే
ల్దోయిఁజాఁచియు వాకిట, నే యుండి యొసంగఁబూన-నిటులనె నతఁడున్. ౨౬౬

మ॥ ఇదియేదో? యొకరేఖ యంతరముగా - నిచ్చోటఁ గన్పించె స
మ్మదచిత్తంబున దానిదాటి యొసఁగం - బోలున్ దగన్ భిక్ష ధ
ర్మదయా సత్యనిధానుఁడౌ ధవుని గా - ర్హస్థ్యంబు రక్షింతువే
ముదితా! యీవలవచ్చి భిక్షనిడఁగాఁ - బొంవంగనౌ నాపుడున్. ౨౬౭

తే। ధర్మగుణ మాత్మనెంచి సీ - తా సుసాధ్వి
రేకకవ్వల డాకాలు - జొకనుంచి
భిక్షగొనుఁడని మునినిఁ దా వీకు - సేయ
భిక్షురూపంబు విడనాడి - భీప్రదముగ. ౨౬౮

మ॥ దశకంఠుండు ధరాసుతంగొని మహా - దర్పంబుమైవాహ సి
ద్ధశతాంగంబునునెక్కి పోవునెడఁ ద - ద్దౌష్ట్యంబు వీక్షించి భ
వ్యశకుంతంబు జటాయువాత్రముగ ర - థ్యంబుల్ పడంద్రన్ని వా
నిశతాంగంబును శార్ఙ్గమున్ ముకుట పా - త్రిం గూల్చి పక్షాహతిన్. ౨౭౦

క॥ మఱియును ముక్కున రావణు, నఱిముఱ్ఱిగాఁ బొడిచి జర్జ-రాంగునిఁ జేయన్
వెఱపడి యొఱకటమున ధర, నొఱఁగియు దశవదనుఁడంత-నొల్లంబోయెన్. ౨౭౧

వ॥ జటాయువత్తఱి సంతసించి మంచిగా జానకి నూఱడించి యాహ్వానముతో వెనుదిరిగి చన నుంకించినఁ దటాలున మూర్ఛఁదేరి రావణుండు క్రోధారుణితాక్షుండై పక్షీంద్రునిఁ దన పాదంబుచే మోదిన నతండు రక్తంబు గ్రక్కుచు సుక్కిపడియెఁ దద నంతరంబ దశగ్రీవుండు దుర్భావుండై భూపుత్త్రింగొని గగనవర్త్మంబు ననుసరించి లంకాపురంబుఁ జేరం జనుచుండ మార్గమధ్యంబున. ౨౭౨

—♦ సీతాదేవి తనభూషణములను ఋశ్యమూకముపై వైచుట ♦—

తే॥ రామరామ యటంచు ధ-రాజ యేడ్చు, చోక్క పర్వతమునఁ గోఁతు-లుంటఁ గాంచి
చీరకొంగును జించి రం-జిల్లు తనదు, భూషణంబులు దానిలో-మూటగట్టి. ౨౨౩

క॥ ఆ కపితతి మధ్యంబున, శోకాతుర చిత్త నాథు - సూచనకొఱకుం
గైకొని సొమ్ములమూటను, వేఁకను దావైచెఁ గీశ - వీరులు కనఁగన్. ౨౨౪

తే॥ మరల నా దశకంధరా-సురుఁడు వెసను, లంకకును జని జానకీ-లలన నచట
శ్రీ యశోకవనస్థలిఁ-జేర్చి వేల, రక్కసుల నిల్పె నామెకు-రక్షగాఁగ. ౨౨౫

—♦ ఇంద్రుఁడు బ్రహ్మాజ్ఞచే సీతాదేవికిఁ బాయసము నర్పించుట ♦—

క॥ దేవేంద్రుఁడు బ్రహ్మాజ్ఞను, నావత్సర తుష్టికరము - నౌ పాయసమున్
భావించి రహస్యంబుగ, శ్రీ వైదేహికి నొసంగి - చెచ్చరఁ జనియెన్. ౨౨౬

శా॥ సీతాదేవియు రామలక్ష్మణులఁ దాఁ - జిత్తంబునం దెంచి ప్ర
స్ఫీతశ్రద్ధయు భక్తియుక్ దనర నా - క్షీరాన్న మర్పించి గో
వ్రాతాదిత్యవరాళికిన్ ద్విజటకున్ - రమ్యంబుగాఁ బాయసం
బాతిథ్యంబు నొనర్చి తక్కినది సౌ - ఖ్యంబొప్పఁ గ్రోలెన్ దమిన్. ౨౨౭

తే॥ రావణుఁడు సాల శ్రీరామ - లక్ష్మణులను,
వనినిఁ జంపింపఁదలఁచి యా - దనుజవరులఁ
బనిచెఁ బదియార్వురను వారిఁ - బట్టి మ్రింగె
దండకారణ్యమునఁ గబం - ధుండు ఘనుఁడు. ౨౨౮

—♦ శ్రీరామ చారిత్రము ప్రత్యక్షసిద్ధంబని పరమేశ్వరుఁడు పార్వతికిఁ దెల్పుట ♦—

సీ॥ గౌతమీనది తటీ-కాంతమౌ పంచవ, టీస్థలంబున సంఘ-టిల్లినట్టి
రామబాణభయంబు-చే మృగం బెటనెటఁ, జరియించె నటనట-స్థానసంజ్ఞ
లవియనేకంబులు-ఖ్యాతిఁగాంచెను బురుల్, మృగనూపురముజాఱె-నెందు నచట
నూపురాఖ్యపురంబు-గోపురంబున నొప్పెఁ, జపలతన్ మృగము పం-చతను గనిన

తే॥ తావు చాపల్య పత్తనం-బై వెలింగె, రామశరవిద్ధమై మృగ-రాజమపుడు
పడిన యానేల గుఱుతులి-ప్పటికిఁ గలవు, లక్ష్మణుని చాపరేఖ మే-ల్నదిగ వెలసె.

తే॥ రావణుఁడు పంచవటి ముందు-రాల నేల, గట్టిగాఁ గాలు పెట్టిన-యట్టి చోటు
గర్తమై జనులకిప్పుడుఁ-గాననౌను, ఖలఖరాదుల సంగర-తలము గలదు. ౨౩౦

క॥ సంయుగ సమయంబున బహు, సంయమినుతుఁడైన రామ - చంద్రుఁడు సీతా
సంయుతముగ సౌమిత్రిని, సరియోజన నిల్పినట్టి -సద్గుహయుఁ దగున్. ౨౩౧

తే॥ జ్ఞాన దృష్టులకిపుడు నా-కాననమున, జానకీ రామచంద్ర ల-క్ష్మణుల దివ్య
రూపములు గానుపించుఁ ద-ద్రూపములె చె, లంగు నజ్ఞానులకు నుప-లములభాతి

తే॥ గౌతమీ నిమ్నగా స్నాన-ఘట్టములకు, రామతీర్థము జానకీ-రమణితీర్థ
మరయ లక్ష్మణ తీర్థమన్-హరువుపేరు, లొదవె నేఁటికి నచ్చటుల్-పొదలె మిగుల.
వ॥ మఱియును. ౨౮౪
తే॥ పర్వతోపరి శ్రీరామ-భద్రుఁ డొకట, సీతతోడుత శయనించె-నా తలమున
శయన రూపముగాఁ దృణ-జాలరీతిఁ, జిహ్నమాలోకన ప్రీతి-సేయు నెపుడు.
ఉ॥ రామునిఁ గాంచనేగిన స - రాగుఁడు లక్ష్మణుఁ డన్నఁ జేరఁగా
రాముఁడు భ్రాంతచిత్తుఁడయి - క్రమ్మఱి తమ్మునిఁ గాంచి లక్ష్మణా!
యేమిది? సీతనొంటరిగ నీగహనంబున నీడి వచ్చితే?
నామది కేమి తోఁపదు వి - నంగ వచింపుము కారణంబనన్. ౨౮౫
క॥ క్రోధాశ్రుస్మయ చేతసుఁ, డై ధారిణి పుత్త్రి పలికి - నట్టి పరుషముల్
మేధావియైన లక్ష్మణుఁ, డేధిత శోకమునఁ దెలిపె - నెరఁగి యతనికిన్. ౨౮౬

—♦ పర్ణశాలయందు సీతనుగానక రామలక్ష్మణులు పరితపించుట ♦—

శా॥ ఆ వృత్తాంత మెఱింగి ఘోరశకున - వ్యావృత్తుఁడై రాముఁడు
న్నావేగుండయి లక్ష్మణుండటు పిఱుం - దన్ రాఁగఁ దత్పర్ణశా
లావైషమ్యకళాస్థితిం దెలిసి స - ల్లావణ్య సీమన్ ధరా
జా వామాక్షినిఁ గానకబ్బురమునన్ - సంతాపముం బొందుచున్. ౨౮౭
క॥ వేవే వెదకుచు మానుష, భావంబున నెల్లచోట్లు - పరికించుచు సీ
తావిధికై వగచుచు శో, కావిలుఁడై చనుచు నా జ - టాయువుఁ గాంచెన్.
తే॥ కాంచి యాతనివలన రా-క్షసకులాధి, నాథుఁడగు రావణుండు జా-నకినిఁ గొంచు
లంక కేగిన విషయంబు-శంకతొలఁగఁ, దెలిసి యాగృధ్ర మంతటఁ-దీఱిపోవ. ౨౯౦
తే॥ గృధ్రరాజంబునకు వహ్ని-కృత్యములను దాను బొనరిచి పలలముల్-త్వరగఁ దెచ్చి
దాని తృప్తికి బలుల నా-స్థలి నమర్చి, స్నాతుఁడై తమ్మునితో దక్షి-ణమున కేగ.

—♦ కబంధ విముక్తి ♦—

క॥ పథమనుసరించి వనిదు, ష్పథులై తమ్మోగురు కొనెడు - పలలాశనులన్
బ్రథను వధించుచుఁ జనిచని, పథమధ్యమునందుఁ గనిరి - పర్వత దేహున్.
ఉ॥ యోజన బాహుఁడై మదబ - లోద్ధతిమించు కబంధ రాక్షసుం
డోజను రామలక్ష్మణుల - నొయ్యనఁ దా గ్రహించి మీరలే
రాజకుమారులో? రుచిక - రంబుగ నేను భుజింతునంచు ని
ర్వ్యాజ పరాక్రమంబు దెలు - పన్ రఘువీరులు తత్క్షణంబునన్. ౨౯౩
తే॥ వాని బాహులఁ దెగవ్రేయ - వాఁడు నపుడె
దివ్యరూపంబు ధరియించి - దేవ! యనుచు

రామునకు మ్రొక్కి తనదు పూ - ర్వపు చరిత్ర
నిట్టులని తెల్పి సంతోష - మ్ముట్టి పడఁగ. ౨౯౪
మ॥ మును గంధర్వవిభుండనై విధివరం - బుం బొంది గర్వంబుచే
తను నుష్టాగ్స్యు మునీంద్రుఁ గాంచి నగఁగన్ - దన్మౌని క్రోధాత్ముఁడై
నను దైత్యుండగుమంచుఁ దిట్టెఁ గనుకన్ - నాఁడాదిగా నిట్టిఁడై
మనితిన్ మీకరవాల ఘాతముల రా - మా! శాపముం బాసితిన్. ౨౯౫
మ॥ ఇఁక నేనేగెద స్వస్థలంబునకు మీ - కీ త్రోవనుం బోయి మా
నక మాతంగ మునీంద్ర ముఖ్యులకు నె - న్నన్ దాసులౌ వారలన్
నికటంబందున నె కాంచి యా శబరి నెం - తేఁ బ్రీతి నీక్షించి యా
మెకు మోదంబు నొసంగి పూజితులరై - మీ సీత వృత్తాంతమున్. ౨౯౬
క॥ తెలియుఁ డటంచును బలికియుఁ, బలు తెఱఁగుల రాముఁ బొగడి-స్వర్గము సేరెన్
లలనాన్వేషణమతి రా, మ లక్ష్మణులు బయలుదేరి-మానిని శబరిన్. ౨౯౭

— ♦ రామలక్ష్మణులు శబరివలనఁ బూజితులై ఋశ్యమూకమున కేఁగుట ♦ —

మ॥ కనఁగా నాశబరీ సమాఖ్యయును వే - గన్ రామునిన్ లక్ష్మణున్
ఘనభక్తిన్ దగు నర్ఘ్యపాద్యముల స - త్కారించి వన్యంబులున్
దిన రుచ్యంబులునౌ ఫలంబులను నె- న్నేన్ దెచ్చి యర్పించి వా
రిని స్తోత్రించి సమంచితాత్మయయి య - ర్థిన్ రాముతో నిట్లనెన్. ౨౯౮
శా॥ రామా! శ్రీయుత ఋశ్యమూకగిరి య - గ్రంబందు సుగ్రీవుఁ డం
తే మంత్రుల్ నలువుర్ తనుం గొలువఁగా - హృద్యంబుగా నున్నవాఁ
డామాన్యున్ హితవర్యుగాఁ గొనుము కా - ర్యంబున్ నెఱిం దీర్చి ని
న్నా మైథిల్యనుభూతుగాఁ జలుపు స - త్యం బిద్దియౌఁ గావునన్. ౨౯౯
శా॥ ఇంపారం దమరింక ముందుఁగల గ - మ్యేడ్యాంబుపూర్ణంబునౌ
పంపానామ సరోవరంబుఁ గని త - త్ప్రాంతస్థ వృక్షంబులం
బెంపౌ రుచ్యఫలంబులన్ దినియు నె- మ్మిన్ నీరముం గ్రోలి య
ర్థింపం బొందు కపీంద్ర వంశ్యుఁడగు సు - గ్రీవున్ సుహృద్భావమున్. ౩౦౦
క॥ అని యాబోయత ముదుకయు, ననలంబును సిద్ధపఱిచి - యాత్మను రామున్
మననము సేయుచు నాయ, గ్నినిఁ బడి వైకుంఠమునకు -నెట్టనఁ జనియెన్. ౩౦౧
ఉ॥ పిమ్మట రామలక్ష్మణులు - పృథ్వీసుతం దలపోసి యశ్రువుల్
గ్రిమ్మఁగఁ ద్రోవదప్పుచును - గ్రిమ్మఱుచున్ మఱి చక్క నేగుచున్
సమ్మదకారణంబయిన - స్వచ్ఛ సరోవరమున్ ఫలాగ్ర కూ
లమ్మునుగాంచి పంపను జ - లమ్ములఁ గ్రోలి ఫలాళిఁ దృప్తులై ౩౦౨

తే॥ ఋశ్యమూకాచలంబున-కేగ నెంచి, సరిగఁ జాపాస్త్రతూణీర-వరము లపుడు
సవరణాగఁ బూని మార్గాను-సారులగుచు, నరుగ వారల సుగ్రీవుఁ-డరసి వేగ.

క॥ మంత్రులఁగని వాలిది దు, స్తంత్రంబిది నరులరూపు - తనరెడి వారిన్
మంత్రిణ మొనరిచి పంపె స్వ, తంత్రత ధనురస్త్రధరులఁ - దప్పక కనుఁడీ!. ౮౦౪

మ॥ అనుచున్ మారుతిఁ గాంచి మిత్రవర! నా - యంతంబునుం గోరి వీ
రిని నివ్వాలియె ప్రేరణం బనిచెఁ ద - ద్రీతుల్ భవచ్చాతురిన్
మనకున్ మానస గోచరంబులగుఁ జు - మ్మా! సద్వటుం డట్టులన్
జనుమా! వారినిఁ బల్కరింపుము! పర - స్వాంతంబు లూహింపుమా!. ౮౦౫

క॥ దుర్మార్గులో? సన్మార్గులో?, మర్మంబును దెలియువఱకు - మంచినయములతోఁ
గూర్మినిఁ జూపుచుఁ జేతుల, నర్మిలి మోడ్చుచును మాట - లాడుము సుకృతీ!.

—♦ శ్రీరామ లక్ష్మణులను హనుమంతుఁడు ఋశ్యమూకనగముం జేర్చుట ♦—

మ॥ అని బోధింపఁగ వల్లెయంచు వటుఁడై - యవ్వాయుసూనుండు వే
చని శ్రీరాముని లక్ష్మణుంగని నమ - స్కారంబులం జేసి యో
యనఘాత్మాగ్రణులార! యోపురుష సిం - హాశ్రేష్ఠులారా! యిటుల్
వనిలోఁ దిర్మ్మరు మీరలెవ్వరో? వచిం - పం గోరితిన్ నావుడున్. ౮౦౭

చ॥ సుమతి సుమిత్రసూనుఁడు వ - చోగరిమన్ వటునిం గుఱించి యో
యమలగుణాఢ్య! పంక్తిరథు - నాత్మజులౌదుము మేము తండ్రి వా
క్యము నెఱవేర్పఁ గాఱడవు - లంబడిఁ జరింతుము రాముఁ డీతఁ డే
నమరఁగ లక్ష్మణుండ గహ - నాంతరమందున రామ పత్నినిన్. ౮౦౮

తే॥ రావణుఁడు మాయచేఁ గొని - లంకఁ జేర్చె
నందులకు సీతకై వచ్చి - యిందువెలయు
గిరిని సుగ్రీవుఁడను మిత్రు - వరుఁడు దొరకు
ననుచు శబరి వచింప మే - మును గడంగి. ౮౦౯

తే॥ వచ్చుచుంటి మటంచుఁ దాఁ - బలుక నపుడు
వటుని రూపంబు విడనాడి - వాయుజుండు
నేను సుగ్రీవసఖుఁడ మీ - నిజచరిత్రి
మరయ వచ్చితినని మ్రొక్కి - కరము భక్తి. ౮౧౦

క॥ భుజయుగమునఁ గూర్చుండుఁడు, నిజముగ సుగ్రీవుఁ జేర్తు - నేర్పున నతఁడున్
సుజయంబుగ మీకార్యము, నజుఁడాదిగ సురలుమెచ్చ - నటులొనరించున్.

చ॥ అని వెస రామలక్ష్మణుల - నంసములందున మోచి ఋశ్యమూ
కనగముఁ తోవఁ బట్టియు నె - కాదొకి నంబరవీథి నేగి స్వ

ర్కసుతుఁ డది రాజశిఖ - రంబున నొక్కటఁ జెట్టునీడ వా
రిని మెలమెల్లడించి తన - తేని సమీపముఁ జేరి నెమ్మదిక్. ౭౧౩
క॥ శ్రీరాముల వృత్తాంతము. నోరూరఁగఁ దెలిపి మైత్రి - నూల్కొనఁ జేయన్
సూరసుతుండును వేగమ, యా రాఘవవరులఁ జేరి - యవనతుఁడగుచున్.

—♦ శ్రీరామ సుగ్రీవ సఖ్య సంభాషణము ♦—

తే॥ వారలకు మ్రొక్కి యొక్క మ - హీరుహమున
స్వయముగా శాఖఛేదించి - త్వరగఁ దెచ్చి
విష్టరముపైచి జానకీ - విభుఁడుఁ దాను
నగ్నిసాక్షిగ సఖ్యంబు - నాచరించి. ౭౧౪
క॥ అన్యోన్యాలింగనములు, ధన్యాలాపములు సలిపి - తక్కిన కపులున్
మాన్యుఁడు లక్ష్మణుఁ డలర న, నన్యంబగు ప్రేమనంద - నాసీనులు కాన్.
క॥ అగ్రస్థిత లక్ష్మణుఁడా, సుగ్రీవునితో వచించె - శుద్ధంబగు నా
యగ్రజు చరితముఁ బిమ్మట, వ్యగ్రుఁడు సుగ్రీవుఁ డిట్లు - పలుకఁగఁ దొడఁగెన్.
మ॥ సఖుఁడా! లక్ష్మణ! నా చరిత్ర వినుమా! - సాంతంబుగాఁ జెప్పెదన్
సఖులుండ మయపుత్త్రుఁ డొక్కతఱి వా - ప్త్యం బొప్పఁ గిష్కింధలో
నిఖిలానోకహసంచరుల భయపడన్ - నిర్ఘాత దీర్ఘస్వనో
న్ముఖుఁడై వాలినిఁ బోరికిన్ బిలువ సం - పూర్ణక్రుధన్ వాలియున్. ౭౧౬
చ॥ బిరబిర వచ్చి యాఖలుని - వీక్షయొనర్చియు ముష్టిఘట్టనన్
బరువడి వానిఁడిల్పుటుప - వాఁడును స్వీయగుహాస్థలంబుఁ జె
చ్చెరఁగనఁ బర్వువాతె రుష - చెందిన వాలి బలంబు మీఱ దు
ష్కరుఁడగు వాని వెన్కనియెఁ - గావున నేనును వెంట నంటితిన్. ౭౧౭
తే॥ అటు మదగ్రజుఁడౌ వాలి - యతనిఁ దఱుము
వాఁడు గుహఁదూఱె వాలియు - వాని వెనుక
లోని కేగుచు ననుఁజూచి - నేను మరలి
వచ్చువఱకిచ్చటన యుండ - వలయు ననియె. ౭౧౯
ఉ॥ అన్న వచించినట్టి నుడి - నాగుహ చెంగట మాసముండినన్
జెన్నగు రక్తధారలు వి - శేషముగాఁ బఱతెంచె నంతియే
యన్నయు రాకపోయె నది - యారసి తన్మయపుత్త్రుచేత నా
యన్న నశించెనంచును శు - గాతురుఁడై పురిఁజేర నెంచితిన్. ౭౨౦
తే॥ పోవునప్పుడు మయపుత్త్రుఁ - డేవిధమున
వచ్చునో? యని భయమంది - పదిలముగను

దగ్గుహాద్వారమునను బ్రి - స్తరము ద్రొబ్బి
మరలి కిష్కింధఁజేరు నా - తరుణమందు. ౭౩౧
తే॥ శాత్రవులు వచ్చి కిష్కింధ-సకల దిశల, ముట్టడించియు నెల్లర-మొత్తఁ బూని
రనెడు నుడి వింటి నారాక-నంతలోనె, తెలిసి శత్రులుఁ బఱచిరి-చలము డాచి.
తే॥ వాలి మరణించెనని విని-యాల నన్ను, వలదు వలదన్న నిర్బంధ-పఱిచి రాజ్య
పాలనార్థంబుగాఁ బట్ట-భద్రుఁ జేసి, రపుడు సచివులుఁ బౌరులు-హర్ష మెసఁగ.
ఉ॥ పిమ్మట వాలి యాఖలునిఁ - బీఁచమణంచియుఁ ద్రుంచి పత్తనం
బమ్మెయిఁ జేరి రాజ్యముఁ బ్రి - యంబుగ నేలెడు నన్నుగాంచి రో
షమ్మున ద్రోహి! యగ్రజుని - చావునుగోరియుఁ జాటియిట్లు రా
జ్యమ్ము గ్రహింతె? యంచు నను - నప్పుడ వెళ్ళఁగఁ ద్రోచి బైటికిన్. ౭౩౨
క॥ దుందుభి పటహధ్వానము, లెందను నిండంగఁ జేసి - యీధర నెవఁడేన్
గ్రిందుగ సుగ్రీవునిఁ బ్రో, వం దలకొను నతనిఁ గూల్తు - వడినని తెలిపెన్.
తే॥ కనుక నాశ్రయమది యొందుఁ - గనక నేను
వచ్చి యీ ఋష్యమూకంబుఁ - జొచ్చినాఁడ
బ్రికిదియున్నాఁడ నాతని - బారిఁ బడక
వానికిట శాపకారణం - బైన కతన. ౭౩౩
ఉ॥ దాని వచించెదన్ వినుఁడు - దైత్యుఁడు దుందుభి నామకుండు తాఁ
బూని లులాయ రూపమును - బూర్వము వాలిని నొక్కరాత్రి యు
ద్ధానకుఁ బిల్వ వాలియును - దర్ప మెలర్ప లులాయశృంగముల్
మానక బిగ్గఁబట్టి యస - మాన బలంబునఁ గొట్టె నేలకున్. ౭౩౪
తే॥ దాని శిరమును ద్రుంచి హ - స్తముల చేతఁ
బైకి నెగురంగవైచినఁ - బలలభోజి
తలయు నిచట మతంగుఁడన్ - తపసిచెంతఁ
బడియె రుధిరంబు ధారలై - పాఱుచుండ. ౭౩౫
చ॥ అదిగని తన్మునీంద్రుఁడు మ - హారుష నొందుచు వాలిఁ గాంచి దు
ర్మద! కనులింత కన్పడవె? - మాకపరాధ మొనర్ప నెంచితే? ౧౭౩
గొదకొని మామకాశ్రమము - క్షోణిధరంబును జేరుదేని నీ
మదమణి యప్డె చత్తువని - మానక శాపమొసంగె వానికిన్. ౭౩౭
క॥ ఈ విధముగ శప్తుండయి, యావాలియు నాఁటినుండి - యరుదేరఁ డిటన్
గావున నిర్భయముగ సచి, వావృతుఁడై యున్నవాఁడ - నగసీమ నిటుల్.
చ॥ పరిశిన యొనర్తు నింక రఘు - వర్యుల మిమ్ముల సౌహృదస్థితిన్
జతగనుగొంటి మీదగు వి - చారము మానుఁడు వేగ భూమిజా

సతినిని రోయఁజేసి తను - సన్నిధిఁ జేర్చెద రావణాసురుం
డతివను గొంచుఁ బైనిఁ జను - నప్పుడు కంటిని వింటి తద్ధ్వనిన్. ౭౩౧

—♦ సీతాదేవిభూషణములను సుగ్రీవుఁడు రామునకుఁ జూపుట ♦—

తే॥ భూషణ వ్రాతమును నామె - మూటగట్టి
మమ్ములనుగాంచి పైచేఁ జి - మ్మెమ్మెగాఁగఁ
జూడుఁడాసొమ్ములను మీరు - శుభము గలుగు
నంచుఁ దొడవుల మూట తె - ప్పించి యొసఁగె. ౭౩౨

క॥ శ్రీరాముఁడు భూషల మన, సారఁగఁ గని పత్నిఁ గనిన - యవ్విధువునఁ దాఁ
గోరిక లీరికలెత్తఁగ, నారసి లక్ష్మణునిఁ బలికె - నతికరుణముగాన్. ౭౩౩

మ॥ అనుజా! యివ్వివి సీత భూషణములే - యౌనా? మతేమైననున్
గన భేదంబులు గాఁగఁ దోఁచునె? లస - ద్జ్ఞానుండవౌ నీవు శం
కను బాయంగను జేయుమా! యనిన దుః - ఖంబాది యా సొమ్ములన్
గని సౌమిత్రియు నన్న కిట్లులను ని - క్కంబెంచి చింతించుచున్. ౭౩౪

తే॥గీ॥ రామ! నిత్యంబు జానకీ-రామ మీకు, వందనము సేయుతఱి వ్రేళ్ల-కందమైన
యంగుళీయకములు మాత్ర-మరసినాఁడ, నిక్కముగ నివి సీతవౌ-నిర్మలాత్మ!.

క॥ మిగిలిన సొమ్ములు సీతవి, యగునో? కాదో? యటంచు - నాత్మను శంకిం
పఁగవలసె నేను గానమి, సుగుణాత్ముఁడవీవ సరిగఁ - జూడు మటన్నన్. ౭౩౬

ఉ॥ రాముఁడు సంతసంపడి ని - రంతర భక్తిహృదంతరున్ గుణో
ద్దాముని దమ్మునిం గని వ్య - థాభరమించుక నేదె నంచు సీ
తామహిళాశిరోమణియుఁ - దప్పక వేగ లభించునంచు శో
భామయ భూషణంబులను - భద్రముగానిడి తాను బిమ్మటన్. ౭౩౭

—♦ సుగ్రీవునకు రాముఁడు నమ్మకము గల్గించుట ♦—

మ॥ అల సుగ్రీవునికోర్కె తీర్చుటకునై - యా ప్రాంతమందున్న పు
ష్కలమౌ దుందుభిశీర్షమున్ గపివరుల్ - గాంచన్ బదాంగుష్ఠ స
ద్బలఘాతంబున యోజనంబరుగఁగాఁ - దన్నెన్ శితంబౌ మహో
జ్జ్వల బాణంబున సప్తతాళతరులన్ - భక్తిం దెగం గూలిచెన్. ౭౩౮

ఉ॥ రామబలంబటుల్ తెలిసి - క్రన్నన సూర్యసుతుండు భక్తిమై
రాముని పాదకంజముల - రంజిల శీర్షమునుంచి మ్రొక్కి దే
వా! మహనీయమూర్తి! వెస - వాలినిఁ జంపి భయంబుఁ బాపుమా!
నామది నిన్నె నమ్మితి ఘ - నంబుగనంచు వచించి యిట్లనున్. ౭౩౯

ఉ॥ శ్రీరఘురామచంద్ర! యిఁకఁ - జెప్పెద నొక్క రహస్యముఁ సునా
సీరుఁడు కశ్యపుండిడిన - చెల్వగు హారము శత్రుసూదనం
బై రహియించు దానినిఁ బ్రి - యంబుగ వాలి కొసంగెఁ గావునన్
హారముదాల్చు వాలిఁ గని - నంతన క్రుంగును శత్రుసత్వముల్. ౮౪౦

క॥ రామా! నీ వెనుకగఁ జని, యా మహితబలాఢ్యు వాలి - నంత మొనర్పన్
సామాన్యముగాదు గుణోద్దామా! తగు యుక్తి నీవు - తర్కింపు మదిన్. ౮౪౧

మ॥ అన సుగ్రీవుని మాటలన్ విని తదీ - యంబౌ భయంబేద ని
ట్లను శ్రీరాముఁడు కీశవర్య! యెదియె - ట్లైనన్ భవద్భ్రాతతో
ననిసేయం దొరకొన్న చంపెదను నే - నా వాలినిన్ జెట్టుచా
టున నేయుండి మదస్త్రముల్ విడిచి పా - టుం బొందఁగాఁ జేసియున్. ౮౪౨

—♦ వాలి సుగ్రీవుల యుద్ధము ♦—

క॥ అని రణ ధైర్యముఁ గూర్పఁగఁ
జని సూర్యుని సుతుఁడు వాలిఁ - జయ్యనఁ బిలిచెన్
ఘనసంగరము నొనర్పఁగ
ననుజున్మని గర్వమరసి - యతఁడును వచ్చెన్. ౮౪౩

తే॥గీ॥ వాలిసుగ్రీవులంత దో - ర్బలము మెఱయఁ
బోరఁదొడఁగిన శ్రీరామ - మూర్తి కాంచి
వారి రూపంబు లొక్కటై - భ్రాంతి గూర్ప
సంశయించెను సంధించి - శరము విడువ. ౮౪౪

క॥ దేహోత్సేకము విరాఁగ, బాహాబాహినిఁ బెనంగి - బలిముఖవరుల
న్లాహవ మొనరుప బలము, త్సాహము డీల్పడఁగ సూర్య - తనయుఁడు పఱచెన్.

చ॥ పరుగున వచ్చి రాముఁగని - భ్రాతృకరాహతి నేను జావఁగా
నరసితివేల? రాఘవ! ర - యంబుగ నీవె హతం బొనర్చినన్
హరుసమె చెందుదుంగద? ద - యామతితో నభయం బొసంగి యి
ప్పరుసున మోసపుచ్చితివి - భావ్యమె? నీకని పల్కెఁ బల్కినన్. ౮౪౫

ఉ॥ రాముఁడు భానుజున్ గని - కరంబు కరంబలరంగఁ గాంచి నీ
వేమియుఁ దూలనాడఁదగు - నే? ననునమ్మిన మోసపుత్తునే?
నామది శంక యొండొడమి - నన్ నిను వాలిని గుర్తుపట్టకెం
తే పహితాస్త్రముల్ విడువ - కిత్తఱిఁ దత్తఱ మొందితిన్ సఖా! ౮౪౬

వ॥ కావున లాంఛనంబుగా నీ వొక్కహారంబు ధరియించుట లెస్సయని లక్ష్మణుని
వలన నాతని యఱుత నొక పూలమాల నలంకరింపఁజేసి మరల వాలితో

సంగరంబొనర్పఁ జేరి రేచి సుగ్రీవునిం బనిచిన. ౨౮౯
క॥ నిండారు కడిమి సుగ్రీ, వుండును నవ్వాలి గృహము - పొంతకుఁ జని నీ
యుండగ మఱఁచెద దండిమ, గండయిన రమ్ము వాలి! - కదన మొనర్పన్.
వ॥ అని యుపాలంభంబులు దంభంబెలర్పం బలికిన వాలియు మండిపడి యుద్దండ భుజాదండంబు లాస్ఫాలనంబు సేయుచు సుగ్రీవుపైఁ గవియ నుంకించి గృహంబు నుండి వెలువడు సమయంబున వాలిదారయగు తారయు నుదార బుద్ధితో భర్తను దారసిల్లి మెల్లఁగా నిట్లనియె. ౨౯౦
శా॥ నాథా! మీరిపు డాహవంబునకుఁ జ - న్నన్ గీడువాటిల్లుఁ ద
త్పాథోరాశిగభీరుఁ డాఢ్యుఁడు లస - ద్బాహుండు రామాహ్వయుం
డా ధాత్రీపతి సానుజుండగుచు ధై - ర్యంబిచ్చి సుగ్రీవు నీ
తో ధార్ష్ట్యంబునఁ బోరఁబంచె నని విం - దున్ శాంతముం బొందుమా! ౨౯౧
క। భగవంతుని శ్రీరాముని, నిగమాంతవిదున్ సభక్తి - నెమ్మదిఁ గనుమా!
తగు శరణంబును వేఁడుమ! జగతిన్ సుగ్రీవునకు నొసంగుము! పదవిన్. ౨౯౨
క॥ అనుచుం బ్రార్థన సేయఁగ, ఘనుఁడా వాలియును సతినిఁ - గాంచి భయంబే
లనె? బేలా! రామునిచే, తనె చచ్చిన మేలుకల్గు - దానికి వగపా? ౨౯3
ఉ॥ నే మృతిఁగాంతునేని తమి - నిన్ రవిపుత్త్రుఁడు నిన్ను నంగదున్
సేమ మెలర్పఁ బ్రోచుఁ గపి - సేననుగాచుఁ బ్రభుత్వమేలు నీ
కేమియు శంకవల్వదు జ - యేచ్ఛయె ముఖ్యము నాకుఁ గావునన్
భామిని! యడ్డుపల్కకుము - బాగుగ శాశ్వతసౌఖ్యమందెదన్. ౨౯౪
క॥ మఱియొక చిత్రము నాదగు, నఱుతనుగల దివ్య హార - మది మాయమయెన్
బఱతు నె? యరికి భయంపడి, తెఱవా! నాగుణము నీకుఁ-దెలియదె యెపుడున్.

—♦ వాలి సంహారము ♦—

మ॥ అని దారామణిఁ దార నూఱడిలఁగా - నాత్రింబుగా నాడి యొ
య్యన సుగ్రీవు నెదిర్చి సంగరతలం - బాదాగ్రహంబొప్పఁ ద
మ్మునితో వాలియుఁ బోరుచుండ విటపీ - మూలంబునందుండి చ
య్యన సంధించియు రాముఁడొక్క శరమే - యన్ వాలికూలెన్ ధరన్. ౨౯౫
తే।గీ॥ వాలి మరణం బెఱింగి దు-ర్వార శోక, భారమున నంగదునితోడఁ-దారవచ్చి
పతిసమీపంబు జేరి దు-ర్గతిఁ దలంచి, యశ్రుధారలు గురియ హా యనుచు నేడ్చె.
క॥ వాలియుఁ గొఱ యూపిరచే, నాలిని సుతుఁగాంచి కనుల - నశ్రులు నిండన్
సోలముదరినుండిన శుభ, శీలుని రఘురాముఁ బిలిచి - చేయెత్తి యనున్.

క॥ రామా! మోసమొనర్చుట, నీ మానితగుణమునకును - నీచతకాదా ?
యే మపకార మొనర్చితి ? నామరణము నీకు శుభము - నా వినితి వ్రాకో? ౮౫౯

తే॥గీ॥ నేనె జీవించియున్న దు - ర్నీతిపరుని
రావణుని నొక్కత్రుటిలోఁ బ - రాభవించి
సీతఁ గొనితెచ్చియిత్తు నా - చేతఁగాని
పనియె? ముందును వెనుకయుఁ - గనవుకాని. ౮౬౦

క॥ నీచేఁ జచ్చితినని నా, కాచింత రవంతయైన - నాత్మను లేదా
నీచత నీయది సుయశము, నా చెంతకుఁ జేరెఁ బ్రోవు - నా పుత్త్రునిఁ గడన్. ౮౬౧

—◆ శ్రీరాముఁడు వాలికి భవిష్యజ్జన్మము నెఱిఁగించుట ◆—

వ॥ అనిన శ్రీరామునంతు నగచరాగ్రేసరుండగు వాలిం దరిసి నీ యొనర్చిన దుర్మార్గం బ నీకిట్టి చెట్ట నొడఁబఱిచె నకారణంబుగా నీతమ్ముఁడగు సుగ్రీవుని మరణంబుఁ గోరి యతని దారయగు రుమం బరిగ్రహించి రమించుచు నాతనిని గొండల పాలొ నరించిన యఘంబు భవదనుభవార్హంబు గాక మానునే? యైనను రాఁబోవు ద్వాపరయుగంబున నీవును గిరాతుండవై నాయందలి పగం దీర్చికొననగు ననంతర జన్మంబున మోక్షంబు నొందఁగలవని యెఱింగించి. ౮౬౨

క. ఎల్లెడ సతిని సుతుఁగని, మూల్గుచు శ్రీరామచంద్రు - ముదలం గనుచున్
నీల్గుచుఁ దమ్మునిఁ గనుఁగొని, యొల్లెను నవ్వాలి బంధు - లేడ్చుచు నుండన్.

తే॥గీ॥ వాల వాలికి నంత్య కృ-త్యముల నెల్ల, నంగదునిచేత జరగించి-యఖిల కపులు
నయ్యహస్కరసుతుఁడు న-భ్యర్చనలను, జలుప శ్రీరామ లక్ష్మణుల్-తలఁపు మీఱ.

—◆ సుగ్రీవ పట్టాభిషేకము ◆—

క॥ కపిరాజ్యమునకు నభిషే, కపురీతినిఁ బట్టభద్రు - గా సుగ్రీవున్
గృపవెలయ నిలిపి సంతస, మపుడొనగూర్చిరి కనంగ - నతి విభవముగాన్.

తే॥గీ॥ వర్షకాలంబు గడచెడు - వఱకు నచట
నుండ నూహించి రాముండు - ప్రోచ్చశిఖర
రాజితంబును స్ఫటికాభ - రమ్యమైన
తత్ప్రవర్షణ గిరిగుహా - స్థలము గాంచి. ౮౬౩

తే॥గీ॥ వివిధ ఫల తరు సుమలతా - వృతము హితము
నైన యచ్చోట సానుజుం - డైన రామ
చంద్రమూర్తి నివాసంబు - సలిపె ఘర్మ
కాలమును వర్షకాలంబు - కడచుచుండ. ౮౬౪

క॥ కిష్కింధా పత్తనమునఁ, బుష్కలమగు కీశరాజ్య - మును నేలుచు నా
విష్కృతి సుగ్రీవుండును, నిష్కుటమున సర్వసుఖము - నెగడఁగ మనియెన్.
చ॥ అనిలకుమారుఁ డొక్కతఱి - నర్యమసూనునిఁ గాంచి దేవరా!
దినములు పెక్కుమీఱె రఘు - ధీరుల కోర్కెనిఁదీర్ప జానకీ
వనితను రోయఁబంచుఁడిఁక - వానరవర్యులనంచుఁ బల్కనా
తనినుడిచే నతండుఁ గపి - తండమునున్ బిలిపించెఁ జెచ్చెరన్. ౮౧౯
ఉ॥ ఇంతటిలోన వర్షఋతు - వేగి శరత్సమయంబురాఁగ దు
ర్దాంత పరాక్రముండగు రఘు - రాముఁడు తమ్మునిఁగాంచి లక్ష్మణా!
యెంతయు మోసమయ్యెను గ - పీంద్రపదంబును బొంది సూర్యజుం
డింతకు నన్ను నిన్ను మది - నెంచఁడు కార్యముఁ బూనఁడారయన్. ౮౨౦
క॥ కావున వేచని యాతని, కావరమును మాన్పి మనకుఁ - గావలసిన కా
ర్యావసరంబుకు దీర్పని, చో వచ్చెదు చేటు దెలిపి - చొప్పెఱుఁగుమనన్. ౮౨౧

—• రామాజ్ఞను వహింప లక్ష్మణుఁడు సుగ్రీవు కడ కరుగుట. •—

శా॥ ఆ రామానుజుఁ డర్యమాత్మజుని డా - యంబోయి మున్మున్గుగా
ధీరున్ మారుతిఁగాంచ నాతఁడును నెం - తే భక్తిఁ బూజించి త
త్కార్యంబుం దొలఁగించు పల్కులను నా - రూఢంబుగా నాడి యా
మారాకారుని సూర్యపుత్త్రి నిజవే - శ్మంబుం గనం జేసినన్. ౮౨౨
ఉ॥ లక్ష్మణురాకఁ దార ప్రియ - లస్మతితోఁ దెలుపన్ భయంబుచే
లక్ష్మణుఁడైన భానుజుఁడు - లంపటుఁడై యెదురేగి నమ్రుఁడై
లక్ష్మణుమ్రొక్కి ప్రార్థనము - లన్ మఱి సత్కృతులన్ భజించుచున్.
సూక్ష్మగళస్వనంబున వి - శుద్ధ మనంబున నిల్పుఁ జెర్చెఁదాన్. ౮౨౩
క॥ సముచిత పీఠస్థుండయి, యమలాత్ముఁడు లక్ష్మణుండు - నప్పుడు సుగ్రీ
వు ముఖంబును గని మా కా, ర్యము మఱచితె? గర్వచిత్తుఁడైతివె? యనుచున్
క॥ వినుమా! కపిరాజా! వా, లినిఁ గూల్చిన రామచంద్రు - లిప్తకము వెనన్
నిను సమయింపదె? యన భీ, తిని గడగడవడఁకెఁ గీశ - ధీరుఁడు జడుఁడై. ౮౨౪
చ॥ అదిగని యాంజనేయుఁడు ప్రి - యంబుగ లక్ష్మణుఁ గాంచి సత్ప్రభూ!
మద మిసుమంతయుం గనము - మాకిఁక ముఖ్యము వేఱెకల్గునే?
యిదె తమ కార్యముం జలుప - నెంచి వనౌకసులన్ గుమిగా నీ
యదనునఁ జేర్చినారము ద - యామతిఁ గాంచుఁడు సర్వసైన్యమున్. ౮౨౫
క॥ అని వచియించియు సుగ్రీ, వుని సమ్మతి నెల్లకపుల - బోరనఁ బిలువన్
జనుదేరిరి వారును జ, య్యనఁ బిమ్మట వారిఁగూడి - యర్యమసుతుఁడున్. ౮౨౬

—♦ సుగ్రీవాదులు రామసన్నిధానమును జేరుట ♦—

తే॥ రామసాన్నిధ్యమును జేరి - ప్రమద మమర
నముఁడై భక్తితో వంద - నము లొనర్చి
కార్యనిర్వాహణమునకై - కపుల నెల్లఁ
జూపి రామాజ్ఞఁ గోరెఁ బ్రి - స్తుతియొసంగ. ౮౭౮

క॥ శ్రీరాముఁడు ననుమతినిడ, గారామున నగచరులను - గడువడిగా సీ
తారామను వెదకఁగ దెస, లారయఁ బంపుచును భాస్క - రాత్మజుఁడంతన్.

—♦ సుగ్రీవాజ్ఞ ♦—

తే॥ దక్కినపుదెసరోయ స-దాగతిజుని, నంగదుని జాంబవంతుని-నల సుషేణు
శరభుమైందుని నభునిఁ బ్రే-షణమొనర్ప, నెంచి కపులకు నెల గడు వ్రుంచి పలికె.

క॥ నెలలోపల శ్రీసీతా, లలనన్ గని కుశలమరసి - లాలసచిత్తం
బులతోఁ జనుదెంచుఁడు వీ, రలయిక లెక్కింపఁబోక - యందఱు కపులున్.

క॥ నిర్ణయకాలము మించక, తూర్ణముగా సీత నరసి - తోడరుదు త్రోడన్
గర్ణానందము గూర్పుఁడు, నిర్ణయగతి రానియెడల - నిగ్గింతు మిమున్. ౮౮౨

—♦ శ్రీరాముఁడు నిజాంగుళీయకము మారుతి చేతికిచ్చుట ♦—

వ॥ అని సుగ్రీవుండు విధించిన వల్లెయని పాశ్చాత్యపశ్చిమోత్తరాదిశలకుం జను కపులు రామాదులకు నమస్కరించి బయలుదేరి వెడలిన దక్షిణాశకుం బోయెడివారి యం దాశుగతనయుం గనుంగొని రామచంద్రుండు మారుతీ! నీదు సుగుణవిశేషంబు నకు నామనంబు గడుంద్రుప్తిగాంచునని మదీయనామాక్షర యుక్తంబగు నిమ్ముద్రిక రహస్యంబుగా సీతాసతికి నొసంగుమా యని తన ముద్రిక నతని వశంబొనర్చి మెల్లఁ గాఁ గపితల్లజుఁడగు నాతనికిఁ దారకంబుపదేశించిన నాంజనేయుండును నమ్మంత్రి రాజంబు లక్షమాఱులు జపించి వాసి సముద్రోత్తారణబలంబు వడసి రామునివలన సీతారహస్యోదంతంబులఁ గొన్నింటినిం దెలిసికొని రామచంద్రునకుఁ బ్రదక్షిణ నమస్కారములుసలిపి లక్ష్మణసుగ్రీవులకు మ్రొక్కి యితర కపివరులతోఁ గూడి కొని దక్కినపుదెసకరిగె ననంతరంబున. ౮౮౩

తే॥ కొన్నిదినములు కడచన-మున్ను వెడలి, నట్టి మర్కటవర్యులు-నపరదిశయు
నయ్యుదగ్దిశ పూర్వాశ-నరసి రోసి, మైథిలిని నెందుగానక-మరలివచ్చి. ౮౮౪

క॥ రామాదుల కావిషయము, మోములు వంచుకొని తెలిపి - ముగ్ధతఁగన శ్రీ
రాముండును వారలనొక, ధామంబున నుండుఁడని వి - ధానమొనర్చెన్. ౮౮౫

—♦ హనుమదాదులు హేమాపురమున దారిగానక చిక్కువడుట ♦—

ఉ॥ ఆ హనుమంతుఁడాది కపు - లందఱు దక్షిణదిక్కుచేరి తా
మూహయొనర్చి కానన స - ముత్కరచారుల దైత్యవీరులన్

బాహుబలంబుమీఱ బిగఁ - బట్టి వధించుచు నొక్కచో సుర
వ్యూహము సార్ద్రవక్త్రులయి - యొయ్యనరాఁ గని తత్ప్రథంబునన్. ౮౮౬
ఉ। భూవివరంబుఁ గాంచి జల - ముఖ్ గడుపారఁగఁ గ్రోలనెంచి వే
వేవివరంబుఁ జొచ్చి యట - వెక్కసమౌ తమమొప్ప దవ్వుగా
నావిధిఁ బోయిపోయి కన - కాంచిత సన్మణిహర్మ్యముండు మో
దావహమైనదానిఁ గని - యందొక భామినిఁ జూచి ప్రేమ్మమై. ౮౮౭
మ। తమ వృత్తాంతము నామెకుం దెలిపి యా - తన్వంగి వృత్తాంత మిం
పమరన్ గోరఁగ నామె యెల్లరకు న - ర్ఘ్యంబుల్ తగం జల్పి యు
త్తములారా! మును విశ్వకర్మసుతయౌ - ధన్యాత్మ హేమాఖ్య నృ
త్యముచే నీశ్వరుఁ దృప్తుఁజేసి బహుర - మ్యం బీపురంబుం గొనెన్. ౮౮౮
క॥ ఆ హేమారమణీమణి, యీహన్ నివసించి యుండు - నెక్కటి వేళన్
సౌహృదమతితో ననుఁగని, తా హర్షముమీఱఁ బలికె - ధాత్రీ! వినవే! ౮౮౯
ఉ॥ నేను దివంబుఁ జేరెదను - నీవును నిచ్చటఁ గొంతకాల మా
జానకిజాని సంస్మృతిని - సౌఖ్య మెలర్పఁగనుండి రామకా
ర్యానుగతాగసంచరుల - నారసి పూజలుసల్పి పిమ్మటన్
మానుగ స్వర్గమున్ గనుము - మానకటంచు వచించి యంతటన్. ౮౯౦
తే। ఆమె మరణించె నేను స్వ - యం ప్రభాభి
ధాన నాహేమకును జెలి - యైనదాన
నెట్టి సాహాయ్యమును మీకు - నిపుడొనర్తుఁ
జెప్పుఁడని పల్కఁ గపివరుల్ - చెలఁగి మరల. ౮౯౧
క॥ అమ్మా! యిత్తఱి సాహా, య్యమ్మగ గుహనుండి మమ్ము - నవలకుఁ జేర్పన్
సమ్మోదమున నేగియు సీ, తమ్మను వెదకెదమటంచు - నభ్యర్థింపన్. ౮౯౨
తే। సత్స్వయంప్రభ నిజయోగ - శక్తిచేత, క్షణములోఁ దద్గుహాబహి - స్థలికి నెల్ల
కీశవర్యులఁ జేరిచి - శ్రీశుఁదలఁచి, స్వర్గపురసౌఖ్యమును బొందఁ-జనియె వేగ.
ఉ॥ వానరవర్యులంతఁ జని - వార్ధితటంబును జేరి చింతచే
మానసముల్ కలంతపడ - మాలుగుఁబోతులనై గుహాస్థలిన్
జ్ఞానవిహీనతన్ బడియు - నాలుగు నాలుగునో దినంబులెం
తేని వసించియున్ గడపి - యీగతి నందితిమంచు ఖిన్నులై. ౮౯౪

— ♦ సంపాతి కపులకు సీతావృత్తాంతముఁ జెప్పి ఱెక్కలు మొలిచి చనుట ♦ —

తే॥ మును జటాయువు శ్రీరామ - మూర్తికార్య
మునకునై ప్రాణములవీడె - ముదల మనము

నటులె ప్రాయోపవేశంబు - నాచరింత
మనుచు వాపోవ సంపాతి - యనెడుపక్షి. ౮౯౫

ఉ॥ ఆ రవమాలకించి భ్రమ - మంది జటాయువుమాట నెవ్వరో?
వారక పల్కుచుండిరని - వచ్చి కపీంద్రులఁ గాంచి వారిచే
శ్రీరఘురామ వృత్తమును - సీతకునై దశకంఠుచేత సం
హారమునొంది తీఱిన జ - టాయువువార్త నెఱింగి చెచ్చెరన్. ౮౯౬

శా॥ దుఃఖాత్ముండగుచున్ జలాంజలిని బం - ధుప్రీతికై యిచ్చి యం
తఃఖేదంబునుబొందు వానరుల చెం - తంజేరి సీతాసతీ
దుఃఖంబున్ ఖలరావణాసురుని యు - ద్యోగంబునుం జెప్పి తా
నిఃఖేటోక్తులతోడ నిట్టులనియెన్ - నిష్పాదనం బొప్పఁగన్. ౮౯౭

చ॥ అల శతయోజనావృత మ - హాంబుధి మధ్యమునందు లంకయన్
లలితపురంబు చెన్నలరు - లావునఁ బంక్తిముఖుండు తత్పురిన్
విలసిత సర్వభోగముల - విశ్రుతుఁడై మను నందశోక మం
జుల వనియందు నొక్క తరు - సుందర మూలమునందు వేదికన్. ౮౯౮

తే॥ సర్వదా రామనామ సం - స్మరణ మొప్ప
వెలయు శ్రీ సీత నేనుచు - వింటి నిటులఁ
గనుక మీరలు వారిధిఁ - గడచిపోయి
జానకినిఁ గాంచుఁడయ్య! స్వ - స్థత తలిర్ప. ౮౯౯

తే॥ శక్తిహీనుఁడనై నాఁడ - సాయపడఁగ
నెఱకలును నూడిపోయెఁ బో - ల్పఱఁగ నాకు
మునుపు నొకపరి నాదు త - మ్ముఁడును నేను
సరిగ నుడ్డీనమునను భా - స్కరునిఁ దాఁక. ౯౦౦

శా॥ వేగం బోవుచుఁ దిగ్మభాను కిరణో - ద్యగ్నాత్మ నాతమ్మునిన్
రాగం బొప్పఁగఁ గాంచి నాయెఱకలన్ - రక్షాస్థితిన్ గప్పఁగా
బాగుంబొందె జటాయు వత్తఱిని మ - త్పక్షంబులూడెన్ వడిన్
నాగర్వంబఱ నేలకుం బడితి మిం - టన్ నిల్వలేకార్తిమై. ౯౦౧

తే॥ ఆ జటాయువు నరిగె వే - ఱైన యెడకు
నేను బక్షవిహీనుఁడై - పూని యాలఁ
జంద్రశర్మాఖ్య దివ్యము - నీంద్రుఁ జేరి
ప్రార్థనము సేయ నాతండుఁ - బలికె నిట్లు.

తే॥ గృధ్రరాజను! పక్షవి-హీనవగుచు, వంకురితిమైన శ్రీరామ-భద్రునాజ్ఞఁ
గపులు సీతనువెదక నిక్కడకురాఁగఁ,గనుము సీతను దెల్పుతె-క్కలును మొలచు.

వ॥ అని ప్రియంబువలికిన నాఁటినుండియు మీరాక కెదురుసూచుచుంటి నిదె నాయెఱ
కలిప్పుడ యంకురింపఁ దొడఁగె మీరు రామకార్యంబు తప్పక నెఱవేర్పుఁడు నా
పైదయ యుంచుఁడని వేఁడుకొని కపులచే సెలవుకొని సంపాతి తరలి సనియెనంత.

—♦ హనుమంతుఁడు సాగరమును లంఘించుట ♦—

సీ॥ అంగదఁండాదియౌ-నగచరవీరులు, తలకొని తమతమ-బలములరసి
శతయోజనంబులు-జానొందు సంద్రంబు, లంఘించునట్టి బ-లంబులేక
యన్యోన్యముగ నాన-నాలోకనంబుల, లపితంబులను బొ్రద్దు-నపుడువుచ్చ
నింబుగా వృద్ధైన-జాంబవంతుఁడులేచి మతిమంతు హనుమంతు-నితవుగఁ గని

తే॥ యతని పుట్టువు మొదలుగాఁ - గతను దెలిపి
నీవుదక్క నొరుండు వా - ర్నిధినిదాఁటఁ
గలఁడె? యని ప్రోత్సహించిన - నలఘుబలుఁడు
వాయుసూనుఁడు పులకలు - ప్రబ్బనిలిచి. ౯౦౮

తే॥ ఒక్కగంతునఁ బర్వత-మెక్కి నిక్కి, నతని పదఘట్టనను ఘట్ట-మవనిక్రుంగ
రామ! శ్రీరామ! రఘురామ-రమ్యనామ!. రాజితోద్దామ! జానకీ-రామ!యనుచు.

స్రగ్ధర॥ అంతం గల్లోలజాలా- భ్యసనలిఖిత లీ- లాంతరిక్షంబు వ్యాళా
త్యంతోగ్రగ్రాహమత్స్యా- ద్యనుపమ కమఠ- వ్యాయతోద్యత్కలీరా
త్మాంతర్భాగంబు రాజ - ద్ధసిత జలకణ - వ్యాపృతాయామ వార్ధు
ర్ధాంతస్ఫారంబునౌ నర్ణవమునుగని సా - రంబుమై వాయుజుండున్. ౯౦౯

తే॥ తన్నభోవర్త్మగామియై-దానిదాఁటఁ, బూని యుడ్డీనమొనరించి-పోవుచుండ
సురసయను నాగమాత భా-సురసమేత, మారుతిబలంబుఁ దెలియ నే-పారవచ్చె.

తే॥ వచ్చి యడ్డముగానిల్చి-వాయుసుతునిఁ, గాంచి నావాతఁ జొఱుమని-మించి పలుక
నాతఁడును రామకార్యార్థ-మరిగి మరలి, వత్తునప్పుడు నీనోటఁ జొత్తుననియె.

ఉ॥ దానికి సమ్మతింపక వృ - థా కలహానకుఁ గాలుదువ్వి యా
మానిని యడ్డుపీడనని - మాటికిఁ బల్కఁగ వాయుసూనుఁడున్
మానుగ దేహముం బెనిచె - మాయతగన్ సురసాఖ్య తద్విధిన్
మానక స్వీయదేహము స - మానముగాఁ బొలుపొందఁ జేసెఁదాన్. ౯౧౦

తే॥ మారుతి బిఱాన నంగుష్ఠ - మాత్రుఁడగుచు
నపుడ యాయమవక్త్రంబు - నందుఁ దూఱి

వెలుపలికివచ్చె నాతని - బలము తెలిసి
సురస వందన మొనరించి - గరువ ముడిగి. ౯౧౧
క॥ హనుమత్కపివర! నీబల, మును గాంచఁగ సురలు నన్ను - మునుకొని పనుపన్
జనుదేరితి నీసత్వము, గనితిన్ సెలవనుచు దివము - గనఁగా నరిగెన్. ౯౧౨
వ॥ తదనంతరంబున ౯౧౩
మ॥ జవమేపారఁగ నేగు నంజనసుత - శ్రాంత్యర్థమై యా సము
ద్రవచఃప్రేరితుఁడై తదీయ జలమ - ధ్యంబందు మైనాక శై
లవరుండుద్భవమొంది దివ్యమణి లీ - లాశృంగమందొంచ మా
నవురీతిన్ హనుమంతుఁ గాంచి కలస - న్నమోప్రీతితో నిట్లనున్. ౯౧౪
చ॥ అనిలకుమార! రమ్ము మధు - రామృత కల్పములౌ ఫలంబులన్
దిని పరితృప్తినొంది తమి - నిన్ క్షణకాలము విశ్రమించి సౌ
ఖ్యనియతిఁగాంచి పిమ్మటఁ బ - థానుసరుండవుకమ్ము నేను రా
ముని కుపకారముం జలుపఁ - బూనినవాఁడను నమ్ము నెమ్మదిన్. ౯౧౫
తే॥ మును మహాదారుణాహవ-మునఁ గడంగి, యాబిడౌజుఁడు కొండల-నవనిఁ దునుమఁ
బంక్తిరథుచేత విడివడి - బ్రదికినాఁడ, వినుము మైనాకుఁడనువాఁడ-వేఁడువాఁడ.
మ॥ అన మైనాకునిఁ గాంచి వాయుజుఁడు సౌ - ఖ్యంబబ్బె నీమాటలన్
ఘనశైలాగ్రణి! రామకార్యము శ్రమో - త్కంపంబుఁ గల్పించునే?
జననాథాధ్యుని రామదేవుని మహా - జ్ఞన్ దీర్పఁగాఁ బోవు నా
కును విశ్రాంతి ఫలంబులన్ దినుటయే - గొప్పౌనె? వల్దంచనెన్. ౯౧౬
క॥ పావనినుడి విని మైనా, కావనిధరవరుఁడు మరల - నాతనిఁ గని భీ
తావన! స్పర్శనమున నేన్, భావనుగాఁ జల్పుమా! కృ - పావనధి! యనన్.
క॥ ఔనని పావని వేగన్, మైనాకునిఁ దా స్పృశించి - మార్గానుసరుం
డై నభమునఁ జనుచుండఁగ, దానవియగు సింహికాభి - ధాన కడిమిమై. ౯౧౯
క॥ ఛాయాగ్రహము గ్రహాధిపుఁ, బాయక గ్రహియించు పగిదిఁ - బ్రాణులనెల్లన్
ఛాయాగ్రాహిణియై తిను, మాయానిధి యపుడుపట్టె - మారుతతనయున్. ౯౨౦
చ॥ పథమనురోధమున్ జలిపి - పట్టిన వారెవరో? యటంచు ద్యో
పథగమనుండు వాయుజుఁడు - భావమునం దలపోసి రాక్షసిన్
భ్రమిమ కరాళవక్త్రను బ - రామరికం గని దాని నోటిలోఁ
గ్రుధగొని దూఁకి ప్రేవులను - ద్రుంచియు దానినిఁ జంపి యుద్ధృతిన్. ౯౨౧
చ॥ వెలువడి త్రోవఁబట్టి విను - వీదిని వేచని స్వరువామి డా
పలిదెసఁదీరముం దరిసి - బాగగు నాపరలంకఁ జేరి కే

వల మదచిత్తఁ గ్రోంచయను - పంక్తిముఖస్వసఁ గాంచి సింహికం
బలె వధియించి దానిని వి - భావరి లంకకునేగ నచ్చటన్. ౨౩

—◆ లంకానామక రాక్షసిని ముష్టిఘట్టనచేఁ గుందించి మారుతి లంకం జేరుట ◆—

తే॥ పుర పురోభాగవర్తిని దరదదైత్య, లంకయనునది బలుపుచు-బింక మొనర
జంకకటువచ్చు హనుమను-గింకఁగాంచి, పెంకెతనమున బెదరించి-పేర్చి యార్వ.
క॥ హనుమంతుఁడు దానినిఁగని, మనమున రోషించి దనుజ - మానిని! మదమా?
యని తన వామకరోన్ము, ష్టిని లంకను గొట్ట నదియుఁ-జేడ్పడి పడియెన్. ౨౪
చ॥ పడి వడి నశ్రువుల్ తొరఁగ - భావమునందున బ్రహ్మవాక్య మ
ప్పుడు స్ఫురియింప వాయుసుతు - మోమునుగాంచి కపీంద్ర! కంజజా
తుఁడు మునుచెప్పినట్లు నను - దూపిలఁ జేసితివయ్య! నివ్వు, రా
ముఁడునిఁక రావణున్ దునుముఁ - బొమ్ము పురమ్మునుజేరు మిమ్మెయిన్. ౨౫
క॥ రమ్యాశోక వనమ్మున, సమ్యఙ్మతితోడ రామ - చంద్రుని భగవ
త్సామ్యముగా స్మరియించుచు, సౌమ్యముగానుండు భూమి - జాతను గనుమా!.
క॥ అని వచియించియు బతిమా, లిన నంతటఁ బ్లవగవరుఁడు - లెస్స యటంచున్
జని కనులారఁ ద్రికూటం, బను పర్వతశిఖరమందు - నమరెడి దానిన్. ౨౬
తే॥ గోపురాట్టాలకములచేఁ-గోపుమీఱి, హట్టవీథీ చతుష్పా-థ్య-మైనదానిఁ
బంక్తిముఖపాలితంబయి-ప్రబలుదాని, రమ్య లంకాభిధేయ పు-రంబుఁ జేరె.

—◆ ఆంజనేయుఁడు లంకయందు సీతను వెదకుట ◆—

సీ॥ చేరిఁయుందున్న య-గారవరంబుల, మెల్లఁగాఁ గనుగొను-చల్లనరిగి
ఘనగుహానిద్రితుం-డును భీతిదుండైన, కుంభకర్ణునిఁ గని-కోఱడమున
నటనుండి పోయి ప్ర-హర్షాత్ముఁడై రాము, స్మరియించు నావిభీషణునిఁ జూచి
శ్రీసులోచనతోడ-మృదుశయ్య నిద్రించు, మేఘనాదుని నొక్క-మేడ గాంచి
ఆ॥ యహాలఁ బంక్తిముఖుని - యంతఃపురములోని, కేగి దీపరాజి - నెల్లనార్పి
నల్లదాప్రుడులను-నగ్నులుగాఁ జేసి, కుండలన్ని పగులఁ-గొట్టి యట్టె. ౨౯
ఆ॥ కొఱవి యొకటి దొరకఁ - గొని రాక్షసుల శ్మశ్రు
వులను భస్మకూర్చ - ములుగఁ జలిపి
తోఁకచేత నచటి - దూతల వెఱపించి
వారలఱచి దెసలు - తేఱిచూడ. ౩౦
క॥ తనమది సంతసపడి మె, ల్లన నవ్వుచు నచటు వాసి - లలిఁ బుష్పకమం
దున నిదురించెడి రావణు, ఘనునిన్ మండోదరిన్ స - కాంతం గాంచెన్. ౩౧

శా॥ ఆ మండోదరిఁగాంచి భ్రాంతిపడి యా - రా! యయ్యశోకస్థలిన్
రామస్వామి ప్రియాత్మపత్ని కలద - న్నాటల్ కదా వింటిఁ? ద
దా రామారత్నమునిట్లు దుష్టమదమౌ - రన్ రావణుం డాత్మసం
ధామంబానునె చెంత నిల్పికొనె యా - శ్చర్యంబటంచెంచెఁ దాన్. ౯౩౨
క॥ అతఁడవ్వాడువ్రున భ్రమగొని, మతిఁదలఁచఁగ సీతరీతి - మండోదరి రా
జిత సుందరియై వెలయఁగ, నతిహేతువుకలను తెలియ - నదియెట్లన్నన్. ౯౩౩

—• మండోదరి జన్మవృత్తాంతము •—

క॥ శ్రీసీత విష్ణుసంచిత, యాసతి మండోదరియును - హరిసంచిత మే
ల్వాసియు నందము చందము, నా సరసీజేక్షణలకు - నమరె సమముగాన్. ౯౩౪
చ॥ మునుపొకవేళ రావణుని - మూర్ఖుని యాతనిమాత కైకసీ
వనిత శుగాతురాత్మయయి - పల్కుచుఁ బంక్తిముఖా! వృదాకునా
థుని బలుశ్వాసచేతను న - ధోభువనంబును జేరె నాఁడు నాఁ
డును భజియించు లింగము ప - టుస్ఫుట భక్తిహృదంతరుండవై. ౯౩౫
చ॥ వెసఁజని యీశ్వరుం గుఱిచి - విస్మితమౌ తపముం బొనర్చి యు
ల్లసమెసలారఁ గాంతి పరి - తొల్యమను త్తమమాత్మలింగమున్
మసలక కోరితెమ్మనఁగ - మానవభోజి తపంబుసేఁతన
న్నసదృశభాతిఁ దృప్తిగను - నట్టులుసేసిన నేను నత్తఱిన్. ౯౩౬
క॥ నీకేవరములు వలయునొ?, సాకల్యముగా వచింపు - సందియమేలా?
నైకొను మొసఁగెద నంటిని, ప్రాకటముగ నతఁడు రెండు - వరములు కోరెన్.
చ॥ ఒకవర మాత్మలింగమును - నొయ్యననిచ్చుట యన్యమౌ వరం
బకరణిలేక నిన్నుఁ దన - యాలిగనిచ్చుట కావునన్ గటా!
యిఁకఁదెక తేరకేఖలున - కిచ్చెదనన్న వరంబు లీనిచో
నకుఁటిలుఁడౌచు దుండగము - నల్పునటంచు నొసంగితిన్ నినున్. ౯౩౮
క॥ మఱి యాత్మలింగమిచ్చితి, నఱుజంతయు శంకగొనక - నర్మముతో నా
కఱకరి రావణుఁడొప్పఁగ, నెఱఁగితి లింగంబుఁ బుడమి - నిడరాదనితిన్. ౯౩౯
తే॥ నిన్ను లింగముఁ గొని యామి - నీచరుండు
పోవునప్పుడు శ్రీ విష్ణు - మూర్తిఁ దలఁచి
నీవు వాపోవ హరియును - నేర్పుమీఱఁ
జందనామలతో స్త్రీనిఁ - జలిపి నొకత. ౯౪౦
దానిని మయగృహముననిడి, మానుగఁ దత్కాంతపేరు - మండోదరినాఁ
బూని వచించెను గూఢము, గానవలను ననుపమయుని - కార్యముగాఁగన్.

ఉ॥ పిమ్మట విష్ణుమూర్తి యొక విప్రుని రూపమునొంది రావణున్
నమ్మికఁ గూర్పఁగాంచి దితి - నందనవంశపయోధిచంద్రమా!
యిమ్మెయి నీశ్వరుండు నిను - నెంతయు మోసమొనర్చె నీవు మో
హమ్మునఁ దెచ్చినట్టి యిక - చాంబుజలోచన గౌరి కాదిఁకన్. ౯౪౩
తే॥ వినుము మయగేహమందు నం - బికను డాచి
కృతిమాచలపుత్త్రిక - నిచ్చె నీకు
హరుఁడు కావున వడిసీమె - నతని యెడన
విడిచి పాతాళమునకేగి - ప్రియను మీఱు. ౯౪౪
తే॥ అందు మయగేహవాసిని - నందకత్తె
నిక్కమగు పార్వతినిఁ గని - నేర్పుమెఱయ
నాయమను నీవు గ్రహియింపు - మయ్య! సౌఖ్య
వారినిధిఁ దేల లంకకుఁ - జేరుమయ్య. ౯౪౪
క॥ భూలోక స్వర్లోకము, లాలోకించెదవు నీవు - నపుడపుడని పా
తాళముఁ జేరిచెఁ బత్నిని, జాలికుఁడై మోసగించె - శర్వుఁడు నిన్నున్. ౯౪౫
క॥ ఇఁక నీయిష్టము తోఁచిన, దాకమాట వచించినాఁడ - నో దనుజవరా!
తికమక లేల? యటంచన, నికరావని సురునిమాట - నిజమని యతఁడున్. ౯౪౬
మ॥ ననుఁ జేరం జనుదెంచి నవ్వుచును నిం - దల్ సల్పి నిన్నున్ జవం
బున నాచెంగటడించి పేర్చుచును ద - ద్భోగిప్రతానస్థలం
బున సత్యంబగు గౌరియుండెనని తాఁ - బోవన్ బయల్దేరఁ దో
వను మాయాద్విజుఁడంతఁ దోఁపపడి చె - ల్వంబొప్ప వెన్వెంటరాన్. ౯౪౭
చ॥ ఒకయెడ నల్పశంకకయి - యొయ్యనఁ బంక్తిముఖుండు భూసురున్
బ్రకటిత భక్తిఁగాంచి ద్విజ - వర్య! కృపన్ క్షణమాత్మలింగ మో
పిక గ్రహియించియుండుఁ డిదె - వేగమ వచ్చెదనంచుఁ బల్కి వి
ప్రకరమునందు లింగమును - బొందుగఁ బెట్టిన నాతఁ డిట్లనెన్. ౯౪౮
తే॥ రావణా! లింగ మొకముహూ-ర్తంబు దాల్తు, నాల నీవిటరావేని-యవనిపైని
లింగమును బెట్టి చనియెద-సంగడీఁడు, వంచనను జేసెనని మీఁద-నెంచవలదు.

—♦ గోకర్ణ మహాక్షేత్రోత్పత్తి ♦—

వ॥ అనిన విప్రునిమాటలకు నియ్యకొని రావణుండు వెడలి మూత్రమును వదలుచుండ
దైవికముగా ముహూర్తకాలంబు దాఁటె నంత ద్విజవేషధరుండైన విష్ణుండు
సమీపమునఁగల వార్ధితటంబునఁ బశ్చిమదిశయందు భూమిపైఁ దదాత్మలింగం
బును స్థాపించి స్వస్థలంబునకునరిగె ననంతరంబున. ౯౫౦

చ॥ దశవదనుండు శౌచము య - థావిధిఁజల్పి బిఱానవచ్చి యం
దు శరధికూలభూమినిఁ గ - నుంగొని లింగము నార్తిసెంది బ
ల్మిశయము లెల్లఁ జాఁచియును - లింగమునుం గదలింప రామిఁ దా
దృశసమయంబునం గలిగె - లింగశిరంబునఁ గర్ణచిహ్నముల్. ౯౧౧
క॥ గోస్థలిశ్రుతి చిహ్నంబునఁ, బ్రస్థితమై లింగ మొప్పెఁ - బ్రస్తుతి కిరవై
యాస్థలి గోకర్ణక్షే, త్రస్థలమన జగతి సదభి - ధానము గాంచెన్. ౯౧౨
తే॥ రావణుఁడు ఖిన్నుఁడై భోగ-రాజనిలయ, మైన పాతాలమును జేరి-యందు మయుని
సద్మమున కేగి యతనిని-సన్నుతించి, కోరి మండోదరినిఁ గాంచి-గౌరి యనుచు.
తే॥ చిత్తమునసమ్మి తనకు నా-చెలువ నొసఁగ, మయుని వేఁడిన నతఁడును-మాధవాజ్ఞఁ
జలుపఁ దటియని యూహించి-సంతసమున, వెలఁది నారావణునకిచ్చి-పెండ్లి సేసి.
క॥ అరణముగా నరిదరదము, గురతరమును నైన శక్తి - గొనుమని రక్షో
వరునకు నిడి మఱి మండో, దరి యని యా సతినిఁబలుకఁ - దగునని నుడివెన్.
ఉ॥ పిమ్మట రావణుండు నతి - వేలముదంబునఁ గాంతఁగూడి స్వీ
యమ్మగు పత్తనాఢ్యము ర - యమ్మునఁ జేరిన వానిమాత లిం
గమ్మును దేని హేతువున - కై కడు దూఱెను దాని కాగ్రహం
బమ్మెయినొంది తామఱి స్వ - యంభువుఁ గూర్చి తపంబొనర్పఁగన్. ౯౧౬
క॥ గోకర్ణక్షేత్రంబును, బ్రాకటముగఁ జేరి తపము - భక్తినొనర్చెన్
లోకేశుఁడు వరమిడె ము, - ల్లోకంబులు వశముగా వి - లోకింపంగన్. ౯౧౭
క॥ పెడమఱి దశవదనుఁడు న, య్యెడ లంకకువచ్చి రాజ్య - మేలుచునుండెన్
దడయక మయుఁడును దనతో, మ్మఁడు గయునినిఁ గూడి లంక - మెనయఁగమనియెన్.
క॥ కావున మండోదరి స్త్రీ, తావనితాసమ సురూప - తారుణ్యములన్
బావనమతిన్ వెలసెను, బావని యక్కాంతఁ గాంచి - భ్రమ మొందనయెన్.
తే॥ గయునకును మృతి తత్సంత్తి-కంతువలన, నగునటంచును బ్రహ్మవా-క్యంబుగాన
నదియెఱింగిన వాయుజుఁ-డతని వస్త్ర, మొకటి రావణుశయ్యపై-నునిచె నోల.
క॥ రావణు వస్త్రమునుం గొని, యావిధినె విభీషణుని శ - యంబుననిడె యా
పావని సీతాపావని రావణుకడ నుండదనుచు - భ్రమము తొలంగన్. ౯౨౧

—♦ హనుమంతుఁ డశోకవనముం జేరుట ♦—

తే॥ వడి నశోకవనంబున-భవ్యగుణను, జానకి ననిందితను గడు-శ్రద్ధతోడ
వెదకుచును నిద్రచెందిన-విహగములను, మేలుకొనఁ జేసె వృక్షస-మీప గతిని.
తే॥ పైకి నెగిరెడు పక్షుల-పక్షహతిని, వృక్షములు పెక్కు రంగులై-యింపుమీఱు
పుష్పవృష్టులఁ గురియించె-బుడమిమీఁదఁ, జూపఱకు సంతసంబును-జోద్య మొప్ప.

క॥ రాలెడు పూవులతోడను, వాలాయమెసంగనిండి - ప్రసవనగంబుల్
బోలి కనిపించెఁ గరువలి, చూలగు హనుమంతుఁ డపుడు - శోభ యెలర్పన్.
తే॥ దిక్కులకుఁ బర్వులెత్తుచుఁ-దేఱిచూచి, చెట్లగుంపుల నడుమ వ-సించు కపిని
నావసంతుఁడుగా నెంచె-నపుడు సర్వ, భూతములు విస్మయంబంది-చేతములను.
క॥ ఈవిధి సీతను వెదకుచు, నావనిఁ బ్రాసాద శింశు - పానోకహముల్
పావనిగాంచి తదీయ మ, హావిటపీ రమ్యమూల - మందుం దమిమై. ౯౬౬

—♦ హనుమంతుఁడు జానకినిఁ జూచుట ♦—

మ॥ అసురస్త్రీ పరివేష్టితన్ మలిన వ - స్త్రాలంకృతన్ దైన్యమా
నస సంపూర్ణను నేకవేణినిఁ గృశన్ - ధాత్రీశయానన్ మహా
వ్యసనోపేతను రామనామ సతత - ధ్యానాత్మికన్ జానకిన్
వెస నీక్షించి కృతార్థుఁడైతి నని తాఁ - బెంపెక్కఁగా నిక్కుచున్. ౯౬౭
క॥ వర శాఖాగ్రమునకుఁ జై, చ్చెర నెక్కియుఁ గూరుచుండి - సీతను బలుమా
ఱరయుచు నచ్చట డాగన్, దరుశాఖలుఁ బత్రములును - దనకడ్డము గాన్.
వ॥ ఆ సమయంబున. ౯౬౯

—♦ రావణుఁడు సీతచేఁ దిరస్కృతుండగుట ♦—

ఉ॥ సౌధమునందు రావణుఁడు - స్వప్నమునం గపివర్యుఁడొక్కరుం
డాధరణీసుతం గనిన - యట్టులు కాంచి భ్రమించి లేచి ధా
త్రీధవ పూజ్యుఁడై మనెడు - శ్రీరఘురాముని చేతఁ జత్తునం
చేధిత భీతిచిత్తుఁడయి - పృథ్వీసుతన్ దిలకింప వచ్చెఁదాన్ ౯౭౦
క॥ వచ్చిన దశకంధరునకు, హెచ్చుగఁ గ్రవ్యాదపత్ను - లెరఁగిరి సీతా
సచ్చరితయుఁ దత్పదరవ, మచ్చుగవిని విహ్వలాత్మ - యయ్యెన్ జాలన్. ౯౭౧
ఉ॥ రావణుఁడంత సీత నభి - రామను గాంచుచు నామెముందు దు
ర్భావముతోడ నిల్చి వర - భామిని! నన్ గనవేల? లజ్జయా?
నీవు భయంబునొందితివె? - నేను మహాబలుఁడన్ ద్రిలోకముల్
నా వశముల్ నినున్ వలచి - నాఁడను నీకిఁక లోపముండునా? ౯౭౨
ఉ॥ రాముని రాజ్యహీనుని న - రణ్యనివాసుని మిత్రదూరునిన్
భూమికవల్కలంబులను - బూని జటల్ ధరియించుకొన్న ని
ష్కాముకునిన్ సనిష్ఠురుని - సౌఖ్యము భోగము లేనివానిఁ ద
న్వీ! మహిఁ దండ్రిలేని నరు - నిన్ మదినెంచక నన్నుఁ బొందుమా! ౯౭౩
తే॥ అప్సరోసేవితుని నన్ను - నమిత భాగ్య
యుక్తు నేమని పలికెద - పువిద! నిన్ను

స్త్రీలు మండోదరీముఖ్య - లాలయమునఁ
బవలు రేయియు భజియింత్రు - పదములొత్తి. ౯౭౪

శా॥ నారాజ్యంబది నీయధీనము లస - న్నాళీకపత్రేక్షణా!
స్మేరాంకూర శుభాననంబున ననుం - బ్రేమించి వీక్షింపుమా!
ఘోరాముల్ పడనేల? నేలఁబడి సొం - పుంజెంపు నేదర్ సదా
హా! రామా! యని యేడ్వనేల? కడుసౌ - ఖ్యస్ఫూర్తి నర్ జేరుమా!. ౯౭౫

తే॥ వనిత! నాజీవితము నీదు-వశము సుమ్ము, నీవుకోరిన నెద్దియేన్-నిముషముననె
దాసుఁడై సేయువాఁడ మ-ద్భాగ్యమనుచు, నింక జాగేల? నను వరి-యింపుబాల!.

క॥ అనిన్ వచ్చిన తలవం, చినయట్టులెయుండ రోష - చిహ్నితమతి నా
జనకసుతాసతి తృణముమ, గొని తనకంతరము పెట్టి - కొని యిట్లనున్. ౯౭౭

శా॥ నీచా! జ్ఞానవిహీన! రాఘవులు సా - న్నిధ్యంబునన్ లేనిచో
నీ చాతుర్యముచూపి దొంగమునివై - నిర్గ్రంథుఁడై నన్నున్
యాచింపం జనుదెంచి రామభయ స - మ్యగ్గ్రస్తుఁడై వచ్చినా
పాప్రచుర్యంబుగ నన్నుఁ దెచ్చితి హవి - ర్భాండంబు శ్వానంబటుల్. ౯౭౮

ఉ॥ కావున రామచంద్రశర - ఘాతవిదారితదేహుఁడై యనిన్
జావునుబొందు నప్పుడయి - నన్ రఘురాముని మానుషత్వమున్
దైవసమత్వముం గనెదు - దానవ! దర్పమెలర్ప నీకునై
నీవకడంగి మృత్యువును - నెమ్మిగ డగ్గఱఁ జేసికొంటివా. ౯౭౯

వ॥ అని నిష్ఠురంబులాడుటయు దశకంఠుండు క్రోధసమావిష్టహృదయుండై ధరాసుతం గని మరల నిట్లనియె. ౯౮౦

శిఖరిణి॥ కనన్ వేగన్ లంకన్ ద్రిదశవదన - గ్లానియయగున్
ఘనుండౌ రాముండున్ నరణకరుఁడౌఁ - గా, యనుజుతోన్
మునీనాభుం డుచ్చైర్ద్విపదమును రా - ముండు కొనెడిన్
సునందంబున్ గాంతున్ నజయరముఁడౌ - క్షోణిపుఁడునున్. ౯౮౧

క॥ ఆ రావణవచనము విని, భూరమణీపుత్రి మరల - మునుకొని దనుజా!
యూరక ప్రేలెదె? నీవా, క్నారమెతగు నుత్తరంబు - గాఁదలఁపు మదిన్.

తే॥ ప్రతిపదంబున సప్తాక్ష-రంబు విడచి, నీవె పఠియించుకొను దుష్ట!-నీనుడులను
దత్ఫలానుభవంబు స-త్వరముగాఁగ, నొందుమా! యని బదులాడె-నొఱపుమెఱయ.

క॥ ఏడవ యక్షరలోపము, షోడశపగు ఛందమగుచు - షోడశకర్ణాం
బోడుగఁదోఁచిన రావణుఁ, డీడిగిలంబడుచు మదిని - నిట్లని చదివెన్. ౯౮౪

షోడశచ్ఛందో వృత్తము

కనన్ వేగన్ లంకన్ దశవదన - గ్లానియుయుగుక్
ఘనుండౌ రాముండున్ రణకరుఁడై - గా, యనుజుతోన్
మునీనాథుండుచ్చైఃపదమును రా - ముండు కొనెడిన్
సునందంబుం గాంతున్ జయరముఁడౌ - క్షోణిపుఁడునున్. ౯౮౫

క॥ అని యిటు సీతావాక్శర, ఘన విద్ధండగుచుఁ బాత్తి - కంతుఁడు సీతా
వనితను భర్త్సన మొనరుచు, చను ఖడ్గమునూని కనియెఁ - జఱుకున నంతన్.
క॥ మందోదరి యవ్వనమున, కుందమిమై వచ్చి పతినిఁ - గుద్ధునిఁ గని సీ
తం దయతోఁ బోవ్రుండని, ముందునకును నరిగి వేఁడె - మోమోటతగన్.
వ॥ పిమ్మట దశగ్రీవుండు వికృతాననలగు రాక్షసస్త్రీలను గనుఁగొని యనుజ్ఞాపూర్వ
కంబుగా నిట్లనియె. ౯౮౮

ఉ॥ రాక్షసకాంతలార! యభి - రామ కుతూహలతన్ సరోజప
త్రేక్షణ సీత నాను వశ - యేవిధియానో? యటుల్ నయానినో?
రూక్షతనో? భయంబుననో? - రూఢి సమాదృతినో? ప్రియత్నముల్
దక్షతఁ జల్పి మన్మదన - తాపముమాన్పఁగఁ జయుఁడీమెతోన్. ౯౮౯

ఆ॥ రెండు నెలలు గడువు-ప్రీతిమైఁ నొసఁగితి, నంతవఱకు వినుచు-నంత వినిచి
యెంతకైనఁ దెగువ-యేసేసి యీ సీత, నన్ నిరాకరించి-నన్ గడంగి. ౯౯౦

క॥ పెంపఱఁ దక్షణమున నే, చంపి మదీయాశఁ దీర్పఁ - జాలుఁడు మదినే
నింపొందెద నటులైనను, దుంపెసలాడక యనుజ్ఞ - తో మెలఁగుఁడీఁకన్. ౯౯౧

క॥ అని యనుమతినిడుచుండిన, దనుజాధిపు రావణున్ మ - దస్థిరు మైథి
ల్యనఘాత్మికతానిటులను, వినవా? దశకంఠ! పూర్వ - విధ్యుక్తములన్. ౯౯౨

తే॥ బాల్యమున నేను నీచేత-వహ్నినుండి, పేటికాస్థితిఁ దేఁబడిఁ-పెలుచ నెల్ల
పొలసుదిండులు నీవును-దెలియ విషయ, మీపురంబుననే వచి-యింప లేదె?.

క॥ మఱచితివో? తద్విషయము, గఱచితివో? కఱతలెల్లఁ - గఱునునఁ జేయన్
బఱచితివో? నాకొఱకిటు, లఱచితివో? యిచ్చకొలఁది - నఱగొడ్డెముగాన్.
క॥ ఆ నుడుల మేరకిప్పుడు, నీనగరముఁ జేరియుంటి - నిను నీ సంఘుం
బీనెఱ్ఱీ రాముని నారా, చానలమున బూదికాఁగ - నారసి పిదపన్. ౯౯౫

తే॥ రామలక్ష్మణ యుతముగాఁ-బ్రేమమీఱ, నాయయోధ్యకుఁజేరి సౌ-ఖ్యమునమనెద
నిటులె మఱిమఱినేన యి-చ్చటులుకని ని, కుంభపుత్త్రకుఁడౌ పౌండ్రి-కుని వధింతు.
క॥ వితత ద్వీపాంతరసం, స్థితునిన్ దుర్మతిని మాని - దేవ విమతునిన్
జతగాఁ బౌండ్రికుఁ జేరెదు, శతకంఠున్ శుంఠ గర్వ - శాంతిగఁ దుంతున్.

తే॥ కుంభకర్ణోద్భవుని పీరు-దంభవృత్తు, మూలకాసురు సంహార-మును బొనర్తు
దైవ యోగంబు నెవఁడేని-దాఁట నౌనె? పొమ్ము బోనంబుదినుము నీ పుట్టుగిట్టు.
క॥ అన నాసీతాఘన వా, క్శనిశిత శరవారఘాత - కుంఠిత హృదయుఁడై
దనుజాగ్రణియగు రావణుఁ, డును లజ్జావనత వక్త్రుఁ - డుగ నిలుసేరెన్. ౯౯౯
ఉ॥ పిమ్మట రావణాజ్ఞ నతి - వేలముగా నసురీగణంబు రో
షమ్మునఁ దాముగర్జిలుచు - సారెకు ఖడ్గకరంబు లెత్తుచున్
బొమ్మముడిన్ వెఱంగొలుపఁ - బూనుచు నాయుధపాళిఁ జూపుచున్
గ్రమ్మచు జానకిన్ వడిగ - రావణుఁ గోరుమటంచుఁ బోరఁగన్. ౧౦౦౦

—• త్రిజటా సాంత్వనము •—

వ॥ విభీషణ ప్రియానుగయగు త్రిజటానామ యవ్వారలంగని జానకీదేవిపైఁ గ్రూరత వలదని నివారించి సాదరంబుగా నిట్లనియె. ౧౦౦౧
తే॥ పతివలనఁ గోలుపడి సదా-పసవి పసవి, యేమ్పు నీమెను బెదరింప-నేల? మీరు
రాక్షసస్త్రీలు చెడ్డత-లంపులుడిగి, మ్రొక్కుఁడీ! జానకీ పాద-ములకు భక్తి.
మ॥ శుభచిహ్నుండయి రామచంద్రుఁడు కలన్ - జూపట్టె నాకిప్పుడీ
యిభయానార్థము లంకఁగాల్చినటులున్ - హేలాగతిన్ రావణున్
సభటస్యందన వాజివారణముగా - సంహారముం జేసిన
ట్లు భృశానందముతోడ సీతఁ గొనిన - ట్లున్ మర్కటో పేతుఁడై. ౧౦౦౩
క॥ ఈ కలనడుమనె రావణుఁ, డేకముగా గోమయ హ్ర - దేరితుఁడయి నిం
ద్యాకృతి దిగ్వస్త్రుండయి, కూఁకిడినటు తైలముంటి - కొనినటు తోఁచెన్. ౧౦౦౪
తే॥ అందువలనను సాహస - మాచరింప
వలదు మీరలు జానకి - లలన నెపుడుఁ
గొల్చుటయె ముఖ్యకార్యంబు - క్షోణిసుతయు
నాత్మనాథునిచే నభ - యంబుఁ గూర్చు. ౧౦౦౫
క॥ ఈమెను బాధింతురయే, నామహిజాసుతయు దుఃఖ - మందుననయేన్ శ్రీ
రామునిచే నీమెయె మిము, నామిక వెసనేదఁ జంపు - నటులొనరించున్. ౧౦౦౬
క॥ అని బోధించిన త్రిజటా, వనితా వాక్యములు దైత్య - వనితలు విని నె
మ్మనముల భయమునుగొని క్రి, మ్మనక యవిచ్ఛిన్నభక్తి - నలరిరి గరిమన్.

—• సీతా విలాపము •—

ఉ॥ అప్పుడు జానకీసతియు - నార్తిని దూలుచు గద్గదస్వనం
బొప్పఁగ నేయుపాయమున - నొందుదునో? మరణంబు దైవమా!

యిప్పుడు నాకు దీర్ఘజట - యే యురిగా నటులన్ ఘటించెదన్
దప్పుడు. మాటలన్ గుణని - ధానుని లక్ష్మణు ముందు దూఱితిన్. ౧౦౦౮
తే॥ పాపఫలమునఁ బీడింపఁ - బడితినిట్టుల
ననుభవించితి స్వీయకృ - తాపరాధ
మకట! తగిన ప్రాయశ్చిత్త - మిఁకఁ దలంప
నసువులను వీడుటని నిశ్చి - తాత్మయయ్యె ౧౦౦౯

—♦ హనుమంతుఁడు సీతవినునట్లు రామవృత్తాంతమును జెప్పుట ♦—

తే॥ అంత నామెకు శ్రుతిపేయ - మైనరీతి
నాంజనేయుఁడు రామవృ - త్తాంత మెల్ల
మెల్లఁగాఁ జెట్టుకొననుండి - మృదుల ఫణితిఁ
బలికె సంతోషమాత్మను - బ్రబలఁ జేయ. ౧౦౧౦
క॥ సాకేతము విడిచదిమొద, లాకానన వాసకృతము - లాపయి రాముం
డేకరణి జతచమొనరిచెఁ, బ్రాకటముగ నదియు హనుమ - రాకయు వినుచున్.
ఉ॥ సీతయు నబ్బురంపడి వి - శేషముదంబును బొంది వ్యోమమం
దాతత రామసచ్చరిత - మంతయు నే విననయ్యెఁ జిత్రమీ
రీతి నిజంబొ? స్వప్నమొ? గ - రిష్ఠుఁడు పుణ్యుఁడెవండు నేఁడు మ
చ్చేతము తృప్తినొందుఁనటు - సేసె? దయామతి నన్ను గాంచుతన్. ౧౦౧౧

—♦ హనుమంతుఁడు రామముద్రికను సీతకొసంగుట ♦—

వ॥ అని సకరుణంబుగాఁబలికిన హనుమానుండును సీతాపురోభాగస్థలంబును జేరి నిలిచి నమ్రీకృతుఁడై నతిమొనర్చి రామసౌమిత్రుల కుశలమునువచించి తాను రామునిబాటగుటయుఁ దనపేరును నెఱింగించి శ్రీరామనామాంకితాంగుళీయకంబు నామె కొసంగిన సద్గుణసముద్రియగు వైదేహియు రాముముద్రికను గన్నులకద్దిగొని ముద్దుగొని పులకాంకురితాంగియై యమందానందమున హనుమంతునిం గని యిట్లనియె.
మ॥ కపివర్యా! యెటువచ్చితిచ్చటికి ర - క్షస్త్రీగణోద్వేష్టితం
బుపరుద్ధంబు సురాపమీవనము రా - మోదంతమున్ విన్చి నా
కిపుడామోదమునించితో గుణనిధీ! - యేరీతిగా రాక్షసా
ధిపు నిర్జింతురొ? రామలక్ష్మణులు వా - ర్ధిందాఁటి నన్ బ్రోతురో?. ౧౦౧౪
క॥ అసువులపై నాసనువిడి, వెసమృత్యువు వాతఁబడఁగ - వీక్షించెడు స
న్నసదృశగతిఁగని రాఘవు, ల సుభోదంతమున నసువు - లన్ నిలిపితహా!
మ॥ అనినన్ మారుతి సీతనుం గనుచు మా - తా! సంశయంబేల? రా
మునికిన్ సాధ్యముకాని కార్యమది యీ - భూమిన్ గనన్ లేదు వా

రనిధిఁ దాఁటుట యేమివింత? వినుమా! శ్రీరామ సౌమిత్రులన్
ఘనులన్ నాదగుస్కంధసంస్థితులుగాఁ - గన్ జేర్తు నిచ్చోటికిన్. ౧౦౧౭
తే॥ ప్లవగసంఘముతోడ నీ లంకఁ జేరి, రాఘవులు ఘోరమౌ రణ-రంగమందుఁ
బఙ్క్తికంఠుని సుతహిత-బంధువార, యుతముగాఁ జంపుదురు సత్య ముర్వి పుత్రి!
క॥ పిమ్మట నూఱటఁగను చి, త్తమ్మున శ్రీరామమూర్తి-తమ్ముని తోడన్
సమ్మదమున నిన్నుంగొను, నమ్మా! సీతమ్మ! నమ్మ-మమ్మా! నన్నున్. ౧౦౧౮
చ॥ అని తన గొప్పరూపమును - నామెకు, బ్రత్యయమొప్పఁ జూపి రా
మునివలనన్ రహస్యముగ - మున్వినినట్టి తెఱంగు చిత్రకూ
టనగమునన్ మనశ్శిలను - డంబుగఁ దాఁ దిలకంబు సీతకున్
మనమలరంగ రాముఁడు స మ్మోదముగఁ దిద్దినవార్త తెల్పియున్. ౧౦౧౯
చ॥ ముదమును జెందు జానకికి - మ్రొక్కి సమీరసుతుండు తల్లిరో?
సదయత నాకనుజ్ఞనిడి -స్వామికి గుర్తుగ నెద్దియేని యి
య్యదనున నిమ్మ భద్రముగ - నయ్యది చేర్చెద రామమూర్తికిన్
ముదల భవత్సుఖాప్తికది - మూలపుఁ గారణమౌ నటంచనన్. ౧౦౨౦

—♦ సీతాదేవి తన చూడామణిని రామార్థము హనుమంతునకొసంగుట ♦—

భుజంగ ప్రయాతము
రసాపుత్త్రి కేశాంత - రస్థంబు దివ్యం
బసామ్యంబు పిత్ర్యంబు - హర్ష ప్రదంబు
న్వసన్ స్వీయచూడామ - ణిన్ దీసి మోద
ప్రసక్తిన్ హనూమత్క - రంబందుఁ బెట్టెన్. ౧౦౨౧
ఉ॥ పెట్టియుఁ జిత్రకూటమునఁ - బెన్నిటి నిద్దుర నెంది లేచి తన్
గుట్టిన కాకముం గనియుఁ - గ్రోధముతో నిషికాస్త్రమేసి చే
పట్టుమటంచుఁ బాదముల - వ్రాలిన కాకమునొంట నేత్రముం
గిట్టఁగఁ జేసి ప్రోచుట సు - ఖించుట జ్ఞప్తిగఁ దెల్పె నంతటన్. ౧౦౨౨
తే॥ ధన్యుఁడైతి నటంచుఁ ద-త్కపివరుండు, సీతకు నమస్కరించి ప్ర-స్ఫీత హర్ష
చిత్తుఁడై స్వామికార్యంబు-సిద్ధిపొందెఁ, గొంతపని యిందొనర్తునన్-కోర్కెఁదవిలి.
క॥ మాతా! సీతాదేవీ!, యాతటి క్షుద్బాధ నాకు - నెక్కువయయ్యెన్
జేత స్తృప్తి వనస్థము, లౌ తీయనిపండ్లు తినెద - ననుమతి నిడుమా!
వ॥ అని ప్రార్థించిన నామెయుఁ గరుణించి కరకంకణంబు నొండు కైకొని మరున్నందను నిఁ గనుఁగొని కపివరా! యిద్దానిని లంకాపట్టణమున నంగడులయందు విక్రయించి వలయు ఫలములనుగొని కడుపారఁదిని బడలికవాయ మంతియకాని వనఫలములను

డుల్పవలవనుసుమా! యనిన నతండు సమ్మతింపక 'తల్లీ! పరహస్తఫలమ్ములను భక్షింపని వ్రతనియమంబు నాకుఁగలదుకావున గతియేమని వగపునొందుచుండఁ దట్ట్రతుదకా కరువలిపట్టితోఁ బుడమిపట్టి యిట్లనియె. ౧౦౨౬

శా॥ బిడ్డా! కర్వలిముద్దులపట్టి! క్షుధచేఁ - బీడింపఁగాఁబడ్డ నీ
యొడ్డుగాంచితి నేమిసేయుదును లం - కేశుండు వీక్షింపఁగా
నోడ్డాడించును నీయెడన్ వనికి న - ర్హుండున్ బ్రభుండాతఁడా
యడ్డంకిన్ దొలఁగింప శక్తులెవర - న్నా! చెప్పనోరాదునా?. ౧౦౨౭

క॥ అనుటయు మారుతియిట్లను, ననఘాత్మిక! లోకమాత! - యవనీతనయా!
ఘన రామనామ మంత్రం, బున నెంతటి వారినైన - భువి నిర్జింతున్. ౧౦౨౮

తే॥ తారకంబేది హృత్కంజ - దళములందుఁ, జిహ్వాంతంబయియుండు సు - స్థిరముగాఁగ
వారికి ఘోరరాక్షస - వారమెల్లఁ, దృణముకంటెను స్వల్పమౌఁ - దేరిచూడ.

చ॥ అనవుడు జానకీసతియు - నా హనుమంతునిఁ గాంచి వానరా!
ఘనమగు నీదుభక్తికి న - ఖండముదంబొనఁగూడె నాకు ని
ర్వనమున రాలినట్టి ఫల - పాళి గ్రహింపుము తృప్తిఁబొందుమా!
దనుజుల మీఁది యాసున వృ - థావనభంగ మొనర్పకుండుమా! ౧౦౨౯

—♦ హనుమంతుఁ డశోకవనమున ఫలములను దిని వనమును బాడొనర్చుట. ♦—

చ॥ అనుటయు వల్లెయంచు మరు - దాత్మజుఁడల్లనఁ దోఁకచేతఁ జె
ట్లను గదలించి రాలిన ఫ - లంబులఁ దాఁ దినుచుండ రాక్షసుల్
వనచరుఁ గాంచి దర్పమున - వన్యఫలంబులఁ దిందువా? యటం
చని బెదరించుచున్ దఱుము - లాడిరి కొవ్వునఁ జివ్వసేయుచున్ ౧౦౩౦

ఉ॥ అంతటఁ గారణంబొకటి యారయఁ గ్రాలెనటంచు నెంచి ని
శ్చింతగ వృక్షముల్ పెఱికి చివ్వునఁ దద్దనుజాళిఁ గొట్టుచున్
సంతసమొప్ప మారుతి వి శాలవనంబును గూల్చె జానకీ
కాంతకు నాశ్రయంబగు న - గంబును మాత్రము నిల్పిపొల్పుగన్ ౧౦౩౧

క॥ చైత్యప్రాసాదంబును, నత్యంతము పాడొనర్చె - నందలి భటులన్
మృత్యువునకు బలియొసఁగెను, దైత్యులు వెఱఁగంది పఱవ-దారుణరీతిన్ ౧౦౩౨

క॥ ఆహనుమానుని భయమున, హాహాకారములఁ జలుపు - చా రాక్షసులున్
గేహస్థుని రావణుఁగన, నూహించియుఁ బర్వువాఱి - రోటమియొప్పన్ ౧౦౩౩

—♦ రావణుఁడు భ్రాంతుఁడై గయునిఁ జంపుట. ♦—

ఉ॥ అంతట రావణుండును శ - యంబుననుండియు నిద్రలేచి శ
య్యాంతరమందునన్ గయుని - యంబరముంగని రోషమంది నా

కాంతను నీఁడు పొందెనని ఖడ్గమునొండు ధరించిపోయి యా
చెంతనె సుప్తుఁడైన గయుఁ జెచ్చెరఁ దా వధియించెఁ గ్రూరతన్. ౧౦౩౪
క॥ పిమ్మట మండోదరిని వ, ధమ్మును నొనరింప నెంచెఁ - దత్సతినిర్దో
షమ్మును రాక్షసులెల్లరు, సమ్మతిగాఁ దెలుప మరల - శాంతుండయ్యెన్. ౧౦౩౫
ఆ॥ అల విభీషణుండు-నపుడ నిద్దుర లేచి, తనకుశయ్య రావ-ణునిది వలువ
గాంచి శంకనొంది-కారణమూహించి, సతినిఁ జంపనెంచి-సత్యమరసి ౧౦౩౬
క॥ ఎన్నఁటికైనను రావణు, నన్నయొకద యంచు నమ్మ-టది మోసముగాం
చెన్నుచు మదిలోఁ గ్రుద్ధగొని, మిన్నక యతఁడుండెఁ గ్రొత్తి-మిష యొంతటిదో?
క॥ తదనంతరమున సన్నుత, పదుఁడై రక్షోగణంబు-భజియింపఁగన్
సదనమునుండిన రావణు, నదరుచు నేడ్చుచును జేరె-నసురీగణముల్ ౧౦౩౮

—♦ రాక్షసస్త్రీలు వనభంగమును రావణునకుఁ దెలుపుట ♦—

చ॥ అటుగని రావణాసురుని - నాయసురీతతి కేలుమోడ్చి మి
క్కుటమగు చేటుదెచ్చె నొక - క్రొత్తి యశోకవనంబునెల్ల న
క్కట! మొదలంటఁగూల్చె మొన - గాండ్రగు బంటుల గెంటి చంపె మే
మెటు బ్రతుకంగ నోపుదుము - హింసకుఁ డాకపియో ప్రభూత్తమా!. ౧౦౩౯
సుగంధి॥ చెట్టుచెట్టుఁ ద్రోకఁజుట్టి - జెట్టియట్టులాగు నా
చెట్టులట్టి కేలఁబట్టి - చెట్టునొంద మమ్ములన్
గొట్టు బిట్టు నెట్టు మిట్టు - గొట్టుమారియైన యా
చెట్టు నట్టుఁబట్టి గిట్టఁ - జేయురాజ! పున్నెమా. ౧౦౪౦

—♦ రావణుఁడు హనుమంతునిఁ బట్టితెమ్మని దైత్యుల నియోగించుట ♦—

చ॥ అని కడు విన్నవింప నసు - రాధిపుఁడుల్ వనపాలు జంబుమా
లిని వెసఁబిల్చి నీవు బలు - లెంకలనుల్ బదివేలమంది నొ
య్యనఁ దోడికొంచు నేగి యిటు - లావడినూర్చిన క్రొత్తిఁబట్టి నె
ట్టన నిటకీడ్చి తెమ్మని క - డంకను బంపెను గిన్కమీఱఁగన్. ౧౦౪౧
క॥ వారును జని మారుతిఁగని, క్రూరతఁగొని పోరఁ గిశ - కుంజరుఁడంతన్
ధీరత ఘోరతరంబగు, నారవ మొనరించి మించె - నతిహర్షముతోన్. ౧౦౪౨
క॥ శితశరములు జతగాఁగొని, దితిజులు మితిమీఱఁ గ్రొత్తి - దిక్కునకేయన్
మతిమంతుఁడు హనుమంతుఁడు, తత్తోరణ మెక్కినిక్కి - దర్పమెలర్పన్. ౧౦౪౩
క॥ పోరఁబోరి రక్కసులపయిన్, జరలాటముకాఁగ దుమికి - చాఁగఁబడఁగొనుచున్
బంకాఁడు మశకములఁబలె, నంభోక్తల నప్పుడతఁడు - నలఁచెన్ గెలుచున్. ౧౦౪౪

క॥ శక్తియుతు దనువరములఁ గొని, చుఱచుఱఁగని కొట్టి రాక్ష - సులఁ జంపియు న
ఱ్ఱెత్తుఁగొనఁ దాలాగంబున. నఱజాతిని జంబుమాలి - నంతమొనర్చెన్. ౧౦౪౫
క॥ రావణుఁ డావార్తను విని, చేవను బలయుతులఁ బంచ - సేనాపతులన్
దా వడిఁ బంపెను వనచర, కావరము డిగింపఁ గపినిఁ-గన గ్రహియింపన్. ౧౦౪౬
తే॥ లక్ష రాక్షస యుతులయి - దక్షులైన
తత్ప్రముఖనాయకులు నేపి - తల్లజునిని
బట్టనుంకించి శరములఁ - గొట్టఁ బూన
నాంజనేయుఁడు రోషారు - ణాక్షుఁడగుచు. ౧౦౪౭
క॥ వారల నెల్లర నపుడుం దమ, హారభసము మీఱఁ గరుల - నొప్పయికముగా
సారెసుఁ గొని మోదుచు నా, తోరణమున మారణంబు - తొడరం జేసెన్. ౧౦౪౮
క॥ దళవాయు లేవురిట్లవధి, దళములతోఁ గూలిచేతఁ - దత్తరుహతిఁ గం
దళములు వగులఁగఁ గూలుటఁ, గళవళపాటొప్ప విని న్ర - ఘాతుకుఁడంతన్
క॥ అక్షుఁడను తనసుతున్ రణ, దక్షునిఁ బిలిపించి పుత్త్ర! - త్వరఁ జని నీవా,
వృక్షచరున్ బంధించి న, మక్షమునకుఁ దెమ్ము పొమ్ము - టంచు వచించెన్.

—◆ హనుమంతుఁ డక్షకుమారునిఁ జంపుట ◆—

క॥ తద్గుర్వాజ్ఞ నక్షుఁడు, ముద్గర ముసలములు శస్త్ర - ములు గొని చని తా
నుద్గాఢముగాఁ గపివరు, నుద్గతి చెడఁగొట్టఁ దొడఁగ - నురుకోపమునన్. ౧౦౫౧
క॥ ఉద్రిక్తుఁడగుచు హనుమయు, సద్గ్రథితాయుధము లెల్ల - చూర్ణముఁ గూల్చియు దీ
వ్యద్గ్రంథి ముద్గరము గొని, తద్గ్రహమాళువును నక్షుఁ - దడయక చంపెన్.
మ॥ అటులయ్యక్షకుమారుఁడున్ హనుమచే - నంతంబునుం బొందె నం
చుటజస్థుండగు రావణుండు విని శో - కోత్తప్తుఁడై రోషియై
పటుసత్త్వాఢ్యుఁడగు నింద్రజిత్తను సుతున్ - భాస్వంతునిం గాంచి య
క్కటా! యక్షుండును గ్రొత్తిచే మృతిఁగనెన్ - గర్మంబలంఘ్యంబహా! ౧౦౫౩

మత్తకోకిలము.
నిన్నుఁ బోలిన వీరు లెవ్వరు - నేఁడు దోఁపరు నామదిన్
గ్రిన్ననం జనుమా! కుమారవ - రా! జితామరనాయకా!
పన్నగుల్ మఱి యక్షులున్ సుర - వర్యులున్ నిను గెల్తురే?
పిన్నకోతియ దెంత? దానినిఁ - బీఁచమేదఁగఁ దెమ్మిటన్. ౧౦౫౪
క॥ నావుడు నింద్రజితుండును, భావనమతితోడఁ దండ్రి - పాదంబులకున్
దా వందనముల నొసరిచ్చి, పావనినిం బట్టి తేర - భావించి తగన్. ౧౦౫౫

—♦ రావణ ప్రేరితుఁడై యింద్రజిత్తు హనుమంతుని బంధింపఁబోవుట ♦—

చ॥ అరదము నెక్కి కోటిమసు - రావళితోఁ వలగొంచు రాఁగ ను
ద్ధురముగ నస్త్రశస్త్రములు - తోమరపట్టిస భిండిపాల ము
ద్గర ముసలాది సాధనవి - తానములర్వఁగ వేగ నేగి వా
నరవరుఁగాంచి మించుచు ర - ణాబొనరించె నచంచలాత్ముఁడై. ౧౦౫౬

తే॥ తోఁకరాయఁడు మెలమెల్లఁ - దోఁకఁ బెంచి
తేఱిచూచుచు నెల్లరా - త్రించరులను
దల్లడిల్లఁగ బిగియించి - పల్లటీలు
గొనుచు నిలకుఁ బెకిల్లునఁ - గొట్టియార్చె. ౧౦౫౭

ఉ॥ ఇంద్రజి దానికిం గనలి - యేపునఁ దూపులు వైచెఁ గ్రోఁతిపై
సాంద్రముగాఁగ నప్పుడు ర - సాతలమల్ల నభ స్తలంబు ని
స్తంద్రత సంచలింపఁగ స - దాగతిసూనుఁడు వృక్షపాళి నీ
రంధ్రముగాఁగ వైచుచుఁ బు - రందర వైరినిఁ గ్రిందొనర్చెనన్. ౧౦౫౮

తే॥ మేఘనాదుఁడు వెఱగొని - మిడుమిడుకని
వేగఁ బెడమఱియేగి తా - డాగె నొకట
నట్టిసమయాన వెన్నుని - పట్టివచ్చి
గాలిచూలినిఁ గనుగొని - లీలఁబలికె. ౧౦౫౯

క॥ హనుమా! మత్ప్రార్థనమును, వినుమా! నాయస్త్ర మెపుడు - విడు హరిజితుఁడున్
జనుమా! వశుఁడై నీవపు, డనుమానము లేక రావ - ణాసురి నెడకున్. ౧౦౬౦

వ॥ అనిన ననిలసుతుండును వల్లెయని సమ్మతింప సరస్వతీశ్వరుండు మరలి డాగి యుండిన మేఘనాదు నవలోకించి హరిజితుండగు నీవ యొక క్రోఁతికి భయంపడ నేనె? మదీయాస్త్రంబు నరివోసి విడిచిన నతండు నీవశుండు కానోపునని ప్రేరేచి యంతర్ధానంబునొందె ననంతరంబున. ౧౦౬౧

—♦ ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రమును వైచి హనుమంతునిఁ బట్టుకొని రావణుకడకుఁ బోవుట ♦—

తే॥ ఇంద్రజితుఁడును గపిఁజేరి - యేపుచూపి, కడఁగి బ్రహ్మాస్త్ర మేసిన - గాలిచూలి
కట్టువడె నంత సంతస - ముట్టిపడఁగ, హరి జితుండును బితఁజేర్చె - హరినిఁ ద్వరగ.

క॥ పిమ్మట రావణుననుమతి, నమ్మానవభోక్తయగా ప్ర - హస్తుఁడు హనుమన్
బమ్మిర మదమునఁ గనుఁగొని, యిమ్మెయి నెందులకు వచ్చి తీవిట కనుచున్ ౧౦౬౩

తే॥ ఎవ్వఁడవు నీవు క్రోఁతి! నీ - కేమి కార్య, మిచటఁగల్గెను? దుర్మార్గ - మేల సేయు?
నిన్నుఁ బ్రేరేచి పనిచిన - నీచుఁడెవఁడు?, తెల్పుమన రామవిషయంబు దెల్పె కపియు.

వ॥ రావణాసురునిఁ గాంచి యిట్లనియె. ౧౦౬౪

—♦ రావణునకు హనుమంతుఁడు నీతిని బోధించుట. ♦—

వంశస్థము॥ దశాస్య! మూఢా! విను - తత్వమేలరా?
యశస్కు రామున్ శర - ణాగతప్రియున్
భృశంబుగాఁ గొల్వుము - పృథ్విపుత్రికన్
ప్రశాంతిగానిమ్ము స - బాంధవుండవై. ౧౦౬౬

ఇంద్రవంశము॥ పంచాస్యతుల్యుల్ ఘన - పర్వతోపముల్
ప్రాంచద్బలుల్ దంష్ట్రన - ఖాయుధుల్ కపుల్
గాంచంగ లంకన్ మద - కాఁగఁ గూల్పకే
మొంచంగ శ్రీరామున - కిమ్ము జానకిన్. ౧౦౬౭

ఇంద్రవజ్రము॥ దేవేంద్రముఖ్యుల్ తగు - దిక్కుయైనన్
దేవేశు నం కానసె - దీటుకొన్నన్
జావేదఁ బాతాళమె - స్థానమైనన్
జీవింతువే? రాముఁడు - చీల్చునిన్నున్. ౧౦౬౮

క॥ అని శుభహిత పావనగతి, ననిలాత్మభవుండు పలుక - నావచనంబుల్
దనుజేశుఁడు పెడచెవినిడెఁ, గనఁ జచ్చెడువాఁడు మందు - గర్హించునటుల్. ౧౦౬౯

—♦ ఆంజనేయుని సద్బోధనము వినక రావణుఁడు విఱ్ఱవీఁగుట ♦—

చ॥ మఱియును రావణుండు కపి - మండను శ్రీహనుమంతుఁగాంచి యి
త్తఱి వెఱలేక ప్రేలెదవె? - తప్పదుకోఁతి! మదీయపౌరుషం
బుఱవును సర్వలోకజయ - మొప్పఁగఁ గాంచవు కావునన్ నిజం
బఱివితలాడఁబూనితివ - హా! వినుమా! యిఁక నాదుశౌర్యమున్. ౧౦౭౦

సీ॥ అఖిలజగత్సృష్టి-కాద్యుఁడౌ పరమేష్ఠి, పంచాంగపాఠకుఁ-డెంచిచూడ
ననుపమానప్రభా-భ్యర్చితుఁడై నట్టి, సూరియు మత్ప్రీతి-హారి యరయ
శీతలభాను వి-ఖ్యాతిగాంచిన యామి, నీరాజు నాఛత్ర-ధారికనఁగ
రంభాదిదేవతా-ప్రమదానుభోగుఁడౌ, సురనాథుఁడును మాల-కరి తలంప
ఆ॥ నగ్ని రజకుఁడెన్న-నా యముండును దండ, ధరుఁడు వరుణుఁ డంబు-దస్థితుండు
హాయిగాఁగ వీఁచు-నవ్వాఁడు కరువలి, దాసులెల్లదేవ-తాగణంబు. ౧౦౭౧

మ॥ అల మార్తండుఁడె నా పితుండు గణపుం - డా గార్దభోద్రిక్తుకుం
డలరన్ మంగళుఁడాదియౌ గ్రహములౌ - హార్యక్షపీఠంబునుం
గల సోపానముగాఁగ నుండుదురు సౌ - ఖ్యస్ఫూర్తిమై బిడ్డలన్
సిలుగేదన్ సతతంబు దాదియయి ష - ష్ఠీదేవి రక్షించుఁ దాన్. ౧౦౭౨

శా॥ కైలాసంబు చలింపనూఁపితిని య - క్షస్వామినిం గెల్చితిన్
నా లావున్ విభవంబులిట్టివి సదా - నందుండనై యుందు న
న్నీలా గొప్పఁగ నిర్భయుండవయి కో - తీ! కేకలం బెట్టుచున్
లీలాజాలముగాఁగఁ బల్కెదవె? కూ - లింతున్ నినున్ దుర్మతీ!. ౧౦౭౩

తే॥ మొదలఁ బ్లవగాళిలో నధ-ముఁడవు నీవు, రాముఁడననెంత? సుగ్రీవుఁ-డేమి లెక్క?
యా వనేచరయుతుని న-రాధము నిన్ను, సానుజుండైన రాముని-సంహరింతు.

క॥ అని కోపోద్రేకుండై, వనచరవరుఁడైన గంధ - వాహకుమారున్
ఘనమగు కరవాలంబున, మునుకొని వధియింప నెంచఁ - బూనినయంతన్.

తే॥ ఆ దశాస్యునిఁ గనుఁగొని-సాదరమునఁ, దమ్ముఁడైన విభీషణుఁ-డిమ్మహీశు
నిట్టులను నన్న! దూతను హింససేయ, ధర్మమౌనె? వధింపఁగఁ-దగదు తగదు.

## లంకా దహనము

వ॥ అని నివారించె. ననంతరంబ లోకరావణుండైన రావణుండు దుష్టభావంబున నీతని వాలంబు దెగనఱకుఁడని భటులకాజ్ఞాపింప వారును ఆపములను గత్తులను గటారులను గొడ్డండ్రను ధరించి గర్జించుచు హనుమానుని లాంగూలంబును భంజింపవారకొన్నఁ బెళిల్లుమని యాయుధంబులెల్లఁ ద్రుళ్లి త్రెళ్లి నలియయ్యె నంతఁ దత్తఱిల్లు భటవర్గంబునుగని దశగ్రీవుండు మీరలీకోతితోఁకకుఁ దైలసిక్తవస్త్రంబులను జుట్టి యగ్గిపెట్టుడని యాజ్ఞాపించినఁ దత్కింకరులను దైలాక్తంబులగు శణపట్టంబులను బుట్టంబులను గట్టిగాఁ గరువలిపట్టి వాలంబునకుఁ జుట్టసాగిన హనుమంతుండు క్రమక్రమంబుగాఁ దనలాంగూలంబు వృద్ధిసేయుచుండె నందువలన లంకయందలి వసనహట్టముల గుట్టలుగుట్టలుగానుండిన బట్టలన్నియు హనుమత్పుచ్ఛంబునకు చాలవయ్యె నెట్టకేలకు అంతఃపురమందలియుఁ బౌరులయుఁజీరముల గ్రహించి తెచ్చిచుట్టి మట్టుమీఱుచున్న వాలంబదెట్టు మట్టసముగాంచునో? యని సీతాదేవి కట్టుపుట్టంబుఁ దెత్తమని యూహించినఁ దటుక్కున నతనివాలంబు పెంపునిలిచెఁ దదర్థంబు సర్వగేహస్థతైలంబులును ఘృతంబును స్నేహమాత్రంబులెల్లఁ గొల్లఁగాఁ దెచ్చుటం జేసి నల్లఁదారిద్రులకెల్లరకు ఘృతాదులలభ్యంబులయ్యెఁ జిన్నిబిడ్డలకు, బునుకలకు రాచుటకేని రవంత తైలంబు లేదయ్యె మఱియుఁ బురుషులకును స్త్రీలకును గట్టంబట్టలుకఱవయ్యె నగ్నులై లజ్జాభరంబునకునోపక యంతిపురము కాంతలు సంగాతము మూలమూలలడాగి రోదనంబులొనర్చుచుండిరి మూఁడుకాళ్ళముదుసలులును నెన్నఁడును వినని కనని చెట్టనిట్టిలొడిగట్టి కట్టిడిరావణుండు పుడమిపట్టికై యెంత సేసెరా? యని వందురుచుండిరప్పుడు నిప్పులనుబ్రోగుసేసి రక్షోనాథకింకరులు భయంకరముగా భస్త్రికంపనంబునఁ గపివాలంబుఁ బ్రజ్వలింపఁజేయఁజూచిన నెంత

పటకును నగ్గి భగ్గుమని మండదయ్యె నాలరావణుండ లేచివచ్చి తననోళ్లతోఁ గట్టిగా
ఘూత్కారములొనర్చుచు నగ్నినిఁ బ్రజ్వలింపఁజేయుచుండఁ దదగ్నిస్పర్శనమున
నతని శ్మశ్రుజాలంబును శిరోజంబులును దగ్ధంబులయ్యెనంత వింశతికరంబులచే
నతండు మీసలను దలలను రుద్దుకొన నారంభించిన రక్షోగణంబు రావణాసురునిం
గని వికటహాసంబొనర్చె హనుమయు దశాననుని వెక్కిరింపఁదొడఁగె సందులకు
రోషించి యతండు కింకరులారా! వీరికోఁతిని నిటనుండి వెడలించి యూరేగింపు
డొనర్పుఁడని యనుమతినిడిన వారును నట్లయొనర్ప నియ్యకొనిరి. తత్సమయంబునకు
సరిగా బ్రహ్మాస్త్రనిర్బంధంబు హనూమంతునకుఁ దొలంగిపోయె; నిశాకాలంబును
నాసన్నంబయ్యె వివిధంబులగు ఘనవాద్యఘోషంబులు మిన్నుముట్ట శస్త్రధారులై
రక్షఃకింకరులు కూఁకలిడుచు వెంబడించుచుండ, గపివరుండైన హనుమంతుండు తన
తండ్రిచెలికాఁడగు నగ్ని తన్ను బాధింపమిం జేసి సంతసించుచు గంతులిడుచుఁ బైకెగిరి
కింకరులకుజంకక లంకయందలి ప్రతిగృహంబుమీఁదికిని లంఘించుచు నగ్నిఁదగుల్చు
చుఁ బలుమాఱు రామనామంబు దలంచుచుఁ దత్పురీవరంబు భస్మీభూతంబు సేయు
చుండె నయ్యెడ. ౧౦౭౬

ఆ॥ ఎదలు దలలునోళ్లు-నెడనెడ దడబడఁ, గొట్టుకొంచుఁ గొంప-కొల్లపోయెఁ
జావు వచ్చెనంచు-క్షణదాచరావళి, పెల్లు తల్లడిల్లి-బిట్టుపనవె. ౧౦౭౮

వ॥ వెండియు. ౧౦౭౯

సీ॥ ఊయాలలను నిద్ర-నొందెడు శిశువుల, వదలి యిండ్లనువెలు వడెడివారు
ఓసీ! కరాళి! కుం-భోదరీ! ఘనదంష్ట్రి!, రారే! యటంచును-జీరువారు
నీళ్ళకుండలుదెచ్చి-నెఱమంటలార్పరే!, యంటుకొనెక్ గొంప-లనెడివారు
పట్టుఁడీ! కోఁతినిఁ-గొట్టుఁడీ! మెడఁబట్టి, నెట్టుఁడీ! యని బిట్టు-నెరయువారు
తే॥ సగముకాలిన యొడలితో-వగచువారు, కొడుక! చచ్చితివే? యని-కుందువారు
పెండ్లమా! పోయితివె? యని-పేర్లువారు, కండ్లునీర్లఁగఁ బండ్లీల-కఱచువారు.

క॥ మగడా! నెగనెడిమంటలఁ, బొగగుంపులఁ గూలితయ్యొ! - బుడుతలు నేనుక్
వగవఁగనయ్యెక్ గటకట!, జగతిక్ గతిలేకటంచు - జడిసెడు వారల్. ౧౦౮౧

క॥ అమ్మా! యబ్బా! కాలెనె?, మమ్ములఁగని మీరలిపుడు - మాటాడరె? యే
యమ్మల యయ్యలఁ గొలువ సు, ఖమ్మగునా? యంచు నేడ్చి - కాశిలెడివారల్.

ఆ॥ కోఁతి చేష్టలెంత - గొప్పచేటొనగూర్చె, మనకు మిత్తియిద్ది - యనెడివారు
నగుచు మర్త్యభోక్త - లల్లాడుచుండంగఁ, గనలుసెంది పంక్తి - కంఠుఁడంత.

క॥ వివిధాయుధధారుల ధీ, రవరేణ్యుల రాక్షసుల ధు - రంధరుల మహా
హవదక్షులఁ బదికోటుల, జవసత్వము కలుగువారిఁ - జయ్యనఁ బిలిచెక్. ౧౦౮౪

తే॥ వారలంగని కడిమి సా - మీరి మీఱి, చాల నాలంక హల్లక - ల్లోల పఱచి
యల విభీషణు నిలుమాత్రి - మట్టివిడిచి, గుబ్బుమనియూర్చి పేర్చెన - ఘోరదీప్తి,
ఉ॥ రావణుఁడుఁన్ ససైన్యుఁడయి - రక్తనిభంబగు లోచనంబులన్
బావనిఁగాంచి బాణము ల - పారముగాఁ గురియించె రాక్షసుల్
తీవర మొప్ప నాయుధత - తిన్ వెసఁబైచిరి వాతసూతిపై
నావిధి కింతయున్ వగపు - నందక మారుతి రాము నెంచుచున్. ౧౦౮౭
ఉ॥ మండెమతోఁకత్రోడనె య - మానుష విక్రమ మొప్ప సైన్యమున్
గండడఁగంగఁగొట్టి లయ - కాలునిఁబోలి దశాస్యుఁగాంచి స్త్రీ
పిండము పిల్లకాకులవి - ప్రీఁక! యదేటికి సిగ్గులేదురా?
దుండగమేలరా? యనుచుఁ - దోఁక విగుడ్చుచుఁ గొట్టె నెత్తినన్.
క॥ ఆ దెబ్బగొని దబాలున, నా ధరఁ బడి యొల్లఁబోయి - యా దశవక్త్రుం
డాదను మూర్ఛనుదేరి య, హా! దైవకృతంబటంచు - నాత్మను గుందెన్.
తే॥ పావనియుఁ జంపఁదలఁచియు-రావణునిని, నింద్రజితునిని విడె రామ-చంద్రమూర్తి
లక్ష్మణుండును వచ్చి చ-లంబుదీఱ, వీరి వధయింతు యశము చే-కూఱుననుచు
క॥ పిమ్మట హనుమానుండును, సమ్మదమును జయముఁగాంచి - జలధితటమ్మున్
నెమ్మిం జేరియు వార్ధి, తమ్ములకున్ బాధలేని - తద్విధిఁ గనుచున్. ౧౦౯౦
తే॥ రంగదుత్తుంగభంగ త-రంగములకుఁ, దనను లాంగూలమును మెల్లఁ-దగులఁజేయు
చల్లనల్లనఁ జల్లఁగా-ననలమార్చి, పులినతలమున క్షణము సొం-పుగ వసించె.

—♦ సీత యగ్నిలోఁజిక్కి మృతిపొందెనని భ్రాంతుఁడై హనుమంతుఁడు విలపించుట ♦—

తే॥ పొగకరులైన శ్లేష్మను-నగచరుండు, కేకరించుచు నుమిసి సం-కీర్ణమైన
యోజనను గొంతవ్రయాడి యూర్వతనయ, జ్ఞప్తివచ్చినఁ దనమది-శంకనొంది.
తే॥ జలధికూలంబుననె నిల్చి - స్వాత్మవంచ
కుఁడను ఛీ ఛీ జడుండను - గొంతయైన
ముందు వెన్కల నూహింపఁ - బోక యకట!
త్వరను బొరవడినాఁడ నెం - తయు నటంచు ౧౦౯౩
తే॥ రామతోషద జానకీ-రమణినారు!, లంక కాల్చెడి తఱినిఁ ద-లంపనైతి
నామెయును నగ్నిబాధచే-నంతమందె, నేమొ? కటకట! దేవికి-హింసకుఁడనో?.
తే॥ ఊహాలవి వేయునేల యా యుర్విసుతను, బ్రజ్వలద్వహ్నిశిఖలకుఁ-బాలుసేసి
నాఁడ నిశ్చయమిది యూరి-తాఁడుకాఁగ, వాలమును గొంతునకుఁజుట్టి-కూలిపోదు.
సీ॥ ఈ పాడుమోముతో-నేనెట్లు శ్రీరాము, చంద్రు నాలోకింపఁ-జాలువాఁడ?
పతిఁడును సీత వృ-త్తాంతంబు వినినంతఁ, గడువడి మరణంబుఁ-గాంచుఁ గాదె?

తద్దుఃఖమున సుమి-త్రాపుత్త్రుఁ డప్పుడె, మరణించు లేను సం-శయము సుంత
వారల మృతిగని-సూరపుత్తుండును, సచివయుతంబుగాఁ-జచ్చిపోవు.

తే॥ నయ్యొ! సుగ్రీవు చావుచే - నతనిభార్య
రుమయుఁ జచ్చును వారి చం - దము నెఱింగి
యంగదుఁడు కూలుఁ బుత్త్రశో - కానలమునఁ
దారయును నాశనంబౌను - దలఁచిచూడ. ౧౦౫౯

సీ॥ రాజ పంచత్వంబు-యోజించి కపులెల్లఁ, బరలోక గతులౌదు-రరవడించి
పదునేనవడియైన-వత్సరంబే తెంచ, భరతుండు మరణించు-భయమునొంది
రాముని దుఃఖభ-రంబుచేఁ గౌసల్య, పంచతనొందు స-త్వరముగాఁగ
లక్ష్మణశోకసం-లగ్న భగ్నాత్మయై, శ్రీసుమిత్రయు మృతిఁ-జెందునటులె.

తే॥ యియ్యనర్థములకు మూల - మెల్లనైన
కైకయును జచ్చు భ్రాతల - గతినిఁ దెలిసి
హతముగాంచును శత్రుఘ్నుఁ - డారటించి
రాముకొఱకు మునుల్ గాంత్రు - తాము మృతిని. ౧౦౬౦

తే॥ రామభక్తులు మంత్రులు-రామునెంచి, యీల్గుదురు రామమిత్రులు-నిలను బాసి
పరముగాంతురు జానకీ-వనితకొఱకు, జనకవంశము సర్వనా-శనముఁ బొందు.

తే॥ రాణి కౌసల్యకును సుమి-త్రికును గైక, కును ధరఁగల సంబంధ-కులములెల్ల
మ్రందిపోవు; నరాజక-ప్రజయుఁ జచ్చు, నష్టమౌఁ బ్రాణికోటి దు-ర్నయమువలన.

తే॥ హవ్య కవ్య విహీనత-నమరతతియుఁ, గుందిపోదురుఁ బ్రళయంబు-నొందుజగము
ధాత తాను బునస్సృష్టి-కై తపించు, నింతటికి నన్నుబుట్టించె-నేమొ? బ్రహ్మ.

క॥ అని బహుఖేదమనస్కుం, డును బ్రాణత్యాగసిద్ధుఁ-డునునగు ఘనుఁడా
యనిలకుమారుఁడు వాలం, బును నురిగా వైచికొనఁగ - బోరుననంతన్.

—◆ ప్రాయోపవిష్టుఁడైన హనుమంతున కశరీరవాణి సీతాకుశల వార్తనెఱింగించుట ◆—

క॥ అశరీరవాణి యతనిన్, భృశమోదంబెసఁగఁ బల్కె - శ్రీహనుమంతా!
కుశలంబు సీత గనుమా!, యశోకవని నిజము మరణ - మందక మనుమా!.

వ॥ అని ప్రియంబులు వల్కుటయు హర్షపూరితహృదయుండై వాయుసుతుండు తత్క్ష
ణంబ యతిత్వరితగమనంబున నశోకవనికరిగె నంతలో నతండు స్వర్ణవేష్టితస్థలమ్ము
గాంచె నందులకుఁదగిన కారణంబొండు పూర్వసిద్ధంబై యుండె నెట్లనిన. ౧౦౬౧

—◆ గజేంద్రమోక్షణ గరుడాహారాదానమున లంకాస్వర్ణమహిమ ◆—

సీ॥ క్షీరసముద్ర వే-ష్టితము శ్రీమంతమ్ము, యోజనాయతము స-మున్నతంబు
నేతత్ప్రమాణ వి-స్తృతము రౌప్యాయస, స్వర్ణత్రిశృంగ మం-చన్నభంబు

వరుణ దేవోద్యాన-వరబుతు మత్సాను, యుతము చరత్సురీ-తతినుతంబు
కమనీయకాంచన-కమలసత్కువలయ, కల్హారహిత సరః-కామనంబు
తే గిరివరంబు త్రికూటాఖ్య-కీర్తితంబు, కరము పొలుపారు నందలి-సరసి ధరణి
నాస్తిక నృశంసక కృతఘ్న-నరులకెపుడుఁ, గనఁగ దుస్సాధమగును న-గణ్యమద్ది.
ఉ॥ ఆసరసిన్ జలాంతరము - నందు దురాత్మ విరూపసత్త్వయు
గ్వాసితనాథవైరి యల - గ్రాహము తా వసియించుచుండఁగా
వాసిఁగ రేణుముఖ్య పరి - వారముతో నొకనాఁడు యూథపం
బాసజలంబుఁ గ్రోలుటకు - నైతృషమీఱఁగవచ్చి యచ్చటన్. ౧౧౦౬
క॥ పుష్కర పానార్థంబై, పుష్కరయుత సరసిలోనఁ - బూనిక డిగి త
త్పుష్కరమును నిగిడించియుఁ, బుష్కరి పుష్కరముఁద్రావఁ-బుష్కలత నిలన్.
క॥ దంతోజ్జ్వల యూథపమును, నంతన్ బాదంబుఁబట్టి - యాకర్షించెన్
సంతసమునఁ దద్గ్రాహం, బెంతయు బలమొప్పఁ గనలి - యేపుతలిర్పన్. ౧౧౦౭
క॥ కరియీడ్చును దీరమునకు, నరయఁగ మకరిజలములోని - కా నక్రము తాఁ
ద్వరనీడ్చును గరినక్రము, లురవడి యన్యోన్యమప్పు - డొవ్వక పోరన్. ౧౧౦౮
క॥ పతి చిక్కువడుట గాంచుచు, నతిదుఃఖము నంది కరిణు - లాక్రోశింపన్
వితతధ్వని దారుణమై, కుతలం బదురింగఁజేసె - క్షుభితజనంబై. ౧౧౦౯
వంశస్థము॥ అటుల్ భయంబందిన - యా కరేణువుల్
తటాలునన్ నాథునిఁ - దారసిల్లియున్
బటుత్వమొప్పంగను - బట్టిలాగినన్
గటా! యశక్యంబయె - గ్రాహ మెవ్విధిన్. ౧౧౧౦
ఉ॥ అట్టులె దివ్యవత్సర స - హస్రము నక్రకరీంద్రముల్ జవం
బిట్టల మొప్పఁ బోర, దుద - కెంతయు వంతయుఁ జింతనొంది తన్
బట్టిన నక్రముంద్రోలఁచు - పాటది తోఁపక తత్కరీంద్రస
మాస్రిష్టబలంబు క్షీణమయి - మ్లానతకల్గినఁ దల్లడిల్లుచున్. ౧౧౧౧
శా॥ ఏకాగ్రస్థిత శుద్ధమానసమునం - దిచ్ఛాపరిపూర్ణంబుగా
(శ్రీ) కాంతారమణున్ హరిం దలఁచి శౌ - రీ! స్వీకృతాబ్జంబు నా
ళీకాక్షుండగు నీకయర్పిత మిఁకే - లీలన్ ననున్ బ్రోచెదో?
నాకీనక్రము బాధఁ బాపుమని క్రి - న్నన్ స్వాత్మఁ బూజించుచున్. ౧౧౧౨
తే॥ అనఘ! యాపద్విమోక్షంబు - నాచరించి
మన్నిరు త్సాహమును ద్రోచి - సన్నుతముగ
రక్షణము సల్ప వేవేగ - రమ్ము! రమ్ము!
ఇందిరాలోల! తడవేల? - కుందఁజాల!. ౧౧౧3

చ॥ అని నుతియింపఁ దన్నుతుల కాపరమేశ్వరుఁడో రమేశ్వరుం
డును గడుఁ బ్రీతచిత్తుఁడయి - నూనముగాని కృపారసంబు క
న్గొనలఁదొలంకఁ దార్క్ష్యునిఁ గ - నుంగొని సత్వరమెక్కి వచ్చి జీ
వనగత నక్రవిక్రమ మ - వక్రముగాఁ గని చక్రధారియై. ౧౧౧౪
క॥ గ్రాహగ్రస్త గజేంద్రుని, గ్రాహమును జలాశయమున - గ్రాహ్యావిధమునన్
శ్రీహరితలఁచి సుదర్శన, మీహనువిడి మకరశిరము - కృత్తమొనర్చెన్. ౧౧౧౫
క॥ నాగేంద్రుని విడిపించెను, నాగేంద్రము లరుసమొందె - నానాఖచరుల్
నాగేంద్రశయను నెంచిరి, నాగేంద్రుఁడు హరినిఁ గొలిచి - నతులొనరించెన్.
శా॥ పూర్వంబాకరి పాండ్య దేశమునకున్ - భూపాలవర్యుండుగా
దార్వార్యంబుగనుండి ధీరుఁడయి యిం - ద్రద్యుమ్నదివ్యాఖ్యుఁడై
యుర్వీదేవులకుం బ్రియుండగుచు ధ్యా - నోపేత చిత్తుండునై
యార్వేరంబదిలేక యొక్కతఱి నో - ప్పారెన్ దపోనిష్ఠుఁడై. ౧౧౧౭
తే॥ అపుడు యాదృచ్ఛికంబుగ-నయ్యగస్త్య, మౌని యేతెంచె నతనిని-మనుజపతియుఁ
గనక నిష్ఠావశుండయి-కనులువిచ్చి, మరల నొక కొంతవడికి న-మ్మౌనిఁ గాంచ.
తే॥ కుంభజన్ముఁడు రోషించి-క్షోణినాథ', మదముపెంపున నన్ గని-యెదురుకొనక
గౌరవింపకయుంటివి-గనుక వనిని, మత్తగజమయి చరియింపు-మాసతంబు.
క॥ అని ఘనశాపం బొసఁగిన, మునిపతిఁ గని మనుజవిభుఁడు-మ్రొక్కుచు దేవా!
కననైతిని మునుఁగ మిము, ననుకూలధ్యాననిష్ఠ - నలరుట వలనన్. ౧౧౨౦
క॥ కావున శాప విమోచన, మే విధమునఁ గల్గునొక్కొ? - యెంతయుఁ గృపతో
నా విధమును వచియింపుఁడు, పావనచరితా! యటంచుఁ - బ్రార్థింపంగన్. ౧౧౨౧
వ॥ అగస్త్యుండు కరుణించి రాజా! మదేభమవై చరించు నీవొక్క సరస్సున గ్రాహంబు
చే గ్రహింపఁబడి విష్ణువువలన శాపంబుఁ బాయఁగలవని నుడివి యతనిచే సత్కృ
తుండై చనియె మఱియును.
క॥ ఈహా చెలంగఁగ నొకపరి, హూహూనామకుఁడు విభవ - యుత గంధర్వుం
డా హరిణేక్షణలను గ్రీ, డాహర్షమెసంగఁ గూడిఁ - యరిగి సరసిలోన్. ౧౧౨౩
క॥ స్నానమొనర్చుచు నందలి, ధ్యానస్థితు స్నాతు దేవ - లాఖ్య మునీంద్రున్
దా నీటడాఁగి లాగెను, మౌనియుఁ గనలొంది యతని - మానక కనుచున్.
క॥ ఓరీ! గంధర్వా! నీ, దౌరాత్మ్యము నెఱిఁగినాఁడ - దర్పిత నక్రం
బై రమ్యంబగు సరసినె, వారక మనుమనుచు శాప - పతితు నొనర్చెన్.
క॥ తప్పని గొప్పఁగ వేఁడుచు, నప్పుడె గంధర్వుఁడున్ మ - హామహా! శాపం
బెప్పుగిదిఁ దొలఁగఁగలదో? చెప్పుము కృపననుచు నడిగెఁ - జేమోడ్పులతోన్.

క॥ వరమునియగు దేవలుఁడును, గరుణామతిత్రోడ నతనిఁ - గాంచుచు నోరీ!
హరివలన ముక్తిఁ గనెదవు, కరిఁబట్టిన తఱినటంచుఁ - గడఁకం బలికెన్. ౧౧౨౭

వ॥ తదీయకారణంబులం జేసి యింద్రద్యుమ్నుండును హూహూనామక గంధర్వుండును
గరినక్రంబులై సరోవరంబునఁబోరి హరికరుణవలన శాపవిమోక్షణంబుగాంచి రనం
తరంబున గరుత్మంతుఁడును క్షుత్పీడితుండై యాహారంబుకొఱకు హరిని నర్థింప నతఁ
డచ్చటఁ బడియుండు కరినక్రకళేబరంబులం దినుమని వచించె గరుడుండు భూప్రభంగుఁ
డను గృధ్రరాజు తత్కళేబరంబుల చెంత కేతెంచిన నద్దానిని సయితమువధించి
కాళ్ల చేతఁ గళేబరత్రయంబునుంగొని గగనంబునకునెగిరి తద్భక్షణార్థంబు పరిశుద్ధ
స్థలంబు నెమకుచుండు నంత. ౧౧౨౮

క॥ అభ్రంకష శాఖంబై, విభ్రమదాయామమై సు - విస్తరమై నై
జభ్రాజితమై వెలయు న, దభ్రము జంబూద్రుమంబు - దనకగపడియెన్. ౧౧౨౯

వ॥ క్షీరోదప్రాంతస్థంబును సహస్రయోజన విస్తృతంబును నగు నా జంబూద్రుమంబు
నర్హంబుగాఁ దలఁచుచు ఖగేశ్వరుండత్తరువున నొక్కశాఖపై వ్రాలికూర్చుండె నా
శాఖయంద తలక్రిందుగ వ్రేలుచు వాలఖిల్యాది మహర్షు లరువదివేలమంది తపంబు
సేయుచుండిరి తదీయ భారవహనంబునకుఁ జాలక శాఖయుఁ బెఠిల్లుమని విరిగె
నంత గరుత్మంతుండు మునులకు బాధకలుగునని తపోవిఘ్నంబునకు వారు కనలి
శాపమిత్తురో! యని త్వరితముగా నిజతుండంబునఁ దచ్ఛాఖను గ్రహించి మరల
మరుత్పథంబున కెగిరి చనుచుఁ దండ్రియగు కశ్యపునింగని తండ్రీ! వీనిని భుజించు
టకుఁదగిన విశాలపరిశుద్ధస్థలంబుఁ దెలియఁజేయుఁడని వేఁడిననతండును శతయోజన
విస్తృతంబగు సాగరమధ్యంబునలంకానామకస్థలంబు కలదని వచించె ననంత
రంబున వైనతేయుండును బితృవాక్యానుసారియై యచ్చోటునకుం జని తుండమున
గ్రహించియుండిన జంబూద్రుమశాఖను బక్షంబుల పైకిమెల్లఁగా వైచికొని
ధరించి యాగృధ్రనక్రగజరాజంబుల కళేవరంబులను తృప్తికరంబుగా భక్షించె
నా సమయంబున నందుఁ బడిన యస్థితతియు మూఁడుశృంగంబులుగా నేర్పడి
త్రికూటనామక పర్వతంబయ్యె నప్పర్వతంబునను తార్క్ష్యుండు మునితతియుత తరు
శాఖను నునిచిచనియె మౌనులును దపోవసానంబున విష్ణు పదంబునొందిరి మఱి
యును. ౧౧౩౦

తే॥ శృంగములు మూఁడుశైవల - స్థితిని నొలఁ
బ్రస్తరంబులఁ బోలియుఁ - బరిఢవిల్లె
నెఱుఁగరయ్యది రాక్షసు - లెప్పుడేని
లంక కాలినతఱినిఁ గ - రంగె నవియు. ౧౧౩౧

క॥ ఆ రసము భూమిపయిఁ బడి, యారయ బంగారమయ్యె - నదిగ్రికుమారీ!
మారుతి యా చిత్రముగని, ధారిణిసుతకడకు నరిగి - తల్లీ! యనుచున్. ౧౧౩౨

—♦ హనుమంతుఁడు మరల సీతాదేవినింగాంచి రామముద్రిక నడయుట ♦—

తే॥ వందనముసేసి నాస్కంధ-మందు నీవు, నూరుచుండుము దేవి! నిన్-గొనియు వేగ
రామచంద్రుని సముఖంబుఁ - బ్రేమమీఱఁ, జేర్తునని పల్క సీతయుఁ-జెప్పెనిట్టుల.
క॥ హనుమా! నా పతిశౌర్యము, గనుమా! ననుఁ బరులు రక్ష - గా విడిపింపన్
వినుమా! యతఁడు సహించునె? చనుమా శ్రీరాముకడకుఁ - జని రమ్మనుమా!.
తే॥ రెన్నెలలు తానుగడువుగా-నన్నుగోరి, రక్కసులకెల్ల ననుమతి-రావణుండు
బలిమిని విధించె నీకది-తెలియుఁగాదె?, కనుక రామునకయ్యది-వినుచుమనఘ!.
క॥ నా చూడామణి నొసఁగుము, నీచుని రావణుని వేగ - నిర్గింపంగన్
బ్రీచుర్యజయముగాంచఁగ, నా చింతను బాప, నన్ గొ - నఁగఁదఁగు యనుమా!
తే॥ లక్ష్మణుఁడుఁ దాను గడిమిమై - లంకఁజేరి
సపరివారంబుగా దుష్టుఁ - జపలచిత్తు
రావణునిఁజంపి ననుఁగొన - రాని యెడలఁ
బ్రాణములు వీడుదునటంచుఁ - బలుకుమయ్య!. ౧౧౩౮
తే॥ నా యొఁద్దు పరశ్శత నతులు రామ, మూర్తికి సమర్పణంబుగా-మొదలఁ దెలిపి
యిచటఁగల నాయవస్థల-నెఱుఁగఁ జేసి, రయముగాఁ దోడికొనిరమ్ము-రాఘువులను.
క॥ అని మఱి రాముని ముద్రిక, గొనుమనియిడి పతికి దీనిఁ - గూర్మిగనిమ్మా!
యని యాంజనసుతుఁ బలికిన, జననీ! సెలవనుచు మ్రొక్కి - చయ్యన నతఁడున్.

—♦ హనుమానుఁడు సీతవలన సెలవుకొని సముద్రముదాఁటుట ♦—

తే॥ అచటినుండియుఁ జని సువే - లాద్రినెక్కి
కాళ్లతొక్కుడు వలన న - గంబునఱఁచి
చూర్ణముగఁ జేయుచుండ సం - పూర్ణకరుణ
నటకు భారతిరమణుండు - నరుగుదెంచి. ౧౧౪౦
క॥ మారుతికృతములు లంకా, పూరనల ప్రజ్వాలనము - మొదలగునవి యా
శ్రీరామునకుం దెలియఁగఁ, దా రచనా పత్రమిచ్చెఁ - దత్కపికిఁదగన్. ౧౧౪౧
వ॥ హనుమానుండును బ్రహ్మను నమస్కరించి సీతాదత్త చూడామణియు రామ
ముద్రికయు బ్రహ్మదత్త పత్రంబును బదిలంబుగా నునిచికొని సముద్రంబు లంఘింప
యత్నింపఁదొడఁగె సురజ్యేష్ఠుండును మరలి చనియె ననంతరంబున. ౧౧౪౨
శా॥ ఉడ్డీనంబొనరించి వాయుసుతుఁడున్ - ద్యోవర్త్మముంబట్టి యే
యడ్డంబుం గనకంతరంగమునఁ దా - హర్షంబునుం బొందుచున్

దొడ్డా రాముని కార్యముం జలిపితిన్ - దోశ్శక్తిమంతుండ నం
చెడ్డన్ గొంచెము గర్వమూని ధ్వని యొం - తేఁ జేసి ఘోరంబుగాన్. ౧౧౪౩

—♦ శ్రీరాముఁడు మునిరూపముతో నాంజనేయుని గర్వమణఁచుట ♦—

తే॥ వారిరాశ్యుత్తరాదిశ-వఱలుతటినిఁ, జివ్వున౯ డిగి యటముని-శేఖరునినిఁ
గొందఱఁ గపీంద్రులనుజూచి-కుతుకమలర, మునికి వందన మొనరించి యనియె నిట్లు.

కం॥ మునివర! మామకసాహస, మున ఘనమగు రామకార్య - మును దీర్చితి భూ
వనితాతనయం గాంచితి, వనరాశిని దాఁటితిన్ జ - వంబునఁ గనుకన్. ౧౧౪౫

తే॥ దప్పిజనియించె నాదు తృ-ద్బాధ తీఱ, మధురజల మొందుచుండెఁ ద త్పథమదేది?
చూపుమనఁ దర్జనిని ముని-చూపె నపుడు, రమ్యమైనట్టి కాసార-రాజమొకటి.

మ॥ అల చూడామణి రామముద్రికయు బ్రి - హ్మాదేశపత్రింబున
య్యాల మౌనీంద్రసమీపమందునిచి కీ - శేశుండు వాజార్థమై
జలపూరంబగు-చోటుఁ జేరవలెగన్ - శాఖామృగంబొందు మా
ని లసత్కుండిని ముద్రికన్ వయిచి పొం - దెన్ దా రహస్యస్థలిన్. ౧౧౪౭

చ॥ జలమును గ్రోలి వచ్చి ముని - సత్తము చెంగట నిల్చి వాయుజుం
డలర శిరోమణిన్ మఱియు -నావిధిపత్రముఁ గాంచు వాని! యిం
దలి వర రామముద్రిక క - నంబడదేమని యడ్గినన్ గవుం
డలువును జూపెనా తఁడుఁ గ - డంకను మారుతి దానిలోఁ గనన్. ౧౧౪౮

కం॥ ఒకటికిఁ బదులై నూఱ్లై, ప్రకటంబుగ వేలు నౌచు - లక్షలునై ము
ద్రికలవి కనుపించిన న, మ్మకచెల్ల! యిదేమటంచు - మతివిస్మయతన్. ౧౧౪౯

చ॥ మునిఁగని గాలిచూలియును వ - మ్మోయని మ్రొక్కి మహాత్మ! ముద్రికల్
గనఁగ ననేకముల్ తలఁపఁ - గాఁదగు కారణమేమి? నేను దె
చ్చిన వరరామముద్రిక వ - చింపుఁడ దేదియొ? యంచు వేఁడె న
మ్మునివరుఁ డప్పుడిట్టులనెఁ - బూనిక మీఱఁగ వాతసూతితోన్. ౧౧౫౦

తే॥ ఎపుడెపుడు రాఘవుల యాజ్ఞ - నెంచి యవని
నవనితనయల కొఱకయి - యనిలసుతులు
లంకకరిగియు ముద్రిక - లనుగ్రహించి
వచ్చిరవి నాదు కరకను - వారలనఘ. ౧౧౫౧

తే॥ ఇన్నియై యున్నవయ్యా! నీ - విపుడు తెచ్చి
నట్టిముద్రిక యెద్దియో? - యరయు మనిన
పీతమదుఁడయి హనుమయు - ఖ్యాతచరిత!
రాములెందఱు? మును వచ్చి - రీమెయిననిన. ౧౧౫౨

వ॥ మునివరునిఁ బ్రశ్నించి ముద్రికలను లెక్కించిన రామచంద్రుల సంఖ్య తెలియఁగల
దని యతఁడు వచింప దొరకొని కరకయందలి ముద్రికలు పల్లమాఱు నెంచుచు
నెంతవఱకు నయ్యవి యంతు తెలియకుండ వృద్ధిఁబొందఁ జూచుట నెఱింగి చింతా
కులితస్వాంతుండై నావంటివారలింతవఱకుండె నూర్లకొలఁది జలధిలంఘించి
లంకకుఁ జని సీతవలన ముద్రికనుబడసి వచ్చిరిఁక నేనెంతటి వాఁడ? బలమునను ధన
మునను జవమునను సముద్రంబు దాటించితినని గర్వింపనలవి యౌనె? తాడినిదన్ను
వాని తలదన్నువాఁడుండుఁ దీరనుమాట యెన్నఁటికేని నిజంబకదా? యని యె
ప్పటియట్ల ముద్రికల నా కమండలువునందవైచి తన్మునీంద్రునకుఁ బ్రదక్షిణించి
దండవత్ప్రణామంబులొనర్చి యతనివలన సెలవుకొని యంగదాదులుండు చెంతకుం
జని వారలను సమీపించిన. ౧౧౫౩

—♦ హనుమంతుఁ డంగదాదులఁ జేరుట ♦—

తే॥ హనుమ రాఁడయ్యె నని సీత - నరయకటులె
రాముఁగాంచుట తగదని - తాము తలఁచి
ప్రాణములు వాయ నుంకించు - ప్లవగవర్య
లంగదాదులు హనుమంతు - నపుడు కాంచి. ౧౧౫౪

క॥ మించిన సంతోషముతో, మంచిగ సేమమున సీత - మని యున్నదె? నీ
గాంచెనె? నమ్మికతో న, ర్పించెనె? గుఱుతేదియేని - వెసఁదెలుపు సఖా!

క॥ అని జానకి కుశలంబును, బని సఫలతఁగనుటఁ దెలిసి - పైకెగురుచు నం
జనసుతుఁ గౌఁగిటఁ బొదువుచు, మనజన్మమె జన్మమనుచు మహిమముకు మరుఁగ.

—♦ అంగదాదులు మధువనమున ఫలములను దుల్పుట ♦—

తే॥ పదఁడు పదఁడిక శ్రీరామ - భద్రుఁజేర
నరుచు మారుతి యుతముగా - నచటినుండి
బయలుదేఱి యరుగుచుఁ - బథమునందు
రవిజపాలితమధువన - రాజముగని. ౧౧౫౫

తే॥ అంగదా! పండులనుదింద - మా? యటంచు
నడిగి యందఱు నేకమై యావనమును
జొచ్చి ఫలముల దుల్పుచు - నిచ్చకొలఁదిఁ
దినుచునుండఁగ వనపాల - వనచరుండు. ౧౧౫౬

క॥ వ్యగ్రుఁడు దధివక్త్రుండను, సుగ్రీవుని మాతులుండు - చుఱచుఱఁగని తా
నాగ్రహమున నడ్డముచనఁ, గాఁ గ్రోధితులు వానిఁగొట్టి - కడకుం దోలెన్.

వ॥ దధివక్త్రుండును సుగ్రీవునిచెంతకరిగి యతనితో నంగదాదులరాకయు మధువనం
బున వారొనర్చిన దుండగమును దెలుప నతండు తనమనంబున హనుమదాదులు

జనకపుత్త్రినిం గనివచ్చియుండనోపు లేనియెడ రమ్యంబగు మధువనంబునందలి ఫ
లంబులెల్ల నెండులకు నానందంబుగా ద్రుల్చుచు భక్షించుచు నైమఱచి బాంధవుం
డగు దధివక్త్రునేని గమనింపక చరలాటమునం గొట్టుదు రనితలంచి మాతులుం గని
యార్యా! నీవువారలను నిరోధింపవలవదు కాని త్వరమై నాచెంతకు వారువచ్చునట్లు
నాయాజ్ఞనువచించి పనుచుమని తెలిపిన దధివక్త్రుండు మరలిచని వారలకు సుగ్రీ
వునాజ్ఞను వచింప వారును ద్వరితగమనంబునసరిగి రామరామానుజ సహితంబుగా
నుండిన సుగ్రీవుని సందర్శించి వారిమువ్వురకును నమస్కారంబులొనర్చి నిల్చిరి.

—♦ హనుమంతుఁడు సీతావృత్తాంతమును రామునకుఁదెల్పి చూడామణి నిచ్చుట ♦—

చ॥ అనిలకుమారుఁ డారఘుకు - లాగ్రణి రామునిఁగాంచి సత్ప్రభూ!
జనకజనేమ మామె మిము - సంస్మరియించుచునుండు సర్వదా
వనమున రాక్షసావృతయుఁ - బంక్తిముఖాగ్రహ భీతచిత్తయుఁ
గనులను నశ్రువుల్ దొరఁగి - కాల్వలు గట్టెడునట్టిదై మనెన్. ౧౧౬౧
మ॥ ఇదిగో! యామెశిరోమణిన్ బ్రియముగా - నిచ్చెన్ ద్వదీయార్థమై
సదయన్ గాంచుఁడు సత్వరంబుగను మీ - సందర్శనం బామె నె
మ్మదిఁ గాంక్షించుచు వేఁడె మిమ్ములను రా - మా! వందనంబుల్ పదే
పదిగాఁ జల్పెను మీకటంచు నొసఁగెన్ - వైదేహి చూడామణిన్. ౧౧౬౨
ఆ॥ మరల బ్రహ్మపత్రి-మరయుఁడీ! యిదియని, కరము భక్తి రాము-కరమునందు
దానినునిచి దేవ!-తమ్మునితో మీర, లవనితనయఁ గనుఁడ టంచుఁ బలికె.
క॥ కాకమువృత్తాంతంబును, మీకున్ జ్ఞప్త్యర్థమై స - మీహితరీతిన్
సాకల్యముగా జానకి, నాకున్ వచియించెననుచు - నయముగ వినిచెన్. ౧౧౬౩
ఉ॥ రాముఁడు బ్రహ్మపత్రము స - రాగమునంగని లంకయందు ను
ద్దామగతిన్ మరుత్సుతుఁడు - తద్దను జామ్మఁగూల్చి లంకనున్
స్వామిహితార్థమగ్నినిడి - భస్మమొనర్చియు విస్తృతంబుగా
నేమియొనర్చె? నంతయును - హృద్యముగా గమనించి ప్రీతుఁడై. ౧౧౬౪
క॥ పత్నీ చూడామణినిన్, బత్నినిఁ గనినంత ప్రీతిఁ - బరికించుచుఁ దా
నాత్మానందముతోఁ గపి, రత్నంబగు హనుమ నపుడు - రమ్మని యతనిన్.

—♦ శ్రీరాముఁడు సీతావృత్తాంతమువిని హనుమంతుని సమ్మానించుట ♦—

ఉ॥ కౌఁగిటఁజేర్చి గొప్పయుప - కారమొనర్చితి వీవు నీ ఋణం
బీఁగుటయెట్లొ? వాయుసుత! - యిమ్మహి ధన్యుఁడనైతివయ్య! నా
కౌఁగిలి లోకదుర్లభము - కల్గెను నీకిదె నాదుభక్తుఁడై
కాఁగల కార్యనిర్వహణ - కారుఁడు నిష్ఠుఁడునై తివంచనెన్. ౧౧౬౫

వసంతతిలక॥ లీలన్ బదాబ్జయుగ - ళిన్ దులసీదళాళిన్
జాలంగ నర్చనలఁ - జల్పియు రాముఁబ్రీతిన్
సాలోక్యమొందు ముని - సంతతి యట్టి శ్రీరా
మాలింగనంబు మరు - దాత్మజుఁడొందెఁ బేర్మిన్. ౧౧౬౯

క॥ కృత పుణ్యపుంజుఁడగు మా, రుతి భీతిలి యాల దివ్య - రూపున్ రామున్
నతియొనరిచి ముద్రికఁగా, కతఁదెల్పియుఁ దప్పునైఁచి - కావఁగ వేఁడెన్.

ఉ॥ అప్పుడు రామమూర్తియు స్మి - తాననుఁడై హనుమంత! తీరమం
దప్పగిదిన్ గనంబడిన - యమ్మునియేన త్వదీయగర్వమున్
గుప్పున నగ్గఁజేయుటకుఁ - గోర్కె వినోదమొనర్చితిన్ ముదం
బొప్పఁగ ముద్రికం గనుమ! - యొయ్య మదీయ కనిష్ఠికాంగుళిన్. ౧౧౭౦

క॥ అన వాయుజుఁ డమ్ముద్రికఁ, గని విస్మయమంది తాను - గత గర్వుండై
మనమున రాముని వైకుం, ఠునిగాఁ దలపోసె బలముఁ - దున నతఁడనుచున్.

వ॥ తదనంతరంబున రామచంద్రుండు మారుతినింగని సవిస్తరంబుగా లంకాస్వరూపంబు దెలియఁబలుకు మద్దానివలన విమతులకుఁ బ్రతీకారంబొనర్పఁ దగునని యడిగిన నతండిట్లనియె. ౧౧౭౨

—♦ ఆంజనేయుఁడు లంక నభివర్ణించుట ♦—

మ॥ కలదాదక్షిణసింధుమధ్యమున లం - కాపత్తనం బాత్రికూ
ట లసత్పర్వతసీమ దేవపురిపా - టన్ గోపురాట్టాల కో
జ్జ్వల గాంగేయమణిప్రతాన సహిత - ప్రాకార సద్ద్వారమై
జలపూర్ణోత్పరిఖా సమావృతమునై - సాలంకృతాగారమై. ౧౧౭౩

సీ॥ నానోపవనదీర్ఘి - కానేకకూప వి, రాజితం బన్యను - ర్ధర్షమద్ది
మణిమయస్తంభ హర్మ్యంబులు సౌవర్ణ, తోరణధ్వజము లిం - పారునచటఁ
బశ్చిమద్వార ని - వాసులై గజరాజ, వాహులు వేలకు - వత్తలుచుండ్రి
వాజివాహులును గా - ల్బలమును నుత్తర, ద్వారమందున నర్బు - దముగ నుండ్రి

తే॥ ప్రాక్కుకుప్పునఁ దద్రీతి - బలము వెలయు
దక్షిణద్వారమున రణ - దక్షులైన
రాక్షసులు పెక్కుమందియు - రథికులుండ్రి
అమిత చతురంగబలము మ - ధ్యమున నమరు. ౧౧౭౪

క॥ నానాస్త్రకుశలు లెపుడు న, నూనంబగు జాగరితఁ గ - నుంగొనుచురు దు
ర్దానవయుతము శతఘ్నుల, తో నిండెను లంక మేటి - దుర్గమమదియా. ౧౧౭౫

సీ॥ శ్రీరామ! తావక-సేవకుఁడగు నేను, దొడరి యాలంకను-వడిగఁ జేరి
యందలి పంక్తిము-ఖాసురు సేనల, హతముసేసితిఁ జతుర్థాంశముఁ బొలె
బంగారు ప్రాకార-ముం గూలఁద్రోచితి, లంకనుగాల్చితి జాకుఁ గొనక
యచటి శతఘ్నుల-నన్నిటిఁ ద్రుంచితి, నాశనంబొనరించి-నాఁడ వనము
తే॥ దేవ! మీచూడ్కిఁ దత్పూర్వ - దేవనాథు
ప్రోలు మఱియొకసారియుఁ - గాలికూలు
లంకకట నాలుగుప్రక్క - లన్ గనంగ
నెల్లలుండెను వినిపింతు - నెల్ల వినుఁడు. ౧౧౭౯
తే॥ తూర్పున లఘులంక పొల్పారు దక్షి, ణాశను నికుంభిలయును వ-ంగాగమునుఁ
బశ్చిమంబునఁ బరలంక-వఱలు మఱియు, నుత్తరమున సువేలాద్రి-యొప్పుననఘ!.
తే॥ ఇంకఁ బ్రస్థానమొనరించి-యేపుమీఱ, మీరు లవణార్ణవతటంబుఁ- జేరుటరయ
మంచిదనియెంతు దేవ! యో-జించుఁడాత్మ, ననిన రాముఁడు సుగ్రీవుఁ గనుచుఁబలికె

—• శ్రీరామ లక్ష్మణులు వానరసైన్యముతో లంకకుఁ బ్రయాణమగుట •—

సీ॥ సుగ్రీవ! ప్రస్థాన-శుభవేళ యియ్యదె, జయముహూర్తంబు ప్ర-శస్తమిపుడ
యాశ్వినసితపక్ష-మతిశుభదంబైన, దశమియు శ్రవణర్క్ష -భానుయుతము
సర్వసైనికులను-సంసిద్ధముగఁ జేర్చి, యూథపుల్ సేనల-నోమఁ జేయు
మిఁక ముందువెన్కల-నిరుప్రక్కలందును, ముఖ్యులు చమువును బ్రోవవలయు
తే॥ నలుఁడు ముంగల నీలుఁడె-న్నఁగను వెనుక, నాసుషేణుఁడు సవ్యంబు-నందు నితర
పార్శ్వమున జాంబవంతుండు-వరలినారు, మోదమును నింతు గ్రాతమ మోఘగరిమ.
ఆ॥ గజ గవాక్ష గవయ కపివరుల్ మైందుండు, వహ్నిదిక్కు మొదలు పరఁగునూాల
లందు నిల్త్రుగాతఁ-బొందుగా నావల, ద్వివిదుఁడాది కపులు వెలయ నోను.
క॥ అరిదమను లెల్లరును దో, సరు దేరఁగ ముందు నేను హనుమంతునిపై
బరువడిగ నెక్కి వెడలెద, వరు నంగదు నెక్కి-నాదు - భ్రాతయు వచ్చున్. ౧౧౮౧
తే॥ నీవు నాసోదరమ్ము సు-గ్రీవ! మనము, లవణ సాగరమును జేర-నవును లెమ్మ
జతనమును జల్పుమని రామ-చంద్రమూర్తి, కపులకాజ్ఞ మొనర్చి ల-క్ష్మణునిఁగూడి.
క॥ సేనామధ్య గతుండయి, మానుగ హనుమంతు నెక్కి - మఱిదక్షిణ ది
గ్యానంబుగఁ దా వెడలె న, నూనానందంబు మదిని - నూల్కొనుమొడన్.
మ॥ కపులవ్వేళ భయంకరంబుగ భుభుః - కారంబులన్ జల్పుచున్
విపులధ్వానిత భేరికాపటహ సం - విద్వాద్య ఘోషంబులన్.
విపులా వాయుపథంబులన్ బ్రచలితా - ప్తిం గూడఁగాఁ జేయుచున్
ద్వీపసామ్యుల్ తగు కామరూపధరులై - వేవే ప్రయాణింపఁగన్. ౧౧౮౪

క॥ శుభశకునంబులు కల్గెను, విభులగు శ్రీరాఘవులకు - వృక్షచరులు తా
మభయమున కేలుఁబవళులు, రభసంబుగ క్షణమునిలక - రామాను మతిన్.
చ॥ వెనుకొని వచ్చుచుండ రఘు - వీరులు సహ్యనగంబు దాఁటి యా
ఘనముల యోగముంగడచి - గ్రిక్కనఁ దక్కపథంబు మీఱుచున్
జనివని దక్షిణార్ణవల - సత్తటిఁజేరి ససైన్యులై ప్రియం
బునఁ బులినస్థలిన్ వసతిఁ - బొందె ప్లవంగమపాళిఁ గాంచుచున్. ౧౧౮౬
తే॥ సాగరోత్తరణార్థమై - బాగుమీఱ, యోజనలు సల్పుచుండిరా - యోజనపుడు
లంకయందున రావణుఁ - డంకిలిగొని, హనుమసేఁతలఁదలఁచి ప్ర - హస్తుఁ బలికె.
మ॥ సచివా! చెన్నఁటి కోఁతి యొక్కటియె తా - సంరంభమేపార గే
హచయంబున్ బసుమంబొనర్చెను నక్షో - కాభిఖ్యాసూ మద్వనిన్
సచర వ్రాతముగాఁగఁ గూల్చెఁ బెలుచన్ - జంపెన్ నరాదావళిన్
బ్రిచలచ్చిత్తులమైతి మిట్లు మనమీ - పై నేమికానున్నదో?. ౧౧౮౮
క॥ అతి లాలితుఁడగు నాదగు, సుతుఁడు కనీయుండు కాంతి - శోభితుఁ డక్షుం
డితర కపిచేత నాజిని హతుఁడయ్యెను గాదె? దుఃఖ - మందగఁ వలసెన్.
చ॥ అని వగఁగుందు పంక్తిముఖు - నల్లనఁగాంచి యమాత్యవర్యులో
దనుజగణాధినాథ! పరి - తాపము భీతియుఁగాంచనేల? కోఁ
తిని వధియించుటెంత యని - తేరకునుంటిమి కాని ధారిణిన్
మను కపితండమంతయును - మావలనన్ క్షయమౌనుగాదొకో?. ౧౧౯౦
చ॥ అనవుడు కుంభకర్ణుఁడు త - దగ్రజునింగని యన్న! జానకిన్
గొని యిటుతెచ్చి దుష్కృతము - గొబ్బునఁ జల్పితివైన నేమి? చే
సినపని సక్కఁదీర్చెదను - జెప్పుము రాముని లక్ష్మణున్ గపిం
ద్రుని రవిజున్ వనాటులను - దోర్బల మొప్పఁగఁ జంపివచ్చెదన్. ౧౧౯౧
క॥ అని యాజ్ఞఁ గోరఁగావిని, ఘనదేహునిఁ గుంభకర్ణుఁ - గని శ్రీమంతుం
డును రామభక్తి తత్పరుఁ, డునునైన విభీషణుండు - డొగరిది యనుచున్.
ఉపేంద్రవజ్ర॥ అయోగ్య కుంభ శ్రవ - ణాదులన్ స్విత్యయుక్తులన్ మత్తుల - సప్రకాంచెన్
స్మయాన దుష్కామల - సద్దశాస్యున్, సుయుక్తిమెంబల్కె వి - శుద్ధబుద్ధిన్.

—♦ విభీషణుఁడు రావణునకు నీతిని బోధించుట ♦—

ఉపేంద్రవజ్ర॥ కుగర్వమేలా? ప్రభు! - కుంభకర్ణుం
డొగిన్ మహాపార్శ్వ ము - హోదరుల్ గాం
చఁగన్ని కుంభుండును - శక్రజిత్తున్
దగంగ రామాగ్రము - నన్ వసింతే?. ౧౧౯౪

ఇంద్రవజ్ర॥ సీతాసతిన్ రామునిఁ-జేర్పుమన్నా!, ఖ్యాతిన్ సుఖంబున్ గన-నౌను లేదా
భూతేశ దేవేశులు-ప్రోచుచున్నన్, సీతేశుఁ డీల్గించును-జీల్చి నిన్నున్. ౧౧౯౫
క॥ అని శుభహిత వచనంబుల, మన మలరఁగఁ దెల్ప దైత్య - మాడనుఁడంతన్
దన సుఖపథము నెఱుంగక, ఘన రోషముఁబూని దుష్ట - కాలవశుండై.
వ॥ విభీషణునిం గని. ౧౧౯౬

—♦ రావణుఁడు విభీషణుని దూఱుట ♦—

ఉ॥ తమ్ముని రూపముంగొనిన - దర్పితశత్రుఁడవీవు నాకు ధ
ర్మమ్ములు బోధచేసెదవె? - మానక చంపియెయుందు నయ్యెఁడీ
పెమ్మెలు పల్కియున్న నిఁకఁ - బ్రోలక లెమ్ము దురాత్మ నీచుఁడా!
యిమ్మెయి నిందనిల్వకుము - హేయము నీముఖమంచుదూఱినన్. ౧౧౯౭
చ॥ సలుపుర మంత్రులంగలిసి - నమ్రతతోడ విభీషణుండు దు
ష్టలుఁడగు రావణుండు పరు - షంబులు పల్కుట కాత్మ. జాలఁ జిం
తిలుచును వేగనేగి రఘు - ధీరుల రామ సుమిత్రి పుత్త్రులన్
సలలిత భక్తిఁగాంచి నతి - సల్పి స్వవృత్తముఁదెల్పెఁ బ్రార్థనన్. ౧౧౯౮

—♦ శ్రీరాముఁడు విభీషణునకు శరణమిచ్చుట ♦—

క॥ రాముఁడు కరుణామృతరస, ధాముఁడు తులసీమనోజ్ఞ - దాముఁడు సుగుణో
ద్దాముఁడు భూపలలాముఁడు, ప్రేముడి శరణంబొసఁడె వి - భీషణునకుఁ దాన్.
తే॥ హనుమచే వార్ధితీరంబు-నందు మరల, సికతమున లంకనిర్మింపఁ-జేసి మిత్రుఁ
డగు విభీషణునకును బ-ట్టాభిషేక, మును బొనర్చెను సానుజ-వనచరుఁడయి.
క॥ మఱియును రాముఁడు నవ్వుచు, వెఱవిడితే? విభీషణా! వి - వేకనిధానా!
కఱకరి రావణుఁ దునుముట, వఱమునిదే లంకనిడు - వసియింపంగన్. ౧౨౦౨
ఆ॥ హనుమవలనఁ గలిగి-నట్టి యీలంకయు, ధరఁబ్రసిద్ధిఁ గాంచుఁ - దప్ప కనుచుఁ
బలికెనంత గగన-వర్త్మముసందుండి, పంక్తివదను నాజ్ఞఁ - బలికె శుకుఁడు.
శా॥ సుగ్రీవా! ప్రభువైన రావణుఁడు నీ - చొప్పున్ విచారించి తా
నుగ్రుండై నినుఁదెల్పెనిట్లు వినుమా! - యోరీ! తమిన్ రాజ పు
త్త్రాగ్రి యాత్మసఖున్ గ్రహించితిని నీ - దౌతాత సామ్మెదెనా?
వ్యగ్రుండైతివె? వైరమూనకుము పో - మ్మా! నీవు కిష్కింధకున్. ౧౨౦౪
క॥ నీ సైన్యము నీవురు వడి, గా సమ్మతి మరలి చనుఁడు - గర్వము విడుఁడీ!
వాసింగనుడీ! యనెనన, గీసర బీసరగనెల్ల - కీశులు వానిన్. ౧౨౦౫
పంచచామరము॥ కరంబులన్ బదంబులన్ బి - గంగఁబట్టి లోహబం
ధురంబులైన శృంఖలాళి - తోడఁగట్టి బిట్టుగన్

దురాత్మ! కాఱుకూఁతలేల? - తుఱుంగుముంచుఁ గొట్టిరా
విరోధకార్యముల్ భటుండు - విన్నఁ బంక్తివక్త్రుతోన్. ౧౨౦౩

వ॥ దశగ్రీవుండును శార్దూల నామకుండైన భటుండు వినిచిన తెఱంగెఱింగి చింతా
కులితస్వాంతుండయ్యె నంత వనధికూలంబున. ౧౨౦౪

ఉ॥ రాముఁడు మారుతిన్ ప్లవగ - రాజగు సూర్యసుతున్ విభీషణున్
గామితసిద్ధి పొందుటకుఁ - గా క్షణమొక్కటఁగూడి యోజనన్
దామువొనర్చి లక్ష్మణయు - తంబుగ నెల్లరతోడ నాల నీ
ర్వామిని స్వల్పవారిని శు - భంబుగదాఁటి వసించి యచ్చటన్. ౧౨౦౫

తే॥ ఎల్లవారల వచనంబు-లెల్లవినఁగ, మేఘగంభీరనినదస - మీకృతాంబు
రాశి నా సవ్యకరము స్ప- ర్శమునఁ జఱచె, నచట ధ్వనిమాని నేఁటికి-నర్ణవంబు.

ఉ॥ పిమ్మట దర్భశయ్యపయిఁ - బ్రీతిఁబరుండి రఘూద్వహుండు సే
మమ్ముగ వారిధింగడచు - మార్గముఁ గోరుచు ధ్యానయోగచి
త్తమ్ములరన్ దినద్వయము - తత్పరుఁడై మని యాలనాఁడు పై
కిమ్ముగలేచి తమ్ముని స - మీక్షయొనర్చ వచించె నివ్విధిన్. ౧౨౧౦

మ॥ కనుమా! లక్ష్మణ! యీ సముద్రుఁడు మహా - గర్వోద్ధతుండయ్యె నన్
గనఁడేరీతిని సత్కరింపఁడు నమ - స్కారంబు సేయండు తా
మనమురింపన్ నరుఁడేమిలెక్క? కపిసం - బంధంబుతో నేమిసే
యును? నన్నించును దౌష్ట్యముంగొనినవాఁ - డుత్సాహియై కావునన్. ౧౨౧౧

మ॥ ఘనబాహూ! యిపుడే కనుంగొనుము దు - ష్కంధిన్ గడున్ శోషిలం
గను శిక్షించెద వానరుల్ పదగతిన్ - గంధిన్ వెసన్ దాఁటనౌ
నని చాపంబున బాణముం దొడుగ భూ - మ్యాకాశముల్ భీతి చా
లనముంబొందెఁ దమంబుగప్పె దెసల - ల్లాడెన్ వడంకెన్ గిరుల్. ౧౨౧౨

క॥ క్షోభించె వారినిధియు మ, హాభీతిని వేలమీఱె - యందలి తిమిమ
త్స్యాభీలనక్రఝషపా, ళీభూతములెల్లఁ జెదరి - క్లేశమునొందెన్. ౧౨౧౩

— శ్రీరాముఁడు శరణాగతుఁడైన సముద్రుని ననుగ్రహించుట —

ఉ॥ అప్పుడు దివ్యరూపధరుఁ - డౌచు సముద్రుఁడు రత్నసంతతిన్
గొప్ప యుపాయనమ్ముగ ర - ఘుప్రవరార్థము పూనివచ్చి నా
తప్పును సైఁపుమంచు వసు - ధాతనయానిజనాథు మ్రొక్కి వే
యప్పనసేసి కానికలఁ - బ్రార్థనచే నభయంబు కోరుచున్. ౧౨౧౪

క॥ రామా! లంకామార్గము, నీమెయిఁ దెల్పెదను నేను - హృద్యముగా న
న్నోమము శరమును విడువకు, మా! మన్ననసేయుమా! ద-యామతిఁగనుమా!॥

వ॥ అని దీనంబుగాఁ బలికిన నతనింగని రామచంద్రుండు మదీయబాణం బమోఘంబు లక్ష్యంబుఁ జూపినంగాని వృథగాఁ బోదనివచించె నంత సముద్రుండిట్లనియె.

తే॥ రామ! ద్రుమకల్పమున నుత్త - రమున నొక్క
చోటు పాపాత్ములకు మేటి - చోటుకలదు
రేలుఁ బవళులు బాధింతు - రేల వారు
నన్నుఁగావున విడుమట - నారసంబు. ౧౨౧౭

క॥ నావుడు రాముఁడు సరియని, తా వడి బాణంబు విడిచెఁ - దద్బాణంబున్
హావడి ద్రుమకల్పస్థితు, లా వారలఁ గూల్చి చేరె - నంబుల పొదిలోన్.

ఉ॥ సాగరుఁడా రఘుప్రవరు - సద్వినయోక్తులెసంగ నోప్రభూ!
బాగుగ నాపయిన్ నలుఁడు - ప్రస్తరముల్ పొదిగించి సేతువున్
వేగ నొనర్పఁగాఁగలఁడు - విస్తృతమొప్పఁగ విశ్వకర్మజుం
డీగుణవంతుఁడైన కపి - యీతని కొక్కవరంబు ప్రాప్తిలెన్. ౧౨౧౯

క॥ ఒకవేళ గంగలో వి, ప్రకులసాలగ్రామమితఁడు - గ్రక్కున వైచెన్
బ్రకటితరుష ద్విజుఁడును నీ, దు కరచ్యుతశిలలు తేలుఁ - దోయమునను నన్.

క॥ కావున బ్రాహ్మణ శాపం, బే వరమై యుపకరించె - నిప్పుడటంచున్
దేవా! సెలవని సాగరుఁ, డావెన్క నదృశ్యుఁడయ్యె - నందఱుకనఁగన్. ౧౨౨౧

— ♦ హనుమంతుఁడు శివలింగములను దెచ్చుటకై కాశికి వెడలుట ♦ —

వ॥ పిమ్మట శ్రీరామచంద్రుండును సేతునిర్మాణమునకు నలుని విధించి తత్ప్రారంభమున విఘ్నేశ్వరునిఁ బ్రతిష్ఠించి యాద్యంతమై నలునివలన నవపాషాణంబులను నవగ్రహపూజార్థంబై మహోదధి పూర్వభాగంబున స్థాపింపఁజేసి గ్రహంబుల నభ్యర్చించి సాగరసంయోగతలంబునఁ దనపేర నొక యుత్తమలింగంబు స్థాపింప నిశ్చయించి మారుతినిం గని వాయుసుతా! యొక్కముహూర్తంబులోపలఁ గాశికింజని శివునకు నాయభ్యర్థనను దెలిపి యతనివలన రెండులింగంబులను గొనితెమ్మనివచించె నంత హనుమంతుండును నట్లయని గగనంబున కెగిరి యతిత్వరితగమనంబున క్షణంబున వారణాసిం జేరి నన్ను నమస్కరించి రామకార్యంబు విన్నవించిన నేనును లింగద్వయంబొసంగి హనుమతో నయ్యా! నేను ముందె దక్షిణదిశకు వెడల నిశ్చయించితి మఱియు నగస్త్యముని విశేషంబువలనను రాముని సమ్మతిని నచ్చటికిం జనుదెంచె దనని నతండు నా వచనంబులను విని దేవా! ముందెప్పుడు తాము కుంభజన్మునితో నివ్విషయంబు నిశ్చయించితిరయ్యది దయచేసి తెల్పుఁడని వేఁడెనంత మారుతీ!

పూర్వవృత్తాంతంబు వివరించెద వినుమని యేతద్విధిని వచింపందొడంగితి. ౧౨౨౩

— వింధ్యుని గర్వభంగమునకై యగస్త్యుని దక్షిణదిగ్గమనము —

తే॥ నారద మునీంద్రుఁ డొకపరి-నర్మదాఖ్య, నదిని స్నానంబు పొనరించి-పొదలుభక్తి
శ్రీమదోంకారరూపు న-ర్చించి సర్వ, దేహులకు సర్వమండని-తెలిసిమ్రొక్కి.

చ॥ అటుచని కాంచె సాస్మృతిభ - వామితతాపనివారకప్రథా
పటుతర నర్మదాజల శు - భంకర భూషణ యుక్చరాచర
స్ఫుట వరరూపయుగ్మపరి - శోభిత సార్థకకీర్తి తోర్వరా
తటహిత వింధ్యనామ వసు - ధాధరరాజముఁ బ్రాప్తతేజమున్. ౧౨౨౪

శా॥ ఆ వింధ్యుండు సభక్తి నారదునిఁ దా - నాహ్వానముం జల్పి రే
వావారిందగు నర్ఘ్యపాద్యములు దీ - వ్యత్ప్రీతిమైనిచ్చి ర
మ్యావాసంబున నున్నతాసనముపై - నాసీనునిం జేసి వే
వే వృక్షస్థిత పక్వసత్ఫలముల - ర్పించెన్ సుఖం బొప్పఁగన్. ౧౨౨౫

క॥ అవల గతశ్రము నారదు, నవనతుఁడై మ్రొక్కి దేవ! - యస్మత్పాపౌ
ఘవినాశనమయ్యెను మీ, దవు నంఘ్రి రజస్సువలన - నాలోకింపన్. ౧౨౨౬

క॥ ఈ దినమే సుదినం బప, నోదిత మంతరతమం బ - నూన ప్రాచీ
నాదిత్సార్జిత పుణ్యాఘ, లాదానం బబ్బె మిమ్ము - నంటినమత్రిన్. ౧౨౨౭

తే॥ నాకులమువారలందు మా-న్యతనుగంటి, నొనర నన నారదుండు ని-ట్లూర్పువిడిచె
నంత సంభ్రాంతచిత్తుఁడై-యగవరుండు, మునిని సర్వార్థకోవిదా! యనినుతించి.

శా॥ ఉచ్ఛ్వాసంబొనరింపనేల? యదియే - దో? కారణం బిమ్మెయిన్
ద్వచ్ఛ్వాసశ్రేయసమెంచి ఖేదములయిం - పం జేసెదన్ దెల్పుఁడీ!
సచ్ఛ్వేతామిత కీర్తిసంపదల ని - చ్చల్ మీఱు నాసాటియే?
తచ్ఛ్వాసోపమ మేరు ముఖ్యనగముల్ - తర్కించి యోజించినన్. ౧౨౨౯

సీ॥ మేర్వాదులను బూర్వ - ముర్వీధరఖ్యాతిఁ, బెద్దలు పల్కిరా విధముకల్ల
నేనొక్కరుఁడ భూమి - నిన్ మోయుచున్నాఁడ, నన్యుఁడెవండు స మర్థుఁడెంచ?
నీశ్వరునకు బిడ్డ - నిచ్చుట రాజౌట, హిమవంతుఁడటు గణియింపఁబడియె
సురసద్మమై మణి - స్తోమంబు హేమంబు, కలిగినన్ మేరువు కాదు గొప్ప,
తే॥ యితరశైలంబు లెన్నినా-గ్లేని తులమె?
దేహపుష్టికిఁ దగును మం - దేహనగము
కరుణకునుమాత్రి ముద యాద్రి - యిరవు ధరణి
నిషధమున నోషధులు సున్న - విషయమెన్న. ౧౨౩౦

ఆ॥ అస్తనగము కాంతి - నా వంతనొందదు
నిల శిఖరి పూర్తి - నీలమంతె
మందరాగమదియు - మందాక్షమై యుండె
మలయధరము భుజగ - కులము నెలవు. ౧౨౩౧

తే॥ గీ॥ రైవతాహార్య మరయ ని - ర్ధనము హేమ
కూటము త్రికూటమును రి - క్తకూటములగుఁ
జెలఁగు క్రౌంచంబు సహ్య కి - ష్కింధములును
బలవిహీనంబులో నీకఁ - బలుక నేల ? ౧౨౩౨

క॥ అని గర్వోక్తుల నాడఁగ, విని నారదమౌని మది ని - విస్మయపడుచున్
ఘనమగు శ్రీ శైలాదులు, కనినంతనె ముక్తి నొసఁగుఁ - గాదే? యనుచున్.

క॥ గర్వము మహిమము నణఁచును, గర్వము సంపదలఁ ద్రోలఁచు - గర్వంబుర్విన్
సర్వానర్థకరంబగు, గర్వింపఁగ దగునె? యెంత - ఘనుఁడైన నెటన్. ౧౨౩౪

క॥ కావున నీతని బలమును, గావరమును నిగ్గఁజేయఁ - గా వలయు నటం
చావింధ్యునితో మునుకొని, యీ విధమునఁ బలికె నప్పు - డెంతయు వేడ్కన్

చ॥ అవు నవు మంచిమాటలిటు - లన్నినగంబుల సారమున్ గడున్
వివరణమొప్పఁ బల్కితివి - విశ్రుత కీర్తివి సత్యమూర్తివిన్
సవినయమింత లేక పరు - షంబుగ మేరువు నిన్ను గ్రించుగాఁ
బవలును రేయి నిందసలు - పన్ విని యూర్చును బుచ్చితిన్ సఖా! ౧౨౩౬

క॥ మావంటి వారలకుఁ జిం, తా వైక్లబ్యంబు కలదె? - త్వద్విషయంబున్
నే వినివచ్చితి నంతియె, పోవలయున్ వత్తుననుచు - మునివరుఁడరిగెన్. ౧౨౩౭

వ॥ వింధ్యుండును మేరువున కింత గరువంబు తగునే? యని గ్రహ నక్షత్రాదులతో
సూర్యుండు తన్నుఁ బ్రదక్షిణించుటం జేసి గొప్పతనమును వెలిపుచ్చుచు విఱ్ఱ
వీఁగుచుండెఁ గనుక నద్దానినిఁ గ్రించొనర్తునని నిశ్చయించి తత్క్షణంబున. ౧౨౩౮

ఉ॥ మించఁగ నుద్యమించి కడి - మిన్ బ్రతివాసర మించుకంత ని
క్కించుచు నగ్రమభ్రపథ - కీర్ణమునొందుఁ గ్రమక్రమంబుగా
నంచిత సూర్యమండలము - నంతకు వృద్ధినిఁ గాంచి తా నిరో
ధించెను బ్రధ్నమార్గము వి - ధించెను సూర్యునకున్ స్థిరత్వమున్. ౧౨౩౯

క॥ ద్విసహస్ర ద్విశత ద్విక, ససంఖ్యలగు యోజనములు - సంరంభముగా
వసుమతి నివ్విధి వింధ్యుం, డసమానముగాఁగ వృద్ధి - నందిన యంతన్. ౧౨౪౦

తే॥ గీ॥ ప్రాచ్యులు నుదీచ్యులును భృశ - బాధ నొంది
చండరశ్మికర వ్రాత - చకితులగుచుఁ

జాలఁగఁ దపించుచుండఁ బా - శ్చాత్య దాక్షి
ణాత్యు లతిసుప్తులైరి దు - ష్ప్రాప్త్యయమున. ౧౨౪౧

సీ॥ ఆసతారాగ్రహా - మైన యంబరమును, గనుఁగొన శమితమా - కరణిఁ దోఁచె
సత్స్వధా స్వాహా వ - షట్కార కర్మముల్, వర్జింపఁబడియె భూ-వలయమందుఁ
బంచయజ్ఞ క్రియల్ - పరికింపలోపమై, ముల్లోకమెల్లఁ గం - పిల్లసాఁగె
సురలు బ్రహ్మాజ్ఞఁ ద - ద్గిరి గురువరుఁడైన, శ్రీయగస్త్యుని వేఁడఁ - జేరఁబుచు
తే॥ ముని యగస్తియు విహ్వల-మును వహించె, నాల నే నాతనినిఁ జింత-యేల?యనుచు
నూఱడించియుఁ బలికితి-నోమునీంద్ర!, దక్షిణాశకు నరుగు మి-త్తఱిని మఱియు.

శా॥ నీవాక్పాశముచేత వింధ్యగిరి నెం - తే సగ్గఁగాఁజేసి సూ
ర్యావేగంబు నిరోధముం దొలఁచి లో - కాసాధ్యసౌఖ్యంబుని
మ్మా! విశ్వస్థితికిన్ సహాయుఁడగుమా! - యాపిమ్మటన్ నేను నీ
సేవల్ పొందఁగ రామపూజ కొఱకున్ - శీఘ్రంబ యేతెంచెదన్. ౧౨౪౩

చ॥ అనివచియింప సంతసము - నంది యగస్తియుఁ గాశివీడి భా
ర్యను దోడికొంచు నేగి ప్రియ - మారఁగ వింధ్యునిఁజేర దేశికుం
గని కడునమ్రుఁడై యతఁడు - ఖర్వతరుండయి కంపమొంది పా
దనములుసల్పి పత్నియుతుఁ - డన్మునివర్యు ననుజ్ఞ వేఁడెడాన్. ౧౨౪౪
తే॥ వింధ్యుఁగని యయ్యగస్త్యుండు - ప్రేమవెలయ
శిష్యవర! సాధుశీల! వచింతు వినుము!
యామ్యదిశకేను వెడలెద - నచటినుండి
మరల వచ్చెడి వఱకు వా - మనత మనుము!. ౧౨౪౫
క॥ భద్రంబగు నని కడు ని, ర్నిద్రంబగు నాజ్ఞ యొసఁగి - ప్రియ మగు లోపా
ముద్రను దోడ్కొని లవణ స, ముద్రముగల దెసకు నరిగె - మునుకొని వడిగన్.

క॥ ఆనాఁటినుండి వింధ్యుఁడు, మానుగ గుర్వాజ్ఞఁబొట్టి - మానిసిరీతిన్
దాను మదమేదియుండెను, మానియు దక్షిణమునంద - మసలక నిలిచెన్. ౧౨౪౬

క॥ పండ్రెండేండ్లకు నొకపరి, తీండ్రంబగు నాజ్ఞ గిరియు - దేశికుఁడిటులం
దండ్రివలెనుండియును నా, మండ్రాటము మాన్పరాఁడు - మరలి యటంచున్.
తే॥ నిక్కి చూచుచు ఖర్వుఁడై - నేలనొదిగె, నర్క సంచారమునకును-నడ్డు లేదు
దండకారణ్యమున నగ-స్త్యముని భక్తి, నెదురుసూచెడు నాకయి-యింతవఱకు.
క॥ కావున నే నిదె వచ్చెద, పావని! నీ వరుగుమనుచుఁ - బనిచితి నతనిన్
వేవేయంబర పథమున, నా వాయుసుతుండు నరిగె - నంతటిలోనన్. ౧౨౫౦

—• శ్రీరాముఁడు సైకతలింగమును స్థాపించుట. •—

క॥ సాగరతలమున రాముఁడు, బాగుగుమూర్తంబు మీఱఁ - బడుచున్నది తా
నాగతుఁడు కాఁడు హనుమయుఁ, బ్రోగుగ నిట నిసుకలింగ - మును స్థాపింతున్.

క॥ అని సుగ్రీవాదులతో, ననువుగ యోజించి మునుల - నా కపివరులన్
మనమలరఁ గూడి సేత్వా, దిని విధిగా లింగముం బ్ర - తిష్ఠించి వెసన్. ౧౨౫౨

చ॥ మునుకొని కౌస్తుభంబును బ్ర - మోదముగా స్మరియింప నద్ది భా
నునికళ ధిక్కరించుచును - నూల్కొని వాయుపథంబునుండి చ
య్యన నరుదెంచి రామగళ - మందు నలంకృతమయ్యె దానఁ గ
ల్గెను ధనవస్త్రభూషలును - గృష్టులునున్ హరులున్ బదార్థముల్. ౧౨౫౩

ఉ॥ రాముఁడు వానినన్నిటిని - రాగమెలర్పఁగ వానికోటికిన్
గామితపూర్తిగా నొసఁగి - క్రన్నన సైకతలింగమున్ శుభం
బౌమతిలంగ మ్రొక్కియును - జాన్వితుఁడై మఱిపూజసేసె నా
పై మునులెల్లఁ దృప్తిఁ దమ - పట్టులఁ జేరఁగఁ బోయిరయ్యెడన్. ౧౨౫౪

ఉ॥ మార్గమునందు వారలను - మారుతిగాంచి మహాత్ములార! యొం
దర్గి ప్రపూజలం గొనఁతి - రంచును బృచ్ఛయొనర్చె వారు నై
సర్గికరీతి వాయుసుత! - సైకతలింగమునిల్పి భక్తిమై
భర్గునిఁగొల్చి రాముఁడు కృ - పామతి సత్కృతిసల్పె మాకిటుల్. ౧౨౫౫

చ॥ అనివచియించిరంత మరు - దాత్మజుఁడాత్మను జింతనొంది నా
ఘనమగు కార్యమెల్ల వృథ - గా నిటుసేసెను రామమూర్తి యా
తనివలనన్ శ్రమంబుగఁ బ్ర - తారితుఁడైతినటంచుఁ గ్రోధముం
గొని రయమారనేగి రఘు - కుంజరు ముందటదూఁకె గట్టిగన్. ౧౨౫౬

తే॥ హనుమ దుమికినచోట నా - తని పదములు
గుర్తుగా గహ్వరియుఁ గొంత - క్రుంగిపోయె
నపుడు రామునిఁగని మారు - తాత్మజన్ముఁ
డేధితక్రోధుఁడై పల్కె - నిట్టులనుచు. ౧౨౫౭

శా॥ రామా! మోసము చేసినాఁడవుకదా? - రాడ్వంశ్యుఁడయ్యున్, భవ
ద్భామారత్నము నేమమున్ దెలుపనే? - పాథోధి లంఘింపనే?
యీపైఁ గాశికిఁబోయి లింగములు దే - నే? యింతలో నాత్రపా?
యా మర్యాదఁ దలంపవైతి పహహా - స్వాంబయ్యెనే? నే ననన్. ౧౨౫౮

తే॥ నీమనములోని వంచన - నేనుగనిన
వృథగ శ్రమమొందుదునె? యింత - యేల? యిక,నో!

లింగములు రెండు నీవి నే - గంగఁదోఁత్రితో?
చెప్పుమా! నీ యభీష్టంబు - శీఘ్రముగను. ౧౨౫౯

వ॥ అనిపలికిన నతని రుపాగరోక్తులాలించి రామచంద్రుండును మంచిదని యిట్లనియె. ౧౨౬౦

మ॥ హనుమంతా! నిజముగా వచించితివి నే - నాత్రింబుళ్లో నీవు రా
కను లెక్కింపక మంచిమూర్తమదియే - గదా భంగమౌ యత్నమం
చును భీతిల్లి ప్రతిష్ఠసల్పితిని యి - చ్చోఁ గావునన్ సైకతం
బును మత్స్థాపితమైన లింగము నిదే - పోఁద్రోయుమా! తీయుమా!. ౧౨౬౧

చ॥ అచటనె కాశినుండి ప్రియ - మారఁగఁదెచ్చిన విశ్వనాథ పు
ణ్యాచయద లింగముంగొని ఘ - నంబుగ నిల్పెదనన్న విశ్వసిం
చుచుఁ బ్రపదశ్వసూనుఁడును - సుస్థితలింగశిరంబుఁ దోఁకచేఁ
బ్రచురముగాబిగించి వెస - లాగఁగఁబూనెను మాటిమాటికిన్. ౧౨౬౨

తే॥ లింగమినుమంత యేని-చలింపదయ్యెఁ, ద్రుటితమై వాలమాయెను-తూపతి యనని
వ్రాలి మూర్ఛిల్లెఁ గపులెల్ల-వగపుగొనిరి, కొంతవడి కాంజనేయుండు-క్షోణినుండి.

తే॥ తెప్పిఱిలి లేచి మదమఱి - తప్పటంచు
రామ చరణంబులను వ్రాలి - రక్షణంబు
సల్పుమా! సత్కృపాసింధు! - జాగువలదు
మన్నన యొనర్పుమని వేఁడె - మరల మరల. ౧౨౬౪

ఉ॥ అప్పుడు మారుతింగని ద - యామతి శ్రీరఘురామమూర్తి నీ
తప్పొకయింతలేదు నిక - తావుయలింగము నుత్తరంబునన్
దప్పక విశ్వనాథగురు - దైవతలింగము నిల్పుమయ్య! నీ
కిప్పుడుమేలు కల్గునని - యొంతయుఁ బల్కెను నేదదేర్పుచున్. ౧౨౬౫

— హనుమంతుఁడు కాశీవిశ్వనాథలింగమును ప్రతిష్ఠించుట. —

తే॥ అనిలతనయుఁడు చిత్తమ - టంచుఁ ద్వరగ
రామలింగేశుప్రక్కన - రమణమీఱ
నిల్పి విశ్వేశలింగంబు - నియమసరణిఁ
బూజలొనరించి శ్రీరాము - మ్రొక్కి-నిలిచె, ౧౨౬౬

ఉ॥ అంతట రామచంద్రుఁడు మ - హాముద మొందుచు గొప్పపట్టి! యీ
చెంతఁగలట్టి లింగముల - సేవ లొనర్చెడి వారలెవ్వరేన్
స్వాంతముపొంగ ముందుగ భ - వత్ప్రతినిర్మితలింగపూజ న
త్యంతముసల్పి పిమ్మట మ - దాహ్వానములింగముఁగొల్వఁగాఁ దగున్. ౧౨౬౭

తే॥ అటులొనర్పరయేని పూ - జాదిఫలము
వ్యర్థమౌ నిద్ది సీకగు - వరము సుమ్మి
మఱియు మిగిలినలింగంబు - సురకవిశ్వ
నాథలింగంబుకడనున్చు - మా! ధరిత్రి. ౧౨౩౮

తే॥ పూజలేకయె యయ్యది-భూతలమునఁ, జాలకాలంబు పడియుండు-నోల నేన
యొక్కతఱినిఁ బ్రతిష్ఠింతు-నొనరఁ దాని, ననిన మారుతి రామాజ్ఞ-నట్లసేసె. ౧౨౩౯

వ॥ హనుమంతుండు తనయెదుటఁ బాదంబులు భూమిలోనికిం దిగఁబడునట్లు గగనంబు
నుండి రోషించి దుమికియుండుటయు సైకతలింగంబునకుఁ బుచ్ఛంబు నా వృతంబుగా
బిగించి యీడ్చి లాంగూలంబు తుంగించుకొనుటయుఁ దలంచి రామచంద్రుండు
తత్ప్రతిరూపంబుగా నతనివలననె యచ్చట స్వీయమూర్తిని స్థాపింపఁజేసి మారుతి
నామంబుచే నొక్కతీర్థంబు నేర్పఱిచి తనపేరను లక్ష్మణునిపేరను దీర్థంబులను
నిలిపి తానును సేతుమాధవనామంబునఁ బ్రతిరూపంబు నెలకొల్పి హనుమత్పు
చ్ఛంబును దనచేత నిమిరిన ఛిన్నమైన యదియు నెప్పటివలె నేకమై బలవంతంబును
రమ్యంబునునయ్యె హనుమానుని వాలంబుచే బంధింపఁబడిన చిహ్నంబులిప్పటికిని
రామేశ్వరలింగశీర్షంబునఁ గానిపించు నదిమొదలు రామ విషయమున బొత్తిగా
గర్వంబుమాని హనుమయు భయభక్తులతోఁ జరింపఁదొడఁగె ననంతరంబున. ౧౨౪౦

శా॥ నే నాసైకతలింగమందుఁ గృపసం - ధిల్లం బ్రభూతుండనై
నానైసర్గిక పూర్వగాథ బహుళా - నందంబునుం బొంపు చం
దానన్ రామునితో వచించితిని యే - తద్రీతి, విన్పింతు గౌ
రీ! నైర్మల్యహృదంతరాళవయి య - ర్థిన్ పన్మి తద్వృత్తమున్. ౧౨౪౧

—♦ శివుఁడు శ్రీరామునకు లింగోత్పత్తిని వివరించుట. ♦—

శా॥ రామా!మున్ దొకవేళ నే ములిసవ - స్త్రంబున్ మెలందాల్చి యీ
భూమిన్ బ్రాహ్మణ రూపధారినయి స - మ్మోదంబునై భిక్షుకున్
శ్రీ మౌనీంద్రుల యాశ్రమస్థలములన్ - జేరంగఁ దత్పత్నులెం
తేమోహంబు నన్నుగోరినగుమ్ములై - యేతెంచి రిచ్ఛావిధిన్. ౧౨౪౨

ఉ॥ నావెను వెంటవచ్చు లల - నామణులన్ బతులడ్డగించుచున్
బోవలదంచుఁ జెప్పినను - బోఁటులటుల్ వినరైరి తాపునన్
నా విషయంబెఱుంగక ఘు - నంబుగ రోషమునొంది మౌనులో
రీ! వలవంతఁగాంతలను - నింత వశంబొనరించి కొంటివో. ౧౨౪౩

చ॥ అని నను నిందసేసి రతి - కర్తముగాఁగలనీదు లింగమా
య్యనఁబడి పోవుఁగాక! భువి - యందునటంచును శాపమిచ్చిరం

తనె వడినూడి నేలఁబడె - నాదగులింగము దానిఁగాంచి యా
వనితలు నిండ్ల కేగిరి జ - వంబుగ నేను నదృశ్యమొందితిన్. ౧౨౭౪
క॥ అంగమునుండియు నూడి క, నంగా ధరయందుఁబడియు - నవయక నా పా
లింగము వడివడిగా వృ, ద్ధింగని గగనంబునంటె - దృగ్భయదంబై. ౧౨౭౫
తే॥ దానిఁగని విస్మయంబంది - ధాతయపుడు
నాంతముగఁజూడ యత్నించి - సమలుకోటి
కడచినంగాని తెలియక - యెడదఁజాల
భీతిఁగని నాదుచెంతకు - వేగవచ్చె. ౧౨౭౬
క॥ వచ్చినమస్కృతి నొనరిచి, యచ్చితిముచెలిపి ప్రళయ - మాసన్నంబై
వచ్చెనటంచును బలికినఁ, దచ్చరితను విధికి వినిచి - తగనిట్లంటిన్. ౧౨౭౭
తే॥ ఓయి! చతురాననా! త్రిశూ - లాయుధంబు
నొసఁగెదను దానిఁబూని లిం - గోన్నతంబు
తగ్గిపోవఁగ ఖండింపు - మగ్గలికను
ననిన నాతఁడు మీరలే - యర్హులనిమె. ౧౨౭౮
క॥ అభ్రంకష లింగంబును, శుభ్రంబుగ మెఱయు మత్రి - శూలముఁగొని త
ద్విభ్రంశముగాఁ దునుమన, దభ్రస్థితి ఖండములుగఁ - దల్లింగమయెన్.
తే॥ పదియు రెండుభాగంబులై - వసుధమీఁదఁ
దెళ్లినట్టి మదీయమౌ - లింగమరయ
ఖ్యాతిమీఱ జ్యోతిస్సంజ్ఞ - లందెవాని
వివరమును దేటపఱిచెద - వినుముశ్రద్ధ. ౧౨౮౦
సీ॥ ఓంకార లింగంబు - నొగి సోమనాథలిం, గంబు త్ర్యంబక లింగ - మింబుమీఱ
మల్లికార్జున లింగ - మల్ల నాగేశ లిం, గము వైద్యనాథలిం - గంబు కాశి
కా విశ్వనాథ లిం - గంబు కేదారేశ, లింగ మహా కాల - లింగములును
భీమేశలింగంబు - నామెయి ఘుసృణేశ్వ, రాభిదలింగంబు - నాఢ్యమైన
తే॥ గంధమాదన లింగంబ-నంఘుతాఘు, వారములుగాఁ జెలంగెను-మేరుశైల
మునకు నీశానదిశ గుప్త-ముగనునుండె, గంధమాదన లింగంబు-క్షత్రివర్య!.
తే॥ నాకు శాపంబిడినముని-నాథులంత, మత్స్వరూపము నెఱిఁగి స-మ్మానమొప్ప
నన్నుగని యీశ్వరా! లింగ-మెన్నమరల, మీకుఁగలుగుతమని పల్కి-రేకసరణి.
క॥ తరువాతఁ బ్రళయవాతము, ధరపై వీవంగమేరు - ధర శిఖరంబున్
విఱిగిపడె గంధమాదన, వరనామకిమద్ది కనుము - వార్ధి జలమునన్. ౧౨౮౩
తే॥ మఱియునాగంధ మాదన-మహితలింగ, మిదిగో! సైకతలింగంబు-నెదుట మీరు
కాంచుఁ డీశాన్యమునను ద-గ్గఱనె కలదు, నేఁటికెవరికి నద్దికా-న్పింపదనఘ!

తే॥ ఇపుడు సానుజుఁడగు నీవు - నెల్లకపులు
మోక్షదంబగు తల్లింగ - మును గనంగ
నయ్యె స్పృశియింపనయ్యె రా - మా! త్వదీయ
సత్ప్రతిష్ఠిత లింగప్ర - శస్తినిచట. ౧౨౮౬

తే॥ గుప్తమైయున్న లింగంబు - గొప్పఖ్యాతి, నొందె నాలింగ తేజంబుఁ-బొందునింక
నీదు సైకతలింగంబు నిశ్చయముగఁ, గనుక నిదియు జ్యోతిర్లింగ-మనఁగ వెలయు.

క॥ పూజోత్సవాది సత్క్రియ, లోజన్ సైకతపు లింగ - మొందును సతమున్
యోజింపఁగ రామేశ్వర, నైజస్థితి నేనునిందు - నన్ వసియింతున్. ౧౨౮౭

తే॥ ఆయగస్త్యునికొఱకు నీ - దైనమాట
కొఱకుఁ గాశినిఁవిడి య - క్కడగవచ్చి
నిల్చినాఁడ నిఁకెవ్వఁడే - నియును భక్తి
మొనయ రామేశలింగంబు - మ్రొక్కనంత. ౧౨౮౮

తే॥ బ్రహ్మ హత్యాదులగు పాప - బంధములను
దొలఁగి యిహాపర సుఖముక్తు - లలరఁగాంచు
వడిగ నస్మదనుగ్రహ - ఫలమువలన
రాఘవా! నీవు నొక్క వ - రంబునిడుమ! ౧౨౮౯

తే॥ నాకు నభిషేకమునకయి - ప్రకటముగ
జనులు మణికర్ణికాస్వచ్ఛ - జలముదెచ్చి
తృప్తిగా స్నాతుఁజేసెడి - రీతిఁగనుము!
వినుము! నామాటలన రాముఁ - డనియెనిట్లు. ౧౨౯౦

శా॥ ఈసేత్వాదిని స్నానముంజలిపి రా - మేశున్ సమర్చించి యా
పై సేతుస్థలి వాలుకంగొని మహా - భక్తిన్ బ్రయాణించి కా
శీ సత్క్షేత్రముఁజేని వాలుకను మే - ల్సొందన్ద్ త్రివేణిన్ శుభా
వాసంబొనటువైచి గంగఁగొని త - ర్వాతన్ సుసంకల్పుఁడై. ౧౨౯౧

తే॥ వచ్చి రామేశ్వరునకు నా - ప్లవమొసర్పఁ
జేయునో? వాఁడు తత్కర్మ - శేష భార
మంతయును వార్ధి విడి మర - ణాంతమందు
బ్రహ్మమును బొందుననుచును - వర మొసంగి. ౧౨౯౨

తే॥ ఎవ్వఁడేనియు సంకల్ప-మింతలేక, గంగరామేశునకు నొసఁ-గంగలేఁడు
రమణ నీజన్మ సంకల్ప-రహితుఁడైనఁ, బూర్వజన్మ ససంకల్ప- మునను జరగు.

—♦ శివరామాగస్త్య సమావేశమున రామేశ్వర మహిమ ♦—

చ॥ అనివచియింపఁ గుంభభవుఁ - డప్పుడు సత్వరుఁడౌచు వచ్చి యీ
శుని నను రామచంద్రుఁగని - జోతలుసేసె రఘూద్వహుండు నా
మునికి నమస్కరించె మఱి - మున్కొని మౌనివరుండగస్త్యుఁ డి
ట్లనె రఘురామచంద్రుని ము - ఖాబ్జముఁ గాంచుచు హర్షచిత్తుఁడై. ౧౨౯౪
శా॥ రామా! తావక సత్ప్రసాదమున సం - రక్తిన్ మహా విశ్వ నా
థామోదంబున కేను బాత్రుఁడయితిన్ - హర్షంబు సంధించె నీ
సోమాలంకృతు లింగమొండిచట నా - త్మస్యంబుమైనిల్పి మ
న్నామంబున్ జనసంబు సార్థకము పొం - దంజేసెదన్ బేర్మిగాన్. ౧౨౯౫
క॥ అనియొకలింగము నీమం, బున సైకతలింగమునకు - మును నగ్నిదిశన్
ఘనభక్తిఁ బ్రతిష్ఠించియు, మనమలరఁగఁ బూజసల్పి - మఱి ప్రణతుండై. ౧౨౯౬
తే॥ విశ్వనాథుని నను రఘు-వీరవరుని, మ్రొక్కి యాగంధమాదన-ముఖ్యలింగ
మును సనాతనమగుదానిఁ-గనిముదమున, సెలవుగొని స్వాశ్రమమునకుఁ-జేరెనతఁడు
తే॥ సేతుతలమున రామేశ్వ-రాతతాల, యంబు వర్ణ్యంబు కుంభజ - న్నామధ్యలింగ
మునకు నాగంధ మాదన-మునకుఁ గనఁగ, దేవళంబులు లేవవి-తెలియఁబడవు.

—♦ శ్రీ రామనామ మహిమచే నలుఁడు సేతువునునిర్మించుట ♦—

ఉ॥ పిమ్మటరామునాజ్ఞను గ - పిప్రవరుండు నలుండు సేతు కా
ర్యమ్మొనరింపఁ బూని మద - మంది శిలల్ కుదిరింప వార్ధిభం
గమ్ములచే శిలల్ చెదరె - గర్వముతగ్గి నలుండు రామ పా
దమ్ములఁబట్టి వేఁడె శుభ - దమ్ముగ సేతువు నిల్చుమార్గమున్. ౧౨౯౯
తే॥ రాముఁడును నాతనిం గని - రాలమీఁద
'రా'యటంచును 'మా'యని - వ్రాయుమయ్య!
యవియె జతచేరి నిల్చు ని - య్యర్ణవమున
ఘనతరంగాళి తాఁకునఁ - గదలవనియె. ౧౩౦౦
వ॥ తదనంతరంబున. ౧౩౦౧
తే॥ ఆంజనేయాది కపివరు - లశ్మములను
గుట్టలను గొండలను దెచ్చి - కూర్చుచుండ
నలుఁడు రామాహ్వయాక్షర - ములనువ్రాసి
సేతువును గట్టసాగెఁ ద - త్సింధువునను. ౧౩౦౨
సీ॥ ప్రథమదినంబునఁ - బదునాలుగామడల్, మఱుదినమామడ - లిరువదియును
మూఁడవనాఁడటుల్ - మూఁడేడులామడల్, నాల్గవ నాఁడామ - డల్గనంగ

ఇరువది రెండును - నేనవనాఁడు యో, జనము లిర్వదిమూఁడు - చక్కఁబఱిచి
పండ్రెండు యోజనాల్ - పరఁగు విస్తృతముగ, సేతునిర్మాణంబు - సేసె నలుఁడు

తే॥ జలధిపై తేలుతేలంగ-సర్వకపులు, దాని దాఁటంగ, గపిమహా-త్వంబు కాదు
సాగరము శక్తి కాదు ప్ర-స్తరస మూహ, బలము గాదు శ్రీరామ-బల మొబలము

— ♦ శ్రీరాముఁడు పరివారముతో లంకకేగి శుకుని విడిపించుట. ♦ —

మ॥ అధిరోహించెను రామచంద్రుఁడవలన్ - హనుమంతునిన్ లక్ష్మణుం
డధిరోహించెను నంగదున్ గపివరుల్ - హర్షంబుతో సేతు స
త్పథముంబట్టిరి రామునాజ్ఞ జవస - త్వంబుల్ సెలంగంగ న
వ్విధి వారెల్ల సువేలపర్వతము వే - వేచేరిరుత్కర్షులై. ౧౩౦౪

తే॥ ఆసుభాచల సమధిరో - హణకరుండు
రామచంద్రుండు సౌవర్ణ - రమ్యచిత్ర
సౌధఘనతోరణధ్వజ - జలపరిఖల
మేటి ప్రాకారముల నింపు - మీఱుదాని. ౧౩౦౫

తే॥ విస్తృతంబగు దాని స్థాపితశతఘ్ని, కావిరాజితమగు దానిఁ-గపులనెల్లఁ
గనుచు సౌధోపరినిఁ బంక్తి-కంఠుఁడొప్ప, దాని లంకాభిధాన ప-త్తనముఁగాంచె.

క॥ ఆమెయి గుణధాముండగు, రాముని దయవలన విడుగ - లంగని శుకుఁడున్
నామమున వెలయు నాప్తుం, డామానవభోక్త రావ - ణాసురుఁ జేరెన్. ౧౩౦౭

ఉ॥ చేరి నమస్కరించి కపి - సేనను జూచెదె? రాక్షసేంద్ర! నే
నారఘు వీరులంగనితిఁ - బ్రాణముతో మనితిన్ దయాళుఁడా
భూరమణీసుతాధవుఁడు - పొమ్మను దమ్మటి జానకిన్ సస
త్కారవిధిన్ సమర్పణము - గా నిడుమా చనుమ వెండియిట్లనున్. ౧౩౦౮

తే॥ శ్రీవిభీషణునకు రాజ్య - సిద్ధికలుగఁ
జెలఁగి లంకకుఁ బట్టాభి - షిక్తుఁ జేయు
మయ్య! రాముని శరణము - నందుమయ్య!
లేనిచో నిన్ను విడువఁడెం - దేని యతఁడు. ౧౩౦౯

చ॥ అనివచియింపఁ గ్రోధభరి - తారుణలోచనుఁడౌచు రావణుం
డును శుకుఁగాంచి ధిక్కృతి న - టుల్ పరుషంబులు వల్కి బైటికిన్
దన భటపాళిచే నతని - దబ్బున ద్రొబ్బఁగఁజేసి రామసే
నను బరికించి యోజనఘ - నంబుగఁ జల్పుచుఁ జేరెఁ దత్సభన్. ౧౩౧౦

—♦ అంగదుని రాయబారము. ♦—

చ॥ అవుల సువేల భూధ్రమున - యుండుఁ బ్లవంగముపాళితోడ రా
ఘవవరులున్ రహస్యముగఁ - గార్యము నెంచుచు నూహసేసి పం
క్తివదన సూచనార్థముగ - ధీవరు నంగదుఁ బంప నాతఁడున్
జవమున నేగి రావణుని - సత్సభఁ జేరియు నిర్భయంబుగాన్. ౧౩౧౧

మ॥ తనలాంగూలమె పీఠమై తనర స్వా - స్థ్యంబొప్పఁ గూర్చుండి త
ద్దనుజాధీశునిఁ గాంచి పంక్తిముఖ! మ - ద్వాక్యంబులన్ విన్మ! నీ
కును మేలౌ తెఱుఁగున్ వచించెదను ర - క్షోవంశ సౌఖ్యంబు దా
నని చేకూఱు నటంచుఁ బల్కఁ దొడఁగెన్ - నానాహితోద్బోధముల్. ౧౩౧౨

మ॥ ధనయుక్తంబుగ సీతని త్తఱిని శ్ర - ద్ధా భక్తులన్ రామచం
ద్రునకున్ వేగనొసంగి సత్కృతిని సం - తోషంబుగాఁ జల్పుమా!
కన నారాయణుఁడౌను రాముఁడు జగ - త్కల్యాణుఁడాతండు రా
మునితో ద్వేషము వీడుమా! భవనదం - బున్ దాఁటుమా! సుల్వుగాన్. ౧౩౧౩

తే॥ జ్ఞానులేపాద పోతంబుఁ - జాలనాశ్ర
యించి సద్భక్తిపూతులై - యేపుమీఱ
ఘోరభవవారిధిఁ దరింత్రో? - కువలయమున
నట్టి రాముఁడు మానవుఁ - డౌనె? చెపుము!. ౧౩౧౪

వ॥ అనిబోధించుచుండిన యంగదుని పలుకులు లెక్కసేయక సక్రోధుఁడై దశాననుఁ
డిట్లనియె. ౧౩౧౫

శా॥ ఔరా! క్రోఁతి! జగద్భయంకరుఁడనై - యాదిత్యులన్ గెల్చితిన్
శ్రీరంజిల్లెడు రౌప్యపర్వతమునున్ - జిత్తాడఁగా నూఁపితిన్
ధీరుంబోలె నసుంగెరల్చుచును భీ - తింగూర్చెదే? కొంతలో
శ్రీ రామాది విభీషణ ప్రముఖులన్ - జీల్తున్ మిమున్ మ్రింగుదున్. ౧౩౧౬

చ॥ అనవుడు వాలిసూనియు ద - శాస్యునిఁ గాంచి త్వదీయపౌరుషం
బును విని నాఁడ నాబలియ - మోఘపుఁ బాశములన్ బిగించి కొ
ట్టిన మొఱవెట్టవే? శివ ప - టిష్ఠ పదాంగుళిచేతఁ గొండక్రిం
దనె పడి తల్లడిల్లవె? క - సంజెఱసాలను నద్రియుంచఁడే?. ౧౩౧౭

తే॥ ఇంతయేల? శ్వేతద్వీప-కాంతలెల్లఁ, దఱిమికొట్టరె? నిన్ను నా-తండ్రి తెచ్చి
నామ తొట్లకుఁగట్టఁడే?-నవమునిచ్చి, కార్తవీర్యభవుల్ మృగ-గతినిఁ గొనరె.

క॥ అనిచులుకనగా నాడిన, ఘనశర విద్ధాంగుఁ బోలెఁ - గ్రౌర్యముగని యా
దనుజపతి భటులతోఁ గోఁ, తిని మూతిని గొట్టి రయ గ-తినిఁ ద్రోయుఁడనెన్.

క॥ వారలు కరసంభృత శర, వారులుగా వచ్చి వాలి - భవుఁజుట్టఁగ నా
తారేయుఁడు వీరుఁడు బల, ధారేయుఁడు వారిఁ గొట్టెఁ-దనపుచ్ఛముతోన్.
తే॥ అట్టిరావణుబుగ్గలఁ-బట్టి నులిమి, కలకలధ్వనిఁ జేయుచుఁ-గదఁడు మరలి
శ్రీసువేలాద్రిరాముని-జేరి మ్రొక్కి, తెలిపె వృత్తాంతమును స్వచ-ర్యలనుసరిగ.
ఉ॥ రాముఁడు పిన్ననవ్వుతన - రన్ గపిమాటలెఱింగి కౌఁగిటన్
బ్రేముడి నంగదుంబొదివి - పిమ్మట లీలమెయిన్ ధనుస్సునన్
శ్రీమయబాణమున్ దొడిగి - చెచ్చెరలంకకుఁ జూపివైచెను
ద్దామగతిన్ శరంబుచని - తత్పురిసౌధము మీఁది ఛత్రముల్. ౧౩౨౨
ఉ॥ నూఱును బాడొనర్చి యటు - నూల్కొని తత్కలశంబులన్ బదిన్
జూఱఁగఁ గూల్చెనంతటనె - క్షోణిసుతన్ దశకంధరుండు చే
కూరఁగ రామచంద్రునకుఁ - గూర్మినొసంగఁడటంచు నంగదుం
డేరుపడంగఁజెప్ప విని - యీసున సూర్యసుతుండు క్రోధియై. ౧౩౨౩

— సుగ్రీవుఁడు రావణ కిరీటమపహరించుట. —

శా॥ ఉడ్డీనంబొనరించి లంకకును నా - శాగ్రస్థితిం బోయి తా
నుడ్డాడించుచు రావణాసురుని భ - వ్యోరస్థ్సలిన్ ముష్టిచే
నడ్డాదిడ్డిగఁగొట్టి నేలకును ద్రో - యన్ బంక్తివక్త్రుండు వే
యొడ్డారించుచు బాహుయుద్ధమునకున్ - హుమ్మంచు నిల్చెన్ రుషన్. ౧౩౨౪
క॥ సుగ్రీవుండును మఱి పం, క్తిగ్రీవుఁడు బాహుబలము - క్రొల్లుబ్బఁగ హ
స్తాగ్రోర్వంఘ్రిల ఘాతము, లాగ్రహమునఁ జలిపికొనుచు - నని సేసిరటన్.
ఉ॥ స్ఫూర్జిత బాహువిక్రమము - సొంపున సూర్యసుతుండు రావణున్
జర్జరితాంగుఁజేసి భయ - సంగతి వ్రీడ సెలంగ ఖిన్నుఁడై
వర్జిత సంగరుండయి జ - వంబున రావణుఁడింటికేగఁ దా
గర్జిలి వానిదౌ బొమిడి - కంబుగ్రహించి ముదాత్ముఁడై వెసన్. ౧౩౨౫
తే॥ రామలక్ష్మణులను జేరి - ప్రభువులార!
దర్పితుని రావణునినొంచి - తత్కిరీట
మిదిగో! తెచ్చితినని యిచ్చి - యొరఁగెనంత
రాముఁడును బ్రీతిఁ గౌఁగిట - రవిజుఁగూర్చి. ౧౩౨౬
క॥ మిత్రమ! నన్నడుగక యే, యాత్రముతో గర్వచిత్తు - నాశరవరు మ
చ్ఛాత్రవుఁ జేరితివయ్యది, పాత్రమె? కీడైననెట్లు? - వలదటులనుచున్. ౧౩౨౭
తే॥ అవలభేరీమృదంగ శం-ఖాదివాద్య, ములను మ్రోగించి ప్లవగోత్త-ములుకడంగి
లంకముట్టడిసేయఁ దలంప రావ, ణుని శిరస్త్రాణమును నంగ-దునకుఁ బెట్టి.

క॥ దళవాయియైన యతనిని, దళముల రక్షింపఁదెలిపి - దైత్యావళికిన్
గళవళపాటొప్పఁగ నవ, ఘుళముగ దక్షిణపుదిశను - గ్రమ్మఁగఁబనిచెన్.

తే॥ తగినసేనను గూడి దో - ర్దర్పమొప్పఁ
బశ్చిమోత్తరా ప్రాగ్దిశా - ద్వారములను
ముట్టడింపఁగ హనుమంతు - దిట్టఁడైన
యాసుషేణుని నలునిఁ జె - న్నారఁబనిచె. ౧౩౩౧

తే॥ స్వస్వబలయుతులౌచుఁ ద - త్ప్లవగవరులు
రామునకు లక్ష్మణునకు సూ - ర్యజున కెరఁగి
యరిగి లంకకు నలుదెస - లాక్రమించి
యట్టహాసంబు లొనరించి - యార్చిరంత. ౧౩౩౨

మ॥ అలసుగ్రీవుని పౌరుషంబు మది న - త్యంతంబు చింతించుచున్
బలఘాతంబుల దీలుపాటుకొని భ - వ్యంబైన ప్రాసాదమం
దలఁతంజెంది రహస్యరీతి శయనం - బాసుండు నారావణున్
జెలువారన్‌గని బోధసేయుటకు ను - త్సేకించి తద్బంధువుల్. ౧౩౩౩

—♦ మాల్యవంతుఁడు రావణునకు బుద్ధి సెప్పుట. ♦—

తే॥ మాలియు సుమాలి మాల్య వ - న్మహితుఁడనెడు
ముగురు మాతామహులు ప్రియ - పూర్వకముగఁ
దలఁచిరటు మాల్య వంతుండు - దనుజనాథుఁ
డైన రావణుచెంతకు - నరుగుదెంచి. ౧౩౩౪

మ॥ వినుమా! రావణ! నాదువాక్యములు సం - ప్రీతిన్ మఱిన్ దానిమీఁ
దను నీచిత్తమురీతిఁ జేయుము! పురిన్ - దజ్జానకీదేవిచే
రిననాఁడాదిగ నాశహేతువులు మీ - ఱెన్ ఘోరముల్ వానినె
ల్లను విన్పించెద సుస్థిరాత్మకుఁడవై - లక్షింపుమా! చిహ్నముల్. ౧౩౩౫

సీ॥ గార్దభంబులు ఘనా-ఘనగర్జలొనరించె, ఘనములు భయదర-క్తములగురిసె
దేవలింగంబులు-తెందెప్పలుగ వ్రీలెఁ, గాళినవ్వుచును న-గ్రమున నిలిచె
ధేనువుల్ ఖరసంత-తిని నీనుచుండెను, నెలుకలు పిల్లుల-నెదిరిపోరె
గరుడములను బన్న-గంబులుఁడీకొనె, ఫలవృక్షములు త్రుళ్లి-పడఁగసాగెఁ

తే॥ గృష్ణపింగళ వర్ణుండు - కృచ్ఛ్రకరుఁడు
వికట వక్త్రుఁడు ముండుఁడు - భీతిమండు
పురుషుఁడగు కాలుఁ డెప్పుడు - పురమునందుఁ
దిరుగు చింటింటఁజూడఁగాఁ - బరఁగెనిక్కి. ౧౩౩౬

తే॥ ఇట్టి దుష్టనిమిత్తము-లెన్నొ? కలిగెఁ, గనుకఁ గులరక్షణార్థమై -ఘనతరమగు
శాంతినొనరింపు మిఁక రామ-చంద్రు మ్రొక్కి, సీతనర్పించి సత్కృతి-సేయుమయ్య

వ॥ అని బోధించిన సత్యమాటలను సరకుసేయక పోఁకుమూకఱేఁడు మాల్యవంతుని
గని తాతా! ముసలితనముచే భీతిల్లి తగని నీతులను బలుకుటెందులకయ్యావి కర్ణ
కఠోరంబులుగా నున్నవని ప్రత్యుత్తరంబొసంగి గృహంబునకుఁ బనిచి యనంత
రంబున. ౧౩౩౮

మ॥ సదస్సుఁ జేరి మహోదరాఖ్యహితు వి - శ్వాసార్హు ధూమ్రాక్షుని
న్మదసంధాను నరాంతకుఁ దనుజమా - న్యుఁ వజ్రదంష్ట్రుఁ రణా
భ్యుదయంబుఁ గలిగింపఁగోరి గుమిగా - యోధావళిం జేర్చి ధై
ర్యదమౌ పల్కులఁబల్కి వస్త్రమణి భూ - షాదుల్ తగం గూర్చియుఁ. ౧౩౩౯

— దైత్యవానర సంగ్రామము. —

సీ॥ ధూమ్రాక్ష! మొలఁగుమ-దూర్పువాకిటనిల్చి, శాత్రవులను మన్నఁ-జాలుమయ్య!
యోనరాంతక! దక్షి-ణోత్తమద్వారాన, నుండి విద్వేషులఁ-జెండుమయ్య!
వజ్రదంష్ట్ర! నీవు-పశ్చిమంబుననిల్చి, పరిపంథులను బాదు-బఱుపుమయ్య!
యోమహోదర! వెస-నుత్తరంబున కేగి, యరిసూదనుండవై -పరఁగుమయ్య!

తే॥ యనుచువారిఁ బ్రచోదన-మునునొనర్చి, పనిచె నంతట రామ రా-వణులసైన్య
ముఱవుసెంది చతుర్దిశల్-హోరుమనఁగ, నట ముఖాముఖినిల్చెను-త్కటముదనర

చ॥ అతిబలకాయులౌ దనుజు - లందఱుఁ గ్రోధవిఘూర్ణితాత్ములై
శితశరఖడ్గశూల గుణ - సిద్ధధనుర్వర భిందిపాల రా
జిత దృఢశక్తిపట్టి సవి - సృత్వర ఘోర శతఘ్నికాగదా
వితత పరశ్వధాదులఁ బ్ర - వీణతమైధరియించి మించుచుఁ. ౧౩౪౧

తే॥ వానరులతోడఁ బోరఁగాఁ - బూనునపుడు
వారలును వృక్షములచేతఁ - బ్రస్తరముల
చేతఁ బర్వతములచేతఁ - జెలఁగిముష్టి
ఘాతములచేత మోదిర - రాతివరుల. ౧౩౪౨

క॥ రక్షశ్శార్దూలురు రణ, దక్షతఁగనకాభరథ మ - తంగజహరులన్
వృక్షచరపాళి కెదురుగ, రూక్షత నడిపించి పోరి - మ్రోగింపదెసల్. ౧౩౪౩

మ॥ పిఱువోకుండఁ గపీంద్రులుం దొడరి వే - వేయుద్ధముంజల్ప న
త్తఱి ధూమ్రాక్షునలుండు మారుతియుఁ ద - ద్దన్ వజ్రదంష్ట్రున్ మదం
బఱఁ దారేయుఁడు తన్నరాంతకు రయం - బారన్ సుషేణుండుఁ జా
గఱపాటొంద మహోదరున్ దునిమిరు - త్కంఠార్భటిన్ మీఱుచున్.

వ॥ మఱియుఁ జతుర్థాంశావశేషంబుగా రాక్షసబలంబును నిహతంబొనర్చి యంగదా
దులు నల్వురును మహోత్సాహమున విజయవాద్య ఘోషంబులు మిన్నుముట్టం
జేయుచు రఘురామునిచెంతకరిగి నమస్కరించి నిల్చిన. ౧౩౮౬

క॥ తనసైన్యం బటు కూలుట, గని యింద్రజితుండు సర్ప - కాండము చాపం
బునఁదొడిగి కపులు లక్ష్మణుఁ, డును రాముఁడు తల్లడిల్ల - టోకుగ వైచెన్.

—◆బ్రహ్మాస్త్రముచే నింద్రజిత్తు వానరులను మూర్ఛనొందించుట.◆—

శా॥ వీక్షన్ రాముఁడు గారుడాస్త్రవరమున్ - వేపూన్చి శార్ఙ్గంబునం
దాకర్ణాంతము లాగి వైవ నది స - ర్పాస్త్రంబునుం గూల్చె మా
యాకారుండగు మేఘనాదుఁడు నదృ - శ్యంబంది యాకాశమా
గ్గాకీర్ణుండయి రామసేనపయి బ్ర - హ్మాస్త్రంబు వైచెన్ వడిన్. ౧౩౮౭

తే॥ దానిచే రామలక్ష్మణుల్ - తద్విభీష
ణాంజనేయులుదక్క వ - నాటులెల్లఁ
గ్రిందఁబడి యొల్లఁబోయి రా - క్రందమున సు
షేణుఁడును జాంబవంతుండు - క్షితినిఁబడిరి. ౧౩౮౮

ఉ॥ అప్పుడు రామచంద్రుఁడు ద - యామతిఁ దమ్మునిఁగాంచి లక్ష్మణా!
యిప్పుడె రాక్షసాధముల - నీల్గఁగఁజేసెద నాలసించుటన్
ముప్పుఘటిల్లె సేనకని - మున్కొనిపల్కి నెఱింగి సాధ్వసం
బొప్పఁగ నింద్రజిత్తు పుర - మొయ్యనఁ జేరఁగఁబాఱె సేనతోన్. ౧౩౮౯

తే॥ రాముఁడును వాయుసంభవు - రాక్షసాధ్యుఁ
డౌ విభీషణుఁగాంచి స - ద్భావులార!
మీరు వేగమ జాంబవ - ద్వీరుఁజేరి
యతఁడు జీవించియుండిన - నరసి మరల. ౧౩౯౦

క॥ నాయాజ్ఞ గాఁగఁ గపివరు, లేయోగమువలన మూర్ఛ - నేది సుఖమువై
యాయుర్బలముం గాంతురొ?, యా యోజననడిగి నల్వుఁ - డవ్విధి ననియెన్.

చ॥ ప్రియముగ నప్డు మారుతి వి - భీషణులున్ నిశయాట నుల్ముకం
బయనమెఱుంగఁ బట్టుకొని - యా కపిసంతతి మధ్య రోయుచున్
నయనయుగంబు మూసికొని - నల్గుచునుండిన జాంబవంతుఁ బ్ర
త్యయితునిఁ గాంచి రాఘవుని - యానతిఁ దెల్పిన నాతఁడిట్లనెన్. ౧౩౯౧

ఉ॥ మీ రెవరయ్య! వాయుజుఁడు - మేలుగనుండెనె? యాతఁ డొక్కఁడే
యారయఁ గార్యముం జలుప - నయ్యెడు ధీరుఁడు రుద్రమూర్తి నా

చేరువ కాతనిం బిలువఁ - జెప్పెద నొక్క యుపాయమున్ రయం
బారఁగఁ గీశులెల్లరును - బ్రాణయుతంబుగ లేతురిత్తఱిన్. ౧౩౫౩
చ॥ అనవుడు వాయుజుండు ముద - మంది మహాత్మ! విభీషణుండు నే
నును నిట నిల్చినారము న - నున్ హనుమంతునిగా నెఱుంగుమా!
యని పదమంటి మ్రొక్క శుభ - మంచును భల్లుకనాథుఁడప్పుడో
హనుమ! పయస్సముద్రతటి - యందలి ద్రోణనగంబు దెమ్మనెన్. ౧౩౫౪

—♦ ఆంజనేయుఁడు ద్రోణాద్రిం దెచ్చి యొల్లఁబోయిన వానరులఁ దేర్చుట ♦—

తే॥ వల్లెయని మారుతియు నేగి-భవ్యకామ, ధేనుఘర్మవిలేపుఁడై - తెలివిమీఱ
నరసి గంధర్వగోపిత-మైన ద్రోణ, శైలమును బువ్వువోలె హ-స్తమునఁ దాల్చి.
ఉ॥ వడిగావచ్చియు జాంబవంతుకడ ని-ల్వన్ బర్వతం బాతఁడున్
దోడితెండయ్య సుషేణునన్న నతనిం - దోడ్తెచ్చె సామీరి యే
ర్పడఁ దద్వల్లికలన్ సుషేణుఁడును సా - రం బొప్పగాఁ దీసి య
య్యెడ జీవింపఁగఁ జేసె నల్లకపులన్ - హృష్టాత్ములై రందఱున్. ౧౩౫౬
క॥ రణరంగమునందు విభీ, షణుఁడున్ మృతినంది పడిన - క్షణదాచరులన్
దృణములబలె రాముని ప్రే, రణమున సంద్రమునఁ బడఁగ - రయముగ నీడ్చెన్
తే॥ అల కుబేరప్రదత్త ది-వ్యాంజనమున, సమరమునడాగు శత్రుల-సరణిగాంచు
నేర్పునందిరి రామాను-లోర్పుమీఱ, స్వస్థలినిఁ జేర్చె ద్రోణాద్రి-శ్వసనసుతుఁడు.
సీ॥ అపుడు రావణుఁడు న-త్యాత చింతాక్రోధ, ఘూర్ణిత స్వాంతుఁడై-ఘోరరూపు
లగు ప్రహస్త దరీము-ఖాతినాద నికుంభ, దేవాంతక నరాంత-కావృతముగఁ
దన్మహానాద దోర్దర్పయుక్సారణ, దేవశత్రుల మహా-ధీరపసుతుల
వీరాగ్రణుల మంత్రి-వికుల యుద్ధార్థమై. ప్రేరేచి పనుపఁగా-వారు కెరలి
తే॥ వానరావళిఁ దాఁకంగ-బవరమంచు, నంగదాదులు పోరిబోరి యసురవరుల
నెదిరి పోరాడి క్షణములో-నీల్గఁజేసి, సింహనాదంబు లొనరించి-చెలఁగి రంత.
తే॥ కుంభకర్ణజ కుంభని-కుంభులిర్వు, రార్చి పేర్చుచుఁ గపులతో-నని యొనర్ప
జాంబవంతుఁడు కుంభునిఁ-జంపివైచె, నంగదుండు నికుంభుని-యసువులూడ్చె.

—♦ లక్ష్మణుఁ డతికాయుని సంహరించుట ♦—

శా॥ ఆ వార్తన్ విని రావణుండు నతికా - యాభిఖ్యునిన్ బుత్త్రునిన్
బ్రావీణ్యంబుగ సంగరంబు సలుపన్ - బంపించె నాతండునున్
వేవే లక్ష్మణుఁ దాఁకి బాణవితతిన్ - వేయన్ సుమిత్రాసుతుం
డావేశంబున వాని శీర్షమును దు - న్మాడెన్ శితాస్త్రంబుచేన్. ౧౩౬౧

క॥ ఆ శరమునఁ ద్రుటితంబగు, నాశరు నతికాయుశీర్ష - మాలంకాపూ
ర్దేశంబునఁ బడినంగని. యాశరపతి పంక్తివదనుఁ - డాగ్రహవశుఁడై. ౧౩౬౨

— రావణుఁడు వైచిన శక్తిచే లక్ష్మణుఁడు మూర్ఛిల్లుట —

మ॥ హితబంధ్వాది పురీజనాంచితముగా - నేతేరి నానాయుధ
ప్రతతుల్ తేజరిలన్ శతాంగముపయిన్ - బ్రాగల్భ్యమేపార సం
స్థితుఁడై వచ్చి రణస్థలిన్ నిలిచి శ - క్తిం దాల్చి వైళంబ దు
ర్మతిమీఱంగ విభీషణున్ హతమొన - ర్పన్ వైచెఁ దచ్ఛక్తినిన్. ౧౩౬౩
తే॥ ఆ విభీషణునకును స-హాయుఁడగుచు, ముందు సనుదెంచు లక్ష్మణ-మూర్తి కపుడు
రావణుఁడు వైచినట్టి దు-ర్దాంతశక్తి, యురమునను దూఱె లక్ష్మణుఁ-డొల్లఁబోయె.
క॥ అది యదనని రావణుఁడును, మదిఁగని లక్ష్మణునిఁ గొనఁగ-మదమునఁ జనఁగన్
బదపడి హనుమయు రావణుఁ, బదములతో మోది ముక్కు-పగులఁగ గ్రుద్దెన్.
ఉ॥ ముక్కున నెత్తురుల్ గురియ - మూల్గుచు నేలకుఁ బడ్డ రావణున్
ధిక్కరణం బొనర్చి కపి - ధీరుఁడు వాయుసుతుండు లక్ష్మణున్
మక్కువమీఱ నెత్తుకొని - మానసమెంతయుఁ గుందుచుండఁగా
నక్కపివాహినీసముద - యాంతరమందునఁ జేర్చెఁ జెచ్చెరన్. ౧౩౬౬
క॥ ఆలో దశకంధరుఁడును, హేలాగతి రథము నెక్కి - యెక్కిడి ధనువున్
గాలికొమారుని తనువునఁ, జాలఁగఁ గురియించె బాణ - జాలము కడిమిన్.
చ॥ అదిగని రామచంద్రుఁడు రు - షారుణలోచనవక్త్రుఁడై పదిం
బది శరముల్ ధనుస్సున న - వారితరీతినిఁ గూర్చి వైచి దు
ర్మదదశకంఠుస్యందనము - రథ్యములున్ మఱి సూతుఁడున్ ధ్వజం
బదవదగాఁగఁగూల్చి హృద - యంబుఁ బగిల్చి యదల్చి క్రొన్ననన్. ౧౩౬౮
తే॥ అర్ధచంద్రశరంబున - నతనిదైన
బొమిడికంబును బడఁగొట్టి - యమలమైన
ఛత్త్రము పతాకయును ద్రుంచి - సాయకముల
మిగుల వ్యాకులుఁడగు సోఁకు - మేటిఁ గాంచి. ౧౩౬౯
క॥ ఓరీ! యలతం గొనితివి, బీరము చెడె నీకుఁ బొమ్ము - వేగమ లంకన్
జేరుము స్వస్థత పొందుము, ధీగతమై ఱేపు రణవి - ధిం గన రమ్మా!. ౧౩౭౦
క॥ అని పలికిన లజ్జాభర, వినమితముఖుఁడగుచు దనుజ - విభుఁడైన దశా
ననుఁ డప్పుడు సభటుండై, వెనుదిరిగి గృహంబు సేరె - వేఁగుచు నెడఁదన్.
తే॥ రాముఁడును మూర్ఛనందిన - లక్ష్మణునిని
గాంచి పవనజుఁగని యెంత - కష్టమొదవె?

హనుమ! జవమున నేగి ద్రో - ణాద్రి దెమ్మ!
యనుజుఁ డిటులయ్యె నని దుఃఖ - మంది పలికె. ౧౩౭౨

— హనుమంతుఁడు కాలనేమినిఁ జంపి ద్రోణాద్రిఁ దెచ్చి లక్ష్మణుని బ్రతికించుట —

ఉ॥ వల్లెయటంచు మారుతి న - భఃపథముం గొని యేగ నంతఁ జిం
తిల్లెడు రావణుండు కపి - ధీరు ప్రయాణ మెఱింగి మాయసం
ధిల్లఁగఁ గాలనేమియను - దృప్తుని విఘ్న మొనర్పఁ బంచె నా
కల్లరి మౌనివోలె వలి - గట్టుకడన్ వసియించె వంచనన్. ౧౩౭౩

క॥ ఆమాయామున్యాశ్రమ, మామెయిఁ గని త్రోవ వరుగు - హనుమయు డప్పిన్
దా మంచినీరు గ్రోలఁగ, నామునిడగ్గఱకుఁ జేరి - యడిగెన్ జలమున్. ౧౩౭౪

చ॥ అపుడతఁ డున్ గమండలువు - నందలి నీర మొసంగఁ బూనఁగాఁ
గపివరుఁ డివ్వి చాలవనెఁ - గావున నొక్క జలాశయంబు మా
నిపసమహాపరాత్మసుఁడు - నేర్పునఁ జూపి కపీంద్ర! నీరమున్
సుపిహిత లోచనుండవయి - సొంపుగఁ ద్రావుము రమ్మ వెండియున్. ౧౩౭౫

తే॥ లక్ష్మణునిఁ గూర్చి మది భీతి - లంగవలదు
నీవు చను కార్య మెఱిఁగితి - నీకు మంత్ర
మిచట నుపదేశ మొనరింతు - నిమ్ము మరల
నాకు గురుదక్షిణ యటంచు - నీకఁ బలికె. ౧౩౭౬

వ॥ పవనసూతియు మునిచూపిన సరస్సునకుం జని కనులు మూసికొని జలంబులం గ్రోలుచుండిన. ౧౩౭౭

క॥ నక్రము తత్సరసిని ని, ర్వక్రముగా వాయుసుతునిఁ - బట్టెఁ దదీయో
పక్రమ మెఱిఁగి యతండును, విక్రమమునఁ జీల్చివైచె - వేగమ దానిన్. ౧౩౭౮

ఉ॥ ఆతనిచేతఁ జీల్పఁబడి - యద్దియు భామిని రూపమొంది సం
ప్రీతిగ మారుతిం గని వి - వేక నిధాన! మదీయ శాప మీ
రీతిఁ జనెన్ భవంబును ద - రించితిఁ బూర్వము ధాన్యమాలియన్
నాతిని దేవవేశ్యను గ - నన్ మునినాథుఁ డొకండు కామియై. ౧౩౭౯

తే॥ రతికి నన్ను బలాత్కార - గతినిఁ బిలువ
నతని నేఁ జేరనైతి ము - న్యగ్రణియును
నక్రముగ నుండ శాపంబు - నాకొసంగి
నాకు మొఱవిని యిటు - మోక్షణంబు దెలిపె. ౧౩౮౦

వ॥ నేనును నింక దివంబున కరిగెద ముందు నీ విచటఁ గనిన మునివంచనాకరుఁడగు కాల
నేమియగు నతండు రావణప్రేరితుండై నిన్ను వంచింప నరుదెంచియున్నవాఁడు మెలఁ

కుపతో వానినిఁ గడతేర్చి నీకార్యంబు సక్కఁబఱిచికొనుమని వచించి గగనమార్గం
బునఁ జనియెనంత. ౧౩౮౧
క॥ రాక్షసకృత్యంబును విని, రూక్షేక్షణుఁడగుచుఁ గపివ - రుండు మునిన్ దా
నాక్షణము చేరి యిదె గురు, దక్షిణయని వానిగ్రుద్ది - ధం ధమ్మనుచున్. ౧౩౮౩
తే॥ కాలనేమియుఁ గపిముష్టి ఘాతములకు, సుక్కి భువిఁబడి యసువులు-గ్రక్కిచచ్చె
హనుమయును బాలవెల్లికి నరిగియచట, ఘనుల గంధర్వులను గెల్చి-కడఁకమీఱ.
తే॥ హస్తతలమున వేగ ద్రో - ణాద్రి దాల్చి
మరలి వచ్చుచునుండ న - మ్మార్గమధ్య
మందు భరతుండు దివివచ్చు - హనుమఁగాంచి
రక్కసుండని యెంచి యా - రాత్రివేళ. ౧౩౮౪
మ॥ శరసంధానమొనర్చి చాపమునఁ ద - చ్ఛైలంబిలన్ గూల ను
ద్ధురతన్ గొట్టఁ దదీయచిత్రమున రాం - తో యబ్బురం బౌనుచున్
ధరకున్ డిగ్గి సమీరసూతి భరతున్ - ధర్మాత్ము నీక్షించి భ
క్తిరతుండై రఘురాముఁ డీతఁడను భ్రాం - తిన్ మెల్లఁగా నిట్లనెన్. ౧౩౮౫
తే॥ దేవ! శ్రీరామ! తత్పూర్వ-దేవనాథు, రావణునిఁ ద్రుంచి జానకీ రమణిఁ గూడి
లక్ష్మణునిఁ దేర్చి యింతలో-లక్షణముగ, నీపురంబును జేరితే?-నిర్మలాత్మ!.
చ॥ అనవుడు మోసపుచ్చుటకు - నై యిటు దైత్యుఁడె కోతి రూపమం
దేను వచియించె రామకథ - నిక్కమటంచును నమ్మరాదు వీ
నిని వధియింతునంచు మది - నిన్ భరతుండు తలంచి చాపమం
దున శరమొండు పూన్చినఁ గ - నుంగొని మారుతి ధైర్యచిత్తుఁడై. ౧౩౮౬
తే॥ ఇతఁడు రాముఁడు కాఁడని-యెంచిమించి, నేను రామునిదూతను-నిశ్చయముగఁ
జాపమును గీపమును లెక్క-సల్పనయ్య!, నాబలముఁ జూపెదను నీక-నంగనపుడు.
వ॥ భరతుండు నీవెట్లు రామదూతవైతివని ప్రశ్నింప హనుమయు సవిస్తరంబుగా
రామవృత్తాంతంబునెల్ల విన్పించె నంత ననంతసంతోషభరితాంతఃకరణుండై కైకేయి
సుతుండు సంధించియుండిన బాణంబువలన ద్రోణాద్రిని మరల హనుమంతుని
హస్తంబున నునిచి త్వరితంబుగా నతని వీడ్కొలిపిన నాతఁడును గగనవర్త్మంబునం
జని రామసన్నిధిని ద్రోణాచలంబు పెట్టెన. ౧౩౮౭
తే॥ తారసుషేణుఁడు జాంబవం - తుఁడును శిఖరి
లతలచే లక్ష్మణునిఁ బ్రాణ - యుతునిఁ జేసి
పడిన కపులను బ్రదికింప - భవ్యగుణుఁడు
రామచంద్రుఁడు ముదవారి - రాశిఁదేలె. ౧౩౯౦
వ॥ లక్ష్మణునిఁ దనయుత్సంగంబుఁ జేర్చి బుజ్జగించిన నెల్లకపులును విభీషణుండును నుల్లాసం

బుమై రామలక్ష్మణులకు మ్రొక్కిరి తదనంతరంబున హనుమంతుండు రామునితో భరతవృత్తాంతంబుదెలిపి యతనివలన ననుజ్ఞఁగొని ద్రోణాద్రిని గైకొని వెడలి దానిని యథాస్థానమున సంస్థాపించి మరలివచ్చునప్పుడు భరతునింగని లక్ష్మణుఁడు జీవించుటయెఱింగించి యాకాశగామియై రామసన్నిధానంబు సేరె నయ్యెడ.

క॥ రామునకు సాయమొనరుపఁ, గా మదిఁజింతించి సుగుణ - గణ్యుఁడు భరతుం
డామెయి సాకేతంబున, భూమీశులనెల్లఁ జేర్చు - పూనికనుండెన్. ౧౩౯౩

—♦ ఐరావణ మైరావణులు రామలక్ష్మణుల నపహరించుట ♦—

తే॥ లంకయందున రావణుఁ-డంకిలిగొని, దూతలనుబిల్చి మీరలు-త్వరగనరిగి
యస్మదాప్తులఁ బాతాళ-మందుఁ బ్రీతిఁ, గ్రాలు నైరావణునిని మైరావణునిని.

క॥ కనుగొని మనకిట శ్రీరా, మునితో నయినట్టి బాధ - పూర్ణంబుగ వే
వినిపించి వారలకు నా, కనువుగఁ దోడ్పడఁగఁ దెల్పుఁ - డని పంపించెన్.

శా॥ పాతాళంబునకేగి వారలును శుం - భద్గర్వులన్ దైత్యసం
ఘాతస్తుత్యులఁబం క్తికంఠసఖులన్ - గన్గొంచు ముమ్మాఱుగా
జోతల్ సల్పియు రావణానుమతియా - చొప్పున్ వెసం దెల్పఁద
న్నేతల్ విహ్వలమంది లంకకపుడే - నేర్పొప్ప నేతెంచియున్. ౧౩౯౪

క॥ రామాదులు వసియించిన, భూమికిఁజని రాత్రియాటఁ - బొందికగా శ్రీ
రాముని లక్ష్మణునింగొని, తా మరుగఁగఁ దలఁచి కీశ - తతినిద్రింపన్. ౧౩౯౬

క॥ సమరశ్రమమున రాముఁడు, సుమిత్రిసుతుఁడల్లె యచట - సొంపగు శిలపై
నమరఁగ నిద్రింపఁగ వా, లమె ప్రహారిగ వారిఁ గాచు - లక్షణయుతునిన్.

క॥ హనుమంతునిఁ గని యతఁడును, గనుమూసిన సమయమెఱిఁగి - గగనోడ్డీనం
బున నెల్లనలోనికిఁజని, ఘనురాముని లక్ష్మణునిని - గ్రావయుతముగాన్.

క॥ క్రూరతమై గొని తమదా, నేరుపుమీఱంగ యామి - నీచరవరులా
నైరావణ మైరావణు, లారయఁ బాతాళమునకు - నరిగిరి వడిగాన్. ౧౩౯౯

వ॥ హనుమానుండును దటాలునఁ గనులుదెఱచి మైమఱచితినని శంకించి కపిసేనా మధ్యమున రామలక్ష్మణులనుగానక చింతించి యొరులయడుగులజాడ నెఱింగి తత్తఱింపడుచు నాజాడవెంబడిపోవుచుండ లంకాదక్షిణదిగ్భాగముననుండెడు ని కుంభిలయందు గుర్విణియైన కపోతి తనపతినిం గని నాథ! మనుజమాంసముపై నా కాశ వొడముచున్నది తెచ్చిపెట్టుమనియడిగె మగపక్షియు భార్యతోఁ బ్రియా! యిప్పుడే నిద్రితులగు రామలక్ష్మణులను గ్రహించి దైత్యులిరువురు పాతాళమున కరిగిరి వారామానవుల నచట దేవతయెదుట వధింతురు కనుక నప్పైన నీకోర్కిని దీర్తునని చెప్పెనంత హనుమంతుఁ డాకపోతముల మాటలనువిని దమత నిమ్మళించు

కొని త్వరితగమనంబుననరిగి పాతాళంబుసేరి తద్ద్వారమున మకరధ్వజుఁడను వానినిం గనియె నతండును హనుమను లోనికిఁ జొరనీక నిరోధించి యిట్లనియె. ౧౪౦౦

క॥ ఎవ్వఁడవు నీవు? మఱియిట, కెవ్విధి నేతెంచినాఁడ - వెవ్వరికొఱకై?
కొవ్వున ననుమతిలేకయె, చివ్వున లోపలికిఁ జనెదె? - చెప్పుమటన్నన్. ౧౪౦౧

తే॥ వాతసూతియు నేరామ - దూతనామ
లంకనుండియు మారామ - లక్ష్మణులను
నిద్రితులను నరాములు - క్షుద్రబుద్ధి
నిటకుఁ దెచ్చిరి వారని - నిందురోయ. ౧౪౦౨

తే॥ నేనుసరుదెంచినాఁడఁ బు - న్నెంబు కలుగు
నీకుఁ దెలిసినఁ దెల్పుము - నిర్మలముగ
రామలక్ష్మణ విషయంబు - క్రమతననియె
నంమలకు వెండి మకరధ్వ - జాహ్వయుండు. ౧౪౦౩

వ॥ అయ్యా! నీవు రామదూతవైనచో మాతండ్రి హనుమంతుండు సుఖియే? యని యడిగె నద్దానికి నబ్బురంబుపడి మారుతియు మకరధ్వజునితో హనుమానునకు భార్యయే లేదుకదా? నీకతఁడు తండ్రియగుటయెట్లని ప్రశ్నించిన నతండిట్లని వచించె. ౧౪౦౪

ఉ॥ లంకనుగాల్చి మారుతి చ - లంబటి వార్ధిజలంబునందుఁ దాఁ
బొంకముమీఱఁ జల్లవడఁ - బుచ్ఛమునందలి యగ్నినార్చి ని
శ్శంకగఘూమయుక్తముమ - సారసమంబగు శ్లేష్మముఁ విడన్
బింకముగల్గు నక్రిమది - వేగముమ్రింగెను నేను బుట్టితిన్. ౧౪౦౫

క॥ అనవుడు నమ్మకమునుగొని, హనుమంతుఁడు నేనయనుచు-హనుమయుఁ బలికెన్
మునుకొని మకరధ్వజుఁడును, వినతుల నొనరించి మించి-వివరించె నిటుల్. ౧౪౦౬

శా॥ తండ్రీ! రాముని లక్ష్మణున్ దనుజులు - ద్యత్ప్రీతిఁ గామాక్షికిన్
దీండ్రం బౌ కరవాలఘాతమున నెం - తే ఱెపె యర్పింపఁగా
గండ్రింపన్ దొరకొన్నవారు గుడియే - గమ్యంబు మీకిప్డు మీ
మండ్రాటంబటు దైత్యులన్ దునిమి రా - మస్వామి నీక్షింపుఁడీ. ౧౪౦౭

—♦ ఐరావణ మైరావణ సంహారము ♦—

మ॥ అనినన్ వేగనణుస్వరూపుఁడయి యా - హన్మంతుఁడున్ దేవళం
బునకుం బోయి సయుక్తిచిత్తుఁడయి త - ల్పుల్ మూసి లోనుండె నం
తనె మైరావణుఁ డాదియౌదనుజు లు - త్సాహంబుతో రామచం
ద్రుని సౌమిత్రినిఁ దెచ్చి ద్వారముకడన్ - ద్రోహాత్ములై నిల్చినన్. ౧౪౦౮

చ॥ అదిగమనించి దేవినుతు - లట్లు సదాగతిసూనుఁడమ్మహా
మనులు వినంగ నోదనుజ - మండనులార! గవాక్షమందె ని
య్యదనునఁ దెచ్చిపెట్టి సుఫ - లాదులు నన్నసులున్ సుమంబులున్
ముదమునవైచి రాఘవుల - నున్ సుమమాలలనించి చెచ్చెరన్. ౧౪౦౯

తే॥ వారి తూణీరములు ధను-ర్వరములొసఁగి, వారలకు దివ్యఫలము లిం-పారఁబెట్టి
మెల్లగా లోనికన్పుఁడు-మిూకునిపుడె, మేలొసర్చెద నిజముని-లీలఁబలికె. ౧౪౧౦

తే॥ దేవికరుణించెనని పూర్వ-దేవులపుడె, రామలక్ష్మణులకును హా-రములువైచి
ఫలములను బెట్టి విల్లున-మ్ములు నొసంగి, పురమునందలి తినుబాడములను దెచ్చి.

తే॥ అల గవాక్షమునుండి దే-వళములోని, కమితముగవైచి శ్రీరామ-లక్ష్మణులు పోయఁ
గడుపునిండఁగఁ దిని త్రావి-గాడ్పుపట్టి, గబ్బుమని తేంచి రామల-క్ష్మణులఁగొరె.

క॥ ఐరావణ మైరావణు, లారీతిగ రామలక్ష్మ - ణాఢ్యుల వేవే
ద్వారమునుండియు లోనికిఁ, గోరిక మిూఱంగఁ ద్రోసి - కో యనిరంతన్. ౧౪౧౩

క॥ గుడిలో మారుతి మోదం, బడరన్ రఘువరులఁ గాంచి - యవనతుఁడై యా
వెడఁగులఁ దనుముదమిఁక నని, తడయక వెలుపలికివచ్చె - దరదధ్వనితోన్.

ఉ॥ రాముఁడు లక్ష్మణుండు మది - రంజిల మారుతి కార్యమెంచి యు
ద్దామగతిన్ బయల్పడి ప - దంపడి శార్ఙ్గము లెక్కువెట్టి సం
గ్రామవిధిన్ నరాదులను - గాండములన్ బడఁగొట్టఁ బూనిరా
భీమపరాక్రమంబునకు - భీతిలి విస్మయమంది రెల్లరున్. ౧౪౧౫

మ॥ ఘన బాణంబుల తాఁకునన్ గనలి ర - క్షస్స్వామి వైరావణుం
డును మైరావణుఁడా రఘూత్తములఁ గ - న్గొంచాయుధంబుల్ జవం
బొనరందాల్చి రణంబొనర్చి రపుడ - య్యుర్వీశవర్యుల్ ఘనా
ఘనధారాసమశస్త్రవర్షమున ర - క్షస్సంఘముం గూల్చుచున్. ౧౪౧౬

క॥ ఐరావణ మైరావణు, లారాటమునొంది చచ్చె - నట్లుగ బలిమిన్
వారి శిరంబులఁ దునిమిన, ఘోరాసుర శీర్షయుగము - గొబ్బున నేలచెన్.

తే॥ రామలక్ష్మణులా దైత్య-రాజయుగ్మ, శీర్షముల నూఱుమాఱులు-చెండుచున్న
వారి శిరములు మరల ను-ద్భవములగుచు, నుండె నంతటనవ్వాయు-జుండు వెడలి.

వ॥ పురంబునందిమ్మటి రహస్యంబుగా నొక్కచో నైరావణభోగపత్నినింగని యా
మెకు నైరావణమైరావణులపై వైరబుద్ధియుండుట యెఱింగి యామెతో వారిమర
ణవిధానంబు దెలియఁజేయుమని యడిగెనంత. ౧౪౧౯

ఉ॥ సూడున సోఁకుటాఁగయు వ - చోగరిమం బెసలార సత్కపీ!
పోడిమి దైత్యులిద్దఱును - భోగరతిన్ నను నాగకన్యకన్

నీఘననుండి తెచ్చి యిట - వెంపరలాడఁగఁ జేసినార లా
పాడి తొలంగుదానవులు - పాడయిరక్కట నేఁడు మేలు నాకగుక్. ౧౪౨౦

వ॥ మఱియును నేనా మైరావణమైరావణుల మరణోపాయంబు నెఱింగించుటకు శ్రీరామచంద్రుండు నన్ను భార్యగా గ్రహించునట్లొనర్పవలయుననినఁ బవనజుఁడా మెనుంగని కాంతా! రామభారంబునకు నీ మంచకంబు భిన్నంబుగాకనిల్చెనేని తప్పక నిన్నతఁడొప్పుకొనఁ జేసెదనని బదులు సెప్పినప్పుడు. ౧౪౨౧

ఉ॥ ఆవనజాతనేత్రిప్రియ - మారఁగఁదెల్పఁ దొడంగ ముందు భృం
గావళిఁబట్టి కంటకము - లచ్చుగఁజెక్కియు బాలురాడఁగా
నావిధిఁగాంచి భృంగముల - కల్లన బాధతొలంచిరీ యన
ద్భావులుదానఁ దుమ్మెదలు - దైత్యులఁగాంచి వచించెనిట్టులక్. ౧౪౨౨

క॥ మాప్రాణములను నిల్పితి, రీ ప్రాపునఁగనుక మేము - నీతయుశోర్ధక్
మీ ప్రాణములకు నెప్పుడు, నప్రళయము గాఁగఁబ్రోతు - మని పడకింటక్.

క॥ నెలకొని యమృతరసంబును, బొలుపుగఁగొని తెచ్చి దైత్య - పుంగవులమొదల్
పలుమాఱును స్పృశియించును, బలలాదులు దానివలన న - బ్రతికెద రరయక్.

క॥ నీవాభృంగ ప్రతతినిఁ, జావంగాఁ జేయుమపుడ - చత్తురుదైత్యుల్
పావనిః యనఁగా నతఁడును, వేవేచని భృంగములను - వెదకొచుఁ జంపెక్.

క॥ అజిరజు నొకపుష్పంధయ, మజిహ్మముగ వేఁడెదాని - నతఁడునువిడి పం
కజనేత్రి మంచకంబును, గజభుక్తకపిత్థరీతి - గాఁజలుపు మనెక్. ౧౪౨౬

క॥ అదియటులు సల్పెఁ బిమ్మట, మదయుతు నైరావణునిని - మైరావణునిక్
గొదకొని రాముఁడుచంపెను, బదవికి మకరధ్వజాఖ్యుఁ - బ్రభువుగఁ జేసెక్.

—♦ నాగకాంతకు శ్రీరాముఁడు వరమునిచ్చుట ♦—

చ॥ హనుమయు సంతసిల్లి సుగు - ణాభరణుక్ రఘురాముఁగాంచి మె
ల్లన మును నాగకాంతకుఁ ద - లంపును దీర్చెదనన్నవృత్తముక్
వినిచిన రాముఁడచ్చటికి - వేచని నవ్వుచు మంచమందుఁ జే
తిని నటుమోఁప నద్దియును - దెప్పున తప్పనిసూలె నేలకుక్. ౧౪౨౮

ఉ॥ అప్పుడు రామచంద్రుఁడు ద - యాహృదయంబున నాగకన్యకక్
దప్పకకాంచి నీవువసు - ధక్ మఱుజన్మమునందు భక్తిమై
మెప్పగు విప్రపుత్రివయి - మేటి తపంబొనరించి యాలనీ
చొప్పునద్వాపరంబున సు - శోభితవైననుబొందుమాలివై. ౧౪౨౯

వ॥ అనివచియించెనంత నాగకాంతయు సంతసించి యగ్నిప్రవేశంబొనర్చె నామెయుఁ బిమ్మట సముద్రతీరమున నొకవిప్రునకుఁ బుత్రికయై పుట్టి కన్యాకుమారి నా

మాంబునందె మఱియు నిక్కడ. ౧౪౩౦
తే॥ రాముఁడును బ్రీతిమెయి గుణ-ధాముఁడైన, యాంజనేయునిభుజముపై-కలర నెక్కె
లక్ష్మణుఁడు చెల్మిపై శుభ-లక్ష్మణునిని, ఘనుని మకరధ్వజుని నెక్కె-కాంతిమీఱె.
క॥ తదనంతరమున వారలు, గొదకొని యాలంక యెడకు - గొబ్బునఁ జనిర
భ్యుదయంబుగ రవిజాములు, ముదమున రామునకు మ్రొక్కి - మురిసిరి మిగులన్.
క॥ శ్రీరామమూర్తి మనమున, గారాబము మీఱఁగా వి - కర్తసుతుతో
నైరావణ మైరావణ, దౌరాత్మ్యము విషయమెల్లఁ - దద్దయుఁ జెప్పెన్. ౧౪౩౩

—♦ రావణుఁడు శ్రీరామునిచేఁ దనచావును నిశ్చయించి చెప్పుట ♦—

మ॥ సభలోనుండిన పంక్తికంఠుఁడును వి - శ్వాసస్థులిట్లేమటన్
సభయుండై విని పూర్వవృత్తమును ర - క్షఃపాళితోఁ దెల్పి కం
జభవుం డెట్లువచించె నట్లజరగెన్ - సాక్షాద్రమానాథుఁడే
కుభృదాధ్యుండయి రామనామమున నా - కున్ హంతకుండయ్యెఁగా?. ౧౪౩౪
తే॥ మఱియు ననరణ్యదీక్షితు మరణమందఁ, జేసితిని నేను గనుక నా-క్షితిధవుండు
నామువంశంబున నె రమా-నాథుఁడుదయు, మొందినినుజంపునని శాప-మొసఁగెనాకు
క॥ శాపానుభవము సమయం - బీ పగిదిన్ వచ్చె రాముఁ - డీల్గించుననున్
శ్రీపతి నరమాత్రుఁడె? వి-రోపికతోఁ గుంభకర్ణు - నొయ్యనఁ బిలుఁడీ!
క॥ అని వచియింపఁగ రావణు, ననుమతిఁ దత్కుంభకర్ణు - నాహ్వానింపన్
దనుజులు వడివడిగాఁ జని, ఘననిద్రాస్థితుని నతనిఁ - గని లేపుటకై ౧౪౩౭.

—♦ కుంభకర్ణుఁడు నిద్రలేచి యుద్ధమునకు వచ్చుట. ♦—

సీ॥ ఆ శ్వాసమునకె యా - తాయాతగతి నొంది, దిట్ట తనంబుతోఁ - దుట్టతుదకు
బాహు పాశములచే - బంధించి కదలించి, కాళ్లతో రాళ్లతోఁ - దాళ్లతోడ
ఫెళ్లు ఫెళ్లనఁ గొట్టి - వెల్లికల్లెములతో - గుఱ్ఱములను బట్టి - కొనుచువచ్చి
యుష్ట్ర సమూహంబు - నొయ్యన రాఁజేసి, వాటితోఁ ద్రొక్కించి - గాటముగను
తే॥ గట్టెలను జెట్టులను దెచ్చి-పొట్టమీఁద - మోది యగ్గిసి వైచుచు - వేదనఁగొనఁ
జేసి పెక్కులు యుక్తులు చేసినంతఁ - గుంభకర్ణుఁడు మేల్కాంచి - జృంభణముగ.
క॥ సూకరములు మహిషంబుల, నేకంబులు వడిగఁ దిని జ- లేచ్ఛను జని వా
పీ కూపంబులఁ బీల్చి స, దాకూతముతోడ రావ - ణాసురుఁజేరెన్. ౧౪౩౯
తే॥గీ॥ చేరి యన్నకు మ్రొక్కి. వి - శేష కార్య
మేమి? యని రామవిషయంబు - నెఱిఁగి మరల
రావణునిఁగాంచి వినయంబు - రాజిలంగఁ
బలికె నిట్టులు గంభీర - భాషణముల. ౧౪౪౦

శా॥ అన్నా! మున్నొకసారి కాననమునం - దా నారదర్షిన్ బ్రియం
బెన్నన్ గాంచితి నెంనునుండి యిట కి - ట్లేతెంచి యెచ్చోటికిన్
గ్రన్నన్ బోయెదరంచు నడ్గితి ననున్ - గన్గొంచుఁ దన్మౌనియున్
విన్నాణంబుగ స్వర్గమున్ వదలి పృ - థ్విం జేరఁగాఁబోయెదన్. ౧౪౪౧
తే॥గీ॥ అచట సాకేతపురిని మ - హా త్ర్యవతారుఁ, డయ్యె వైకుంఠుఁడాతని-నరసి వేగ
రావణాది దురాత్ముల మ్రిందఁజేయ, వెడలుమా! యని బోధింప-వెడలుచుంటి.
క॥ ఇది దేవ ప్రార్థనమని, ముదమున సతఁడేగెఁ గనుక - మునుకొని వచ్చెన్
గదనమునకు (శ్రీ)రాముఁడు, మదమేటికి? సీతనొసఁగు - మా! రామునకున్.
చ॥ అనవుడు కోపఘూర్ణిత హృ-దంతరుఁడై దశకంఠుఁడోరి! చ
య్యనఁజని నిద్రితోమ్ముల కుల - మాఱడి పోవఁగ మేలెసేసితి? రా
మునకు మనుష్యమాత్రునకు - మూర్ఖుని రీతి భయంబు నెంచెదే?
యని యనుజన్మఁదిట్టె నరు - ణాయత లోచనుఁడై సభాస్థలిన్. ౧౪౪౪
క॥ తద్బంధు క్రూరోక్తికి, నుద్బోధము మాని యన్న-కొఁగినతులిడియు
ద్యద్బలమునఁ బాదాల, సద్బహిరుర్వికిని దుమికి - సాధ్వసకరుఁడై. ౧౪౪౫
తే॥గీ॥ కుంభకర్ణుఁడు గర్జావి జృంభణంబు
సలిపెఁ గోతులు కలఁగునఁ - బలపలనయి
రామపార్శ్వంబునకుఁ బాఱె - భ్రాంతనుగని
యలవిభీషణుఁడును మ్రొక్కి - యనియె నిట్లు. ౧౪౪౬
తే॥గీ॥ అన్న! దశకంఠునకు నీతు - లెన్నొ? తెలిపి
రామునకు సీత నిమ్మన్నఁ - గార్య మొంది
నన్నునిందించి కడఁద్రోచె - నెన్న నతఁడు
కనుక (శ్రీ)రామ శరణంబు - గనినవాఁడ. ౧౪౪౭
ఉ॥ నావుడు కుంభకర్ణుఁడును - నమ్రునిఁ దమ్మునిఁగాంచి మేలటం
చేవిధినైన నా యెదుట - నిత్తఱి నిల్వకుమయ్య! నీవు రో
సావిలుఁడైన నాకు హితుఁ - డంచహితుండనియున్ స్ఫురింప ది
చ్చా విస్తృతంబుగా రణము - సల్పెదఁ బొమ్మని తెల్పెఁదెల్పినన్. ౧౪౪౮
తే॥ ఆ విభీషణుఁడును రాము - సంకమునకు
నరిగెఁ దత్కుంభకర్ణుండు - నంకమునకుఁ
దొడఁగి బింకంబెలర్పఁ గో - తులను ద్రొక్కి
విసరికొట్టుచు నార్చుచుఁ - బేర్చి మిగుల. ౧౪౪౯
క॥ ఆగ్రహమున వానినిఁ గని, సుగ్రీవుండెదిరి పోరఁ - జుఱుకునఁ దత్పం
క్తిగ్రీవానుజుఁ డొయ్యన, సుగ్రీవునిఁ గ్రుచ్చిపట్టె - శూలము చేతన్. ౧౪౫౦

తే॥ లంక కరుగంగ యత్నింపఁ - గింక నొంది
రవిజుఁడా కుంభకర్ణునిఁ - బ్రిదర సొమ్ము
నఖరములఁ జీల్చి కుందించి - నభముచుండి
భువికిడిగి రాఘవునిఁజేర - మ్రొక్కి నిలిచె. ౧౪౫౧

—♦ శ్రీరాముఁడు కుంభకర్ణునిఁ జంపుట ♦—

తే॥ వెనుదిరిగి పోవు కుంభక - ర్ణుని సరక్త, శోణితాస్యునిఁ గన్గొని - సోఁకు మూక
లెల్లఁ బరిహాసమొనరింప-నుల్లలమునఁ, గనలిరణమున కతఁడు తత్క్షణమువచ్చె.

క॥ వచ్చెడు కుంభశ్రీవుపైఁ బెచ్చుగ శ్రీరామమూర్తి - వేఁడిశరములన్
గుప్పెను శార్ఙ్గకళాపతి, మోచ్చండత శత్రుసైన్య - ముదరి పడంగన్. ౧౪౫౩

మ॥ శర సంవిద్ధ నిజాంగుఁడై దనుజుఁడున్ - సాలాగపాళిన్ బోరిం
బోరి నారాముని పైకి వైవ రఘురా - ముండున్ సమిచ్ఛాతురిన్
దరుశైలావళిఁగూల్చి బాణములతో - దైత్యార్భటింగాంచి తా
సరవాయిం గొనకారివేరమున వా - యవ్యాస్త్ర మేసెన్ వడిన్. ౧౪౫౪

తే॥ అదియు దానవసాయుధ - హస్తములను
దునుమ నతఁడును నార్చి రా - మునిని మ్రింగఁ
బరుగు వాఱెను రాముఁడ - ప్పాట వాని
యడుగులను దుంచె నర్ధచం - ద్రాశుగమున.

క॥ హతకరపదుఁడయ్యును ద, ద్దితిజుఁడు బడబాముఖంబు .. దీటున వాయిన్
దతముగఁ దెఱచుచు రామ, క్షితిపతిపై కుఱికె శశిఁది - గియు రాహువనన్.

ఉ॥ రాముఁడు వానినోట శర - రాజములన్ గుమిగాఁగవైచి యు
ద్దామ రవిప్రభాపటల - ధామమునైంద్రశరంబుఁ బూన్చిగ
ర్వామయ పీడితుండయిన - యాతనిగొప్పశిరంబుఁద్రుంచె స
ర్వామరులున్ స్తుతించిరి సు - మావళి నించిరి రామచంద్రుపై. ౧౪౫౭

—♦ ఇంద్రజిత్తు నికుంభిలయందు హోమము సేయుట ♦—

క॥ విజయధ్వానము లెసఁగెను, నిజంబుగఁ బిత్రృవ్యుఁడిట్లు - నీల్గుట విని త
ద్రజనీచరవరుఁడగు నిం, ద్రజిత్తుండును దండ్రికెరఁగి - దర్పోద్ధతుఁడై. ౧౪౫౮

తే॥ త్వర నికుంభిలకేగి యా - వటము యోగి
నీ వటంబును జేరి యా - నేల వెలయు
గుహారహస్యముగాఁ దూఱి - కుమురు పాటు
గాఁగఁ గూర్చొని చుట్టు దు - ర్గమములైన. ౧౪౫౯

క॥ తోయానిలానల వ్యా, ఘ్రాయత సర్వాసుర ప్ర - హత కంటకవా
రాయత్త ప్రాకారము, లా యేడును నిల్పికొని ని - యామము తనరన్. ౧౪౬౦
తే॥ రక్త మాల్యాంబరములు ధా - రణ మొనర్చి
రక్తచందన పుష్ప సం - యుక్తుఁడగుచు
దివ్యరథశస్త్ర జయలాభ - దృష్టిమీఱ
హవన మొనరింప యత్నించి - యచట మఱియు. ౧౪౬౧
సీ॥ హోమకుండమునకు నూర్ధ్వమునను గృష్ణ, భోగిని దలకింపు-గాఁగఁగట్టి
రక్తపుష్పాక్షతల్-రక్త గుంజాతతుల్, సర్షపముల్ రక్త-చందనంబు
నిక్షువుల్ ఖదిరముల్-కృష్ణధుత్తూరముల్, నింబభల్లాత కౌ-దుంబరములు
నర్కపలాశంబు-లయ్యపామార్గముల్, బదరికలామ్రముల్-బంధుకములు
తే॥ బీజపూరంబు లెమ్ములు - వివిధ సమిధ
లల విభీతక ఫలములుఁ - బలలములును
మర్త్యముండము లెల్ల లో - మములు స్నాయు
వులుఁ బృదాకులు మండూక - ములును జేర్చి. ౧౪౬౨
క॥ నానాత్వగ్గంతంబు ల, నూనంబుగఁగూర్చియున్ మ - నువులన్ విధిగా
మానుగఁ బఠియించుచు శ్రీ, ధ్ధానయితాఖిలము వేల్చు - చశుభము మూసెన్.
తే॥ ఒగి విభీషణుఁడా ఘోర - హోమధూమ
మభ్రపథమునఁగాంచి కా - ర్యంబు తెలిసి
రామునింగని దేవ! యిం - ద్రజి కడంగి
హవన మొనరించుచున్నాఁడ - హంకృతుఁడయి. ౧౪౬౪
క॥ ఆహోమము తుదిదనుకదు, రీహాత్ముఁడు సలిపెనేని - యెవరికిని సమి
ద్ద్రోహలుఁ డజేయుఁడగు నతఁ, డూహింపుము తడవుసేయు - టొప్పదురామా!.
ఉ॥ ద్వాదశవత్సరంబులు స - భక్తిహృదిన్ మని నిద్రమాని యా
మోదన సౌఖ్యమున్ వదలి - యుండెడివాఁడు వధించు నింద్రజిన్
లేద యజయ్యుఁడౌతఁడని - లీలవచించెను ముందు బ్రహ్మ; సీ
తాదయితా! సుమిత్రిసుతు - ధర్మమటుల్ నెఱవేఱఁగావునన్. ౧౪౬౬
క॥ అతఁడును నేనునుజనిదు, ర్మతియగు నమ్మేఘనాదు - మడియింతుము స
మ్మతి నొసఁగుమన్న రాముఁడు, హితమతి శుభమనుచుఁ బనిచె - నెంతయు వారిన్.

—♦ లక్ష్మణుఁ డింద్రజిత్తును వధించుట ♦—

మ॥ హనుమన్ముఖ్యుల యోధవీరుల మహా - హర్షాత్ములంగూడి చ
య్యన సౌమిత్రియు సవ్విభీషణుఁడు హో - మారంభ ఘోరస్థలిన్

గనిరా లక్ష్మణుఁడంత నంగదభుజా - గ్రింబందుఁగూర్చుండి ముం
డ్లను నాగ్నేయశరాసబూది సలిపెన్ - రక్షస్తతిన్ గూలిచెన్. ౧౪౧౮
తే॥ గారుడాస్త్రంబు నరివోసి భూరిభుజగ, పాళినంతము నొందించె-వ్యాఘ్రములను
బర్వతాస్త్రముచేఁ గొట్టె-వహ్నినట్టి, మీఁజె పర్జన్య శరమున-నాఱఁజేసె.
క॥ హనుమానుఁడు క్షణమాత్రినె, యనిలునిఁదనలోకిఁబిల్చె - నవలసుమిత్రా
తనయుఁడు వాయవ్యాస్త్రం, బును దోయముశోషిలంగ - బోరనవై చెన్.
క॥ వాసిన్ గోటలు గూల్చి దు, రాసదభూవివరమార్గ - మటఁదెలియమివే
వే సావిూరి వటంబును, రోసంబునలాగఁబూనె -రూక్షేక్షణుఁడై. ౧౪౨౧
చ॥ అపుడు వటస్థయోగినిగు - హాముఖమొయ్యనఁ జూప నద్దహా
నుపలముదోసి మారుతియు - నూఁకునలోనికిఁదూఱె యింద్రజి
ద్వపువునుగీఱె వహ్ని యం - థాయథలోనటుసేసి వస్తువుల్
విపులముగా విదిర్చి భయ - పెట్టిన నింద్రజితుండు క్రోధియై. ౧౪౨౨
తే॥ హవన మొనరించుటను మాని - యాయుధములఁ
బూని హనుమను వెనుకొని - ముందునున్న
లక్ష్మణాదులఁ గన్గొని - లావ్రమీఱ
రథము నధిరోహణముసేసి - రణమునఁ దల్పె. ౧౪౨౩
తే॥ రణమునకు భ్రాంతినొందక-రాజసూతి, లక్ష్మణుఁడు దివ్యశార్ఙ్గక-లంబములను
సమరణాగఁ దాల్చినంగరో-త్సాహ మొప్ప. వడిధనుష్టంకృతిని జల్పెఁ-బుడమియుడల.
ఉ॥ రావణి యస్త్రశస్త్రతతు - రాజనగంబులతోడ స్వీయను
ర్భావ మదాతిరేకపరి - భావవచస్సులతోడ లక్ష్మణున్
నోవఁగఁజేసెనంతట న - నూన రుషామతి లక్ష్మణుండు బా
ణావళివైచి దైత్యుని ర - థాశ్వములన్ ధరఁగూల్చి చెచ్చెరన్. ౧౪౨౫
క॥ ధనువును ధ్వజమునుసూతుని, ఘనకవచముఁ జెండివైచె - క్షణమాత్రినఁ ద
ద్దనుజుండన్యధనుస్సును, గొని సాహసిముగ విడిచి - ఘోరశరములన్. ౧౪౨౬
తే॥ నేలమీఁదనె నిలుచుండి-నేర్పుమెఱయ, రాజసుతుని తనుత్రాణ-రాజసపుడు
చీల్పదానికిఁ గనలి యం-జేయుఁడైన, లక్ష్మణుఁడు శార్ఙ్గమందుఁ గ-లంబముదొడిఁ.
తే॥ సశరముగువాని కుడిచేయి - క్షణములోనఁ
దుంచి తద్దేహమునఁబడఁ - దోసికొట్టె
సోఁకుఁడును వామకరముచే - శూలముగొని
లక్ష్మణునిఁజంపివైవఁద - లంచెనంత. ౧౪౨౭

తే॥ అరిభయాకరమైన శా-తాంబకంబు, లక్ష్మణుఁడుపేడి వానిశరా - లంబుతోడ
సవ్యకరముల్ల దశకంఠ-సమ్ముఖమునఁ, బడఁగఁగొట్టైను విహ్వలం-పడఁగ నతఁడు.
ఉ॥ ఇంద్రజి హా స్తశూన్యుఁడయి - యేపు తొఱంగఁగ మట్టు మీఱి ని
స్తంద్రి రుషావశుండయి ప - దంపడి భీషణవక్త్రమొప్పచుఁ
రుంద్రముగాఁగఁదాఁ దెఱచి - రూక్షత లక్ష్మణు మ్రింగఁబోవఁగా
సాంద్ర యశస్కునగ్రజు ల - సన్మతి లక్ష్మణుఁడెంచి మించుచుఁ. ౧౪౫౦
తే॥ రామ నామాంకితంబు వ - రంబు భీక
రంబు తీక్ష్ణశరంబు శా - ర్ఙ్గంబునఁ గ
రంబు సంధించి తాఁడీవ - రంబుమై ను
రంబునఁ శక్రజితుని కూ్రి - రంబు నెఱిగి. ౧౪౫౧
ఉ॥ వానిశిరస్త్రకుండల వి - భాసహితంబగు నుత్తమాంగముఁ
మానకతుంచివైచె నస - మాన ముఖంబును బొందిరాకపుల్
భూనభముల్ ప్రశాంతిఁగొనెఁ - బొంగుచు దేవతలెల్ల రత్తఱిఁ
సూనవితానముఁ గురిసి - స్తోత్రముసేసిరి లక్ష్మణాఖ్యునిఁ. ౧౪౫౨
క॥ దుందుభులుమ్రోసె మఱియు న, రిందముఁడౌ లక్ష్మణుఁడును - బ్రీతిమెయిఁ ది
క్కందరములు మార్మ్రోగ వ, డిందరరావంబు సలిపి - కీవిగసిలి చెఁ. ౧౪౫౩
క॥ ఆజయ శంఖారావము, భూజాతయునాలకించి - ముచుకొని త్రిజటా
రాజీవాక్షినిఁబంపి త, దాజికృతంబెల్లఁదెలిసి - హర్షమునందెఁ. ౧౪౫౪
చ॥ హనుమయు నింద్రజిత్తుతల - నయ్యెడఁగేల ధరించి రామచం
ద్రునకిది చూడఁజేయుదము - తూర్ణముగాఁ బదఁడన్న నంగదుఁ
మనమలరంగనెక్కి కపి - మండలితోడ విభీషణాఖ్యుతో
ఘనుఁడు సుమిత్రసూనుఁడు త - గంజనుదేరెను వాద్య చిహ్నుఁడై. ౧౪౫౫
క॥ వాఁరెల్లరు నవ్విధిఁజని, శ్రీరామునిఁగాంచి మ్రొక్కి - రిపుసుతు శిరముఁ
వారక చూపిన నతఁడును, గూరిమి లక్ష్మణునిఁబొడివి - కౌఁగిటఁ. ౧౪౫౬
వ॥ విభీషణునిని గపులను బ్రియోక్తులనాడి మెచ్చికొనుచు సంతోష తరంగిత స్వాం
తుండై యుండెనంత. ౧౪౫౭

—• రావణుఁడు సీతనుజంప నుద్యుక్తుఁడగుట •—

శా॥ లంకఁబంక్తిముఖుండు పుత్త్రకరముఁ - లక్షించి చింతించుచుఁ
లెంకల్ శక్రజితుండు చచ్చెనని యా - లింపఁ సభఁ దెల్పనా
యంకాపొంకపుమాట కార్తిగని యా - ర్భాకాంతుఁడై కొంతలో
హుంకారించుచులేచి వాలుగొని క్రో - ధోద్రేకుఁడై భీకుఁడై. ౧౪౫౮

తే॥ నాతియాసీత సర్వ వి-నాశమునకు
మూలమైనన్ను దూలించె-గాలిఁబోలెఁ
గనుక వధియింతునామె నీ-క్షణమునంద
యనుచుఁ ద్వరపడి వెడలె దు-రాగ్రహమున. ౧౪౮౯

ఉ॥ అంతసుపార్శ్వనామ సచి-వాగ్రణి రావణుఁగాంచి దేవ! దు
ర్దాంతపరాక్రముండవు ప-దంపడి కాంతనుగ్రింపనెంతె? ని
శ్చింతగ రామలక్ష్మణులఁ-జేద్పడఁజేయుము యుద్ధమందు నీ
పంతముదీర్చికొమ్మని ని-వారితుఁజేసె హితంబు పెంపునన్. ౧౪౯౦

—♦ సులోచనా సహగమనము ♦—

తే॥ మేఘనాదుని సతియగు-మెలఁతమిన్న, శ్రీసులోచన కేయూర-భాసురమును
మార్గణాన్వితమును నగు-మగనిచేయి, గాంచి యాతనిపౌరుష-క్రమము నెంచి.

తే॥ కనులనీరమునించి యం-గకముఁగుంచి, బిట్టుషలవించుచుండ న-వ్విభుకరంబు
సతికి సాంత్వనముగ క్షత-జమునశరము, చేతనిటునేలవ్రాసిన-రీతిఁదోఁచె. ౧౪౯౨

ఉ॥ ప్రేయసి! దుఃఖమందకుము - శ్రీమదనంతునిచేతఁ జచ్చి మో
క్షాయత సౌఖ్యముంగనితి - నారఘురామునిఁజేరినీవునున్
బాయనిభక్తిమ్రొక్కి-నయ - వాక్కులనాదు శిరంబువేఁడి తె
మ్మా! యనలంబునుంజొఱుము! - మాముకసన్నిధిఁజేరుమా! వెసన్. ౧౪౯౩

మ॥ వరభర్తృవ్రతయా సులోచనయు నా - వ్రాఁతన్ విలోకించి సు
స్థిరచిత్తంబున నత్తమామలకు నెం - తేమ్రొక్కి తత్సమ్మతిన్
ద్వరనాందోళిక నెక్కి రాముఁగనఁ గాం - తాయుక్తయైయేగె వా
నరులాయందలమున్ సమీపమునఁ గ్రి - న్నన్ జూచి యబ్రంబుతోన్. ౧౪౯౪

శా॥ అన్యోన్యంబుగ రావణుండు భయ స - మ్యగ్రస్తుఁడై యిట్లు స
మ్మాన్యన్ సీతను భక్తి పూర్వకముగా - మారామ చంద్రార్థమై
ధన్యత్వంబునఁ బంపుచుండెనని యు - త్సాహంబుతో నెంచి సా
జన్యస్ఫూర్తినిఁ బర్వవాతిశిబికా - సంవేష్టనంబొప్పఁగన్. ౧౪౯౫

తే॥ అందలమునందు నుండెడు-నామె మేఘ, నాదపత్నిసులోచనా-నామకాని
సీతకాదని యెఱిఁగి చె-చ్చెరనుమరలి, ధీరులను రాఘవాధ్యులఁ-జేరిరపుడు.

క॥ శ్రీమత్సులోచనయు శ్రీ, రాముని సన్నిధికినరిగి - ప్రణమిల్లుచు దే
వా! మద్భర్తృశిరంబి, మ్మా! మన్ననసేయుమా! ద - యామతిఁ గనుమా!.

మ॥ అనిప్రార్థించెను దత్సతీత్వమునకున్ - హర్షించి శ్రీరాముఁడా
య్యాన నయ్యింద్రజిశీర్ష మిమ్మనుచు నా - హన్మంతుతోఁదెల్పెఁ వెం

టనె యాతండును శక్రజిచ్ఛిరము కాం - తా ప్రీతిగానిచ్చెఁ ద
ద్వనితారత్నము రాముసాజ్ఞఁ గొనియు - ద్యద్భక్తి నేగెన్ వడిన్. ౧౧౯౮

చ॥ అటుచనియానికుంభిల ని - శాధిపుదేహముఁ గాంచి లంకకున్
భటులనుబంపి యంగఁగల - భర్తకరంబులఁ దేనొసర్చి తా
బొటబొట నశ్రువుల్ దొరఁగఁ - బూనికఁ దత్కరయుగ్మశీర్షముల్
స్ఫుటముగ నాథుదేహమునఁ - జొప్పడఁజేసి యచంచలాత్మయై. ౧౧౯౯

తే॥ చితను గల్పింపఁజేసి యం - చితముగాఁగఁ
బతి తనువుతోడ మండెను - చితినిఁ దాను
గూలి పతియుక్తముగను వై - కుంఠమునకుఁ
జనియె దివ్యాంగియై సులో - చన బిడాన. ౧౨౦౦

—♦ రావణుఁడు యుద్ధమునకువచ్చి పరాభవమందుట ♦—

క॥ తదనంతరమున నా దశ, వదనుండును సుహృదులన్ స్వ - బాంధవులన్ శై
ర్యమలను బరిజనులను సా, యుధులను మఱిగూడి యరిగె - యుద్ధమొనర్పన్.

లయగ్రాహి.

క్రూరులు సమీరక బల-వీరులు గభీర గుణ-వారులు సురారికుల-ధీరులు కడంకన్
జేరి రణరంగమును-ఘోరముగ నార్చి జ్వలి-తోరు వివిధాయుధము-లారఁగొనగింకన్
శూరులు మనోహర శ-రీరులు ధనుర్విశిఖ-ధారులు రఘూద్వహు లు-
దారులు ముదానన్,
వారక కపిప్రకర-సారములు మీఱఁగని-పోరుఁడని తెల్పితమిఁ-
గూరిరి రయానన్. ౧౨౦౨

ఉ॥ పిమ్మట రామచంద్రుఁడతి - భీషణశాతశరప్రతానముల్
గ్రమ్మఁగ వైచి రక్కసుల - మ్రందఁగఁజేసియు నొక్కబాణమున్
సమ్మద మొప్ప శార్ఙ్గమున - సంధిలఁజేసి దశాస్యు నేయ వే
గమ్మున లంకలోనఁబడి - క్రావరమే దెనువాఁడు ఖిన్నుఁడై. ౧౨౦౩

—♦ రావణుని మాయాకృతము ♦—

క॥ అంత నిలక మయుని - చెంతకు నతఁడేగి, కృత్రిమముగఁ దనదు - కెలసమమర
రాముశిరమువంటి - రమ్యశీర్షమునొండు, సలుపఁజేసి మనసు - చల్లబడఁగ.

ఆ॥ ఆశిరముఁబూని దానిని, దాశరథిప్రియకుఁ జూపఁ - దలకొని చనెఁద
లౌకశలము నెఱిఁగి బ్రహ్మయు, నాశరుఁడటు రాకమును పె - యువనిజఁగని యెన్.

చ॥ కని యబలా! కడంగి దశ - కంధరుఁడిప్పుడు కృత్రిమంబు రా
మునిశిరమున్ గ్రహించి సను - మోసముసేయఁగ వచ్చుచుండెనా

తని కృతముంగనుంగొని వ్య - థావివశాత్మవు గాకుమమ్మ! రా
మునకు భయంబులేదని ప్ర - మోదముగూర్చిచనెన్ దయాళుఁడై. ౧౫౦౬
ఉ॥ అంతటరావణుండును ర - యంబున జానకియొద్దఁజేరియో
కాంత! యిదో కనుంగొనుము - కాంతుఁడు రాముఁడటంచు నిక్కడ
భ్యంతరమేమిలేక రణ - మందు వధించితినేను రామునిన్
జెంతనెచూడు తచ్ఛిరముఁ - జెల్మినిఁకన్ ననుఁబొందుమమ్మ! యనెన్. ౧౫౦౭
ఉ॥ సీతయుఁ దానధోముఖిగఁ - జెన్నటి రావణుతోడఁ బల్కె నీ
వ్రాత ఫలంబు తప్పునే? కృ - పారహితా! భవపంకమగ్న! నా
చేతము మోదమంద రఘు - శేఖరుఁడాఢ్యుఁడు రామచంద్రుఁడా
శాతశరాన నీశిరముఁ - జయ్యనఁగూల్పఁగఁజూతు నాజిలోన్. ౧౫౦౮
క॥ అనిపలికిన దశవదనుఁడు, సునిశిత వాక్శరమె తన్ను - జొప్పున వెట్టన్
ఘనలజ్జావశుఁడై చని, తనయింటను జేరియుండెఁ - దల్లడ పడుచున్. ౧౫౦౯
క॥ రామాజ్ఞఁ గపులులంకన్, వాములుగాఁ గసవుతెచ్చి - ప్రాకారమునన్
గీములుఁజుట్టఁగ వైచియు, వేమాడఁగ నగ్నిపెట్టి - పేర్చిరి వెలుఁగన్. ౧౫౧౦
క॥ మునుపటి లంకాదహనము, మనములకున్ జ్ఞప్తిరాఁగ - మానవభోక్తల్
కనకనమండెడు నగ్నినిఁ, గని యాబాలముగ హల్ల - కల్లోల పడన్. ౧౫౧౧

—♦ రావణుఁడు పాతాళగుహయందు హోమము సేయుట ♦—

చ॥ దశవదనుండు వేగముగఁ - దజ్జలదాస్త్రముఁ వైచి యగ్నిసన్
బ్రశమనమందఁజేసెను బ్ల - వంగమపాళియు రాముఁజేరె న
ర్దశనుదలంచి రావణుఁడు - క్రిన్నన శుక్రునివేఁడి తద్వచో
వశుఁడయి హోమముంజలుపఁ - బొల్పడెనొక్కగుహన్ రహస్థితిన్. ౧౫౧౨
క॥ ఇంద్రజివలెనే యతఁడును, సాంద్రముగా హోమవస్తు - జాలముగొని ని
స్తంద్రిత లంకాద్వారము, లందేవ్వన మూయఁజేసి - లంపటమోవన్. ౧౫౧౩
మ॥ రుధిరస్నాతుఁడు ముండమాలియయి యా - రూఢంబుగాఁ బ్రేత పీ
ఠభృతి ప్రస్థితుఁడై శరౌఘముల బా - ఢంబొప్పఁ దద్ధోమకుం
డధరాతీరమునంమనన్ బఱచి కుం - డంబందు మాంసాస్రియు
గ్రిధిరాభాదశరాత్రిబాలకశిరః - కోటిన్ వెసన్ వేల్చెఁదాన్. ౧౫౧౪
క॥ రిపుఘాతార్థంబివ్విధిఁ, గృపణుఁడు దశముఖుఁడు హోమ - రీతిం జలుపన్
ఖపథోత్థిత ధూమముఁగని, సుపథవిభీషణుఁడు రాముఁ - జూచుచుఁ బలికెన్.
క॥ రామా! రావణుఁడిప్పుడు, భీమంబగు హోమమున్ గ - భీరతఁ జలుపన్
వేమునొకనియె దురాత్ముఁడు, హోమము తుదిముట్టఁజెట్ట - నొందఁ డటన్నన్.

— ♦ కపులు రావణుని హోమమునకు విఘ్నము కల్గించుట ♦ —

శా॥ శ్రీరాముండును హోమముఁ దెలుపఁగా - వృక్షాటులం బంచెఁ ద
ద్వీరుల్ వైళమయేగి కోటతలుపుల్ - త్రెళ్ళి కేలు గావించియుఁ
గారాకూరముగూర్చి దైత్యులకుఁ బ్రా - కారంబు లంఘించి యా
పారావాండ్రను జంపి హోమగుహాద్వా - ద్వారంబునుఁ జేరఁగన్. ౧౫౧౭

చ॥ తెల తెలవాఱవచ్చెఁ గపి - ధీరుల కల్ల గుహాముఖంబెటుల్
తెలియక పోయెనంతట సు - ధీయుతురాలు విభీషణాత్మప
త్ని లలితరూపయౌ సరమ - నెట్టనఁ దగ్గుహ హస్తసంజ్ఞచే
బలిముఖపాళికిం దెలిపి - భావము సమ్ముదవార్ధిఁ దేలెనే. ౧౫౧౮

ఆ॥ ఆ గుహాపిధాన-మైన పాషాణంబు, నంగదుండు చూర్ణ-మట్లు తనదు
పాదఘట్టనలను-బరువడి నొనరించె, మెంచి పంక్తివక్త్రుఁ-గాంచినొంచె.

క॥ కపులెల్లరుఁ దరువులఁగొని, యపుడా దశవదనుఁ గొట్టి-రా దెబ్బలకుం
జపలతనందక సురవై, రిపుఁడు స్థిరంబుగనె యుండెఁ - గ్రియనెఱిఁగి మదిన్.

క॥ కొందఱు కపివరులచటికి, మందోదరి నీడ్చి తెచ్చి - మానంబేదన్
దొందఱఁ గూర్చుచుఁ బట్టము, నుందొలఁగఁగఁజేసి యామె నుఁ బాధింపన్.

శా॥ భార్యా దుఃఖవిలాపమున్విని గగు - ర్పాటొంది నేత్రంబుల
స్థైర్యంబూప్పఁగవిచ్చి పత్నిఁగని కో - ధస్ఫూర్తిమై కీశులన్
ధైర్యోపేతులఁజూచి రావణుఁడు దు - ర్ధర్షుండు తద్ధోమముఁ
వార్యంబౌటను వీడిలేచి సతిచెం - ఱన్ జేరె నుద్విగ్నుఁడై. ౧౫౨౨

వ॥ వానరుల య్యెడం బెడమ్మఱి రాముకడకుం జనిరి మండోదరి దీనయై నాథునంఘ్రికమ
లంబులు గ్రహించి మనోహరా! తడవుసేయక పుడమిపట్టిని రామునకు సమర్పించి
లంకారాజ్యమునకు విభీషణునిఁ బట్టముగట్టి నిశ్చింతమై నాతోడ నొక్కవనంబుసేరి
తపోనిష్ఠాగరిష్ఠుండవగుట శ్రేష్ఠంబు గణియింపరాని యనర్థంబులకు మూలమైన బల
వద్భగవద్విరోధంబు తగదు కనులార నాయవస్థ నుదిలకించితిర కాదె? నామాటలాల
కించి సుఖంబుగాంచుఁడని విన్నవించిన నచ్చంచలాక్షితో దశాస్యుండిట్లని వచించె.

మ॥ రమణీ! రాముఁడు విష్ణుఁడా జనకజా - రమ్యాంగి శ్రీలక్ష్మియా
చమరన్ నామదిలో నెఱింగితిని రా - మాస్త్రంబుచేఁ జావఁగాఁ
బ్రమదన్ సీతను దెచ్చితిన్ రణము స-ల్పన్ బోయెదన్ రాముశ
స్త్రముచేఁ జెచ్చెరఁ ద్యక్తదేహుఁడయి త - ద్వైకుంఠముఁ జేరుదున్.

ఉ॥ నీవును మత్క్రియల్ జరపి - నిశ్చలవృత్తిని నగ్నిదూఁకి నా
తో విమలాత్మవై సుఖము - తోఁప వికుంఠపదంబు పొందుమా!

చావది ప్రాణధారికి వి - చారణ సేయఁగ నైజమౌఁగదా?
పావనశీల! వేగ శుభ - పద్ధతి నన్ బయనింపఁ జేయుమా!. ౧౬౨౫

—♦ రావణుఁడు రణరంగమునకు వచ్చుట ♦—

వ॥ అనియామెనోదార్చి పత్నీయుతంబుగా నంతఃపురంబునకుంజని దివ్యాంబరాభరణంబులును గవచంబును గోటీరంబులును ధరించి ధనురస్త్రంబులను నిశితాయుధంబులను గైకొని సమరసముత్సేకుఁడై యారావణుం డుత్సాహవర్ధనంబు రూపొందినచందంబు దోఁప రాజగృహంబునుండి వెడలి సూతసిద్ధంబగు శతాంగంబు నధిరోహించి బయలుదేరెనంత. ౧౬౨౬

తే॥ ఆతనికి ముందిమెనురయ్యె-నౌలనతని, ముకుటమదిక్రిందఁబడె-నవ-శకునచిహ్న
మ్గలంబయ్యె నటులైన-నతఁడునిలక, సంగరస్థలిఁజేరి దో-స్సార మొప్ప. ౧౬౨౭

క॥ శ్రీరామాదులపై శర, వారంబును గురియఁజేసి - వంచనచే సీ
తారామను గల్పించియుఁ, దేరుననామెను వధించె - దేరికనంగన్. ౧౬౨౮

చ॥ కపులదిచూచి బిట్టుతట - కాపడి రామునితోడ దేవరా!
కృపణుఁడు రావణుండిపుడ - పృథ్వీసుతన్ వధియించెనంచు శో
కపరతఁదెల్ప రాఘవులు - గ్లానిమునింగిరి బ్రహ్మచెచ్చెరన్
గృపమెయివచ్చి దానవుని - కృత్రిమమున్ వచియించెరామునితోన్. ౧౬౨౯

తే॥ రాముఁడును లక్ష్మణుఁడుఁ గపి - రాజుఁగపులు
నావిభీషణుఁడును దాన - హర్ష మొంది
రంత విధియునంతర్ధాన - మందెమరల
యుద్ధమునకెల్లవారు స - న్నద్ధులైరి. ౧౬౩౦

—♦ ఇంద్రప్రేరితుఁడై మాతలిసరథుఁడుగా రామునకు సహాయుఁడగుట ♦—

శా॥ ఇంద్రప్రేరణనప్డు మాతలియు ది - వ్యైష్వస్త్రయుక్తంబు ర
థ్యేంద్రాఢ్యంబశనిధ్వజాంచితము స్వ - చ్ఛేద్యాతపత్రోత్తమున్
రుంద్రధ్వానితమైన స్యందనము నా - రూఢార్థమై తెచ్చి ని
స్తంద్రప్రక్రియురాము మ్రొక్కి హరివి - శ్వాసంబుఁదెల్పెన్ దమిన్. ౧౬౩౧

తే॥ రాముఁడామాతలిని గడుఁ - బ్రేమఁగాంచి
యరదమధిరోహణముసేసి - యాహవంబు
ఘోరముగఁ జల్పఁదొడఁగె ర - క్షోగణాధి
నాథుఁడారావణుఁడుఁ గద - నమునమీఱె. ౧౬౩౨

—♦ రామరావణ యుద్ధము ♦—

సీ॥ ఆగ్నేయశరమును - నసురాధిపతియేయ, నాగ్నేయశరము సీ - తాప్తుఁడేయు
దైవాస్త్రమును వేస-దైత్యవంద్యుఁడు వైవ, దైవాస్త్రమును నరో-త్తముఁడు వైచు
వారుణాస్త్రంబును-గ్రూరచిత్తుఁడువిడ, వారుణాస్త్రముఁ క్షత్రి-వరుఁడువిడు,
వాయవ్యశరమును-బలకీర్తివర్తుఁడు వేయ, వాయవ్యశరముఁ క్ష్మా-భర్త వేయు
తే॥ నిట్టులన్యోన్యముగఁ బోర-నెదిరిపోర. రావణుండు భుజంగాస్త్ర-రాజమువిడె
రాముఁడును బన్నగాశనా-స్త్రంబువిడిచి, దాననద్దాని భంజించె-దనుజుఁడడల.
తే॥ వెండిపర్జన్యశరముదై-త్యుండువైవ, రాఘవుండు వాయవ్యాస్త్ర రాజమేసె
నసుర యాగ్నేయశరము ర-యానవేయ, జానకీపతి పర్జన్య-శరమువిడిచె. ౧౫౩౪

క॥ సర్వాస్త్రకోవిదుండును, సర్వాహవదక్షుఁడైన - క్షణదాచరుఁడా
యుర్వీతనయాపతితో, సర్వాస్త్రములటులె వృథగ-తుయమైపోగిలెన్. ౧౫౩౫

శా॥ నాగంబుల్ పదివేలు లక్షహరులె - న్నన్ స్యందనాల్ నూఱునా
పైఁగాంచంగను నేస్పకల్ పదగులున్ - భావింపఁగా నూఱుకో
ట్లైగిట్టింపుగొనన్ గబంధము కబం - ధానర్తనాల్ కోటికాఁ
గా గెల్వారఁగఁ గింకిణీధ్వని యటుల్ - గంటల్ తదీయాజిలోన్. ౧౫౩౬

తే॥ రామశార్ఙ్గాగ్రమునఁ బ్రహా - రమునర్ధ
మునకె నిరుపవిమాఱులు - మ్రోగుచుండె
నట్టిరణమును గనఁ గోతు - కాత్ములగుచు
దివి విమానస్థులైసురల్ - దీటుకొనిరి. ౧౫౩౭

చ॥ అపుడశనిధ్వజంబును సు - రాంతకుఁడొక్క శరంబుచేత స
వ్విపులఁబడంగఁగొట్టినది - వీక్షయొనర్చి రఘూద్వహుండునున్
గపివరునాంజనేయుఁగని - క్రిచ్చఱసీవు ధ్వజంబుకమ్మనన్
గపియును దేరిమీఁద నెస - కంబుగఁ దాలమునిల్పి నెక్కొ-నెన్. ౧౫౩౮

ఉ॥ పావని కేతనంబుగని - పంక్తిముఖుండు తదీయతాలమున్
బావని నైంద్రిచాపమును - వాజులనున్ మఱిమాతలిన్ సితం
బైవిలసిల్లుఛత్రమును - నంబకముల్ వెసఁదొవ్వ్రదేసియు
ద్ధావని వ్రీలఁగొట్టికడు - నార్చుచుఁ బేర్చెనుబీరమారఁగన్ ౧౫౩౯

తే॥ మాతలియు మారుతియు క్షణ - మాత్రలోనఁ
దెప్పిఱిల్లిరి హనుమఁను - దృఢతరమగు
స్కంధమును నెక్కి రాముఁడు - స్కంధమందు
భీష్ముఁడై తాను బరిణించె - గ్రీష్మభాను. ౧౫౪౦

ఉ॥ సోఁకులఱేఁడునుఁ బరిఘ - సూడునఁగైకొని హన్మఁబోమ్ము నన్
దాఁకఁగవైచె మారుతి వ్య - థాభరుఁడై త్వర నొల్లఁబోయె న
ప్పోఁక నెఱింగి రాముఁడు ప్రి - వీణతఁ గోరెను వైష్ణవాంబులై
చీఁకటి గొంగ వెల్గుబలెఁ - జెన్నగు స్యందనముఖ్యముల్ రహిన్. ౧౫౪౧
క॥ శ్రీవైష్ణవరథ రథ్య మ, హావిష్ణురథధ్వజోత్త - మాస్త్రిగదాశా
ర్ఙావృత రాజచ్ఛత్రోసు, ఖావశ్యకచామరములు - నలసారథియున్. ౧౫౪౨
శా॥ వేవే ద్యోపథమందునుండి సమరో - ర్వీలస్థలిం జేరఁగా
శ్రీవైదేహీధవుండుఁ దేరునకు న - ర్థిన్ మ్రొక్కి యందెక్కియున్
జ్యావల్లిన్ సవరించి బాణసమితిన్ - శార్ఙంబునం గూర్చి దు
ర్భావున్ రావణుఁ గాంచి కొన్ని శిరముల్ - వ్రయ్యంగఁ గొట్టెన్ రుషన్. ౧౫౪౩
ఉ॥ రామశరాళిచేతఁ దెగి - రావణశీర్షములంబరంబునన్
వేముదమొప్ప నవ్వుచును - బృథ్వీసుతాపతి పాదసన్నిధిన్
గామితరీతి వ్రాలుటకుఁ - గానన జివ్వనవచ్చుచుండె శ్రీ
రాముఁడునుం దలంచెను గ - రాళముఖంబులు మ్రింగునంచుఁ దన్. ౧౫౪౪
చ॥ అటుతలసోసి రాముఁడు శ - రావళిఁ జాపమునందుఁ బూన్చి యు
త్కటముగవైచి చెండ్లవలెఁ - దచ్ఛిరముల్ గగనంబునందుఁ బ్రి
స్ఫుటముగ నాడఁ గొట్టుచును - సోఁకుఁడు చచ్చెడురీతిఁ దోఁపకు
ద్భటుని విభీషణుం గని యు - పాయమెఱింగి దశాస్యుఁ గాంచుచున్. ౧౫౪౫
తే॥ వానినాభిని నమృతంబు-వఱలియుంటఁ, బావకాస్త్రంబుచే సుధఁ-బాయఁ జేసి
వాని కరములు శిరములు-వడిగఁ ద్రుంచె, నొక్కతల రెండు చేతులు-దక్క నెల్ల.
క॥ క్రూరాసురుఁడగు రావణ, వీరునకున్ రామచంద్ర - విభునకును మహా
ఘోరమును రోమహర్షణ, మారయఁ దనుజులమును నైన - యాజి చెలంగెన్.
వ॥ హనుమయును మూర్ఛనుండి తేఱి రామరథసమీపంబున నడచుచుఁ దరుశిలాతతు లచేత దనుజసమితిని జెండాడఁదొడంగె లక్ష్మణుండును సుగ్రీవాదులును విభీషణుండును బదంపడి విపక్షసైన్యంబు నక్షీణపరాక్రమంబెసంగఁ గాఁక్షేయకాదులచే నుత్క్షేపించుచుండి రయ్యెడ. ౧౫౪౬

—♦ రావణ సంహారము ♦—

ఉ॥ పిమ్మట సూతువాక్యములఁ - బ్రీతిమెయిన్ విని రామమూర్తి చా
పమ్మున నబ్జజాస్త్రము జ - వమ్మగ సంధిలఁ జేసి దైత్యవ
క్షమ్మును జూపి యేయ దశ - కంధరుఁడా క్షణమందచచ్చె న
స్త్రమ్మది రామబాణతతి - రాజితమై దొనఁ జేరెఁ గ్రమ్మఱన్. ౧౫౪౭

తే॥ రావణుని దేహముననుండి-రమ్యతేజ, మొకటి సూర్యాభమించుచు-నుద్భవిల్లి
రామచంద్రునిలోఁ జేరెఁ-బ్రమదవిస్మ, యాత్ములై దేవతలు కన్ను-లారఁ గనఁగ.
తే॥ సురలు కురియించిరప్పుడు-విరులవాన, దుందుభిధ్వాన మమరె ది-క్కందరముల
నప్సరోంగన లాడిరి-హర్షమలర, లోకమెల్లను ముదవార్ధి-లోనఁదేలె. ౧౫౫౧
క॥ పతిమరణంబును విని యా, సతి మండోదరియు భర్తృ - సహగమనంబున్
హితముగ నొనరిచి చేరెను, బతితో మోదంబుమీఱ - వైకుంఠంబున్.

—♦ విభీషణ పట్టాభిషేకము ♦—

ఉ॥ చెచ్చెర నావిభీషణుని - చే దశకంఠుని సత్క్రియావిధం
బచ్చుపడంగఁదాఁ జలుపు - నట్టులుసేసి రఘూద్వహుండు మే
ల్మచ్చికమై విభీషణుని - లంకకుఁ బట్టముగట్ట లక్ష్మణున్
హెచ్చుగ హెచ్చరించె హిత - మొంచి సుమిత్రసుతుండు నత్తఱిన్. ౧౫౫౩
తే॥ లంకకుఁ గపీంద్రపాళితో-శంకలేక, యరిగి రామాజ్ఞ దైత్యరా-జ్యంబునకు వి
భీషణుని రాజుగాఁజేసి- వేడ్కమీఱ, నెల్లరనుగూడి రాముని-యెడకు వచ్చె.
ఉ॥ రాముఁడు వాతసూతి నను - రాగముతోఁగని యాంజనేయ నీ
వీమెయి నివ్విభీషణుని - నీరవిజున్ దోడికొంచు నేగి మ
ద్భామను జానకింగని శు - భంబుగ యుద్ధవినోదమున్ సగ
ర్వామయుఁడైన పంక్తిముఖు - నంతముఁ దెల్పుమటంచుఁ బంపెఁదాన్.
ఉ॥ పిమ్మట సూర్యజానులును - వేడ్క నశోకవనమ్ముఁజేరి సీ
తమ్మను నెల్లవృత్తముఁ బ్రి - యమ్ముగవిన్చియు నామెనప్పుడా
నమ్మను జేయవేఁడి రవ - ణమ్ములు దివ్యములైన చేలముల్
సమ్ముదమొప్ప నిచ్చి యవి - చక్కఁగ నామెధరింపఁ జేర్మిపై. ౧౫౫౪
ఉ॥ పల్లకియందు నామెను శు - భంబుగఁ గూర్చొనఁజేసి హర్షసం
ఫుల్లహృదబ్జులై విభవ - పూర్ణత మంగళవాద్యముల్ తగన్
దల్లలితాంగి నొయ్యఁ గరు - ణానిధియౌ రఘురాముఁ జేర్చిరా
పల్లవపాణియున్ వడిగఁ - బల్లకిడిగ్గి సభక్తిచిత్తయై. ౧౫౫౭
చ॥ నయభయ లజ్జలొప్ప నయ - నంబుల నీరముగ్రమ్మ మెల్లగా
జయరమఁగొన్న రాముపద - సారససన్నిధి కేగి నమ్రయై
దయఁగనుడంచు మ్రొక్క లలి - తంబును శుద్ధము నిర్మలంబు ని
శ్చయమునునైన యామెదగు - స్వాంతమెఱింగియుఁ బల్కెఁగాంచుచున్.
శా॥ లోక ప్రత్యయమెంచి రాముఁడను నో - లోలాక్షి! తత్పంక్తి వ
క్త్రాకృష్టిన్ రిపుగేహవాసినివి మ - ర్యాదాస్థితుల్ చెల్లె నీ

సౌకర్యం బెటులట్లు సేయుమిఁకని - చ్చక్ నిన్ను నేనొల్లఁ బో
మ్మికాలంబున నన్యుఁజేరు వనితల్ - హేయంబుగాఁ జూడరే?

—♦ సీతాదేవి వహ్నినిఁ బ్రవేశించి మరల రామునిఁ జేరుట ♦—

చ॥ అనవుడు ఖేదచిత్తయయి - యశ్రులు రాల ధరాత్మజాత చ
య్యన మఱఁదింగనుంగొని ద - యామయ! పేర్చుచితిన్ జగంబునం
దున నిటులాఱడింగొనితి - దూఁకెదనయ్యనలంబునందు శ్రీ
జననమె దూష్యమాఁగ? కృ - శానుఁడె నాకిట సాక్షియౌనవెన్. ౧౯౬౦
తే॥ అన్న కనుసన్న లక్ష్మణుఁ-డంపు నొకటఁ, జితను బేరిచె నంత నా-సీత వెడలి
స్నాతయైవచ్చి భక్తినం-జలి ఘటించి, ప్రజ్వలచ్చితకడ నిల్చి-పతిఁదలంచి.
శా॥ నేనారాముని సంతతంబు మదినెం - తే యోతునేనిన్ లస
జ్జ్ఞానంబింతయు వీడనేని పతియే - దైవంబటం చాత్మలో
సానందంబుగఁ గాంతునేని పరునా - స్యం బెప్పుడున్ జూడలే
దేనిన్ శ్రీజ్వలనా! శమింపుమని బ - ర్హిశ్శిఖల్లో దూఁకెదాన్, ౧౯౬౨
ఉ॥ ఆ సమయంబునందు సుర - లందఱు పంక్తిరథుండు నభ్రమం
దో సుగుణాగ్రగణ్య! కరు-ణోదధి! జానకియందు లేశమేన్
దోసము లేదు రామ! పరి - తుష్టిగ సీతనావే గ్రహింపు మా
శ్వాసముగూర్పు మామెకని - సమ్మతిఁబల్కిరి మాటిమాటికిన్. ౧౯౬౩
తే॥ వీతిహోత్రుండు సుఖముగా-సీతనపుడు, దివ్యరూపధరుండయి-తెచ్చి హెచ్చు
మచ్చికను రామచంద్రున-కిచ్చి మ్రొక్కి, యీమె నిర్దోషయని వచి-యించి యరిగె.
క॥ త్రిగుణాత్మికయగు సీతను, భగవంతుఁడు రామమూర్తి - స్వాంకమునందున్
జగమెల్లఁబొగడ నిడుకొని, బిగికౌఁగిట నామెఁ బొదివి - ప్రీతిదుఁడయ్యెన్.

—♦ అమృతవర్షముచే వానరులు బ్రతుకుట ♦—

క॥ తరువాత దేవతలచే, గురుతర సంస్తుతులు పొంది - క్షోణిజపతి త
త్సురపతివలన సుధావృష్టి రసన్ గురియంగఁజేసె - శేవతలిర్పన్. ౧౯౬౬
క॥ అద్దాన రామరావణ, యుద్ధంబునఁ జచ్చినట్టి - యుక్కరి కోతుల్
గ్రద్దన బ్రతికియుఁదోఁకల, ముద్దాడుచు నెగిరి రాము - మ్రొక్కిరి మిన్నులన్.
క॥ సీతా లక్ష్మణయుతుని న, రాతిజయంబందినట్టి - రాముని మఱి యా
కోతులుగుములై పొగడుచుఁ, జేతులుపట్టుచును మేలు - చేకుఱె ననుచున్.
సీ॥ జయజయరావణ-క్షయకర రణభీమ!, జయజయదానవ-చయవిరామ!
జయజయ సద్విభీ-షణ రక్షణోద్దామ!, జయజయ సురపుష్ప-సాంద్రదామ!

జయజయ జానకీ-స్వాంత సంతతధామ!, జయజయ సుగ్రీవ-సౌఖ్యకామ!
జయజయ వైభవ-సంపూర్ణసుత్రామ!, జయజయ రఘువంశ-జలధిసోమ!
తే॥ జయజయ సమస్త మునివర - స్తవ్యనామ!
జయజయ పితృవాక్యపాలన - క్షాంతరామ!
జయజయ కృపాభిరామ! శ్రీ - సత్యనేమ!
జయజయశ్రీరామ! యనుచు ము - చ్చటనుగనిరి. ౧౫౯

తే॥ ఆ కపులయందు నొక కపి - నపుడు గనక
రాముఁ డతఁడెంతనని సమీ-రసుతుఁ గాంచి
యడిగెఁ బవనజుఁడును దేవ! - యాఁతఁడంతఁ
గుంభకర్ణుఁడు మ్రింగ నా - కోఁతినిదియె. ౧౬౦

తే॥ యమని స్మరియించి వీక్షించి - యాజిసుతుఁడు
వానరునిఁ గోర నాతని - యానతిఁ గొని
కాలుఁడాకపి నర్పించె - క్షణమునంద
దుర్మిచరునిఁగాంచి రాముఁడు - తుష్టినొందె. ౧౬౧

—* రామాదులు కుబేరప్రేషిత పుష్పక మధిరోహించుట *—

వ॥ అనంతరంబున మాతలియు రామునివలన నామంత్రణంబునొంది వాజియుక్తంబగు రథంబుతో నిందరనగరంబునకేగె రాముఁడును మంగళస్నానంబొనర్ప విభీషణప్రార్థితుఁడయ్యును భరతునిస్మరియించి యందులకంగీకరింపక సర్వవానరయుతంబుగా వైష్ణవసారథ్యోపేతంబుగా గరుడమకరధ్వజవిభీషణులతోడ సీతాలక్ష్మణసహితంబుగాఁ గుబేరప్రేషితసచేతనపుష్పకంబధిరోహించి యయోధ్యకుం బయనంబయ్యె నంత నభఃపథంబున విమానస్థులైయుండిన నిర్జరులును దశరథుఁడునుసముచితోక్తులతో సీతారామలక్ష్మణులకు సంతోషంబుగూర్చి వారివలన వీడ్కోలువడసి దివంబుసేరిరి పుష్పకస్థుండగు రామునింగని విభీషణుండయ్యెడ నభివాదనంబొనర్చి యిట్లనియె. ౧౬౨

శా॥ రామస్వామి! రసాతలంబునకుఁ గూర్రి - రక్షోగ్రణిఁ డైరావణుం
డామైరావణుఁడట్లు మిమ్ముఁగొని మా - యారీతి నేగన్ మహా
త్మా! మీశక్తినిఁ జూపకేలొకో? హనూ - మంతుండె మేల్ సాహసం
బామర్త్యాళులచెంతఁ జేసెఁగద? నా - కారీతి విన్పింపుఁడీ!. ౧౬౩

మ॥ అనఁగా నవ్వి విభీషణుంగనుచు రా - మాధ్యుండు మిత్రాగ్రణీ!
వినుమా! బంభరముల్ సదాగతిజుచే - వేగన్ మృతింగాంచున

ట్లనఘుండావిధి నిర్ణయించె మఱియుర్ - హన్మంతువిఖ్యాతి న
న్నును సౌమిత్రిని బ్రోచెనంచు నెలయర్ - దూష్ణీంస్థితిర్ బొందితిర్. ౧౫౭౪

చ॥ అని వచియించెనంత మరు - దాత్మజుఁడుర్ దనుజేంద్రుఁగాంచి రా
మునిమహిమం బెఱుంగవె? య - మోఘసుకృతార్థుఁడటంచునన్ను మే
లనెదవు నాకుగర్వమఱె - నాతని పాదరజఃకణోపమా
న నియతికేనియుందగని - నాబలమెంత? గుణోదధీ! యనెర్. ౧౫౭౫

—• శ్రీరాముఁడు సీతావాక్యముచేఁ ద్రిజటకు వరములనిచ్చుట •—

వ॥ వారిమాటలకు విభీషణుండు సంతోషతరంగితస్వాంతుండై రామచంద్రునకు దండవ త్ప్రణామంబొనర్చి పూజించి మిన్నకుండె నప్పుడన్నులమిన్నయు జగన్నుతశీలయుఁ బున్నెముల నెలవునునగు నేలచూలి లీలావినోదుఁడగు మగనింగని చెలిమితనరఁదన మోలనుండిన త్రిజటావనితకు మేటివరంబునిమ్మని మాటిమాటికిని బ్రార్థింప నర్థి జనకల్పకంబును నసల్పకృపాపరుండునునగు శ్రీరాముండు త్రిజటకు రమ్యాంబరా భరణంబులిప్పించి యిట్లనియె. ౧౫౭౬

సీ॥ త్రిజటాభిధాన! నీ-ప్రియభావ మెఱిఁగితి, శుభదముతో వచ-స్సులను వినుమ!
చైత్రవైశాఖ మా-సములఁ గార్తికమాఘ, మాసంబులందు సం-ప్లవ మొనర్చు
మనుజుల పుణ్యసం-భవసత్ఫలంబున, మూన్నాళ్ల ఫలము నీ-కొదవుఁ జుమ్మ
పూర్ణిమానంతర-మున నటుసేయని, వారి మాసఫలంబు-చేరునిన్ను

తే॥ మఱియు నశుచిగ శ్రాద్ధంబుఁ-గఱకుబుద్ధిఁ, దిలలు దక్షిణలిడకయె-చలుపువారి
పుణ్యమును శౌచమభ్యంగ-మునుద్యజించు, వారి పుణ్యంబునీయవి-వారిజాక్షి!.

క॥ అని వరములొసఁగి త్రిజటా, వనితను సరమాసతిర్ శు - భంబు తలిర్పర్
ఘనపుష్పకమును జేరుం, డని మెల్లరఁగూడి యరుగు-చభ్రపథమునర్. ౧౫౭౭

ఉ॥ రాముఁడు దైత్యదుర్మద వి - రాముఁడు భక్తజనాంతరంగ సం
ధాముఁడు హేమరత్న సుమ - దాముఁడు సర్వసుపర్వవందితో
ద్దాముఁడు కీర్తిపూర్ణ హిమ - ధాముఁడు రమ్యవినోదవర్ణితా
రాముఁడు జానకీ హృదభి - రాముఁడు భార్యనుగాంచి యిట్లనుర్. ౧౫౭౮

మ॥ అలివేణీ! యదెలంక కన్గొనుమదే - యాజిస్థలంబల్లదే
శిలలర్ గొండలఁబేర్చి కట్టినమహా - సేత్వగ్రిమాసేతు తీ
ర్థలసద్ఘట్టమదే సముద్రమతి ఘో - రంబిద్ది యుత్తుంగవీ
చులవేమిన్నును మన్నునేకముగఁ దో - చుంగాదె? వీక్షింపఁగర్. ౧౫౮౦

సీ॥ నీకై కదా? యావ-నేచర సంఘమ్ము, నెల్లను దమిఁగూడి-హితవుగనితి
నీకై కదా? పావ-నికి నుంగరంబిచ్చి, తేవ నిఖ్యాబ్ధి దాఁ-టించనైతి

నీకై కదా? భక్తి నియతి నీశ్వరుఁగొల్చి, సేతునిర్మాణ వి-ఖ్యాతిగొనితి
నీకై కదా? యూని-నీచరనాథుని, సపరివారంబుగాఁ-జంపినది
తే॥ జానకీ! నీను ప్రేమపా-శంబులకును, వశునిగాఁ జేసికొంటివి-వరుసనన్ను
బల్లవాధరి! యన్యోన్య-భాగ్యగరిమ, మిప్పుడేకద? ఫలియించె-మెప్పునించె.
క॥ అని క్షణమాత్రనె తక్షణ, వననిధిఁ బుష్పకముగడచి - పారముఁ జేరన్
దనుజవిభీషణసూక్తిని, విని యవనికిడిగ్గి ధనువు - వేకొని యతఁడున్. ౧౫౭

—* శ్రీరాముఁడు సేతువును భంజించి సంపాతితోఁ బుష్పకము నెక్కి వెడలుట *—

తే॥ శ్రీధనుష్కోటిచేత నా-సేతువపుడె, భంజనమొనర్చె నద్దానఁ-బరమపుణ్య
నిలయమై ముక్తిదంబయి-వెలసెనచటు, వరధనుష్కోటి తీర్థమన్-ప్రథితిఁ గాంచి.
క॥ కోదండపాణి నామము, తో దాశరథియును దనరెఁ - దుష్టికరముగా
నాదృతిఁ దత్తటమున; నా, మీఁదట సంపాతియును స - మీపించెఁదటిన్.
క॥ అటువచ్చిన సంపాతియుఁ, దటమున శ్రీరాముమ్రొక్కి - తద్ఘనునాజ్ఞన్
దటమునఁ దమ్మునిపేరన్, జటాయుతీర్థంబు నిలిపె - సంతసమారన్. ౧౫౯

వ॥ తదనంతరంబున శ్రీరామచంద్రుండు సంపాతిని దనపుష్పకమునధిరోహింపఁజేసి తానును బుష్పకంబెక్కి సీతాసతికిఁ గౌతుకముదీర్ప వింతలనుజూపుచుఁ జనిచని రామేశ్వరునిసన్నిధానంబుసేరి తల్లింగమును జాయాయుతంబుగాఁబూజించి యెల్లరితోఁ బుష్పకంబునధిరోహించి పయనించుచు జానకింగాంచి యిట్లనియె. ౧౬౦

శా॥ సీతా! చూచితె? సైకతేశ్వరునిఁ గా - శీలింగ మారెండు నా
చేతన్ మారుతిచేత నిల్పఁబడె వా - సిన్ మంత్రముంజల్పి యిం
దీతీరంబున దర్భశాయియయితిన్ - హేరాళభక్తిన్ శిలా
వ్రాతంబున్ గ్రహపూజకియ్యెడ శుభా - ర్థంబేను మున్ నిల్పితిన్. ౧౬౧

తే॥ ఇచట నాయాజ్ఞ సాగర - మింతయేని
రవమొనర్పదు వినుమ! సా - రసదళాక్షి!
యనుచుఁ బథచిత్రములఁజూపు - చును ముదాన
వడిగఁ గిష్కింధఁజేరెఁ బు - ష్పకమువలన. ౧౬౨

ఉ॥ పిమ్మట వానరీతతినిఁ - బ్రీతివిమానమునెక్కఁజేసి య
భ్రమ్మునఁ బోవుచున్ జనక - రాజకుమారినిఁగాంచి రాముఁడో
కొమ్మరో! తత్ప్రవర్షణ సు - గోత్రముకన్గొను; ఋశ్యమూక భూ
ధ్రమ్మునుగాంచు; మూఁడు మదె - రమ్య సరస్సును బంపనున్ మఱిన్. ౧౬౩

క॥ కృష్ణన్ వరభీమరథిన్, దృష్ణాహరణంబొనర్చు నిమ్నగలన్ ద
ద్విష్ణుధ్యాన స్థితి రో, చిష్ణువులై వెలయుమునులఁ - జెప్పెఁ గనుమీ! ౧౬౪

తే॥ రమ్య గోదావరీతీర - రాజితంబుఁ
బంచవటి నిటు సేయుమా! - భవ్యమైన
కుంభభవు నాశ్రమమును గ - న్గొనుము! యదిగొ!
యాసుతీక్ష్ణమునీంద్ర ప - ర్ణావసథము. ౧౫౯౧

క॥ లక్షింపు మత్రియుటజము, లక్షణమగు చిత్రకూట - లలిత నగమ్ముం
రక్షాచణఁ గాళిందిని, వీక్షింపుము దివ్యజాహ్న - విని మనమలరన్. ౧౫౯౨

క॥ అనవుఁడు సీతయుగంగకు, మును మ్రొక్కినరీతి మఱచి - మోద హృదయయై
తనపతి పథకౌతుకములఁ, గనఁ జేయఁగఁ గనుచుసతని - కడనుండెఁ దమిన్.

—॰ శ్రీ సీతారామలక్ష్మణులు పరివారముతో భరద్వాజాశ్రమమున విడియుట ♦- —

క॥ ఆశ్రితమందారుండగు, నా శ్రీరఘురాముఁ డవ్వల - నందఱతోఁ బు
ణ్యాశ్రయమైన భరద్వా, జాశ్రమమునఁ బుష్పకంబు - నవరోహించెన్. ౧౫౯౪

తే॥ త్వర భరద్వాజమౌనియు - నరిగి రాము
చంద్రునకు మ్రొక్కి భక్తిని - స్తంద్రుఁడగుచు
నెల్లరను బిల్చికొని వేడ్క - నేగితనదు
పర్ణశాలను విడియించి - వారినపుడు. ౧౫౯౫

ఉ॥ స్వీయతపః ప్రభావమునఁ - బృథ్విని సృష్టియొనర్చిస్వర్గముఁ
బాయనిప్రేమ రాముఁ బరి - వారయుతంబుగ సత్కరించినన్
వాయుకుమారుఁగాంచి రఘు - వర్యుఁడు నేఁటి కరణ్యవాసమున్
బాయుటయయ్యె మాఘసిత - పక్షచతుర్థికదయ్య! కావునన్. ౧౫౯౬

ఉ॥ నీవు నయోధ్యకేగి వడి - నిన్ భరతుంగని భావుకంబుగా
నావిషయంబు దెల్పుము వి - నన్ గుహునిచ్చటికన్నుముందుగాఁ
బావని! యన్ననాతఁడు న - భఃపథగుండయిపోయి తద్గుహున్
క్ష్మావనితాసుతాధవుని - సన్నిధి చేరఁగఁబంచి పిమ్మటన్. ౧౫౯౭

♦ భరతుఁడు రామాదుల యాగమనము దెలియక ప్రాయోపవేశమునకుఁ గడంగుట ♦

తే॥ పయనమై శ్రీయయోధ్యకుఁ - బ్రమద మొదవ
నరుగుచుండెను దత్సను - యమున భరతుఁ
డనుజయుతుఁడు నందిగ్రామ - మంచుమదిని
సంశయించుచు శత్రుఘ్ను - సరగఁ బలికె. ౧౫౯౮

శా॥ శత్రుఘ్నా! పదునాలుగేండ్లు కడచెన్ - క్ష్మాజాతతోఁ దమ్మితో
శత్రుఘ్నుండగు రామచంద్రుఁడిటకున్ - సంతోషియైరాఁడు హా!

రాత్రించారులఁజేరిచే మడిసిరో? - రాముండు సౌమిత్రియున్;
ధాత్రింబొప్పఁగ లంకఁజేరి మనముల్ - సాహాయ్యమీ లేదుకా?. ౧౭౯౯
క॥ రాజులఁ బిలువఁగఁ జేయుట, యోజించుట కాలహరణ - యోగ్యములయ్యెన్
శ్రీజయసంపద్యశునిగ, రాజాఢ్యుగ రాముఁగాంచి - రంజిలమికటా!. ౧౮౦౦
ఉ॥ కావున సూర్యవస్తమును - కాలమునంతకు నేఁడుచూచి స
ద్భావులు రామలక్ష్మణులు - భ్రాత్రిజతో నిటురానిచోఁ ద్వరన్
బావకుఁడంగఁ బ్రాణములఁ - బాసెద నిశ్చయమిద్ది రాజులున్
నీవునులంక కేగి రజ - నీచరులన్ వధియించి యావలన్. ౧౮౦౧
తే॥ జనకజాతనువిడిపించి-జనక సామ్యు, లైన రామునకును సుమి-త్రాత్మజునకు
నాకు నొనరింపుమా! పర - లోకవిధులు, సాదరుండవ్రకమ్మ నీ-వన్నఁడ విక.
సీ॥ అనవుడు శత్రుఘ్నుఁ-డును మాతలును నూర్మి, ళాదులు వనితలు-నాప్తజనులు
మంత్రులు పౌరులు-మఱి జానపదులును. సేవకుల్ భరతు వే-ష్టించినిలిచి
కడుశోకభరమునఁ-గన్నీరు మున్నీరు, గానేడ్చుచును దైవి కంబునెంచి
పొగులుచు రవివంశ-భూషణు శ్రీరాముఁ, దలఁచుచు లక్ష్మణున్-ధరణిసుతను
తే॥ స్మరణ మొనరించుచును ఘోర - మరణమునకుఁ
దొడరవలదని భరతుని - తోడఁ జాలఁ
బల్కుచును వేఁడుచును నుల్కి - పడుచునుండ
వారి కూఱటఁదెలుపుచు - భరతుఁడంత. ౧౮౦౩
మ॥ సరయూనిమ్నగ కేగి తత్తటిఁజతన్ - జల్పన్ నియోగించి స
త్వర మొప్పన్ జితిసిద్ధమైనఁగని స - ద్భక్తిన్ నదిన్ స్నాతుఁడై
వరదానంబు లనేకముల్ సలిపి య - వ్వైశ్వానరున్ ధ్యానరీ
తి రహిన్ దా వలగొంచు మ్రొక్కిపితనున్ - దేవావళిన్ వేఁడుచున్. ౧౮౦౪
తే॥ తల్లులకు మామలకు గురు - తల్లజులకు
రామలక్ష్మణులకు జాన - కీ మహిళకు
మ్రొక్కుచును ప్రీతిగా నుద - ఙ్ముఖుఁడునగుచు
నిలిచి సాయంరవినిఁజూచు - చలరుచుండె. ౧౮౦౫

—• హనుమంతుఁడు భరతునకు రామాదులయాగమనము దెల్పుట •—

క॥ అప్పుడు పురుషులు వనితలు, గొప్పగఁదామొక్కపెట్ట - గొల్లన నేడ్వన్
దెప్పునవచ్చెడి హానుమయు, నప్పగిదినిఁగాంచి సంభ్ర - మాకుల హృదుఁడై.
చ॥ గగనమునుండి డిగ్గి వడి - గా ననలంబున దూఁకనెంచు ధ
ర్మగుణనిధానునిన్ భరతుఁ - గన్నని జేరి మహాత్మ! రాముఁడున్

జగతిజయుఁ సుమిత్రిజుఁడు - సౌఖ్యము భావుక మొప్పవచ్చి రెం
చఁగ నిలు మగ్నిదూఁకకుము - జ్యేష్ఠజధవ్రుండిటుపంపె నన్నునుఁ. ౧౬౦౭
తే॥ అని సుధామధురోక్తుల-వినఁగఁ బలుక, భరతుఁడయ్యెడ సంతోష-భరితుఁడగుచు
నగ్నికి సమస్కరించి శ్రీ-యాంజనేయుఁ, గౌఁగిటనుగ్రిచ్చి నుతిచేసి-కాంతిమీఱె.
క॥ హనుమానుండును భరతుని, వనజోపమ పాదములకుఁ - బ్రణతులనిడి రా
ముని వృత్తాంతమునంతయు, వినిపించెను సకలజనులు - వేడుకనొందఁ. ౧౬౦౯
తే॥ బౌల భరతుఁడు సర్వజ-నాళిఁగూడి, పురమునకుఁజని సాకేత-పురవరంబుఁ
దోరణాదులచే మోద-కారణంబు, గా నలంకృతముగఁ జేసి - కౌతుకమున.
శా॥ శ్రీమాఘాంచిత శుక్లపంచమిని న - ర్థిఁ సత్ప్రభాతంబునఁ
రామార్థంబయి బంధుమిత్రి పరివా - రంబొప్ప శీర్షంబున
నాశ్రమస్వామిని పాదుకల్ నిలిపి యా - నందంబుతోఁ దాను వే
వే మార్గంబుఁ బ్రతీక్షణంబుసలిపెఁ - వేవేల్గుమూర్తిక్కునఁ. ౧౬౧౧

—• శ్రీరామాదులు నందిగ్రామము చెంతకు వచ్చుట •—

ఉ॥ అంత ననంతకాంతులు ది - గంతరముల్ ప్రసరింపఁ బుష్పకా
భ్యంతరమందు దోగ్యగతిని - నా రఘురామవిభుండు జానకీ
కాంతయు లక్ష్మణుండు కపి - కాండము ధీరవిభీషణాదులుఁ
సంతసమొంతయుందనరఁ - జయ్యనవచ్చిరి హెచ్చుమచ్చికఁ. ౧౬౧౨
క॥ భరతాదులు వారలఁగని, పరమానందంబునొంది - ప్రణతులు కాఁ శ్రీ
ధరణీతనయారమణుఁడు, భరతునిఁ గౌఁగిటనుబాదివి - ప్రణుతించితగఁ.

—• శ్రీరాముఁ డనేకరూపములతో నెల్లరిను నాలింగనాదులచే మన్నించుట •—

క॥ నానా రూపంబులతోఁ దానప్పుడె జనులనెల్లఁ - దమిఁగౌఁగిళులఁ
మానుగఁజేరిచి యబ్బుర, మూనఁగ నొనరించి మించి - యొయ్యన పురలఁ.
క॥ జటియగు భరతునిఁగని యు
త్కటమగు వగగొనుచు మిగులఁ - గన్నీరురలఁ
గటకట! యని యోదార్చుచు
నటుమాతలనుఁ సపత్నుఁ - డగుగుదు మొ్రక్కెఁ. ౧౬౧౫
క॥ పిమ్మట నృత్తములును వా, ద్యమ్ములు మీఱఁగ భద్ర - దంతియు మును ర
మ్యమ్ముగ నడువఁగఁ బుష్పక, మిమ్ముగ రాఁ రామచంద్రుఁ-డెల్లరతోడఁ.
క॥ నందిగ్రామముఁ జేరి త, గం దీక్షనువీడి స్వీయ - కాంతాయుతుఁడౌ
చుం దమ్ములతో శుభవిధు, లొందెను సభ్యంజనాప్లు - వోత్సవమునురఁ. ౧౬౧౭

క॥ మణిహేమాంచిత భూషణ, గణమును దివ్యాంబరములుఁ - గౌతుకముగ స
ద్గుణులగు శ్రీరాముఁడు ల, క్ష్మణుఁడును భరతుఁడును జనక-జయుఁ దాల్చిరొగిన్.
క॥ మంగళవాద్యమ్ములు మ్రో, యంగా రోవెలఁదులచట -నాడంగా నె
మ్మిం గాంతలు మణిహారతు, లం గల్యాణముగ నిడిరి - రామాదులకున్.
తే॥ జానకీ రామచంద్రల-క్ష్మణులు భక్తిఁ, గోసలాత్మజ మొదలగు-కోమలులకు
గురులకు వసిష్ఠునకు లస-చ్చరితయైన, శ్రీయరుంధతికిని నతుల్ - సేసిరంత.
తే॥ వారలెల్లరు మఱి రఘు-వీరవరుల, కాధరాజాతకును బ్రీతి-యామతిల్ల
దీవనలనిచ్చిరపుడు మై-థిలిని గోస, లాత్మజాదులు కౌఁగిట-నలముకొనిరి.
క॥ భరతుఁడు నగ్రజుపాదుక, లరుసముతోఁదెచ్చి రాము-నంఘ్రులఁ దొడిగెన్
గరయుగము మొగిచి యన్నా! వరరాజ్యము గొనుమటంచుఁ-బ్రార్థనసలిపెన్.

— శ్రీరాముఁడు సపరివారముగా నయోధ్యను బ్రవేశించుట —

చ॥ అనవుడు రామచంద్రుఁడు త - థాస్తని గుర్వనుజ్ఞఁబొంది వెం
టనె తనపత్నితోఁ దత హను - టూహుటి స్యందనమెక్కి యెల్ల వా
రును శుభరీతిరాఁగ, మును - రోవెలఁదుల్ నటియింప వాద్యని
స్వనములెలర్ప వానరులు - చంకలఁదట్టి జయంబు పల్కఁగన్. ౧౬౨౩
క॥ సాధస్తపౌరభామిను, లేధితమోదమున సుమము - లెంతయుఁ గురియన్
భూధవులు పొగడ హారతు, లాధవళాలిడఁజేరె - నప్పుడయోధ్యన్. ౧౬౨౪
శా॥ శ్రీరాముండటువచ్చి స్యందనము న - ర్థిన్ డిగ్గి సీతాసతిన్
గారాబంబున రాజసద్మమునకున్ - గాంతాళితోఁబంపి యిం
పారన్ బుష్పకమున్ గుబేరునెడ క - ర్హంబౌనటుల్ పొమ్మనన్
శ్రీరంజిల్లు విమానమా ధనపతిం - జేరెన్ జవంబొప్పఁగన్. ౧౬౨౫
క॥ ఆవల నెల్లరఁ దగువిధి, గా విడియఁగఁజేయ మంత్రి - గణమునకాజ్ఞన్
దా వడిగానిడి రాముఁడు, కేవల కరుణామయుండు - గృహమును జేరెన్.

— శ్రీరామ పట్టాభిషేకము —

తే॥ శ్రీమహిత మంగళప్రద - మౌ ముహూర్త
మొనర నిర్ణయమొనరించి - మునివరుండు
గురువరుండు వసిష్ఠుండు - కుతకమలర
రామ రాజ్యాభిషేక స - త్క్రమము జరప ౧౬౨౬
తే॥ హనుమదాదులచేఁ జతు - రబ్ధి జలము
లపుడె తెప్పించి దివ్యసిం - హాసనమున

వివిధ శుభవాద్యములు మ్రోగ - విధిహితముగ
రాముఁ గూర్చుండఁజేసె దా - రాయుతముగ. ౧౬౨౭

క॥ హెచ్చిన మచ్చికతో భూ, భృచ్చయమాసభనునిండె - నెల్లరుఁ బూసల్
గ్రుచ్చిన వడువునఁ జేరఁగ, వచ్చిరి వాద్యధ్వనుల్ న - భంబునుదాఁకన్. ౧౬౨౮

సీ॥ శ్రీరామచంద్రుండు-సింహాసనస్థుఁడై, స్మితవక్త్రకమలుఁడై-చెలువుమీఱె
సీతాసుసాధ్వియు-శ్రీరామవామాంక, సంస్థయై సమ్మోద సరణిఁగాంచె
వెనుకప్రక్కన ఛత్ర-మును బూని సంతోష, భరితుఁడై సౌమిత్రి-పరిఢవిల్లె
సవ్యపార్శ్వంబునఁ-జామరధారియై, భరతుఁడు నిర్మల-భక్తి వెలసె

తే॥ వ్యజనమునుదాల్చి శత్రుఘ్నుఁ - డనసమొంది
వామ భాగంబునందున - వఱలియుండె
నాంజనేయుఁడు మును - పాదుకాంచితములు
రామపదములు ధరియించి - రక్తిమించె ౧౬౩౦

సీ॥ వాయవ్యమునఁ బ్రీతి-వానరనాథుండు, జలపాత్రమును బూని-సరగనిలిచె
నీశాన్యమున దాన-వేంద్రుండు నెమ్మిమై, భవ్యదర్పణమును-బట్టినిలిచె
నాగ్నేయమునఁ బ్రేమ-నంగదుఁడును రమ్య, తాంబూలపాత్రంబు-దాల్చినిలిచె
నైరృతి జాంబవం-త ప్రధానుఁడు వస్త్ర, కోశము ధరియించి-కూర్మినిలిచెఁ

తే॥ దొడరి లక్ష్మణ భరత శ - త్రుఘ్నవరుల
యెడమప్రక్కల సంపాతి · హితుఁడు గుహుఁడు
ఘనుఁడు మకరధ్వజుఁడు శ్రద్ధ - మోఁయసిల్చి
రలర గరుడుఁడు హనుమడా - పలను నిలిచె. ౧౬౩౧

తే॥ భానుసుత దైత్య తారేయ-భల్లుకాఢ్య, వామపార్శ్వంబులందున-వరుసఁగాఁగఁ
జిత్రరథుఁడును విజయుఁడు-శ్రీసుమంత్రుఁ, డల్ల దారకుఁడును నిల్చి-రుల్లసమున.

తే॥ సురలు యక్షులు గంధర్వ - వరులునేన
గిన్నరులు కామరూపముల్ - చెన్నుమీఱు
నగములగములు నోషధుల్ - నదులు నదము
లెల్లరముఁ జేరితిమి రాము - నీక్షసేయ. ౧౬౩౩

తే॥ అప్పుడు వసిష్ఠముని సము-దాంబువులను, రమ్యతీర్థజలంబులఁ-బ్రమదమమర
విప్రమునియుక్తుఁడై రామ-పృథ్వీపతికి, విధిగ నభిషేకమొనరించి-వేడ్కనించె.

క॥ వాసవ సంప్రేరితుఁడై, భాసురమణికాంచనప్ర-భాదామము ను
ల్లాసము తనర సమీరుఁడు, వాసిగ నర్పించె రామ-భద్రునకు సభన్. ౧౬౩౫

క॥ దేవేంద్రుఁడు మఱి తానును, భావంబలరంగ లేచి - భర్మమణివ్రా
తావిష్కృత నవహారము, శ్రీవరునకు రామునకుఁ బ్ర - సిద్ధిగనిచ్చెన్. ౧౬౩౬

క॥ పాడిరి గంధర్వులు తమి, నాడిరి రోవెలఁదు లప్స - రోమునివర్యుల్
వేఁడిరి సుమములఁ గురియుచుఁ, గూడిరి దేవతలు మ్రోఁత-గొనె దుందుభులున్
క॥ భరతునిచేఁ బూజలు గొని, వరసభలోనుండు నేను - వాంఛతలిర్పన్
సురలెల్లరు గణుతింపఁగ, దొరకొని శ్రీరామచంద్రు - స్తుతి యొంచితిటుల్.

— శివకృతరామస్తుత్యష్టకము —

ఇంద్రవజ్ర॥ కారుణ్యపాత్రున్ వర - కంజనేత్రున్
ధారాధరగాత్రున్ బహు - ధా పవిత్రున్
సౌరిద్యుమిత్రున్ భువి - జాకళత్రున్
శ్రీరామచంద్రున్ నతి - జేసి యెంతున్. ౧౬౩౯

ఇంద్రవజ్ర॥ ధర్మావతారున్ హృత - ధాత్రిభారున్
శర్మాబ్ధిసారున్ భవ - సంగసారున్
గర్మ ప్రచారున్ బ్రవి - కారదూరున్
నైర్మల్యహృద్రాముఁగ - నన్ నతింతున్. ౧౬౪౦

ఉపేంద్రవజ్ర॥ రమావిలాసున్ శశి - రమ్యహాసున్
క్షమామరావాసు జ - గన్నివాసున్
సమస్త లోకాద్భుత - సత్ప్రకాశున్
నమస్కరింతున్ సుమ - నస్కరామున్. ౧౬౪౧

ఇంద్రవజ్ర॥ సౌందర్య ఫాలున్ హత - సప్తతాలున్
వందారులోలున్ వర - వాగ్రసాలున్
మందార మాలున్ సద - మర్త్యపాలున్
వందింతు రామున్ సుర - వైరి కాలున్. ౧౬౪౨

ఉపేంద్రవజ్ర॥ హతారి మానున్ విగ - తావసానున్
నుతాగమాంత ప్రవి - నోదగానున్
శతారధార్యాది ల - సత్ప్రధానున్
నతింతు రామున్ గజ - నాథయానున్. ౧౬౪౩

ఇంద్రవజ్ర॥ శ్యామాభిరామున్ నయ - నాభిరామున్
ధీమత్ప్రణామున్ గృత - దీన కామున్
శ్రీమద్యశోధాముఁ బ్ర - సిద్ధ నామున్
రామున్ నమస్కారము - లన్ భజింతున్. ౧౬౪౪

ఇంద్రవజ్ర॥ లీలా శరీరున్ రణ - లేఖ్యధీరున్
హేలా గభీరున్ జగ - దేక సారున్

వివిధ శుభవాద్యములు మ్రోగ - విధిహితముగ
రాముఁ గూర్చుండఁజేసె దా - రాయుతముగ. ౧౬౨౭
క॥ హెచ్చిన మచ్చికతో భూ, భృచ్చయమాసభనునిండె - నెల్లరుఁ బూసల్
క్రుచ్చిన వడువునఁ జేరఁగ, వచ్చిరి వాద్యధ్వనుల్ న - భంబునదాఁకన్. ౧౬౨౮
సీ॥ శ్రీరామచంద్రుఁడు-సింహాసనస్థుఁడై, స్మితవక్త్రకమలుఁడై - చెలువుమీఱె
సీతాసుసాధ్వియు-శ్రీరామవామాంక, సంస్థయై సమ్మోద సరణిఁగాంచె
వెనుకప్రక్కన ఛత్ర-మును బూని సంతోష, భరితుఁడై సౌమిత్రి-పరిఢవిల్లె
సవ్యపార్శ్వంబునఁ-జామరధారియై, భరతుఁడు నిర్మల-భక్తి వెలసె
తే॥ వ్యజనమునుదాల్చి శత్రుఘ్నుఁ - డసమమొంది
వామ భాగంబునందున - వఱలియుండె
నాంజనేయుఁడు మును - పానుకాంచితములు
రామపదములు ధరియించి - రక్తినించె ౧౬౩౦
సీ॥ వాయవ్యమునఁ బ్రీతి-వానరనాథుండు, జలపాత్రమును బూని-సరగనిలిచె
నీశాన్యమున దాన-వేంద్రుండు నెమ్మిమై, భవ్యదర్పణమును-బట్టినిలిచె
నాగ్నేయమునఁ బ్రేమ-నంగదుఁడును రమ్య, తాంబూలపాత్రంబు-దాల్చినిలిచె
నైరృతి జాంబవం-త ప్రధానుఁడు వస్త్ర, కోశము ధరియించి-కూర్మినిలిచెఁ
తే॥ దొడరి లక్ష్మణ భరత శ - త్రుఘ్నవరుల
యెడమప్రక్కల సంపాతి - హితుఁడు గుహుఁడు
ఘనుఁడు మకరధ్వజుఁడు శ్రద్ధ - మోఁయసిల్చి
రలర గరుడుఁడు హనుమదా - పలను నిలిచె. ౧౬౩౧
తే॥ భానుసుత దైత్య తారేయ-భల్లుకాఢ్య, వామపార్శ్వంబులందున-వరుసఁగాఁగఁ
జిత్రరథుఁడును విజయుఁడు-శ్రీసుమంత్రుఁ, డల్ల దారకుఁడును నిల్చి-రుల్లసమున.
తే॥ సురలు యక్షులు గంధర్వ - వరులు నేసు
గిన్నరులు కామరూపముల్ - చెన్నుమీఱ
నగములగములు నోషధుల్ - నదులు నదము
లెల్లరముఁ జేరితిమి రాము - నీక్షసేయ. ౧౬౩౩
తే॥ అప్పుడు వసిష్ఠముని సము-ద్రాంబువులను, రమ్యతీర్థజలంబులఁ-బ్రమదమమర
విప్రమునియుక్తుఁడై రామ-పృథ్వీపతికి, విధిగ నభిషేకమొనరించి-వేడ్కనించె.
క॥ వాసవ సంప్రేరితుఁడై, భాసురమణికాంచనప్ర-భాదామము ను
ల్లాసము తనర సమీరుఁడు, వాసిగ నర్పించె రామ-భద్రునకు సభన్. ౧౬౩౪
క॥ దేవేంద్రుఁడు మఱి తానును, భావంబలరంగ లేచి - భర్మమణివ్రా
తావిష్కృత నవహారము, శ్రీవరునకు రామునకుఁ బ్ర - సిద్ధిగవైచెన్. ౧౬౩౬

క॥ పాడిరి గంధర్వులు తమి, నాడిరి రోవెలఁదు లప్పు - డా మునివర్యుల్
వేఁడిరి సుమములఁ గురియుచుఁ, గూడిరి దేవతలు మ్రోఁత-గొనె దుందుభులున్
క॥ భరతునిచేఁ బూజలు గొని, వరసభలోనుండు నేను - వాంఛతలిర్పన్
సురలెల్లరు గణుతింపఁగ, దారకొని శ్రీరామచంద్రు - స్తుతి యించితిటుల్.

— శివకృతరామస్తుత్యష్టకము —

ఇంద్రవజ్ర॥ కారుణ్యపాత్రున్ వర - కంజనేత్రున్
ధారాధరగాత్రున్ బహు - ధా పవిత్రున్
సౌరిద్యుమిత్రున్ భువి - జాకళత్రున్
శ్రీరామచంద్రున్ నతి - నేసి యొంతున్. ౧౬౩౯

ఇంద్రవజ్ర॥ ధర్మావతారున్ హృత - ధాత్రిభారున్
శర్మాబ్ధిసారున్ భవ - సంగసారున్
గర్మ ప్రచారున్ బ్రవి - కారదూరున్
నైర్మల్యహృద్రాముఁగ - నన్ నతింతున్. ౧౬౪౦

ఉపేంద్రవజ్ర॥ రమావిలాసున్ శశి - రమ్యహాసున్
క్షమామరావాసు జ - గన్నివాసున్
సమస్త లోకాద్భుత - సత్ప్రకాశున్
నమస్కరింతున్ సుమ - నస్కరామున్. ౧౬౪౧

ఇంద్రవజ్ర॥ సౌందర్య ఫాలున్ హత - సప్తతాలున్
వృందారులోలున్ వర - వాగ్రసాలున్
మందార మాలున్ సద - మర్త్యపాలున్
వందింతు రామున్ సుర - వైరి కాలున్. ౧౬౪౨

ఉపేంద్రవజ్ర॥ హతారి మానున్ విగ - తావసానున్
నుతాగమాంత ప్రవి - నోదగానున్
శతారధార్యాది ల - సత్ప్రధానున్
నతింతు రామున్ గజ - నాథయానున్. ౧౬౪౩

ఇంద్రవజ్ర॥ శ్యామాభిరామున్ నయ - నాభిరామున్
ధీమత్ప్రణామున్ గృత - దీన కామున్
శ్రీమద్యశోధాముఁ బ్ర - సిద్ధ నామున్
రామున్ నమస్కారము - లన్ భజింతున్. ౧౬౪౪

ఇంద్రవజ్ర॥ లీలా శరీరున్ రణ - లేఖ్యధీరున్
హేలా గభీరున్ జగ - దేక సారున్

శ్రీలోలు సూర్యాన్వయ - రక్షవారున్
జాలన్ నతుల్ సల్పెద - శ్యాము రామున్. ౧౬౪౭

ఇంద్రవజ్ర॥ సాంగోపగీతున్ హృద - య ప్రతీతున్
సంగీత కావ్యామృత - సారభూతున్
రంగద్వచోతీతు ఖ - ల ప్రఘాతున్
శృంగార రామున్ నతి - సేసియెంతున్. ౧౬౪౮

ఇంద్రవజ్ర॥ శ్రీరామ పద్యాష్టక - రీతి భక్తిన్
బారంబుగాఁగన్ విని - వ్రాసి రక్తిన్
మీఱన్ బఠింపన్ గడు - మేలు కల్గున్
నా రమ్యవాగర్థము - న్యాయమౌతన్. ౧౬౪౭

—* దశరథుఁడు రామపట్టాభిషేక మహోత్సవమువలన నానందించుట. *—

చ॥ అని నుతియించి యాసదము - నందుఁ బ్రియంబుగ నేనునుండ నం
తనె పదితేర్ల జేఁడు ద్యుతిఁ - దారి విమానమునుండి రామచం
ద్రునిఁ బరమాత్ము బంధుజన - తోషితు ధారిణిజాసమేతుఁ బా
వనమతి రాజ్యపీఠమున - భాసిలు పుత్త్రకుఁగాంచి యిట్లనెన్. ౧౬౪౮

శా॥ రామా! ధన్యుఁడనైతి నేను బితరుల్ - రంజిల్లగా ధన్యు లెం
తే మాన్యంబును ధన్యమయ్యెఁ గులమున్ - దేశంబు ధన్యంబు నిన్
శ్రీమద్రాజ్యశుభాభిషేచితుని వీ - క్షింపన్ ఫలంబబ్బె మ
ద్భామా రత్నము కోసలాత్మజ కడున్ - ధన్యాత్మ నిన్ గాంచెఁగా? ౧౬౪౯

చ॥ అనవుడు రాముఁడున్ బితకు - హర్షముమై నతిసేసె లక్ష్మణుం
డును భరతుండు శత్రుదమ - నుండును గోసలజాదిభామినుల్
ఘనముగుభక్తిఁ బంక్తిరథుఁ - గాంచుచు మ్రొక్కిరి మంత్రులున్ బ్రియం
బునఁ బురివాసులున్ బ్రభు! న - మోయని చేతులు మోడ్చిరత్తఱిన్. ౧౬౫౦

— శ్రీరాముఁ డందఱను సత్కరించుట. —

తే॥ దశరథుఁడు నెల్లవారితోఁ - దగు విధముల
ముచ్చటించుచు రాముచేఁ - బూజలొందె
నేను మొదలగు దేవతల్ - జ్ఞానధనుఁడు
రాముఁడిడు సత్కృతుల నంది - రంజిలితిమి. ౧౬౫౧

మ॥ సురగంధర్వులు యక్షకిన్నరులు రా - జుల్ శ్రీదశస్యందనుం
డరుసంబొప్పఁగ నేను మానులును రా - మామంత్రణంబొంది చె

చ్చిర మాచోటులు చేరఁబోయితిమి మిం - చెన్ భోగభాగ్యంబు లు
ర్వరయయ్యెన్ ధర పాడిపంట లొదవెన్ - రాముండు రాజౌటచేన్. ౧౬౫౨

తే॥ తరులు లతలును ఫలసు మ - భరితములుగ
సుమము లత్యంత పరిమళ - శోభితముగ
నలరి పొలుపారె దక్షిణా - నిలుఁడు తొడరి
మెల్ల మెల్లగ సుఖము సం-ధిల్ల వీచె. ౧౬౫౩

క॥ మా రాముఁడు శ్రీమత్సీ, తారాముఁడు సకల విభవ - ధర్మ్మలసద్రా
జ్యారాముఁడయ్యెఁ బ్రభులిఁక, శ్రీరాముని కెవరుసాటి - క్షితి ననిరి జనుల్.

ఉ॥ రాముఁడు నూఱువేలగు తు - రంగములున్ వరధేనువుల్ ప్రియం
బామతిలంగ లక్ష వృష - భాఢ్యము లొక్క-శతంబు కోట్లకున్
హేమ ధనంబులున్ మణులుఁ - బృథ్వీసురావళికిచ్చి భాను శో
భామయ రత్నహారమును - భానుసుతాగ్రణికిచ్చె మెచ్చుచున్. ౧౬౫౪

సీ॥ భక్త వత్సలుఁడును - బార్థివాగ్రణియైన, శ్రీరామచంద్రుండు - చెలువు వెలయ
నా విభీషణునకు - నవతంస వర్యంబు, నొసఁగి యంగదునకు - నెసక మెసఁగ
సలలిత బాహు భూ - షణము ప్రీతిగనిచ్చి, సీతచేతికి దర - స్మితము తనరఁ
గోటిచంద్రప్రభా - పాటవాన్విత దివ్య, ఘనరత్నహారంబు - గొనఁగనిచ్చె

తే॥ నంత శ్రీజానకీకాంత - సంతసమున, మారుతాన్వితమును భర్తృ - మానితంబు
నైన యారత్నహారంబు - నాంజనేయు, నకు నొసంగెను గౌరవ - ప్రకటనముగ

క॥ అత్తఱి శ్రీరాముఁడు కపి, సత్తము హనుమంతుఁగాంచి - సత్కరుణమెయిన్
జిత్తంబలరఁ బ్రసన్నుఁడ, నిత్తున్ హనుమా! వరంబు - లిదె కోరుమనెన్.

చ॥ హనుమయు భక్తిపూర్వకము - లౌ ప్రణతుల్ ఘొనరించి దేవ! పా
వనమతి నీదు నామమును - బ్రత్యహమున్ స్మరియించుచుండు నై
నను బరితృప్తి నొందదుః మ - నంబటుకావున నీదు పేరు మే
దిని మనునంతకాలము స - దేహుఁడుగా వరమిమ్ము నాకిఁకన్. ౧౬౫౫

సీ॥ భవదీయ చరితంబు - భావుకంబుగ నెందు, వినఁబడు నచటికి - వేగఁజనఁగ
వరమిమ్ము మఱియు దే - వళముల నదులను, నిమ్నగా తటములన్ -దీర్ఘములను
దజ్జలాశయములఁ - దక్క వేఱగుచోట్ల, గడియ లాఱిటిమీఁదఁ-గడుముదమున
నీ కథల్ జరగఁగా - నెమ్మి వరమ్మిమ్ము, రామా! యటంచుఁ బ్రా-ర్థన మొనర్ప

తే॥ రాముఁ డవ్విధముగనె వ - రంబులొసఁగి,
మారుతీ! నీవు కల్పాంత - మహితసముచ

మంతేవత్రికును సుఖముండి - యప్పుడు నాను
భవ్య సాయుజ్యపదవినిఁ - బడయుమనియె. ౧౬౫౯
ఉ॥ సీతయు మారుతింగని వి - శేషముదంబున నాంజనేయ! ప్రి
స్ఫీతసుఖంబులెల్లఁ బృథ - వీగను మెచ్చుట నుండిన్ భవ
చ్చేతము రంజిలన్ యశము - సెంనుము భక్తవరూడ వీవు వి
ఖ్యాతచరిత్రుఁడౌదువు మ - దాజ్ఞను బూజ్యుఁడవౌదు వారయన్. ౧౬౬౦
తే॥ మానవులు విఘ్నశాంతికై - పూని నిన్ను
భక్తిఁ బూజింత్రు స్మరణ ప్ర - సక్తివలన
భూతములు ప్రేతములు పిశా - చాతురములు
నాశనంబౌ నటంచుఁ గ్రి - న్నన వచించె. ౧౬౬౧
క॥ సాకేతోపాగతులువ, నౌకసులా రామువలన - నొగి సత్కృతులై
రా కాంచనమణిభూషలు, శ్రీకరవస్త్రములు పడసి - ప్రియమింపారన్.
క॥ సుగ్రీవ ప్రముఖులును ద, శగ్రీవుని భ్రాతృవరుఁడు - సంపాతియు రా
జాగ్రిణులున్ మకరధ్వజుఁ, డగ్రియుఁడు గుహుఁడు నొంది - రటుబహుమతులన్
క॥ పిమ్మట భక్ష్యమ్ములు భో, జ్యమ్ములు లేహ్యమ్ములున్ ఘృ - తాదికములు చో
ష్యమ్ములు పానీయమ్ములు, సమ్మతిఁ దసరంగ రామ - చంద్రుఁడు తమిమై.
తే॥ అందఱును గూడి రమ్య గృ - హాంతరమున
భోజనమునకుఁ గూర్చుండి - యోజఁదాను
విధిగఁ బ్రాణాహుతులుఁ గొన, - వేళ మెఱ్ఱఁగి
కుప్పిగంతులు వైచి హ - న్మప్ప వచ్చి. ౧౬౬౪
క॥ రాముని భోజనపాత్రము, హైమంబగు దానిఁ బదము - లమరెడిదానిన్
గామితపదార్థపూరిత, మై మేలగుదానిఁ గొనియె - హాసాస్యుండై. ౧౬౬౬
చ॥ అటుకొని రామశేషమును - హర్షముగాఁదినుచెల్ల కోఁతులన్
దటుకునఁ బిల్చి చన్నమును - దత్థ్రలమందున వైచుచుండ ను
త్కటమగు భక్తిఁగీశులును - దానవవర్యవిభీషణుండు న
చ్చటునకుఁ బర్వువాఱిరి ని - జ ప్రభురాముని మొంగిలిం దినన్. ౧౬౬౭
క॥ ఆలీల వారలెల్లరు, కోలాహలముగను బుడమి - కూఁతు మగనిదౌ
మేలైన భుక్తశేషము, వాలాయముగా భుజించి - వాయుజుఁబొగడన్ఁ ౧౬౬౮
తే। తద్వినోదము గని రామ - ధరణిధవుఁడు
ధరణిజాతయు సంతోష - భరితులైరి

తోడరి యివ్విధి వివిధ శా - తుకము లొప్ప
భానుజాదులు కొన్నాళ్ళు - వఱలి రచట. ౧౬౬౯
ఉ॥ అంతననంతకాంతులు ది - గంతరముల్ వెసఁగ్రమ్మఁ బుష్పకం
బెంతయు వచ్చి రాముఁగని - యిట్లనె నోప్రభువర్య! యక్కుబే
రాంతికమందునుండియుఁ ఒ - దాజ్ఞను వచ్చితి నిన్నుగొల్వ నీ
చెంతనెయుందు నంచనిన - శ్రీరఘురాముఁడు పల్కెఁ బ్రీతుఁడై. ౧౬౭౦

—శ్రీరామునివలన సెలవుగొని యెల్లరును నిజనివాసముల కరుగుట.—

క॥ వరపుష్పకమా! నీవిఁకఁ, ద్వరగా సుగ్రీవ ముఖ్య - భవ్యగుణుల నె
ల్లరనుఁ స్వస్థానంబుల, నరుసంబుగఁజేర్చి ద్వార - మందున నిలుమా! ౧౬౭౧
క॥ అనవుడు చిత్తంబనుచు గ, గనయానము రవిసుతాది - ఘనులను శీఘ్రం
బున స్వస్థలములు చేరిచి, యనువొప్ప నయోధ్యయందు - నటువసియించెన్.
సీ॥ ఘనుఁడు విభీషణుం - డును లంకలో ధర్మ, రాజ్యంబుసేయుచుఁ-బ్రఖ్యాతిఁగాంచె
మకరధ్వజుండు ధ - ర్మంబుగాఁ బాతాళ, మున రాజ్యమేలుచు-ఘనతఁ గనియె
గరుడఁడు యౌవరా-జ్య రమా విలాసంబు, సంపాతి కొనగూర్చి- స్తవముగొనియె
కిష్కింధయందు సు-గ్రీవుండు కపులతో, రాజ్యంబు సలుపుచు-రమణమించె
తే॥ శృంగిబేరపురంబునఁ - బ్రియమెలర్ప
గుహుఁడు రాజ్యపదంబంది - గొప్ప నొందె
నంజనా నందనుఁడు రాము - నాజ్ఞవడసి
తపమొనర్పఁగ హిమధరా - ధరముఁజేరె. ౧౬౭౩
క॥ ఐదాఱునాళ్ళకొకమా, ఱాదరమును గొన విభీష - ణాదు లయోధ్యన్
గాదిలిఁ జేరుచు నట సీ. తాదయితునిఁ గొల్చుదురు స - దా ముదమొదవన్.
తే॥ అఖిలవత్సలుఁడగు రాముఁ - డఖిలరాజ్య
మిుర్వి శాసించి పాలించు - చోర్మి మీఱ
వలదటన్నను లక్ష్మణు - వైభవముగ
యౌవరాజ్యాభిషేకంబు - నందఁజేసె. ౧౬౭౫

— శ్రీరాముని రణయజ్ఞ వర్ణనము. —

వ॥ లక్ష్మణుండును భక్తిపరుండై సౌభ్రాత్రంబు మెఱయ రామసేవా ధురీణుండయ్యె
విశ్వామిత్రాధ్వర పూర్వంబున నట్టి రణయాగంబునకు రఘురాముండు ప్రారం
భించె నట్టి రణాధ్వరంబు పూర్ణతఁగనియె నెట్టులనిన. ౧౬౭౬
మ॥ రణరంగంబది యజ్ఞకుండ మిఁక మం - త్రంబుల్ సుయోధ ప్రఘా
గణనారావము శస్త్రనిస్వనమె త - త్కార్మాత్త సంరంభ మా

రణ పాషాణ విఘర్షణంబె సువిధా - రామార్జనం బస్త్రరా
డ్గణమే దర్భపరిస్తృతంబు స్థిరవశా - టన్ ధైర్యమూహ్యాంబయెన్. ౧౬౭౭

మ॥ ఘనకాలానల మగ్ని స్రుక్కుతలఁపన్ - గాండంబు దాఁకన్ రయం
బున మాంసాహుతి వేల్వఁగాఁబడెఁ గరం - బున్ దద్వసోర్ధారయ
య్యెను రక్తాంచితధార శస్త్రకళ వ - హ్నిజ్వాల స్వేదస్రవం
బనలోద్ధూమము యజ్ఞఘోషమయె హా - హాకార మోంకారమై. ౧౬౭౮

మ॥ అవి వీరుల్ విడుపట్టె బాణతతియే - యయ్యాజ్యసేకంబు దీ
పనిధానంబగు జీవసంహనన మ - ప్పాటన్ వెలిన్ బాఱువా
రనిలో దీపబలిన్ హరించుజడుల - ప్లాటన్ బరానందమున్
గనరవ్వారలు హోమపూర్ణ విధికిన్ - గ్రాహ్యాంబులయ్యెన్ దలల్. ౧౬౭౯

మ॥ సవమం దొప్పు ప్రదక్షిణంబు రణ ద - క్షశ్రేణి సవ్యాంబుగా
నవనిన్ దిర్గుట స్వీయవహ్న పదము లీ - యంబూనుటే దక్షిణల్
దివిజుల్ నేకురియించు పుష్పములె భూ - దేవాభిషేకాంబువుల్
జవసత్త్వంబులు మీఱఁగా జయము హె - చ్చన్ గాంచుటే శ్రేయమున్.

తే॥ జంగమ స్థావరానంద - ముంగనంగ, స్వాన్వయానంద మాభూత - పాళితర్ప
ణంబె విప్రుల సంతర్ప - ణంబు రామ, భవ్యబాహువునే రణా - ధ్వరముజరగె.

క॥ విశ్వామిత్రుని యజ్ఞము, విశ్వస్తుతుఁడైన రాము - విభు రణయజ్ఞం
బైశ్వర్యప్రద మొప్పఁగ, శాశ్వతయశమంది యేక - సామ్యములయ్యెన్.

క॥ గాధిజు జన్నము సాంతం, బై ధాత్రిని ముందె జరగె - నారాముని యు
ద్ధాధికయజ్ఞము నిల్వక, యేధితయత్నమునఁ దనరె - నింతటి వఱకున్.

వ॥ కావున శ్రీరామచంద్రుండు కాలానలంబునకుఁ బరితృప్తిం గూర్పఁ బుడమిని పాత్రంబుగా నొనర్చి విరాధరుధిరంబుచేఁ దత్పాత్రంబుఁ బ్రోక్షించి చిత్రాహుత్యర్థమై శూర్పణఖా ఘ్రాణకర్ణంబుల ఛేదింపఁజేసి ప్రాణాహుతులకై ఖరదూషణ త్రిశిరమారీచ కబంధుల నిహతంబు సలిపి శిఖాబంధ విమోక్షార్థంబై శబరీభవబంధనంబు ద్రొలంచి సేతుజలస్పర్శనార్థంబై వాలిని వధించి తదస్రంబునించి క్ష్వధితార్థంబై లంకాపురినిఁ గాల్పించి కుంభకర్ణునోదనంబుగాఁ జేసి యింద్రజిత్తును బక్వాన్నంబుగాఁ జలిపి బహువిధశాకార్థంబై రాక్షసుల మ్రందించి సారణుని శాల్యన్నంబుగా నొనర్చి ప్రహస్తుని వడియంబుసేసి నికుంభు నప్పళంబుగా నప్పగించి కుంభుని లవణంబుగావైచి కాలనేమిని బాయసార్థంబై పంచత్వమొందించి యతికాయుని శర్కరగాఁ జూఱొనర్చి మైరావణుని క్షీరంబుగాఁ జేసి మైరావణుని ఘృతంబుగాఁ జలిపి దధ్యోదన సమాప్తంబుగా దశగ్రీవుని సంహరించి నివేదించి

సకల పదార్థయుక్తంబగు నమ్మహాపాత్రంబు కాలానలునకుఁ దృప్తికరంబుగా నొసంగె త్వక్క్లేశకీకసాకులం ద్యజించుటయె యుచ్ఛిష్టబలిసంత్యాగంబయ్యె నివ్విధంబున రణాధ్వరంబు నెఱవేర్చి శ్రీరాముఁడయోధ్యాం బ్రవేశించి రాజ్యాభిషేకంబు నొందుటయె యవభృథస్నానంబు సమస్త మంగళాచారంబులును దక్షిణ యజ్ఞాంగ విహితంబులుగా నెఱుఁగునది శ్రీరామ రణయాగ వర్ణనంబు సవిస్తరంబుగా వచించితి పరమాత్ముండైన రాముండు నిర్వికారుండును నిర్మలుండును సదానందుండును గర్తృత్వాది విహీనుండునునయ్యు లోకోపదేశార్థంబు సంతోషంబుగా గార్హస్థ్య మవలంబించి వివిధ ధర్మంబు లొర్పం దొడఁగె మఱియును.

ఉ॥ రాముఁడు రాజుకాఁగ నభి - రామతనందిరి భూప్రజల్ ముదం
బామతిలెఙ్ జగంబునకు - నాధులు వ్యాధులు బాధలుఙ్ ఫణి
స్తోమభయంబు తస్కరుల - దుండగముల్ కనరావు సద్గుణో
ద్దాముఁడతండు పుత్త్రుల వి - ధంబున నెల్లరఁ బ్రోచుఁగూరిమిఙ్.

తే॥ తండ్రివలె నెల్లరును రాముఁ - దలఁచుచుండ్రి
సీతతో సోదరులతోడ - స్ఫీతముదము
తనర సాకేతమున రామ - జనపతియును
సర్వభోగంబు లొందుచు - స్తవముగాంచె.

—♦ మునులతోడ నగస్త్యుఁడు శ్రీరామదర్శనమునకు వచ్చుట ♦—

క॥ రామునిఁగనఁగ నొకప్పుడు, శ్రీమహితుఁడు కుంభభవుఁడు - చెల్వుగవానిఁ
గ్రామణులతో నయోధ్యకు, నామోదను మీఱవచ్చె - నతిసుతుకమునఙ్.

తే॥ అయ్యగస్త్యాది మునుల ది - వ్యాంఘ్రికమల
ములకుఁ బ్రణమిల్లి - శ్రీరామమూర్తి మిగుల
వారలకు సత్క్రియలు సల్పి - గౌరవంబు
నిండ ధర్మాసనముల గూ - ర్చుండఁ జేసె. ౧౬౮౭

తే॥ సుఖులు తుష్టులునై ముని - స్తోమమెల్ల
గుశలసంప్రశ్న మొనర ర - ఘుప్రవీరుఁ
గనుచు శత్రునిషూదనా! - ఘనసుఖోప
భోగివగు నిన్నుదలఁతుమె - ప్పుడును మదిని. ౧౬౮౯

తే॥ మేఘనాదుండు మొదలగు-మేటిరాక్ష, సులను నిర్మూలమొనరించి-యిలనునీవు
చాలఁ గృతకృత్యుఁడైతివి-జానకీ వి, శేషసుఖదాయివని ప్రశం-సించి రంత.

క॥ చిఱునగవున రాముండును, గఱకరియగు మేఘనాదు - ఘనతయె మొదటఙ్
గఱుమనఁ బల్కితిరేలొకో?, మఱితెల్పుఁడటంచు ఘనుల - మానులనడిగెఙ్.

క॥ అందుల కగస్త్యముని ని, ష్యంద మరందంబుచంద - మందముమధురం
బొందిన పొందగునుడుల న, మందానందమునఁ బలికె - మహిజాపతితోన్.

క॥ వినుమా! రామా! యిందద్విజ, తుని చరితము జన్మకర్మ - దోహాలమెల్లన్
మునుకొని సంక్షేపంబుగ, వినిపించెదఁ దద్యశో ప్తి - విధియుఁ గ్రమముగాన్.

--♦ రావణ కుంభకర్ణాదుల జన్మకర్మ వృత్తాంతము ♦ -

చ॥ కృతయుగమందుఁ బూర్వము వి - రించిసుతుండు పులస్త్యనాముఁ డం
చితతృణబిందునందినినిఁ - జెల్వుగనొందియు విశ్రవోభిధున్
సుతుఁగనె లోకవిశ్రుతు సు - శోభితువేదనిధిన్ మునీంద్రుఁ ద
త్సుతుఁడును దేవవర్ణియను - సుందరినిన్ నిజపత్నిగాఁ గొనెన్. ౧౧౯౪

తే॥ వరభరద్వాజభవదేవ - వర్ణియందు
విశ్రవసుఁడును దనయుని - వైశ్రవణునిఁ
గాంచి సంతోషమునమించె - గ్లావిధమున
వైశ్రవణుఁడును బాలుపొంది - భక్తి వెలయ. ౧౧౯౫

మ॥ చిరకాలంబు తపంబొనర్పవిధియున్ - జెల్వారఁ బ్రత్యక్షమై
పరణీయంబగు పుష్పకంబు ధనసం - పద్రాజరాజత్వమున్
వరముల్ గానిడె నంత వైశ్రవణుఁడున్ - భావంబు పొంగన్ గృపా
కరునిన్ దండ్రినిఁజేరి మ్రొక్కి నెలవున్ - గాంక్షించి ప్రార్థించెడాన్. ౧౧౯౬

మ॥ సుతసంప్రార్థనమెంచి విశ్రవసుఁడున్ - శోభిల్లు లంకాపురిన్
దతవాదాసని వార్ధిమేఖలను నా - నాగేహ సంభూషితన్
దితిజుల్ వెన్నుని భీతిచేవిడినదా - నిన్ విశ్వకర్మోత్కృతన్
సుతుకై తెల్పిన నెల్లెయంచు నతఁ డ - చ్చోటన్ వసించెన్ దమిన్. ౧౧౯౭

చ॥ ఒకతఱినిన్ సుమాలియను - నొక్క నిశాచరుఁ డాత్మజామణిన్
సుకముగ వెంటఁదోడ్కొని వ - నుల్ పురముల్ గనుగొంచునేగి త్రిభ్రం
బకసఖుఁగాంచి పుత్త్రియగు - మానినిఁగైకసిఁ జూచి బిడ్డ! నీ
వికఁజని విశ్రవోమునిని - నెంతయు వేఁడుము సత్సుతార్థమై. ౧౧౯౮

తే॥ అతనికృపచేత శ్రీధనా-ధ్యక్షుపగిదిఁ, దేజవిరాజిన సుతులు పెం-తిగ జనింత్రు
దానమేలగు మనకుం స-తంబటంచు, రాక్షసహితార్థమై పల్కె-దక్షతమెఱుఁ

ఉ॥ ఆవనితాలలామయును ర - యంబున నస్తమయంబువేళ మెహా
దావహమైన మునింగని ప - దాంగుళిచే భువివ్రాయుచున్ నిలన్
బావనశీలుఁడాతఁడును - బంకజనేత్రనుగాంచి కాంత! నీ
వేవిధినుంటి వేల? భవ - దిచ్ఛయదేది? యటంచుఁ బల్కెడాన్. ౧౨౦౦

తే॥ అంగములకు నామె మీఱ రతే - యర్థులరయ
ననుచు బహులువచించె స - య్యనఘుఁడంత
నంతరంగంబునందుఁ ద - త్కాంతతృషను
దెలిసి యిట్లనిపలికెను - జెలువ్రుతనర. ౧౨౦౧

చ॥ తరుణిరో! నిమనోభిలషి - తంబు నెఱింగితిఁ బుత్త్రకామవై
యరయఁగ దారుణంపు సమ - యంబున వచ్చితివీవు కావునన్
గఱకరులైన రాక్షసులు - కర్గదరిద్ధులు నీకుఁ బుత్త్రులి
ద్ధరణి నఘోరరూపులు కృ - తాంతసమానులు నౌదు రెన్నఁగన్. ౧౨౦౨

క॥ అనవుడు మునిశార్దూలునిఁ, గని కైకసి దేవ మీకుఁ - గలిగిన తనయుల్
ఘనకృపణులైన నెట్లని, వినయంబునఁ బ్రార్థనంబు - వేమఱుసలిపెన్. ౧౨౦౩

చ॥ మునియు దయామయుండయి ప్ర - మోదముతోఁ జపలాక్షిఁ గాంచి యో
వనిత! త్వదంతిమోద్భవుఁడు - భవ్యగుణుండగుఁ జుమ్ము నీవు చిం
తను మదివీడుమంచును మ - నంబలరన్ వచియించెఁ గైకసీ
ఘనకచయుం గ్రమక్రమము - గాఁగనెఁ బుత్త్రులఁ బుత్త్రికాత్రియిన్. ౧౨౦౪

తే॥ రావణునిఁ గుంభకర్ణునిఁ-గాంచియనెడు, దాని శూర్పణఖాఖ్యఁ గుం-భీనసినిని
గాంచి కడపటఁగనియె ర - క్షఃకులాబ్ధి, మణిని సద్గుణుఁడౌ విభీష-ణుని ఘనుని.

ఉ॥ రావణకుంభకర్ణులును - రాములకారాతులు మువ్వురున్ సుదు
ర్భావ దురాగ్రహంబు లమ - రన్ మునిహింసకులై సమస్తభూ
తావళిఁబట్టి మ్రింగుచును - నారయ దుష్టచరిష్ణులైరి స
ద్భావముతో విభీషణుఁడు .. ధర్మపథంబుననుండె నెన్నికన్. ౧౨౦౫

—♦ రావణుఁ డీశ్వరునివలన వరములు పడయుట ♦—

చ॥ ఒకతఱి రావణుండు తలి - యొక్కతమిన్ నెఱవేర్ప లింగమున్
బ్రకటితభక్తిఁ దెచ్చుటకుఁ - బోల్పడి శ్రీరజతాద్రిఁ జేరి త్ర్యం
బక సఖుఁగూర్చి దుష్కరత - పంబొనరింపఁ గడంగి శీర్షమున్
స్వకృతికిఁగాఁగఁ దున్మికొని - పాదతలంబుననిల్పి దానినిన్. ౧౨౦౬

తే॥ తనువు వీణగ నంత్రముల్-తంత్రులుగను, నంగుళులు శంకువులుగ ర-యానఁ జల్పి
తాను షడ్జస్వరంబున-గానమపుడు, సేసె గాంధర్వమును గడు-చెన్నుమీఱ.

ఉ॥ శంకరు భక్తమానసవ - శంకరుఁ గింకరలోకశంకరున్
బొంకమెలర్పఁగాంచుచు న - మోయని మ్రొక్కుచు నందికేశ్వరుం
డంకనెయుండ నాతనిని - నాశివుఁడుంగని పల్కె నీవు ని
శ్శంకగ లింగమిచ్చుట పొ - సంగదటంచును బంపు రావణున్ ౧౨౦౭

క॥ నావుడతఁడేగి వేగము, రావణు శీర్షంబు సంధి - లంజేసియు దు
ర్భావుఁడవు రాక్షసుండవు, నీవరుగుము హరుఁడు లింగ - మీయండనియెన్.

చ॥ అదివిని రావణుండును ని - శాంతముకాఁగ మఱిన్ శిరంబునన్
మొదటివిధంబునన్ దునిమి - మున్కొని గానమొనర్చెనట్టులే
పదిదినముల్ ఘొనర్చెనఁ గృ - పావశుఁడై గిరిజావిభుంటు తా
ముదమునవచ్చి రావణుని - ముందటనిల్చి వరంబు లీయఁగన్. ౧౭౧౧

తే॥ శంభుఁగాంచి శిరస్కుఁడై - క్షణదచరుఁడు
భక్తియుక్తంబుగా మ్రొక్క - భర్గుఁడంత
సంతసంబంది రావణా! - స్వాంతమలర
వలయు వరములఁగోరుమా - వడిగనియె. ౧౭౧౨

ఉ॥ రావణుఁడున్ ముదాత్ముఁడయి - ప్రార్థనసేయుచు నీశ్వరున్ శుభం
బావహిలంగ లింగమిడు - మా! యని మాతృహితంబుకోరి గ
ర్వావృతుఁడై గిరీంద్రజను - నార్యను భార్యగఁగోరె నీశ్వరుం
డావిధిగా వరంబులిడి - యాతనిఁగాంచి వచించె నిట్టులన్. ౧౭౧౩

క॥ పదిదినములు మత్ప్రీతిగ, గొదకొని నీతలను దునుము - కొనితివి కనుకన్
బదితలలుకల్గి మఱి యిరు, వదిచేతులుకల్గి మనుము - వసుధాస్థలిలోన్.

మ॥ అనినన్ రావణుఁడున్ దశాస్యుఁడయి ది - వ్యంబైన లింగంబు నా
ర్యను దా నిర్వదిచేతులొప్పఁగొని స్వీ - యంబౌస్థలింజేర నే
గెను ద్రోవన్ హరియైన నీవ గిరిజన్ - గీడేద విడ్పించియున్
ఘనయుక్తిన్ బథమందె లింగమును గో - కర్ణంబునా నిల్పితో. ౧౩౧౪

మ॥ హరియానీదగు వాక్యజాలముల దై - త్యాగ్రేసరుండున్ శుభా
కరయా శ్రీమయపుత్త్రినిన్ గృహిణిగాఁ - గాంక్షించి పెండ్లాడి సం
బరమేపారఁగ సత్కృతుండయి సతీ - మందోదరీ యుక్తుఁడై
యరిగెన్ స్వస్థలిఁజేరెఁ దల్లిపనుపా - హారీతభంగంబుకాన్. ౧౭౧౫

మ॥ ధననాథున్ వరపుష్పకస్థు నొకటన్ - దత్తైకసీకాంత క
న్గొని పుత్త్రిత్రియితోడఁబల్కెఁ ద్రపమీ - కున్ లేదు సాపత్నబం
ధునిటా గౌరవమీతుసేయుఁడిదె షం - డుల్ మీరు జీవచ్ఛవాల్
మనవంశంబున హీనులై తిరనఁగా - మాతృాక్తి రోషించుచున్. ౧౭౧౬

—• రావణ రావణానుజులు బ్రహ్మనుగూర్చి తపంబు లొనర్చుట •—

క॥ ఉత్తమ గోకర్ణస్థలి, కత్తఱి దశకంధరుండు - నాతని తమ్ముల్
సత్తపమొనర్ప నేగిరి, చిత్తంబుల బత్తిమీఱ - శ్రీముజుఁగొలువన్. ౧౭౧౭

సీ॥ పదివేల వర్షముల్-గొదకొని యాకుంభ, కర్ణుండు తపమును-ఘనతఁ జలిపె
నైదువేలేండ్లు ప-దాంగుష్ఠసంస్థితిఁ, దద్విభీషణుఁడును-దపమొనర్చె
నాదశాస్యుండు ధూ-మాహారియై దివ్య, వర్షముల్ వేయి త-పస్సుజరగఁ
దలనొండు ఖండించి-తద్వహ్ని వేల్చుచుఁ, దొమ్మిదిమార్లిట్లు-తొడరిచేసె
తే॥ నటులె పదియవతఱిఁ బ్రధా-నాంగమరయ, ఛేదనముసేయ సంకింప-శీఘ్రగతిని
శ్రీప్రజాపతి ప్రత్యక్ష-మై ప్రసన్నుఁ, డగుచుఁ గాంక్షితమును దెల్పు-మనుచు నడిగె.

ఉ॥ అప్పుడు రావణుండు కమ - లాసనుగాంచి నమస్కరించి నా
కెప్పుడుఁ జావులేని వర - మిమ్ము సురాసురయక్షదేవరా
డప్పతిముఖ్యనాగగరు - డాహులచే హరిచేత భర్గుచే
నప్పదిగిన్ భవత్పరమ - హస్తముచేతఁ ద్రయీజగంబులన్. ౧౭౨౦

చ॥ నరులొక లెక్కకాను సుర - నాథనుతా! కనుకన్ గృపాప్తిచే
వరమునొసంగి ప్రోవుము శు - భంబుగ నన్నని కోరెనంతఁ బం
కరుహభవుండునున్ వరము - గ్రన్ననిచ్చి యొసంగె వాసవా
శిరములు పంక్తివక్త్రుఁడును - జెచ్చెర స్తోత్రమొనర్చె నవ్విధిన్. ౧౭౨౧

తే॥ అల విభీషణునకుఁ బాక-శాసనుండు, మంచిబుద్ధియు నమరత్వ-మెంచనొసఁగి
దేవపతిపదకాంక్షితు-ధృతిసమేతు, వాగ్విమోహితు ఘటకర్ణు-వాంఛనడిగె.

వ॥ కుంభకర్ణుండును విధాతృనింగని కృతప్రణాముఁడై దేవా! షణ్మాసంబులు సుఖంబుగా నిద్రయు నటుపిమ్మట నొక్కనాఁడు భోజనమును నాకుఁ గలుగఁజేయుమని వేఁడిన విధి యనుగ్రహించి యతనికి వరంబునొసఁగి యంతర్ధానంబునొందె రావణాదులును స్వస్థలంబునకుంజనిరి తదనంతరంబ సుమాలియుఁ దన దౌహిత్రసత్తములుత్తమవరంబులందుట విని నిర్భయుండై పాతాళంబునుండి ప్రహస్తాదులతో సుఖంబుగా భువికిచనుగుదెంచి మంత్రులవాక్యంబులను విని దశగ్రీవుండు బలాత్కారముగా లంక నుండి ధనదుని బయలువెడలించి సర్వరాక్షసయుతుండై లంకారాజ్యంబనుభవించుచుండె నప్పుడు. ౧౭౨౩

చ॥ ధనదుఁడు తండ్రివాక్యమునఁ - దప్పక శ్రీరజతాద్రిఁజేరి యా
శునిభజియించి మిక్కిలిగ - సోమధరుండు హితుండుఁగాగ సా
ఘననగసీమయందె యల - కాపురరాజము విశ్వకర్మచే
తను నెలకొల్పఁ జేసికొని - తచ్ఛివుచేఁగొనె దిక్పతిత్వమున్. ౧౭౨౪

సీ॥ రావణాసురుఁడు గా-రాబంబుమై శూర్ప, ణఖను విద్యుజ్జిహ్వ-నకు నొసంగి
యరణంబుగా దండ-కారణ్యమిచ్చెను, గుంభీనసిని సము జ్జృంభణముగ
మధుదైత్యునకునిచ్చి-మధువనమతనికి, బహుమతిగానిచ్చెఁ-బ్రస్తుతముగ
ఖడ్గజిహ్వునకును-గ్రొంచినొసంగి వా, రలకు శ్రీపరలంక-నలరనిచ్చె

తే॥ మఱియు వైరోచనాహ్వయు - మనుమరాలి
నాలిగాఁజేసెఁ గుంభ - కర్ణాసురునకుఁ
దమిని శైలూషుఁడనెడు గం - ధర్వసుతను
సరమ నపుడు విభీషణు - సతిగఁ జలిపె.

తే॥ చుప్పనాతి మగండును-ముప్పుఁబొంది, చావఁగా నామెకును దోడు-గావిధించి
ఖరుని దూషణుఁడి త్రిశిరుని-గాననమున, నిలువఁజేసెను దశముఖుం-డలవు వెలయ.

— ఇంద్రజిత్తు జననము —

తే॥ హర్ష మారవృత్తి జ్వాల - యనెడిగ్రహిణి
నొంది తత్కుంభకర్ణుండు - నొందెనివ్వ
రావణుఁడును మండోదరీ - రమణియందుఁ
గనియె సుతు మేఘనాదు ను - త్కటబలాఢ్యు. ౧౨౨

క॥ రావణిజనియించిన తఱి, నా వారిద నాదమట్టు - లఱచెఁ బెలుచన్
గావున నెల్లరు నొకటిగ, నా వానిని మేఘనాదుఁ - డనిరి ముదమునన్. ౧౨౨

క॥ తరువాత రావణుండును, సురగంధర్వులను ఋషులఁ - జోపుడుకొనఁగా
బిరబిర మోదుచుఁ గూల్చుచు, నరయఁగఁ దత్పుత్రులన్ న - యంబఱఁ గొనియెన్.

చ॥ అదివిని యక్షరాజు ప్రియ - మైనసుతుల్ వచించి దూతనున్
గొదకొని రావణాసురుని - కుత్సితమాపఁగఁ బన్నె దానిచే
మదయుతుఁ డాదశాస్యుఁ డస - మానరుషన్ గొని యేగి యాతనిన్
బదపడిగెల్చి పుష్పకమ - పారముదంబునఁ బొంది యచ్చటన్. ౧౨౩౦

— రావణుఁడు రంభతో భోగించుట —

తే॥ కొన్ని దినములు సేనలఁ-గూడినిల్చి, యొక్క రాతిరి నలకూబ-రోత్సుకమును
దీర్ప నూపురరవ మొప్ప-దివిని నేగు, చున్న రంభనుగని మోహ-మెసఁగ నతఁడు.

మ॥ బలవంతంబుగఁబట్టి యౌవనవతిన్ - బల్మాఱు భోగించి యిం
పలరన్ గ్రాఁగిటఁగుచ్చి ముద్దుగొని భో - గాపేక్షతీఱంగ న
చ్చెలువన్ వీడిన నామెయుంజని ప్రియున్ - శ్రీయక్షరాట్పుత్రుఁ గ
న్నులనీరమ్మదిగ్రమ్మఁ గన్గొనుచు ముం - దున్ నిల్చి యిట్లంచనెన్. ౧౨౩౨

మ॥ రమణా! రావణుచేత భంగపడితిన్ - రంభాఖ్యనై దైత్యుచేఁ
బ్రమదల్ పొందని చెట్టనొందితి భవ - త్పాదాబ్జముల్ నమ్మి సౌ
ఖ్యముతోనుండిన నేను దుఃఖపడఁగా - నయ్యొంగదా? యంచుఁ జే
లముకొంగున్ మొగమందువైచికొని చా - లన్ ఖిన్నయై యేడ్చెఁదాన్.

ఉ॥ ఆనలకూబరుండును గురు - ధారుణలోచనుఁడై దురాత్ముఁడౌ
దానవనేతకున్ దగవి - ధంబున శాపమొసంగె నట్టి య
జ్ఞానవనైన సమ్మతిని - నందక యాతఁడు పొందునేని తా
నా నిమిషంబునందె మృతి - నొందెడుఁ గావ్రతమంచుఁజెప్పెరన్. ౧౨౩౪
క॥ ఆ శాపము చారునిచే, నాశరనాథుం డెఱింగి - యది మొదలుగఁ గా
మాశయమునఁ దనుగోరని, యేశశిపేక్షణను బొంద - నెంచఁడెపుడున్. ౧౨౩౫

—♦ రావణ దిగ్విజయాదికము ♦—

క॥ పిమ్మట దండధరుని దా, వ్వమ్మనురన్ వరుణునిన్ ద - శాస్యుఁడుకని యు
ద్ధమ్మున వారలగెల్చె మ, దమ్మున మఘవంతు గెలువఁ - దలకొని యరిగెన్.
తే॥ దండిమగఁడైన రావణు దుండగంబు నెఱిఁగి లేఖర్షభుఁడు వాని-నెదిరిపట్టి
వడిగఁ జెఱసాలఁబెట్టె న-వ్వార్త తెలిసి, మేఘనాదుఁడు వచ్చె స-మీకబుద్ధి.
ఉ॥ వచ్చిన మేఘనాదునకు - వాసవపుత్త్రునకున్ బలంబు పెం
పెచ్చఁగ యుద్ధమయ్యె సుర - లెల్ల భయంపడి రట్టివేళ భూ
ధ్రోచ్ఛ్రయమున్ నదంబులు న - గోత్తమముల్ కదుఁదల్లడిల్లఁగా
నచ్చెరువంద దైత్యుఁడు బ - లారిని గెల్చె బిగించెఁదాళ్లతోన్. ౧౨౩౮
క॥ తీండ్రముగ నింద్రునిఁగొని, మాఁడ్రింటంపఁడెడు దైత్య - మండలినాథున్
దండ్రిని నే విడిపించియు, గండ్రండౌ యింద్రజితుఁడు _ కడువడిమరలెన్. ౧౨౩౯
చ॥ మరలి పురంబుసేరి యస - మాన పరాక్రమవంతుఁడంచు నె
ల్లరును నుతింప నాతఁడు క _ ళాభరితుండయి మించె నంత శ్రీ
సరసిజసంభవుండు హరి - సంకటపాటు దొలంపవచ్చి మేల్
వరములనిచ్చి యింద్రజికి - వాసవునిన్ విడిపించి యేగెఁ దాన్. ౧౨౪౦
తే॥ నాఁటినుండియు నింద్రజి-న్నామమొంది, మేఘనాదుండు వెలసె స-మీకవీర
వర్యుఁడై నట్టి యతఁడు రా_వణునికంటె, నధికుఁడు బలిష్ఠుఁడగు మేము_నందువలన.
తే॥ ఆదిగణ్యునిగా మేఘ-నాదు నెంచి, నీవు సన్నిధిఁ బల్కి_తి-మోదయార్య!
రాఘవా! జానకీధవా!-రాణ్మహాత్మ, వినుము తర్వాత నాదశా-ననుని కృతము.

—♦ రావణుఁడు రజతాద్రియెడ భంగపడుట ♦—

ఉ॥ లోకములెల్ల నున్ గెలువ - లోలుపుఁడై దశకంధరుండు ఘో
రాకృతి వహ్ని నైరృతుల - నల్కఁగఁ దాను జయించి వాయువున్
దాఁకి తటానఁ గెల్చి చని - దర్పితుఁడై రజతాద్రిఁబట్టి య
స్తోకభుజాబలంబొసరఁ - దూలఁగ నూఁచియు నెత్తఁబూనెఁ దాన్. ౧౨౪౩
చ॥ అపుడు ససాధ్వసాత్మయయి - యార్య మహేశునిఁ గౌఁగిలించె వా

మహదమునంగుళిన్ శివుఁడు - మానక వెండిమలన్ భరంబుగా
విపులకు స్రగ్గనొత్తె గిరి - వీరుదనోకహపాళిసంధులన్
గృహణుని రావణాసురుని - కేల్గుమి చిక్కను బిక్కిరింపఁగన్. ౧౭౪౪

తే॥ స్తంభసంబద్ధచోరువి-ధాన నతఁడు, గట్టిగా నేడ్వసాగె న-క్కాలమందు
వడిగ నందీశ్వరుఁడు దైత్య-జనునిఁగాంచి, క్రోఁతిచేష్టలనొసరింతె?-కూళ! నీవు.

తే॥ కనుకఁ గ్రోఁతుల సాహాయ్య-గరిమ మొందు, నరులచేత మృతింగాంతు- వరయనను చు
శాపమిడె నాల శివుఁడును-గోపముడిగి, రావణుని విడె వానియా-క్రందమాపి.

—♦ రావణాపజయములు ♦—

ఉ॥ అంతటఁ బోక దానవగ - ణాధిపుఁడొయ్యన హైహయాఖ్య శ్రీ
మంతపురంబుఁజేరి ప్రభు - మండను బాహుసహస్రయుక్తు ధీ
మంతునిఁ గార్తవీర్య నస - మానుఁ బురంబునఁ గానకప్డు శే
వాంతరవారిమున్గి శివు - నర్చనసేయఁ దొడంగెఁ దత్తటిన్. ౧౭౪౭

శా॥ ఆ మధ్యాహ్నమునందె కాంతలను బ్రే - మానందుఁడై కూడి త
ద్భూమీశుండును నర్మదానది జలం - బున్ స్వీయబాహుస్థితిన్
దామున్ గన్ జననీక సేతువుబలెన్ - స్తంభింపఁగాఁజేసి యు
ద్దామస్ఫూర్తిని వారికేళిసలిపెన్ - దైవారు మోదంబునన్. ౧౭౪౮

శా॥ రేవావారియు మిక్కుటంబయి దశ - గ్రీవున్ శివధ్యానని
ష్ఠావత్తిష్ణుని నాక్రమించె నది రో - షస్ఫూర్తివీక్షించి దు
ర్భావుండాతఁడు కార్తవీర్యుఁగని సం - గ్రామంబొనర్పన్ స్వబా
హావృత్తిన్ గృతవీర్యజుండు గొనె దు - ష్టాగ్రేసరున్ రావణున్. ౧౭౪౯

చ॥ అటుగ్రహియించి వానిమెడ - కల్లనఁ ద్రాటినిఁగట్టి యీడ్చియు
త్కటముగ నూరికిం జనియుఁ - గాష్ఠవినిర్మితహస్తిపోలె స
ష్కుటమున నాటలాడుటకుఁ - గూరిమిబిడ్డకొసంగె వానిసం
కటము పులస్త్యమౌని విని - క్రిన్నన నర్జును వేఁడవచ్చెఁ దాన్. ౧౭౫౦

క॥ వచ్చి తదర్జునునింగని, మచ్చరికము మదినిమాను - మా! రావణునిన్
మచ్చికమై విడుమా! యని, హెచ్చుగనర్థించి దైత్యు - నెసవిడిపించెన్.

చ॥ విడివడి తద్దశాస్యుఁడును - వేచని వాలినిగెల్వనెంచి యా
జడనిధి ధ్యాననిష్ఠుఁడు న - చంచలుఁడై నిలుచున్న వాలినిన్
గడుమదమొప్పఁగాంచి యొడి - కంబుగ వెన్కకునేగి చేతులన్
బొడవుగఁజాపి యాతనినిఁ - బూనికఁబట్టెను జంకలందుఁనన్. ౧౭౫౧

చ॥ హరివరుఁడైన వాలియు ద - శాస్యుని చేష్ట నెఱింగి మెల్లఁగాఁ
గరములసందునందతని - గట్టిగ నొత్తుచుఁ బట్టి యెత్తి సాఁ
గరములనాల్గిటన్ గడుఁగ - గావిక లొనటు ముంచిముంచి చే
చ్చెరఁ దనయూరు చేరి సుతు - చెన్నగు తొట్టలఁగట్టి వానినిన్. ౧౨౫౩
తే॥ కొంతకాలంబు చనఁ గపి-కాంతుఁడంత, నంతరంగంబునను గృప-నంది ఖలునిఁ
బంక్తివదనుని విడిచె న-ప్పాట నతఁడు, వాలితో సఖ్యమొనరించి - వడిగ వెడలె.
తే॥ వెడలి పుష్పకమెక్కి హం-పీరుఁడైన, వారిదాఁకుచుఁ జనిచని-కోరికలరఁ
దాను బాతాళమును జేరి-భానుకోటి, కాంతిమంతము బలిపుర-మెంతయుఁగనె.
క॥ తత్తేజంబునఁ బుష్పక, మత్తఱి హ్రాతతేజమగుచు నరుగక నిలిచెన్
సత్తువపోగరున దనుజుఁడు, చొత్తెంచుచు లోనికపుడు చూచెను గుజ్జున్. ౧౨౫౬
తే॥ కోటిసూర్యప్రతీకాశుఁ-గోమలాంగుఁ, బీతకౌశేయవసను బ్రి-స్మితభూషు
వరచతుర్బాహు నిదిరా భాసమాన వక్షుఁ గమలాక్షుఁ ద్రిభువనా-ధ్యక్షు నిన్ను.
క॥ ఆటుగని యెవఁడవురా? ని. విటనుండెద వేల? బలియు - నింట నెకలఁడా?
యెటకేని యేగియుండెనె?, తటుకున వచియింపుమనియె - దంభమెలర్పన్.
తే॥ నెమ్మి వామనమూర్తివౌ-నీవు పంక్తి, వదనునకు నుత్తరంబీక-వానిఁగనక
మిన్నకుండఁగ నాతఁడు-నిన్ను బధిరుఁ, డనితలంచియు లోనికి-నరిగె సరగ.
మ॥ బలియున్ రమ్యగృహాంతరస్థలమునన్ - బ్రహ్లాదుఁడై జాయతో
లలితాలంకృతిమీఱఁ బాచికల లీ - లన్ బూని యాటాడుచున్
లలనాపాంగవిలోకనంబులను లో - లత్వంబునుం జెంది యిం
పలరన్ గూర్చొనియుండి కన్గొనియెఁ దా - నాగంతుఁడౌ రావణున్. ౧౨౬౦
చ॥ కని తనదైన పాచికను - గ్రిన్నన దొర్లఁగవైచి దవ్వుగా
దనుజగణాధ్యునిం బిలిచి - దానిని దెమ్మనిపల్క రావణుం
డును వెసనేగి పాచికను - నూకి కదల్పఁగలేకపోయె నం
తనె చెలికత్తియం బిలిచి - తద్బలి తెమ్మని చెప్పెఁ బాచికన్. ౧౨౬౧
తే॥ దాసి యప్పుడు పాచికన్ - ద్వరగఁ దెచ్చి
బలికినిచ్చిన నతఁడు రా - వణునిఁ గాంచి
యల్పుఁడా! పొమ్ము; ఛీ! ఛీ! బ - లాధికుఁడవె?
యనుచు వెడలఁగఁ జేసె దు - రాత్ము వాని. ౧౨౬౨
తే॥ పిదప రావణుఁడును నిన్ను వేఁడి మరలి, తనములంకకు నరిగి నా-జననమిట్లు
కొత్తగాఁ గల్గినట్లయ్యెఁ-గుతుకమార, నూరఁ జేరితినని సుఖ-ముండెనింట.
మ॥ జయకాంక్షన్ జను రావణుండొకతఱిన్ - సాకేతముం గాంచి దు
ర్నయుఁడై శ్రీయనరణ్యుఁ ద్వత్కులజుఁ బూ - ర్వంబందుఁ జేర్గన్ననన్

చ్ఛయశుక్ దా నెదిరించిపోరి యని నా తన్మనాథునింగూల్ప రో
షయుతుండై యనరణ్యుఁ డిట్లుపలికెన్ శాపోక్తులన్ గ్రన్ననన్. ౧౭౬౪

తే॥ రావణా! మామకీనకు - లంబునందె
దైవము నుబ్బోని సుయశుండు - ధైర్యయుతుఁడు
వార్ధిగంభీరుఁడును వీర - వర్యుఁడైన
సుతుఁడు జనియించి మిము నెల్లఁ జూచుఁగొనుత!. ౧౭౬౫

—• సనత్కుమారుఁడు రావణునకు విష్ణుశక్తిని దెల్పుట •—

వ॥ అని దశాననుని శపించి తానును నాకంబునకేగె నంత నురంతచింతామగ్నుండై పంక్తివక్త్రుండు లంకకుంజని యొక్కచో సనత్కుమారునింగని నమస్కరించి యే కాంతంబుగా నతనితో దేవతలయందెవండు శ్రేష్ఠుండని ప్రశ్నించిన సనత్కుమారుం డిట్లనియె. ౧౭౬౬

క॥ జిష్ణుఁడు భక్తహృదబ్జచ, రిష్ణుఁడు లక్ష్మీమనోజ్ఞ - కృష్ణుఁడు సద్భ్రా
జిష్ణుఁడు పరమకృపావ, ర్ధిష్ణుఁడు విష్ణుండె ఘనుండు - దేవతలందున్. ౧౭౬౭

చ॥ అనుడు దశాననుండును మ - హాత్మునిచే హరిచేత యుద్ధభూ
మిని మృతినంది దుర్లభను - మేయమునై తగు ముక్తిహొందఁగా
ననువగు మార్గమేదయిన - నాదృతి నాకు వచింపుఁడంచు పతా
నిని గడువేడ నందులకు - నిర్మలచిత్తముతో నతండనున్. ౧౭౬౮

క॥ త్రేతాయుగమున దశరథ, భూతలనాథునకు విష్ణు - మూర్తి జనించున్
ఖ్యాతిగ రామాహ్వయుడయి, యాతనితో వైరమొంది - యందుము ముక్తిన్.

చ॥ అని వచియించె రావణుఁడు - నట్టి నిదానముచేత గౌతమీ
ఘననది తీరమందుఁ దమ - కాంతను సీతనుదొంగిలించెఁ బా
వనగుణశీల! రామ! రవి - వంశపయోనిధిసోమ! విన్మ ; త
ద్దనుజుఁడిఁకొక్కసారి ముని - తల్లజు నారదుఁగాంచి యిట్లనెన్. ౧౭౭౦

తే॥ దేవ! యెచట మహాబలుల్ - ధీరవరులు
కలరొ? త్రైలోక్యవృత్తాంత - ములను దెలియు
మీరు వచియింపుఁ డాహవ - వీరుఁ డయిన
నాకు సమిదిచ్ఛ జనియించె - నాగ మునియు. ౧౭౭౧

—• శ్వేతద్వీప కాంతలచే రావణుఁడు పరాభవంబుగొనుట •—

తే॥ దనుజనాథ! శ్వేతద్వీప - మున బలాఢ్యు
లైన వారలు కలరు వి - ష్ణ్వర్చకులును

విష్ణుచేఁ జరుపఁబడినట్టి - వీరులచటఁ
బుట్టునురజయ్యులై యుంద్రు - పొలుపు వెలయ. ౧౭౭౨

చ॥ అని వచియించి తాఁజనియె - నంత దశాస్యుఁడు మంత్రియుక్తుఁడై
ఘనమగు పుష్పకంబున వి - కాసమెలర్పఁగఁ గూరుచుండి చ
య్యనఁ బయనంబుసల్పి సిత - మైతగు ద్వీపముఁ జేర దానికాం
తిని హత తేజమైనిలిచెఁ - దెప్పునఁ బుష్పక మల్ల దాపునన్. ౧౭౭౩

తే॥ తొడరి రావణుఁడొకఁడ కాల్నడక నపుడు, దీవిలోనికిఁ బోవఁ ద-ద్ద్వీపనిలయు
లైన కాంతలు పూలకై-యరుగుచుండి, పంక్తివక్త్రునిఁ గనుగొని-పరిహసించి.

ఉ॥ ఎక్కడివాఁడ వోరి! యిపు - డిక్కడ కేటికి వచ్చినాఁడవో?
యెక్కపితుండు పంపెనినుఁ? - నెల్లిదమైతిమె మేమటన్న? నీ
చెక్కులు చీల్చివై చెదము - చెన్నఁటి! యంచును గేలుపట్టి వే
ముక్కు మొగంబునన్ బగుల - మోదుచు నూఁచిరి క్రిందు మీఁదుగన్.

తే॥ మఱియుఁ గందుకమునుబోలె - మనుజభోక్త్రు
పతిని బదముల గ్రహియించి - పైకివిసరి
క్రీడసల్పఁ దొడంగఁగాఁ - బీడనొంది
యొక్కవిసరున కతఁడును - నుక్కడాంగ. ౧౭౭౬

చ॥ తన పరలంకయందుఁ బడి - దైవకృతంబున కబ్బురంబునన్
గనుచును విష్ణుచే మృతినిఁ - గాంచి జనించినవారలీదృశం
బనుపమసత్వముం గొని ర - హా! హరిచే మరణంబునొంది నే
నును వెలిదీవిఁ బుట్టిన న - నూనబలంబొనగూడునంచుఁ దాన్. ౧౭౭౭

చ॥ మనమున నిశ్చయించి యభి - మానము నెంచక దైవవైరమున్
గొని మునిభక్త వర్గములఁ - గొందలపాటును బొందఁజేయుచున్
వనమున వంచనన్ జనక - పార్థివపుత్త్రికనున్ గ్రహించె న
ద్దనుజుఁడు శ్రీయశోకవని - ధాత్రిజఁ బ్రోచెను మాతరీతిగాన్. ౧౭౭౮

క॥ అని వచియింప నగస్త్యునిఁ, గనుగొని శ్రీరామమూర్తి - కౌతుక మలరన్
మునివర! వాలిది సుగ్రీ, వునిదౌజననంబు నాకుఁ - బొందికఁ జెపుఁడీ!. ౧౭౭౯

— వాలిసుగ్రీవ హనుమంతుల వృత్తాంతము —

వ॥ అని యడిగెనద్దానికిఁ గుంభసంభవుఁడును మంచిదని తదీయవృత్తాంతంబు రామునకు
వినిపింపందొడంగె నెట్టులనిన. ౧౭౮౦

కవిరాజవిరాజితము॥ కనకమయంబగు మేరునగంబునఁ - గంజభవుం డొకవేళ సభన్
మనమలరంగను గూర్చొనియుండ న - మందముదశ్రువులాతని క
న్గొనలను జాఱఁగ బ్రహ్మయువానిని - గూరిమిఁబట్టియునంజలిలో
ననువగు యోజనసల్పి విడెన్ భువి - నజ్జలబిందువులొక్క మొగిన్. ౧౨౮౧

క॥ పుడమిఁ దదశ్రుజలంబులు, పడినంతనె యుద్భవించెఁ - బ్లవగోత్తముఁ డొ
క్కఁడు వానిఁగని విధియును, గొడుకా! యెపుడిటనె మనుము-కొమరారననెన్.

మ॥ చిరకాలంబిటు వోవ నావనచర - శ్రేష్ఠుండు ధీమంతుఁడై
విరజాఖ్యుండయి మేరుపర్వతమునన్ - వృక్షంబులన్ దిర్గుచున్
హరువౌచోటులఁ గాంచుచున్ సుఫలమూ - లార్థంబుతా నేగి వాఃప
రిపూరంబును రత్నసత్ఖచితమౌ - బావింగనెన్ దీర్ఘికన్. ౧౨౮౩

మ॥ కని యవ్వాపిని నీరుగ్రోలుటకు నా - కాంక్షించి స్వచ్ఛాయ య
వ్వనమధ్యంబునఁ గానిపింప నిట నె - వ్వండో? ననుంబోలియుం
డెనటంచున్ జలమందుదూఁకి కపినిన్ - నీరంబునన్ గాన కొ
య్యనఁ దీరంబును జేరెఁ గాంతయయి య - త్యాశ్చర్యమేపారఁగన్. ౧౨౮౪

అంబురుహాము॥ కాంతబలెన్ దనరూపము మాఱుట - గాంచి వానరుఁ డెంతయున్
జింతయు విస్మయముం గొనె నంతట - శ్రీమహేంద్రుఁడువచ్చి యా
కాంతనుగని మోహవశుండయి - శ్రిన్నవీర్యము వీడఁగాఁ
గాంతవు వాలమునంబడి వీర్యము - ప్రాప్తమయిబడెఁ బిమ్మటన్ ౧౨౮౫

క॥ కపివరుఁ డొకరుఁడు పుట్టెను; విపులను నవ్వాఁడె వాలి - పేరన్ హరితు
ల్యపరాక్రముఁడై వెలసెన్, దపనుండును నపుడెకాంచెఁ - దద్భామినినిన్.

తే॥ కాంచి మోహంబుచేత న-చ్చంచలాక్షి, గ్రీవతలమున వీర్యంబు-గ్రీలఁబడఁగ
విడిచె నద్దాన జనియించెఁ-బుడమినొక్క, వానరుఁడువాఁడె సుగ్రీవ-వర్యుఁడనఘ!

క॥ పిమ్మట సుతయుగ్మమ్మును, నమ్మానిని యెత్తికొనియు - యామిని నొకచో
నిమ్ముగ నిద్రించియు లే, వమ్మునుపటివలెనె తాను - వానరుఁడయ్యెన్.

క॥ గంధగజనిభుని విరజుని, బంధురవిక్రమునిఁ బుత్రి - వరయుతునిఁ గృపా
సింధుఁడు బ్రహ్మయు వెసఁ గి, ష్కింధకుఁ బ్రభువుగనొనర్చెఁ - గీర్తిసెలంగన్.

తే॥ ఋక్షవిరజునసంతర - మెల్లకీశ
రాజ్యమునకును బ్రభుఁడయ్యె - రమ్యగుణుఁడు
ఘనబలుండగువాలి రా - ఘవవరేణ్య!
యనుచు ఘటసంభవుఁడు పల్కె - హర్షమెసఁగ. ౧౨౯౦

చ॥ మునివరుఁగాంచి రాముఁడును - మున్కొని తా నడిగెయిట్లనెన్ దయా
వననిధి! మౌనిచంద్రమ! భ - వన్మధురోక్తులఁ దృప్తి జెందితిన్
ఘనబలుఁడైన మారుతి వి - కర్తనసూనుని చెంతనుండి వా
లిని నెదిరింపఁ డయ్యెఁగద? - లీలవచింపుఁడు దాని హేతువున్. ౧౭౯౧

చ॥ అనవుడగస్తియిట్లు బలుకు - సర్యమవంశపయోధిసోమ! పా
వనగుణధామ! రామ! భవ - బంధవిమోచననామ! పూర్వమం
జననగసీమ నిర్మలయ - శస్కుఁడు కేసరినాముఁడుండె నా
తనికినిఁ బత్నులిద్దఱు సు - ధర్మపథంబునఁ గొల్తురాకపిన్. ౧౭౯౨

ఉ॥ వారలయందొకర్తయగు - భామిని యంజన మున్ను కైకతాఁ
బాఱఁగవైచినట్టి యల - పాయసమున్ వెస గ్రద్దవీడ నిం
పార భుజించె నంతటఁ బ్రి - యంబొనరం బృషదశ్వుఁ డామెతో
మారసుఖంబుగాంచె వరం - మారుతికగ్గెఁ దదీయకాంతయున్. ౨౭౯౩

తే॥ అరయఁగాఁ జైత్రసితపక్ష - మందు గణన
గనిన యేకాదశిని మఖ - యనెడిరిక్క
వెలయ మరుదాత్మజుం డుద్భ - వించె నను మఁ
బలుకుదురు గొప్పవారైన - ప్రాజ్ఞవరులు. ౧౭౯౪

—• హనుమంతుఁడు సూర్యుని గ్రసింపఁబోవుట •—

చ॥ అనిలసుతుండు బాల్యదశ - నాఁకటిపెల్లునఁ దూర్పుకొండపైఁ
దనరెడు బాలభానుఁ గని - తద్దయుఁ బక్వఫలంబటంచు నె
మ్మనమున నెంచి పైకెగిరి - మారుతవేగమెలర్ప సూర్యునిన్
గొనఁ జనె రాహువత్తఱిని - గొబ్బునవచ్చెను భానుఁ బట్టఁగన్. ౧౭౯౫

తే॥ వచ్చి పర్వదినంబిది - హెచ్చుకడిమి
నెవ్వఁడో? సూర్యుమ్రింగఁగా - నివ్విధముగ
నరుగుదెంచెడుఁ గ్రొత్తగా - ననుచుఁ దలఁచి
యాంజనేయునిఁ గాంచి భ - యాకులుఁడయి. ౧౭౯౬

చ॥ పరుగునఁబోయి శక్రుసభ - వాదనముం బొనరించి దేవరా!
శరణు మహానుభావ! భయ - సంగతుఁడైతిని నూత్నపూరుషుం
డురుబలుఁ డొక్కరుండు రవి - నొయ్యనఁ దానుగ్రహించుచుండె భా
స్కరుని గ్రసింప నేన కద? - శాశ్వతబాధ్యుఁడ; నట్లు కావున్. ౧౭౯౭

తే॥ రమ్ము తొలఁగింపుమింక వి - ఘ్నమ్ము నేఁడు
పర్వతిథి నాదు కార్యమి - ప్పగిది నిలిచె
నని వచింపఁగ వెలిగారు - నపుడ యెక్కి
భిదురపాణియు సురలతో - వెడలె వడిగ. ౧౭౯౮

చ॥ అటుచని సూర్యుఁబట్టు మరు - దాత్మజునల్లనఁ గాంచి మించి ప్ర
స్ఫుటరుషఁ దచ్ఛతారమును - బూనికతోవఁగ వాతసూతియున్
దటుకున వజ్రఘాతమునఁ - దాళఁగఁ జాలక వామహాన్వనో
చ్చుటవలనన్ దదీయగిరి - సొమ్మసిలెన్ బవనుండు హా! యనన్. ౧౭౯౯

తే॥ ఒల్లఁబోయిన సుతుఁగని-తల్లడిల్లి, పెల్లువగచుచు శ్వసనుండు-పిల్లవాని
• మెల్ల మెల్లఁగదేర్చి చిం-తిల్లికనలి, యల్ల స్తబ్ధతఁగొనె లోక-మెల్లఁగుంద. ౧౮౦౦

క॥ అల్లీలవలన జనములు, ముల్లోకములన్ శవాల - పోలికసోలన్
దల్లడపాటున విధియు మ, రుల్లోకపుదూ త్రి తన్మ - రుత్తును జేరెన్. ౧౮౦౧

తే॥ చేరి పవమాన! నీవిట్లు - సేయఁదగునె?
కోపముడుగుము నీముద్దు - కొడుకునకును
మేటి వరముల నొసఁగెద - మేలుగూర్పు
మయ్య జనముల బ్రదికింపు - మయ్య! యనియె.

క॥ విధివచనంబుల ననిలుఁడు, నధికంబగు ముదమునంది - యప్పుడె లేచెన్
విధవిధములుగా జనులకు, సుధకైవడి సోకి కూర్చె - సుఖమొప్పఁ దుష్టిన్.

క॥ అపుడగ్రస్థితు వాయుజుఁ, గృపమెయి విధిగనుచు మారు - తీ! పవితనుఁడై
యెపుడు నమర్త్యతమని భ, క్తిపథంబున హరినిఁగొలిచి - కీర్తినిఁ గొనుమా!.

వ॥ అని వరంబులొసఁగి యాంతర్ధానంబు నొందె తక్కిన దేవతలును హనుభగ్నంబగుట వాయుజునకు హనుమంతుఁడను నామంబిడి యొక్కొకరొక్కొకవరంబునిచ్చి తమ తమ నెలవులకుం జనిరి. తదనంతరంబునఁ బూర్వంబునుండి యింద్రుఁడు నియోగించియుండిన చందంబున స్వర్భానుండును భానునింగదిసిపట్టెనని వచించిన మరల శ్రీరామచంద్రుం డగస్త్యమునీంద్రునింగాంచి మహాత్మా! సైంహికేయుండు దివాకరుని గ్రహించునట్లు వాసవుండెట్లు నియోగించె నయ్యది వివరింపుఁడని వేఁడిన నతం డిట్లనియె. ౧౮౦౨

—• సూర్య చంద్రగ్రహణ విచారము •—

తే॥ రాహువమృతంబు వంచనా - క్రమ మెలర్పఁ
గ్రోలి యష్టమగ్రహమయి - కుపితుఁడగుచు

సురల మ్రింగుట కరుగఁగా - సురవిభుండు
రాహునకుఁ బర్వములఁ బట్ట - రవినిఁ దెలిపె. ౧౮౦౬

తే॥ ఆ విధుంతుదసంగ్రస్తుఁ - డైన సూర్య
మోక్షణార్థంబు ధర్మముల్ - భూతలమున
జనులు పొనరించి సంప్రీతి - సంధిలంగ
ముక్తుఁడగు సూర్యభగవాను - మ్రొక్కుచుండ్రి. ౧౮౦౭

తే॥ ఇటులె రాహువు కేతువు - కుటిలబుద్ధి
భాను హిమభాను గ్రసియించి - పరఁగుచుండు
రవియె గ్రహణంబులను పేర-నవని వెలసె
రామ! సుమనోభిరామ! సు ర్మగవిరామ!. ౧౮౦౮

—♦ శాపగ్రస్తుఁడగు హనుమంతుఁడు స్వబలము నెఱుంగకపోవుట ♦—

వ॥ మఱియు సమస్తదేవప్రదత్తవరప్రసాదుండగు హనుమానుండు బలంబు పెంపున మున్యాశ్రమంబులను ద్రిమ్మరుచుఁ గుశాస్తరణంబులను విదుర్చుచు వల్కలాజినంబులను వ్రచ్చుచు మునిబాలకులను ధర్షించుచుఁ బెక్కుచేష్టలొనర్పఁ దొడంగినఁ దన్మునీంద్రులతనింగని యిప్పటినుండి నీబలంబు నొరులు ప్రశంసించువఱకును నీవె ఱుంగకుండుదవుగాక! యని శాపంబొసంగి రద్దానివలన సుగ్రీవుని సన్నిధియందు స్వబలం బెఱుఁగక మారుతి వాలి నెదిరింపఁడయ్యె సముద్రలంఘనసమయంబున జాంబవంతునిచేఁ దెలియఁబడి పర్వాలంబువోలె నతండు నీరువామినిందాఁటె సర్వేశ్వరుఁడవైన నీ వెఱుఁగని వృత్తాంతంబు లేదు త్రికాలకలనాసాక్షివియు నికల్పోపేక్షితుఁడవును భక్తానువర్తనుండవునగు నీవు మానుషలీలావినోదంబుమై మద్వాక్యంబులను మన్నించుచుండు వంతియ యని యనేకవిధంబుల సర్వమునిపరివృతుండైన యగస్త్యుండు రాముని స్తుతించి యతనివలన నామంత్రణంబుకొని మునులతోనంతర్హితుండై నిజాశ్రమంబు సేరె ననంతరంబున. ౧౮౦౯

—♦ శ్రీరాముని మానుషలీలావినోదము ♦—

క॥ శ్రీరాముఁడు భార్యా భ్రా, తారాధితుఁడగుచు సచివు - లనువర్తింపన్
గారాబము మీఱఁగ సం, సారంబొనరించె నింట - స్వయమగు లీలన్. ౧౮౧౦

సీ॥ ఒగి ననాసక్తుఁడ-య్యును విషయాసక్తి, భార్యతో సుఖములు-పడయుచుండె
హనుమంతముఖ్యభ-క్తాగ్రణుల్ తనుగొల్వ, మించి రాజ్యంబుఁ బా-లించుచుండె
సస్యసంపన్నమై-జగతీరమణిమీఱఁ, గరుణార్ద్రదృష్టిమై-గాంచుచుండె
భూజముల్ ఫలవంత-ములు లతల్ సుమంబు, లెల్లప్పుడున్ సంత-సిల్లుచుండె.

తే॥ జనులు నిజధర్మనిరతులై - సంచరింప
స్త్రీలు పతిభక్తిభరితలై - చెలువునింప
నెచట విధవాత్వములు బాల్య - మృతులులేక
యుండ రాముఁడు శాసించు - చుండెనవని. ౧౮౧౧

తే॥ తమి విమానమునెక్కి సీ - తాయుతముగ
సానుజామాత్యుఁడయి రామ - చంద్రమూర్తి
జగమునెల్లను గ్రుమ్మరి - సత్యధర్మ
నిలయుఁడై దివ్యకర్మముల్ - సలిపెనెన్నొ?. ౧౮౧౨

క॥ లోకోపదేశమునకై, ప్రాకటముగ లింగములను - బ్రస్థాపించెన్
వేకోట్లకు మిక్కుటముగ, నాకరణిని వివిధమఖము - లతఁ డొనరించెన్.

తే॥ విపులదక్షిణలొసఁగెను-విప్రులకును, సర్వదానంబు లొనరించె- స్తవ్యరీతిఁ
దాను ముదవార్ధిఁదేలి సీ-తాసుసాధ్వి, నటులె దివ్యసుఖంబుల-నలరఁ జేసె.

చ॥ పదునొకవేలయేండ్లు నటు - పైఁ బదునొక్క సమల్ సమస్త సం
పదలును వైభవంబులు శు - భంబులు మీఱఁగ నేకపత్నుఁడై
సదమలభక్తి రాజ ఋషి - సత్తముఁడై రఘురామచంద్రుఁ డిం
పొదవ ధరాజ తన్ గొలువ - నొద్దిక రాజ్యమొనర్చెఁ బూజ్యతన్. ౧౮౧౩

—♦ సారకాండాంత పద్యములు ♦—

పద్మనాభవృత్తము

శ్రీరామునాఖ్యాన మీసారకాండంబు
శ్రీదంబు పాపఘ్నమున్ జెప్పినాఁడన్
గౌరీ! వినన్ వ్రాయఁ గాంచన్ సుఖస్ఫూర్తిఁ
గాంతుల్ ప్రపూర్ణత్వముం గాంచు నంచున్
గాదీ ప్రియప్రోక్తమయ్యెన్ దదీయంబు
కావ్యంబు వాల్మీకి భక్తిన్ రచించెన్
శ్రీరామ! యంహోవిరామా! కృతిన్ నీకుఁ
బ్రీతిన్ సమర్పించితిన్ గృష్ణమూర్తిన్. ౧౮౧౪

కందగీతిగర్భితద్విప్రాసోత్పలమాలావృత్తము

శ్రీకరుణానిధీ! (శుభవ - శీకరణాంచిత! స్తుత్యనామ!) య
స్తోకరణప్రథా (సహిత! - శోకహరా! భువిజా కళత్ర!) స
త్స్వాకర చిత్త సంగ్రహా, సు - ఖాధిక సత్పథగామి! రామ!) కీ
ర్త్యాకర! భోగదా! (ధృతిప - దా! కవిలోకపతీ! నమోస్తు) తే ౧౮౧౫

## మాలికాబంధము



చ॥ ఖలకులకాల! శ్రీల! కన - కప్రకటాంబర! ధీర! సూరస
త్కలజలజాలయాకుతుక - తుష్టతుషారవచోవరా! వరా!
యలఘులతాలతాంతహారి! - హర్షహాసన్ముఖ! దుఃఖహా! ఖరో
జ్జ్వలవిలయా! లసద్వ్యశీ! ప్ర - శస్తశమాత్మక! శ్రీకళాకరా!. ౧౮౧౮

గద్యము.

ఇది శ్రీరామచంద్రబాలాత్రిపురసుందరీ చరణారవింద
మకరంద పానానందేందిందిరాయమాన మానసత్వా
మహావైభవ మంగాంబా నంజపార్య ప్రధాన
తనూభవ సుకవిజనవిధేయ పోంపల్లి
కృష్ణమూర్తి నామధేయ ప్రణీత
మగు శ్రీకవితానంద వాల్మీకి
రామాయణము నందలి
సారకాండము
సమాప్తము.
ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః

## విజ్ఞప్తి.

చ॥ శుభబహుధాన్య భాద్రపద - శుద్ధతృతీయకు సారకాండమున్
బ్రభువర! రామ! తావక కృ - పామహిమన్ రచియించి కాంచితిక
విభవముఁ గద్య పద్యములు - వేయియు నెన్మదినూర్లు నిర్వమల్
సభ బుధులెల్ల మెచ్చఁ దమ - సన్నిధి నర్పణమొనొనర్చితిన్.

శ్రీరామచంద్ర పరబ్రహ్మార్పణమస్తు.

